శ్రీ రామచంద్రాయ నమః.

# వాసిరెడ్డివంశచరిత్రము

ఇది

వాసిరెడ్డి వెంకట సుబ్బదాసుగారిచే

రచియింపంబడి

శిష్టా హనుమచ్ఛాస్త్రిగారిచే

సంస్కరింపంబడి


చంద్రికాముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటింపంబడియె.

మొదటికూర్పు 1,000 ప్రతులు.

గుంటూరు.

వెల రు 1-8-0.





1914.



వాశిరెడ్డి వెంకటసుబ్బదాసు,

గ్రంథకర్త.

# విషయసూచిక

## ప్రథమాశ్వాసము.



## ద్వితీయాశ్వాసము

## తృతీయాశ్వాసము.

## చతుర్థాశ్వాసము.

| | | | |
|---|---|---|---|
| 32 | 5 | నఁడ | నుఁడ |
| | 23 | యొద్ధ | యుద్ధ |
| 33 | 14 | బల్కొ | పల్కొ |
| | 18 | పతి | మతి |
| 34 | 14 | వెఱగు | వెఱఁగు |
| | ,, | పబ | పమబ |
| | 19 | నగ్ర | నఁగ్ర |
| | 24 | రిగిఁన | రిఁగిన |
| 35 | 3 | చఁగ | పఁగ |
| | 11 | వుఁచు | వుచు |
| | 26 | శిఘ | శిఖ |
| 36 | 12 | దత్స | తత్స |
| | 14 | గమ్మ | గ్రమ్మ |
| | 17 | నిలకు | యిలకు |
| 37 | 23 | లవఱ | లువఱ |
| 38 | 6 | పాటి | సాటి |
| | 14 | కొందరి | కొందఱ |
| | 15 | తాయి | లాయి |
| 39 | 26 | దాఁలే | దాలే |
| 41 | 12 | పుత | పులత |
| 42 | 1 | ద్దీరబ్బి | దీలరబ్బీ |
| 43 | 15 | గీ॥ | కం॥ |
| 45 | 9 | చూవ | చూప |
| | 11 | పుఁడుఁ | పుఁడుఁ |
| 47 | 22 | దెబ్బ | దెఁబ్బ |
| 48 | 11 | ధీశ్వ | దీశ్వ |

ద్వితీయాశ్వాసము.

| | | | |
|---|---|---|---|
| 53 | 12 | జెప్పి | జెప్పి |
| | 28 | టొద్ది | ట్టొద్ది |
| 59 | 17 | ధన | ధన |
| 61 | 12 | జెప్పి | జెప్పి |
| 63 | 9 | మస్న | మన్న |
| 64 | 18 | లులు | లుల |
| 66 | 24 | నట్టి | నిట్టి |
| 67 | 21 | ముగ్గ | ముగ్గ |
| | ,, | లిగ | లింగ |
| 68 | 14 | నలువురు | సరసులు |
| 72 | 3 | బలు | చిలు |
| 77 | 26 | రుగు | అుగ |
| 81 | 10 | యవ | యాలువో |
| 82 | 17 | నాలు | నాను |
| | 18 | డుఁ | ఁడు |
| 83 | 22 | సర | నర |
| 88 | 29 | ద్భి | ద్భ |
| 94 | 26 | ...... | చేత |
| 96 | 15 | మ్మనీ | మ్మహనీ |
| 101 | 3 | జీరా | జీవరా |
| 102 | 28 లో అందుజ్యేష్ఠునకు శాయన్న, అప్పయ్య యనువారు పుట్టిరి. | | |
| 106 | 16 | యడ | యఁడ |
| 107 | 19 | తీర్రి | తీర్త్రి |
| 108 | 7 | రామయ్య | రాఘవయ్య |
| 111 | 28 | రణ | రణి |
| | 30 | స్న | న్న |
| 115 | 23 | ప్రధా | ప్రజా |
| | 25 | త్యజ్ఞ | త్యనుజ్ఞ |
| 119 | 20 | లిత్య | లిసత్య |
| 121 | 26 | క్రవి | త్రవి |
| 123 | 17 | రచ | రస |

తృతీయాశ్వాసము.

| | | | |
|---|---|---|---|
| 130 | 23 | జిత | జింత |
| 136 | 2 | గామ్ర | గ్రామ |
| | 30 | డభూ | డ |
| | ,, | మ్మవి | క్ష్మభూవి |
| 137 | 5 | కిర్తి | కీర్తి |
| 138 | 16 | అశ్వ | ఆశ్వ |
| 139 | 21 | మాసు | వాసు |
| | 4 | శివ | చిన |
| | 7 | ద | ధ |
| | 22 | యెడి | యెడ |
| | 23 | ప్రి | ప్రె |
| | 27 | బ్రా | భ్రా |

| | | | |
|---|---|---|---|
| | 29 | గఁని | గఁగని |
| 140 | 28 | ఆని | అని |
| | ,, | పంకి | జంకి |
| 142 | 8 | క్షితు | క్షితి |
| | 17 | నమ | నసమ |
| | 19 | భ్రూపా | భ్రూఫా |
| 143 | 1 | ధి | ది |
| | 4 | ణొ | ణో |
| | 7 | ంర్ణ | కర్ణ |
| | 14 | లిగి | లిఁగి |
| | 15 | వేమ | వెలమ |
| 144 | 18 | ద్ధన | త్థన |
| | 22 | పఁచే | పఁజే |
| | 25 | జయ ...... | గ. |

జయమ్రాతంబుఁగల్గించుమరో అనియుండఁదగు

| | | | |
|---|---|---|---|
| | 26 | మేం | మెం |
| | ,, | మె | మే |
| | 27 | వాడు | నాడు |
| 149 | 15 | ర్ప | దర్ప |
| 154 | 4 | క్రిడ | క్రీడ |
| 155 | 10 | ర్చటిక | ర్ఘటిక |
| | 11 | దైర్య | ధైర్య |
| 160 | 2 | బహు | హుబ |
| | 19 | గని | గవి |
| 171 | 27 | సారది | సారిది |
| 173 | 4 | మెఁస | మెసఁ |
| 176 | 23 | అన | అని |
| 186 | 6 | స్నక | స్నక |
| ,, | 16 | బ్రప | బక్రప |
| 190 | 4 | ట్రో | టో |

## చతుర్థాశ్వాసము.

| | | | |
|---|---|---|---|
| 196 | 23 | ఘనత | ననువు |
| 201 | 19 | ధిర | ధీర |
| 202 | 9 | య్యు | య్యూ |
| 211 | 14 | లిసి | లసి |
| 213 | 23 | యని | నని |
| 216 | 24 | ర్ణం | ర్ణఁ |
| 220 | 2 | ం | ల్ల |
| ,, | 7 | నిగల్ నిగల్ | నిగనిగల్ |
| 225 | 10 | జ్యా | జ్యో |
| ,, | 15 | ముక్షు | ముముక్షు |
| 227 | 3 | మగ | మగు |
| 228 | 6 | పరు | పలు |
| 231 | 3 | రాగం | రాంగం |
| 241 | 18 | తొ | తో |
| 242 | 5 | నూరు | నూలు |
| ,, | 20 | రూప్ర | రూపప్ర |
| 243 | 8 | మణిఁగి | మణఁగి |
| 246 | 16 | మానంబు | మానసంబు |
| 250 | 15 | చిద | చి |

## పంచమాశ్వాసము.

| | | | |
|---|---|---|---|
| 262 | 3 | వాయువు | — |
| 264 | 4 | విస్థూ | స్థూ |
| 272 | 10 | డండ | డ |
| 274 | 3 | కర్ణె | కర్మ |
| 280 | 2 | ణతి | ణాతి |
| 288 | 23 | సంజ్ఞా | సంజ్ఞాన |
| 292 | 13 | ద్ఞ | దజ్ఞ |
| 298 | 1 | ద్దీ | ద్ధీ |
| 304 | 27 | దివం | దినం |
| 318 | 13 | బ్రహ | బ్రహ్మ |
| | 15 | జ్ఞాస | జ్ఞాన |
| 322 | 9 | మగు | యగు |
| 325 | 10 | టఁచు | టంచు |
| 326 | 17 | పట్లు | నట్లు |
| 330 | 17 | గిదిరిగి | గితిరిగి |
| 335 | 24 | నూర్యం | సూర్యం |
| 337 | 15 | నొఁదు | నొందు |
| 343 | 15 | వాన | వాసన |
| 345 | 25 | నార | సార |
| ,, | 30 | ఇతొ | ఇత్తో |

# పీఠిక.



గుణగ్రహణపారీణులగు ప్రాజ్ఞశేఖరులారా! "వాసిరెడ్డివంశచరిత్రము" అనెడి పేరుచేతనే యీగ్రంథమందలి గాథ యెల్లరకుఁ దెలియుచున్నను, ఈకథాంశమునకుఁ బ్రధాననాయకుఁడగు మల్లికార్జునప్రభువరునియొక్క జన్మకాధారమగు కమ్మవంశమునుగూర్చి కొంతచర్చ వ్రాయఁదగియేయున్నది. కానిచర్చను బెంచి వ్రాసినఁబాఠకమహాశయులకు విసువు కల్గించినవాఁడనౌదునని కుఱుచపఱచియే వ్రాయనెంచితిని. కృష్ణానది మొదలుకొని నెల్లూరిమండలమునఁ గందుకూరు (స్కందపురము) వఱకుఁ గలదేశము కమ్మకరాతమని, కర్మకరాష్ట్రమని, యాంధ్రచక్రవర్తులకాలమున వ్యవహరింపఁబడినది. అటుపిమ్మటి ప్రభువులకాలమునఁ గూడఁగమ్మరాష్ట్రము, కర్మరాష్ట్రమని వ్యవహరింపఁబడినది. ఇట్లె మఱికొన్ని శాసనములందును గమ్మరాష్ట్రప్రతిష్ఠాదికమునుగూర్చి హెచ్చుగా ముచ్చటింపఁబడియేయున్నది. మఱొక్కవిషయము నాలకింపుఁడు, శ్రీపావులూరి మల్లనామాత్యుఁడు తనగణితశాస్త్రమందుఁ "కమ్మనాటిలోపలఁ" అనియొక పద్యమునఁ బ్రశంసించియేయుండెను. పెక్కేల, శ్రీ వెంకటాద్రిప్రభుసత్తముని పాలనాదికము నిన్న మొన్నటిదేకదా? కనుక కమ్మయనునదికూడ రాజ్యాంగరక్షణ నిపుణమై ప్రవర్తిల్లిన వంశవిశేషమేకాని వేఱొండుకాదని నేనువ్రాయకుండఁగనే సర్వజ్ఞేయమగును. ఇట్టిప్రశస్తపురుషుల చరిత్రమును, పౌర్వాపర్యక్రమమునఁ దొట్రుకులు లేకుండ నేనువ్రాయఁగలనా యనుకొనక "ప్రాంశులభ్యేఫలే లోభాదుద్బాహురివవామనః" అని శ్రీకాళిదాస మహాకవిచెప్పినట్లు వ్రాయఁగడంగితిని. ఈకడంకకు హేతువు నాగ్రంథాంతమందలి "నిరుపమసత్కవిత్వ" అనుపద్యార్థమేయగును. నాశక్తికొలఁది శాసనాదులచేతనేమి, ముద్రితగ్రంథవిమర్శనాంశములచేతనేమి, శ్రుతకథాసంవిధానముచేతనేమి, స్వానుభవముచేతనేమి, యీచరిత్రమును, న్యూనాధికవృత్తుల నందకుండ వ్రాసితిననుకొందును. సహృదయులగు కవిచంద్రులెందేని సప్రమాణమగులోపముల, నాయందలి దయచేఁదెలిపిన శిరసావహించిదిద్దికొందును. ఇందుసంగరపదవిని రాజశ్రేష్ఠులకు రథారోహణాదికమున్నట్లు వర్ణించితి. "మహాకవులు స్వల్పతటాకమునేని స్వర్గంగానదీసమముగ విపులపఱచి వర్ణించుటకలదు గనుకమంచినివర్ణించుటలో నిదియుఁ దప్పుకాదుగదా" యని వ్రాసితిని. ఇంతేల సకలవిషయములలో గుణస్వీకృతిప్రాజ్ఞలోకమునకేవదలి, త్రిశుద్ధిగ నమ్మహనీయులఁ బ్రార్థించుచున్నాఁడను. ఇందలిముద్రణ ప్రమాదాదిసర్వసందర్భములకుఁ జాలవఱకు శుద్ధపత్రికయు, శేషాంశములకు విద్వత్కవులును నాధారములని నమ్మియున్నాఁడను సంస్కరణభారమును వహించిన బ్రా॥శ్రీ॥ శిష్ట్లాహనుమచ్ఛాస్త్రి గారికి నేనెంతయుఁ గృతజ్ఞుఁడనని మనవి చేయుచున్నాఁడను.

ఇట్లు విధేయుఁడు,
గ్రంథకర్త వా॥ వెం॥



శ్రీ సీతారామసహాయము.

# వాసిరెడ్డివంశచరిత్రము.

## ప్రథమాశ్వాసము.



మద్దివ్య ధనుస్తృణీకరణగోష్ఠిం గుంభినీ పుత్రికన్
భూమానందముతోడఁ గైకొని మహాభూపాలకుల్ గొల్వ ను
ద్దామప్రక్రియ ధాత్రినేలి నిజభక్తశ్రేణి రక్షించు నా
రాముండిచ్చు మదన్వవాయులకు ధీరశ్లాఘ్య సామ్రాజ్యముల్॥1

సీ॥ వర రజోగుణముచే వాసిగా నేదేవి యఖిలలోకంబుల నటుసృజించు
సాత్త్వికగుణముచే సకలభూతంబులఁ బోషించు నేతన్వి భూరిమహిమ
నిజతమోగుణముచే నెనరులేకే కొమ్మ సమయించును సమస్త జంతువులను
ఘన శుద్ధసత్త్వాది కాంతిచే నేరామ శ్రీరాము సరసను జేరియుండు

గీ॥ నట్టి జగదేకజనని దయానమేత
భూరి సుగుణహృదబ్జాత పూతచరిత!
భక్తజన మానసోద్యాన పారిజాత
సీత కరుణించి నన్ను రక్షించుగాత॥ 2

గీ॥ ముజ్జగంబులఁ బూర్ణుఁడై మోదమలర। నెగడుచున్న నిరాకారు నిర్వికల్పు
నిర్మలానందమయు, నీద్యు, నిర్విచారు। నెన్ని సంస్మరియించెద నన్నుఁ బ్రోవ॥

చ॥ ననుఁగని పెంచి విద్యలఘనప్రతిభుంబొనరించి భద్రవ
ర్తనునిఁగఁ జేసి దైవగురురాజ పదాంబుజ పూజనాఢ్య శీ
లునిఁగ నొనర్చి జ్ఞానము వెలుఁగఁగఁ జేసిన తల్లిదండ్రులన్
మనమున నిచ్చలున్ గొలుతు మంగళకావ్యకవిత్వ సిద్ధికై॥ 4

చ॥ వివిధ మనోహరాగమ వివేకధనుండు తెనాలి నామక
ప్రవిమలపట్టణస్థుఁడు ప్రబంధకృతిప్రచురుండు నాకు నె
క్కువ కవితావిధుల్దెలిపి కూరిమినించిన ధన్యమూర్తి భా
గవతుల యప్పశాస్త్రి గుణగణ్యు భజించెద నిష్టసిద్ధికై॥ 5

శా॥ రంగద్యోగ విధాన దక్షయయి సాంద్రప్రజ్ఞ భక్త్యాంత రో
త్తుంగాజ్ఞాన లతాలవిత్రమయి యెంతో పేర్మితో నన్నుఁ జి
త్సంగ స్వాంతు నొనర్చి ధన్యపద సంచారార్హ విజ్ఞాన పు
ష్టింగల్గించిన తల్లిఁ గొల్చెదను దాడేపల్లి ఘణ్యాంబికన్॥ 6

మ॥ ఘనతన్ భక్తులఁ బ్రోచు శ్రీరఘువరున్గాంక్షించి దాస్యంబు హె
చ్చినబుద్ధిన్ దృఢభక్తిచే నిరతమున్ శ్రీరామనామ ప్రకీ
ర్తనమున్ నెమ్మనమందు నల్పి పరతత్త్వధ్యానముం జెందు శ్రీ
హనుమంతున్ సముపాశ్రయింతు మదభీష్టార్థంబు చేకూఱఁగన్॥ 7

గీ॥ ఏమహామహుఁ బూజింతు రెల్లఘనులు
కావ్యములు సేయుతఱి విఘ్నగణము తొలఁగ
నట్టిజగదేకపూజ్యు నే నభినుతింతు
విఘ్ననాథుని గృతుల నవిఘ్న మొసఁగ॥ 8

చ॥ చదువక పూర్వకావ్యములు చక్కఁగఁ జూడక లక్షణంబులన్
పదఁపడి నూత్నపుంగృతుల భావ మెఱుంగఁగలేక యీర్ష్యచే
సదమలమైన గ్రంథముల సారమసారముఁ జేసి తప్పులన్
వెదకెడి కింకవీంద్రులనఁ విజ్ఞులుగాఁగ భజింతు నిచ్చలున్॥ 9

చ॥ భువి నుపకారవాంఛ మెయిఁ బొల్పుగ సంస్కృతమందుఁ దెల్గునన్
బ్రవిమల వాక్కులన్ గృతులు భావ్యముగా రచియించి త్రోవలన్
సవినయ దృష్టిఁ జూపిన ప్రశాంత సుశీలుర సత్కవీంద్రులన్
వివిధ విధంబులన్ గొలిచి వేఁడెద మత్కృతి నాదరింపఁగన్॥ 10

చ॥ చదువఁగలేదు శాస్త్రములు, చక్కఁగ వ్యాకరణాది గ్రంథముల్
పదఁపడి చూడలేదుమఱి, పండితవర్యుల సేవనేని నె
మ్మదిఁగని చేయలేద యభిమానముదూలఁగ రామచంద్రునిన్
సదమల భక్తిచేఁ గొలువ, సంతసమారఁగ నిచ్చెసిద్ధినిన్॥ 11

మ॥ నిరతిన్ నేనొకసత్ప్రబంధమును వే నిర్మింపఁగాఁగోరి ధీ
వరసంఘమ్ముల కెల్ల వందనములన్ వాంఛామితిన్ జల్పి మ
ద్గురు కావ్యంబున నెందునేఁ గలిగినన్ దోషంబులం జూడకే
కరుణన్ దిద్దఁగఁగోరి వేఁడితిఁజుఁడీ గ్రంథంబు రంజిల్లఁగాన్॥ 12

వ॥ అని యిట్లు శిష్టాచార ప్రకారమ్ముగ నిష్టదేవతా ప్రార్థనమ్మును, సద్గురుకీర్తనమ్మును, సంస్కృతాంధ్ర సత్కవిస్తోత్రంబును, కుకవి నిరసనంబును, గావించి మదన్వయ చారిత్రంబు నొక్క ప్రబంధంబుగా రచియించి యాచంద్రతారార్కంబుగా వెలయింప శ్రీ గురుకటాక్ష వీక్షణంబున హృదయపీఠంబు శ్రీ జానకీ జానికై యలంకరించుచున్న సమయంబున॥ 13

సీ॥ నీలాంబుదచ్ఛాయఁ బోలుదేహమువాఁడు, రాజిల్లు నలిన నేత్రములవాఁడు
పసమీఱుజాళువావలువఁ గ్రాలెడువాఁడు, డంబైన కంబుకంఠంబువాఁడు
మణిమయ తపసీయ మండనంబులవాఁడు, లీల జగంబుల నేలువాఁడు
కులిశాదిరేఖలుగలపదంబులవాఁడు, సోముఁగేరెడునట్టి మోము వాఁడు

గీ॥ సీతవామాంకమున నింపుఁజెందనవల।నూర్మిళేశుఁడు నిల్వఁగా నొప్పమీఱు
గంధవహసూనుఁడునుముందుకదిసినిలువ,నలరురాముండుప్రసరించెనాత్మలోన

వ॥ ఇట్లు హనుమత్సీతాలక్ష్మణసమేతుండై చిఱునవ్వులొలుకు ముఖాంబుజంబుతో బాల్యంబునుండియు గురుకటాక్షంబున నాపైఁగనఁబఱచువాత్సల్యంబున సంపూర్ణాంతరంగుండై సాక్షాత్కరించి వత్సా! నీదృఢభక్తికిమెచ్చితి, నీయభీష్టంబుదీర్చెద, నీవురచించునిజాన్వవాయచారిత్రంబు మదంకితంబుగావింపుము, తద్రచనావిశేషంబున నీకిహపరసాధనంబుకలుగునని సపరివారుండై యంతర్ధానంబునొందినఁబరమానందభరితాంతఃకరణుండనై॥ 15

శా॥ శ్రీరామున్ జనకాత్మజన్ మనమునన్ సేవించిసౌమిత్రినిన్
సారాచారవిచారువాయుసుతునిన్ శ్లాఘించి యద్దేవు స
త్కారుణ్యామృతపూరపూరిత కటాక్ష శ్రీలఁబెంపొంద నే
పారంగా నలకావ్యమున్ బుధులు సం, భావింపఁగావించెదన్॥ 16

## షష్ఠ్యంతములు.

క॥ పరమేశునకును ఘనునకు। నరసఖునకు భువనపతికి, నతపాలునకున్
సురవరునకు దైత్యారికి। నిరవద్యునకమలునకును నిఖిలేశునకున్॥ 17

క॥ వైకుంఠనివాసునకున్। సాకరవరరూపునకు శుభచరితునకున్
లోకానురాగపరునకు। గోకులరక్షకున, కతులగోపీపతికిన్॥ 18

క॥ నరసింహునకుం బరునకు। వరకమలశరీరునకును బద్మాక్షునకున్
వరలోకపాలమణికిన్। బరమానందునకు రామపరమాత్మునకున్॥ 19

వ॥ సమర్పణంబుగా నారచియింపఁబూనిన వాసిరెడ్డివంశచరిత్రంబను గ్రంథంబున
కు బ్రధానమార్గంబగు మదీయవంశావతారం బెట్టిదనిన. 20

చ॥ వరశివభక్తుఁడున్ ఘనుఁడు, బంధురతేజుఁడు సుందరాంగుడున్
వరసగుణౌఘగణ్యుఁడును, సారసలోచనుఁడార్తరక్షణుం
డరయవివేకవారినిధి యుంచితశూరుఁడు సద్గుణాఢ్యుఁడున్
నిరుపమశాంతమూర్తియును నీతివిదుండును వంశకర్తయై॥ 21

సీ॥ శ్రీసదాశివుఁడధిక సుస్థిరవిభూతి। ప్రబలశౌర్యప్రచారుఁడై పటిమ మెఱసి
యాత్మసత్యోన్నతుని గాంచెనవనియందు మల్లిఖార్జునుఁడని యెసు మానఘనుని

ఉ॥ కమ్మకులాబ్ధిసోముఁడు నఖండపరాక్రమశాలి యంటు భృ
త్సమ్మత నీలవర్ణుఁడతిశాంతుఁడు వంశవిభూషణుండు ని
త్యమ్మును గీర్తికాముఁడు నహంకృతిదూరుఁడు మల్లికార్జునుం
డిమ్ముగ భూమిసమ్మదము హెచ్చఁగ నేలుచునుండె ధీగతిన్॥ 23

ఉ॥ ఆ లలితాత్మశేఖరుఁడనంత యశస్కుఁడు మల్లికార్జునుం
డోలి సుపుత్రులం గనియె నొప్పులకుప్పల నల్వురన్ లస
చ్ఛీలుర వారిలోపలను, జ్యేష్ఠుఁడు శూరుఁడునై వెలుంగు శ్రీ
శైలపతి ప్రభుండలరు, శైవ్యుఁడు శాశ్వతభోగశాలియై॥ 24

వ॥ ఆభూపాలునకు వేంకటాద్రియను కుమారుండు పుట్టె, నాతనికి వాళయాహ్వ
యుండు, నాతనికి నాగయాభిఖ్యుండు, నాతనికి సూరయనామధేయుండు,
నతనికి యయ్యపనీఁడు, వానికి సూరయాఖ్యుండు, వానికి సుబ్బయభూపాలుండు
నాతనకు రమణయ్యయును గలిగిరి. 25

సీ॥ అత్తిరమణయ్యకుద్భవమయ్యె సుతుఁడు। సూరయాభిఖ్యుఁడభిమానసుకచిరుఁడు
సూర్యదేవరవంశజసుందరాంగి వేంకమాంబను బెండ్లాడె వేడ్కమీఱ॥ 26

ఉ॥ వారలుగాంచి రుజ్జ్వల సువర్ణశరీరుల వంశకర్తలన్
సారసపత్రనేత్రులఁ బ్రశాంతమనస్కుల నల్వురన్ దయా
వారిధులన్ సుకృత్యకులవర్తనులన్ హితవాక్ప్రసక్తులన్
ధీరవరేణ్యులన్ విమలధీవిభవ ప్రథితప్రభావులన్॥ 27

వ॥ వారల నామంబు లభివర్ణించెద॥ 28

చ॥ గురుతరమైన వంశమునఁ, గూరిమితోడ జనించి ధీరుఁడై
పురహరుపూజ నెల్లప్పుడుఁ, బొందుగఁ జల్పుచు విప్రకోటికిన్
నిరతము దానధర్మములు నెమ్మది రంజిలఁ జేసి కీర్తిచే
వరలుఁడు శాస్త్రి కోటయ ప్రశాంతుఁడు భవ్యచరిత్రుఁ డెంతయున్॥ 29

శా॥ ఖ్యాతిం బొల్చెడివాఁడు ధర్మపథనిత్యావాసి, పుణ్యక్రియా
స్వాతంత్ర్యమ్ము గలట్టి ధన్యుఁడు దయాస్వాంతుండు కోటయ్యకుం
బ్రీతిం గూర్చిన సోదరుండు నయసంప్రీతుండు వెల్గొందెడున్
సీతారామయనామకుండు బుధవాక్ప్రీయాభిలాషాత్ముఁడై॥ 30

సీ॥ అమ్మహనీయునకనుఁగుఁదమ్ముండును, నవనీవరోత్తముండగుచుం బరఁగు
వేంకటసుబ్బయాభిఖ్యుండు మహితుండు, సుగుణాలవాలుండు, సుజయుండు,
నిర్వికల్పసమాధినిష్ఠాగరిష్ఠుండు, నియతవ్రతుండతినిర్మలుండు
సమరసభావుండు, సత్యసంధుండును, బుధసహాయుండు పుణ్యశాలి

గీ॥ అట్టిధీరునితోఁ బుట్టువజ్జనయున। వెంకమాంబయునంగనుమినుతికెక్కఁ
బ్రబలి యీనల్వురును గణ్యభావమంది। వైభవోన్నతులను జెందివఱలిరపుడు॥ 31

వ॥ ఇవ్విధిలో భక్తాగ్రేసరుండు వేంకటసుబ్బదాసుండు చిఱుతప్రాయమున మొద
లుకొని, సద్గురుకృపావిశేషంబున, శ్రీరామాంజనేయోపాసనాధిక్యంబున నిరం
తరభక్తి సంకలితానందాంతరంగుండనై నిజజనస్థలంబునందొక్కనాఁడు, సా
యంకాలమునఁ, బవమానసూనుసన్నిధి సమీలితలోచనుండనై యుండ నప్పరా
త్పరుండు సాక్షాత్కరించి, యోభక్తాగ్రగణ్యా! నీచతుర్విధభక్తికానందించి
తి, మత్ప్రభువరుండు సీతాలక్ష్మణసమేతుండై యిచటవిహరింపఁగుతూహ
లిమై యున్నవాఁడు నీకెయ్యదియును సాధ్యంబులేదు. మత్సాహాయ్యంబున నీయ
భీష్టంబు సిద్ధింపఁగలదు. నీవు సనాతనాలయంబుఁ బునరుద్ధారణంబుఁ గావించి తద్దే
వతాసుప్రతిష్ఠఁ జేయుమని యానతిచ్చి యంతర్ధానంబునొందెఁ దదనంతరంబ. 32

కం॥ నాయన్న భావమునుగొని। పాయఁ ని యుత్సాహమునను బరమార్థతనే
సీయిలదేవళమొక్కటి। కాయక్లేశంబువలనఁ గట్టించుటకున్॥ 33

గీ॥ మద్గురూత్తము దయకు నేమనసు దీఱఁ । గోరి సేవింపఁ బనరించి కూర్మితోడ
సంతసించితి నీకోర్కి సఫలమగును । గంధవహసూనుఁ డెప్పుడీ కరుణఁ గాంచు॥ 34
వ॥ అని యేతద్విధంబగు సద్గురుప్రసాదంబువడసి మదిష్టదేవతాప్రార్థనంబుఁ జేసి
దైవజ్ఞులచే సుముహూర్తనిర్ధారణంబు చేయించి తుంగభద్రానదీతీరమం
దుండు తుమ్మపూడిఁ పురంబున శంకుస్థాపనాదికృత్యంబొనర్చించి మహాభాగ
వతోత్తముండును సత్త్వగుణప్రధానుండును మంగళగిరిపత్తనవాసియునగు
కేలము వెంకటస్వామియను సుకసుతారిని తామించి నీవీదేవాలయంబు శాస్త్రో 35
క్తవిధిగా నిర్మింపవలయునని నియమించిన యనంతరంబున.
సీ॥ జనపదంబులనుండు జనులతోఁ బోరాడి మన్ననతోడను మనుజవిభుల
సాయంబుఁ గైకొని చారుతరంబైన పాషాణములు చాలబండ్లమీదఁ
బత్యంతపర్వత ప్రాంతస్థలులనుండి, తెప్పించి యత్యంతదివ్యమైన
సున్నంబుఁ గంకరసొంపగు నిసుకయు వలయువస్తువుల నవ్వారిగాఁగఁ
గీ॥ బడవలను నించికొని వచ్చి పటురయంబ । సకలసురలును బుధజనుల్ సన్నుతించు
నటుల దేవళ మొక్కటి యందముగను । గట్టెనద్భుతశిల్పప్రకారములను॥ 36
ఉ॥ గోపురమండపంబులును గ్రొత్తవిమానముఁ జుట్టుగోడలున్
బ్రాపగు యజ్ఞశాలయును బ్రస్ఫుట తేజముతోడఁ గట్టెఁ దా
నేపుట భేదనంబున ననీగతి లేదహహా! సుతారియా
బాపురె! యంచు భూజనులు ప్రస్తుతి సేయఁగ దుమ్మపూడిలోన్॥ 37
సీ॥ తద్విమానమునందు దైవరూపంబుల, హరిహరబ్రహ్మలహర్షమొనఁగ
నిజవాహనములతో నేర్పుగా రచియించె, నిక్కంబుగా వారు నిల్చిరనఁగ
దుంబుర నారదుల్ తుంగభద్రానదీ తీరంబునందుండు దేవళమున
నివసించు కోరిక నిర్మలానందత, నాకంబునందుండి యవనికిడిగి॥
గీ॥ యావిమానంబునన్నిల్చి యహరహగతిని । వీణలందందమీటుచు వివిధగతుల
గానములసల్పుచుండి రాఘనులనంగ । శిల్పకారుండు నిర్మించెఁ జిత్రగతుల॥ 38
ఆ॥ ఆవిమానమందు నలరారు పాంచాలి । కానికాయ మమరకాంతలెల్ల
నిచటి వైభవంబు నీక్షింపఁ జనుదెంచి । యబ్రపడుచు నిల్చిరనఁగ నొప్పె॥ 39
వ॥ ఇట్లనేకవిధ చిత్రాతిచిత్రంబులఁ జోద్యంబగు నాదేవాలయంబు త్రిదివంబుం
బోలి శ్రీరామచంద్రుండిట నవతరించుఁ గానఁ దన్నామామృతపానంబున సమ
స్తపంకంబులు నశించు మోక్షంబబ్బు, నను తలంపు వాడమి సేవింపవచ్చు.
నిఖిల భువనదేవమునిగణంబుల పజ్జియను ప్రాంతింబొందించు మహాపురుష

విగ్రహంబులఁజూపఱల కానందంబు నాపాదించుచుండె॥ 40

క॥ పవమానసూనుఁడత్తఱినవిరళముగ రాముకొఱకు నానందమునన్
సవనాదికృత్యములకును। సవయజ్ఞ సుశాలవేయ నాకొష్టమనన్॥ 41

సీ॥ దేవాలయంబును దేదీప్యమానత, మెఱుఁగు సున్నంబున మెఱయఁజేసి
జేగురుల్వెట్టించి జిగిగల్గుపగడాల, కోణీగలు ముంజూర్లుఁ గూర్మిఁగట్టి
ప్రజ్వలద్దీప్తిచేఁ బ్రాభవంబలరార, జగతిక్రేవల నెఱజాజునింప
నీల గవాక్షముల్ నెఱిగల్గుకాంతులు, కృష్ణాగరుజధూపమేపుమీఱ
ముంగిళ్ళ ముత్యాలముగ్గులువేయఁగ, ఁదద్విభూతియు మేల్మిఁదనరియుండ
గరుడ పచ్చలకూర్పుగల ద్వారములయందుఁ బచ్చనిచాయలు పరిఢవిల్ల

గీ॥ ధర్మపాంచాలికాపాణిపద్మరాగ। రాజినీరాజనోపచారముగ వఱలఁ
దరల వైడూర్యవలభికల్ దనరుచుండ। దేవళంబెల్ల నిరుపమదీప్తివెలిగె॥ 42

వ॥ పిమ్మటఁ బురజనులుం దనుతమ గృహరాజంబుల నలంకరించుకొనిరి. తద్దే
వాయతనంబున సవనార్థమై యజ్ఞశాలయుఁ బందిళ్లుమొదలుగాఁగలయనేక
శృంగార మందిరంబులు నిర్మించిరి॥ 43

సీ॥ దేవౌఘముఖ్యులు దేదీప్యమానులై, నచ్చువారలకెల్ల వరుసగాను
దుంగభద్రాతీర తుమ్మపూడిపురంబు నందుండు సౌధంబులంచితముగ
శృంగారమేపార నింపుగాఁజేయించి, రంగవల్లులు దిద్దిరింగితముగ
రాజమార్గంబులు రచ్చలు క్రంతలు, శోభిల్లఁజేయించి సొంపుమీఱ
జేగురు సున్నంబుఁ జెలువుగానలఁదించి, పచ్చనితోరణాల్ పటిమఁ గట్టి
విపణివీథులనింపిరి వేడ్కమీఱ। సకలఫలములుఁగుసుమముల్ సమరఘముగ
వలయువస్తువులన్నియు వాసిగాను। జూచువారలకత్యంతచోద్యమలర॥ 44

వ॥ పదంపడి పవమానసూనుండు, నిజభక్తుఁడగు వేంకటసుబ్బదాసునియందుఁగ
ల యనుకంపావిశేషంబునఁ దద్భక్తునిచేఁ బ్రేరితుండై శ్రీసీతారామలక్ష్మణుల
వైకుంఠంబునుండి రావించి తుమ్మపూఁడిపురంబున నూతన నిర్మిత దేవమంది
రంబునం, బ్రతిష్ఠితులఁజేయించి తదారాధనలచే భక్తులం దరింపం జేయఁగోరి
వారల నాహ్వానముచేయఁ దానదృశ్యమార్గంబునఁ గైలాసాది దేవోత్తమ
నివాసంబులకరిగి శంకరాదుల సకుటుంబముగాఁ దత్సుముహూర్తమునకు
వేంచేయఁ బ్రార్థించి వారలచే ననుజ్ఞాతుండై హరిమందిరంబునకు మగిడి
యేతెంచి॥ 45

దండకము:—శ్రీమన్మహాదేవదేవా త్రిలోకాభిరామా పరంధామ నిష్కామ
సంపూర్ణకామా బుధేంద్రాంతరంగాబ్ధిసోమా లసద్దివ్యతేజా యచింత్యం
బసంగం బఖండం బబాధ్యం బబోధ్యం బసాధ్యం బభేద్యం బవిచ్ఛేద్య మా
ద్యంత శూన్యంబవర్ణం బశుక్లం బకృష్ణం బపీతం బహీనం బసూక్ష్మం బదీ
ర్ఘం బహ్రస్వం బనాద్యంతరం బక్షరం బవ్యయంబై యనిర్దేశ్య మాద్యం
బదృశ్యం బకంపం బలక్ష్యం బలిప్తం బశబ్దం బసంస్పర్శరూపం బసుస్వాదు
గంధం బవాఙ్మానసప్రాప్యమై పూర్ణమై నిత్యమై శుద్ధమై శాంతమై కేవలంబై
నిరాకారమై సచ్చిదానందమౌ రూపముంగొన్న వైకుంఠవాసా మహానాగ
పర్యంకమందెప్పుడున్ లక్ష్మితోఁగూడి నీభక్తులం బాలనంజేయు చానంద
యోగంబునం జిత్స్వరూపంబుతో విశ్వమెల్లన్వెలింగించుచుం దీతిం బ్రకాశింపఁగా
సాక్షివై లోపలన్ బైట భూమిం దివిం బూర్ణరూపుండవై శోకమోహం
బులున్లేక సంతోషయుక్తుండవై దుష్ప్రపంచుండవై నిర్విశేషుండవై నిర్గుణ
బ్రహ్మవై యొప్పు నీదివ్యతత్త్వంబు నీసత్కృపాంచత్కటాక్షంబున న్మర్త్య
లోకంబునం దుంగభద్రానదీ తీరమందుండు శ్రీతుమ్మపూడింబురాధీశులై
నట్టి శ్రీకమ్మవారెల్లరు న్ప్రతిష్ఠార్థమై దివ్యదేవాలయంబొక్కటింగట్టి మీరా
కకై దేవ నన్నంపినారయ్య లోకత్రయారాధ్య సద్భక్తహృన్మందిరా యాప
దుద్ధారకా వాయుపుత్రుండ మీసేవకర్మండ వే నా మొఱాలింపుమీ నన్ను
రక్షింపుమీ జాగరూకుండనై యాజగద్రక్షణార్థంబు మేల్కొల్పితిన్నిను,
భక్తానుకంపన్ సుదాక్షిణ్యభావంబున న్నీవు శ్రీరామరూపంబుతో సోదరుం
గూడి పెంచేయఁగాఁగోరి సేవేఁడెదన్మందహాసంబున న్వేగ మమ్మేలఁగా సర్వ
లోకేశ రావయ్య యింద్రాది బృందారకుల్వేచియున్నారు స్వామీ నమస్తే
నమస్తే నమః॥ 46

వ॥ ఇత్తెఱంగున వాయుసుతుండు స్తోత్రంబు సేయ మేల్కాంచఁగా॥ 47

ఉ॥ వాయుసుతుండు శ్రీహరికి వందనముంబొనరించి యెంతయుం
బాయని భక్తిసూక్తులను బాగుగ స్తోత్రము సేయఁ గేశవుం
డాయత జాగరూకత సముంచితచేష్టలతోడ భక్తుఁడా
వాయుజుఁ గూర్మిచేనడిగె నందముగా సరసాంక చిహ్నలన్॥ 48

సీ॥ ప్రవిమలానంద యద్భక్తి పవనతనయ! బ్రహ్మచర్యవ్రతా సత్య భవ్యచరిత
నిర్వికల్పసమాధి నన్నే యనవరత మాత్మలో సంస్మరింపుమా యాదిభక్త॥

మ॥ చిరకాలంబుననుండి నీవెచట నిశ్చింతం బ్రమోదంబుగా
నిరతిం దాపసవృత్తిఁ గైకొని మహానిర్వాణ కాంక్షుంగడున్
స్థిరచిత్తంబుననుంటివౌ తెలుపుమా ధీరాత్ముఁడాయంచు శ్రీ
హరి యవ్వాయు సుతోత్తముంబలుక నాహ్లాదంబుతో నిట్లనున్॥ 50

గీ॥ విన్నవించెద నవధారు విశ్వమయుఁడ। మునిజనోద్యాన మందారఘనవరేణ్య
తుంగభద్రానదీతీర తుమ్మపూడి। పురమునందుండినచ్చిఁతి బుణ్యచరిత॥ 51

వ॥ అచ్చట మద్భక్తుండును వాసిరెడ్డివంశ సంభూతుండును నగు వేంకట సుబ్బదాసు మత్ప్రేరణంబున దేవరం బ్రతిష్ఠించుటకై యతిభక్తిన్నవీన దేవగృహం బునిర్మించి మీతొల్లింటి సీతారామలక్ష్మణ రూపంబులఁ బూజింపఁగోరి యున్నవాఁడు కాన నేతత్కార్యార్థమైవచ్చితినని విన్నవించు సమయంబున॥52

చ॥ పరమదయాసమేతు లతిభవ్యచరిత్రులు నాదిదంపతుల్
సిరిగలనందిపై నధివసించి భటాదులగొల్వవేగఁ దా
మరమరలేక భూతి మదహస్తి సుచర్మముతోడ నత్తఱిన్
మురహరుఁజూచు వేడుకను మున్నుగవచ్చిరి తుమ్మపూఁడికిన్॥ 53

ఉ॥ వాణియు ధాతయుందమకు వాహనమౌ నల రాజహంసపై
నాణెముగాఁగనెక్కి యతినమ్రతతో నిజవర్తనాదులన్
బ్రాణసఖుల్ నుతింపఁ గడుభవ్యత వారలు నుత్తమంపు గీ
ర్వాణ సువాక్కులన్ వెడలివచ్చిరి శ్రీహరిఁ జూచువేడ్కతోన్॥ 54

మ॥ సురలున్ దిక్పతులున్ మహామహులు హెచ్చుంగూర్మితో సిద్ధులున్
గరుడుల్ గౌరవవారిధుల్ సుగుణసంఘప్రాజ్యవిద్యాధరుల్
వరమామోదహృదంతరాళులయి శశ్వద్భక్తి పెంపొంద శ్రీ
హరిసేవింపఁగవచ్చిరచ్చటికి నైజావాసముల్ వీడుచున్॥ 55

వ॥ అంతట సనకసనందనసనత్కుమారాది మహాఋషులును, బ్రహ్లాదనారద పరాశరప్రముఖ పరమభాగవతోత్తములును, వివిధాప్సరస్సంఘంబులును, వైకుంఠంబునకువచ్చినయవసరంబున.

తే॥ వాహనంబులుదిగి వారు వరుసగాను। విష్ణుసందర్శనముచేసి విబుధులంద
ఱతి కుతూహలులయి తన్ను నుతులుసేయ నున్నవలుచేసె వారికి మాధవుండు

వ॥ తత్సమయంబునఁబరమదయాళుఁడగు శ్రీహరిని శంకరాదులు తమభక్తికొలం ది నిట్లుస్తుతియింపసాఁగిరి. 58

ఉ॥ వెన్నునితోడశంకరుఁడు వేడ్కదలిర్పఁగఁబల్కెనిట్టులో
సన్నుతవర్యనీపరమ సాధకనామము సంస్మరింపుచున్
నిన్నెడఁబాయకుండుటకు నెమ్మదిమర్త్యులు కోరుచుందురా
పన్నులకోర్కెదీర్పుము విపజ్జనపాలన లోకపావనా॥ 59
వ॥ అంతట వాణీపతియిట్లనియె. 60
శా॥ భూలోకంబునభక్తులందఱుమిముం బూజించిసాయుజ్యముల్
వాలాయంబుగనందఁగోరి కరుణా వార్ధీ మహానందులై
చాలంగౌతుకమందుచుందురు జగజ్జాలావనోత్సాహ నీ
పాలంజిక్కిన పుణ్యమూర్తులను గాపాడంబ్రయత్నింపుమా॥ 61
వ॥ అంతటఁబాకశాసనుండిట్లనియె. 62
తే॥ ఆదిమధ్యాంతశూన్యయో యప్రమేయ। భక్తరక్షణభావయో పరమపురుష
శీఘ్రముగమీరుభక్తుల శ్రేయములను వృద్ధిపఱుపంగమిమ్మునే వేఁడుకొందు
ఉ॥ ఆయెడనీరుపాప కడుహర్షముతోనిటుపల్కెభక్తితో
శ్రీయుతుఁడైన శ్రీహరికి శీఘ్రమెవందనమాచరింపుచున్
మాయను మాయఁజేసి నిజమానసభక్తులఁ బ్రోతువంచు మి
మ్మాయిల మర్త్యులెల్లనుతియించుచు వేఁడెదరయ్య మాధవా॥ 64
తే॥ జమునసైదోషు నత్తతి జగతివిభుని।గారవంబార నుతిసల్పె కాంతమీఱ
భక్తకోటినిబ్రోవుమాపరమపురుష। వేచియున్నారుమిముఁగొల్వవేడ్కననుచు
తే॥ మూలతేఁడిట్లనుచువేఁడె మోదమలర।రాతినాతిగఁజేసిన రాజవనుచు
వేడుచున్నారుమిమ్మును వివిధగతులఁ।గావుమోయయ్య వారినిఁ గరినిఁబోలె॥
తే॥ నీళ్ళరాయండు వెన్నుని నిరుపమముగ।స్తవమొనర్చెను భక్తియుశ్రద్ధగలిగి
శబరిభక్తికిమెచ్చినశాంతమూర్తి।యాశ్రితులయార్తిఁదీర్పుమోయయ్యయనుచు
తే॥ సోఁకుదయ్యమువచ్చి తాసొంపుమీఱ।మత్కుమారునిబ్రోచెడి మహితచరిత
పృథివిజనులెల్లనినుస్తుతియించుచుండి।రయ్యవారలఁబ్రోవుమాయనుచువేఁడె
ఉ॥ తత్తడినెక్కువాఁడతుల ధైర్యసుశీలతశ్రీహరిన్ మహో
ద్యత్తత భక్తి వేఁడె సుగుణాఢ్యులఁ దుంబుర నారదాదులన్
జిత్తముపొంగగాచితని శ్రీహరి యిప్పుడుమర్త్యులెల్ల ని
న్నుత్తమభక్తిఁగొల్చుచట నుండిరటంచు యథార్థవాక్కులన్॥ 69
క॥ పిడిముడిగల వేలుపుచెలి। కుడిదెసకేతెంచి విష్ణుగుణవర్ణనముం
గడుమోదమలరఁజేయుచు।వడిగామర్త్యులనుబ్రోవ వరమునుగోరెన్॥ 70

వ॥ అప్పుడా వైకుంఠవాసుఁడగు శ్రీహరి విరించ్యాదుల స్తోత్రంబులంది తదుక్త ప్రశస్తోక్తుల కానందించి సకలభూతాంతర్యామియు, లోకత్రయ రక్షణాభిలాషుండును, భక్తవాంఛితప్రదాతయుఁ గావున సానందాంతఃకరణుండై శ్రీ సీతారామ లక్ష్మణావతారరూపంబుల కియ్యకొని మర్త్యలోకంబునం గల తుమ్మపూడి పురంబునకు వేంచేసి భక్తులు సేయు పూజలందుకొని మోక్షం బొసంగంగోరి యచ్చటికి వేంచేసిన శివ విరించి ప్రముఖుల కేతత్సంగతిఁ దెలియం జెప్పి రనంతరంబు॥ 71

తే॥ వాసవుండాదిగాఁ గలవారలెల్ల|సపరివారంబుగాఁ దాము చనిజగాన
భక్తపాలనఁ గావించు భావమునను|స్వామియాజ్ఞను రావించె వైనతేయు॥ 72

వ॥ అప్పుడు విఘ్నరాజునుఁ ద్రిమూర్తులు రావించి మేమీక్షణంబున మర్త్యలోకంబున కరుగుదెంచుచున్నారము గాన నీవీక్షణంబ తుమ్మపూడి పురంబునకుం బోయి కార్యవిఘ్నంబు కాకుండనుండు యత్నంబున నుండుమని యాజ్ఞాపింప నాద్వైమాతురుండు॥ 73

చ॥ ఒకఁడగు తుండమున్ మొలను నొప్పగు గజ్జెలు మేలిగంటలున్
బ్రకటముగాను మ్రోయఁ దనుభక్తతతుల్ పొగడంగఁ గార్యముల్
వికలత నొందనీక నెఱివేడ్కను మూషకవాహనమ్ముపై
నికట సుసేన గొల్వఁ గమనీషి జనెన్ మును దుమ్మపూడికిన్॥ 74

సీ॥ సారభేయము నెక్కి శంభుండు పార్వతి, ప్రమథగణాదులు పటిమఁ గొల్వ
గరుడవాహనమెక్కి ఘనతరాముఁడు సీత, సనకాదు లందఱు సరసఁ గొల్వ
నంచ తేజీ నెక్కి యాధాతయును వాణి భక్తసంతతి తమ్ము బలసి కొలువ
నష్టదిక్పాలకు లంచితోల్లాసిత, స్వస్వవాహనముల వరుస నిల్వ

గీ॥ సురలు యక్షులు సిద్ధులు సొంపు మీఱ|గురుముఖుల్ స్తోత్రములచేత గరిమఁ
జూప|నప్సరస్త్రీలు సరసనాట్యములు సలుప|బయలు వెడలిరి మేదినీపథమునకును॥

ఉ॥ ఆ యెడ నాంజనేయుఁ డతి హర్షముతోడుత వచ్చి భూమికిన్
శ్రీయుతుఁడైన రాఘవుఁడు చెచ్చెర వచ్చెనటంచు భక్తితో
బాయని ప్రేమతో నఖిలభక్తులకున్ వినిపించి వారికిన్
హాయిగ నుండు తావులను నచ్చట నేర్పఱిపించె నత్తఱిన్॥ 76

వ॥ అప్పుడు తత్పురవాసులంద ఱతిప్రేమాతిశయమ్ముల వారలఁ బ్రాసాదాది మహావేశ్మములయందు విశ్రమింపఁ జేసి భక్తిశ్రద్ధానురాగంబుల వలయు వస్తుపరికరంబులఁ బరితృప్తులం జేయుచు నత్యంతానందమగ్నులై నిద్రాహార

బులమాని సేవించుచుండిరట్టియెడ॥ 77
తే॥ పవనజుని ప్రేరణంబున భవ్యముగను। గురువసిష్ఠాది శిష్టులుకూర్మిమెఱయ
రామునిప్రతిష్ఠకొఱకునైరహివెలుంగ। స్థిరముహూర్తంపుఁగాలంబుఁదెలిపిరపుడు
సీ॥ తన్ముహూర్తంబునఁ దగుపెద్దలందఱు సవనాది కృత్యముల్ సరసగతిని
సఫలమ్ముగాఁజేయ సంతోషభరితులై సకలవస్తుచయంబు చాలినట్లు
సమకూర్పఁగాఁగాంచి శర్వుండు ఋత్విక్ప్రవరుల నేర్పఱచెను వరుసగాను
పాకశాసన ముఖ్యపావనులందఱు సభ్యులైయొప్పఁగ సమతవెలుఁగఁ
తే॥ గమ్మదారలందఱిత్తఱిఁగఁజనయాను।నుత్సవాలోకనాపేక్షనొప్పి విమల
భక్తినాసక్తిఁబొరలుచుఁబ్రాభవమున। మొనసిసద్గోష్ఠిసలుపంగమోదమలర॥
వ॥ అప్పుడు తత్సవనార్థనిర్మిత యజ్ఞశాలాంతరస్థలి, వేది, యరణి, మొదలగువా
నినిసిద్ధపఱచి,తత్కార్యాధ్యక్షుండగు విరూపాక్షుండు వసిష్ఠాదులను ప్రసిద్ధుల
నాచార్యాది ప్రశంసనీయకృత్యంబుల నియమించి నారదాదుల, గాయకులు
గానోనర్చ, యితోన్యంబులగు నాయాక్రియలకుఁ దక్కంగల వేత్తలనేర్పఱ
చి, యథావిధిగఁ ద్రేతాగ్నులను గ్రహించి నాయావేదికలందిడి సమంత్రకం
బుగ మఖప్రారంభంబు చేసిరట్టియెడ॥ 80
సీ॥ శ్రీరామవిభునకు సీతావధూటికి సూర్యదేవరవారు సొంపుమీఱఁ
బెండ్లికైసేఁతఁల బ్రీతిచేఁజేయించి కనకదుకూలముల్ గట్టనిచ్చి
కాంచనసుమరాజి ఘనమల్లికాదులహారముల్ వేసిరి హర్షమెసఁగ
నానావిధంబులు నవనవంబులునైన పరిమళద్రవ్యముల్ పరఁగనలఁది
గీ॥ భూషణాదులు తళ్కులింపుగనఁగూర్చి।యిష్టదైవంబు హనుమంతునిష్టముగను
గమ్మవారందఱత్తఱిఁ గ్రమభక్తి।గొల్చిరాత్మలఁగోరికల్ కొనలుసాఁగ॥ 81
శా॥ రాముండయ్యెడఁబొల్చె షోడశకళా రాజత్సుధాధాముఁడై
స్వామి శ్రీముఖమందహాసమలరేఁ జంద్రప్రభాసారమై
హేమాంగీమణి సీత చెంతనిలువన్ శ్రీశుండు విద్యుల్లతా
శ్రీమద్వారి ధరంబుపోల్కెఁగనె సుశ్రీనంతలన్ గూర్చుచున్। 82
గీ॥ పరమపావని మహితాంగి భవ్యచరిత।కమలలోచని జగదేకగణ్య విభవ
విమలహృదయాంతరాళ పవిత్రవాణి।రాము నామాంకమందుండెరమణిసీత॥
గీ॥ భ్రాతృపదభక్తినిరతుండు పద్మనయనుఁ।డార్యమత వేదివిజ్ఞానియమలహృదయ
లక్షణశ్రీసమేతుండు లక్ష్మణుండు।రాముకుడిభాగముననిల్చెరమ్యముగను॥ 84
వ॥ ఇవ్విధంబునసీతారామలక్ష్మణులు దివ్యాసనాసీనులైయుండ, నాఁడ నేయుండు

నిటలతటఘటితాంజలిపుటుండ్రై, రామనామామృత రసపానభరితానందంబు
ననిల్వ, శివబ్రహ్మలిరువంకల నుత్తమాసనంబుల విశ్రమింప, నష్టదిక్పాలకులు
సముచితాసనంబులందుండఁ బ్రమథగణప్రముఖులును, సనకాదిమునిచంద్రులు
ను, శౌనకాదిభాగవతోత్తములును, భగవచ్చరణకమలధ్యానాసక్తులై త
న్నామకీర్తనంబులు చేయుచుఁ, బూర్ణానందసమాధిచేఁ దాదాత్మ్యంబుఁ గో
రియుండ, నితరామరవిశేషనిచయంబులు, నియమంబులఁ గొలువుకూటంబు
ననిల్చి, శ్రీరామచంద్రునితో సంభాషించుచుండ, రంభోర్వశీముఖ్యసురగణి
కాకదంబంబులు, గానవిద్యాపరంబులై యుండ, నారదాదిపురాణమునులును,
శ్రవణానందకర వీణావాదనంబులు సల్పుచుండఁ, దత్సభ మహావిభవవిరాజ
మానంబై చూపఱకత్యానందంబు సంఘటింప నచ్చటి ఖేచరభూచరసముద
యంబులిట్టిమహోత్సవం బదృష్టచరంబని, స్తుతులచేఁ దెలియఁ జేయ సు
ప్రతిష్ఠార్థంబయిన పరికరంబుల, సీతారామవేంకటసుబ్బదాసులందించుచుం
డ, నాగమతత్త్వవేత్తలైన, పురుషోత్తమాచార్యానంతాచార్యాదులు, పున
శ్చరణాదికృత్యంబులు నిర్వర్తింప, దైవసహాయబలంబున సవనంబెట్లుజరుగు
చుండెననిన 85

సీ॥ ఆచార్యునాజ్ఞచే నఖిలఋత్విక్కులు నధ్వర్యులును గూడి హర్షమెసఁగ
మంత్రమంత్రార్థముల్ మంచిగాఁ జెల్పుచు వేదికాస్థలులందు వేదవిధిని
జత్వరంబులయందుఁ జక్కఁగా ఘృతమును నుంచుచు వారలు నొప్పమీఱ
నావాహితులఁ జేసి రఖిలదేవతల ధవిత్రసాధనముల వీతిహోత్రు

తే॥ వెల్గునట్లుఁ జేయుచు వేడ్కమీఱ। బాత్రలందందనిల్పి సభద్రముగను
నిరుపమోల్లాసముదయింపని యతిద్విజులు। సల్పుచుండిరి సవనంబు సమరసముగ

ఉ॥ ఆసవనంబు వారలు సమంచితకల్పముతోడ వేడ్కచే
నాసురవర్యులున్ ఋషులు నార్యులు సంతసమొందునట్లుగా
నా సరసుల్ విధిజ్ఞులు మహామహులు నానతి దాఁటకుండఁగా
భాసురలీల సల్పిరి యభంగురభావముతోడ నెచ్చఁగన్॥ 87

వ॥ ఆసమయంబున నధ్వర్యుప్రముఖులు తద్ధవిత్రంబులచే శ్రమాపనోదనంబొన
ర్చుకొనుచు, దర్వీసాధనంబులచేఁ బాత్రస్థఘృతంబు దేవతాహవిర్భాగంబున
కై విసియోగించుచు, నెడనెడ నుపస్పర్శాదికృత్యంబులు దీర్చికొనుచు,
యజమానప్రముఖు లఘమర్షణార్థంబుగాఁ దద్విధిప్రయుక్తులై మెలఁగు
సమయంబున. 88

సీ॥ హేవళంబ్యబ్దాన జ్యేష్ఠమాసంబున భృగువారయుక్తమహాకృష్ణదశమి
సకలనిర్జరులును సాంద్రసుశీలతఁ జిత్తముల్ రంజిల్లస్థిరవిభూతి
వలనొనియత్తటి వాంఛామితంబుగాఁ బ్రేమించియుండ సంప్రీతిఁగోడ
గంగాధరుండును కమలాసనాదులు మురియుచు సంమోదభరితులగుచు॥
తే॥ రామలక్ష్మణులనుసీత రమ్యముగను। పెంపుసొంపార మానసప్రేమమీఱ
సుప్రతిష్ఠితమూర్తులఁజూచి యాపురు।కట్నములనీయఁదొడఁగిరిఘనతమెఱయ॥
శా॥ గౌరీశప్రముఖుల్ మహామహులుశ్లాఘ్యంబైన భక్తిప్రభన్
శ్రీరామున్ సుగుణాభిరాముఁగరుణాసింధున్ బ్రభావోజ్జ్వలున్
నారీరత్నమురాముభార్యను లసన్నామోత్తమన్ జానకిన్
సారాచారునిలక్ష్మణున్ గొలిచిరంచద్భావమలర్పించుచున్ 90
గీ॥ ధనదుఁడామెడసమకూర్చెఁదగిన ధనము। రామచంద్రునికతిభక్తిరమ్యముగను
ఘనసుభూషణములకునై కంజనయను। నుతులనొనరించువారికి హితముగాను
మ॥ అనియిబ్భంగి సురోత్తముల్ ఋషులు తామత్యంతమోదంబుచే
ఘనతన్ గెంపులు రత్నహారములు సత్కారంబుగాఁదెచ్చి స
ద్ఘనుఁడౌ శ్రీరఘురామచంద్రునకు నిక్కంబౌ ప్రభంగూర్పఁగా
సనకాదుల్ దృఢభక్తియుక్తిని మహాసంతుష్టి సల్పన్వెసన్ 92
మ॥ సవనాద్యుత్తమకార్యముల్ మిగులసత్సత్కారముల్ సల్పితా
మవలీలన్ రఘువర్యునిన్ మదినమర్త్యశ్రేణిభావించిబల్
భవబంధంబులు బాయునట్లునిరతిం బాటించితన్నామమున్
సువివేకంబున సంస్మరించుచు మనస్సుల్ పొంగిదీపింపఁగాన్ 93
ఉ॥ శంభువిధాతృనాజ్ఞలను జక్కఁగఁ గైకొని భక్తులందఱున్
సంభరితానుమోదమున సత్కృతులన్ సమకూర్చి పెండ్లిప్రా
రంభముఁజేసి మంగళతరంబుగ సల్పఁదొడంగిరయ్యెడన్
రంభయు మేనకాదులును రమ్యతలంబుగ నాట్యమాడఁగన్॥ 94
శా॥ కల్యాణాత్మకమైన విష్ణుకథలాకర్ణింపుచున్ మానులా
కల్యాణంబునుగాంచుచున్ నిరతిఁ దత్కారుణ్యమున్ బొందమాం
గల్యంబౌ హరినామకీర్తనలు సంగన్యానులై వారు సా
కల్యంబారఁగ సంస్మరించుచు మహాకాంక్షామితిన్ నిల్వఁగన్॥ 95
ఉ॥ బాగుగ భక్తులందఱును బాలశశాంకునిఁబోలు రామునిన్
శ్లాఘనీయమైన వరసీతను లక్ష్మణమూర్తినిన్ వెసన్

రాగవిదూరశీలతను రమ్యతరంబుగఁ గాంచనప్రభా
శ్రీగురుదీప్తి మండపముఁ జేరఁగఁ జేసిరి సమ్మదంబునన్॥ 96
ఉ॥ శ్రీరఘురాముఁడావలను సీతనునిల్పి సుమిత్రపుత్రునిన్
సారసనేత్రు దక్షిణపుఁ జక్కినిఁజక్కఁగనుండఁజేసి త
ద్గౌరవ వంశవర్ధనులఁ గాంచనతేజులఁ బెండ్లిసేయఁగాఁ
బౌర జనంబులత్యమలభక్తినిజేర్చిరివైభవోన్నతిన్॥ 97
సీ॥ శ్రీరామచంద్రు సుస్థిరవైభవోన్నిద్ర కల్యాణమాయెడ ఘనతమీఱఁ
గాలకంఠాది విఖ్యాత గౌరవులెల్ల మునుకొని యిటునటు మొనసినిల్వ
ఘనవసిష్ఠప్రముఖ బ్రహ్మఋషులెల్ల నిర్వికల్పసమాధి నియతిఁగొల్వ
నష్టదిక్పాలకులారామువలగొని కార్యానుకూలతఁ గదిసియుండ
గీ॥ భాష్యపురుషోత్తమాచార్య బుధుఁడుమఱియు
నయ్యనంతమహాచార్యుఁ డతిమహత్త
వెలయఁజేయించిరిరువురు, వివిధవిబుధ
మానసోల్లాసములు పొంగిమలయునటుల॥ 98
సీ॥ గరుడోత్సవంబులు ఘన రథోత్సవములు సంతుష్టచిత్తులై సకలబుధులు
తుంగభద్రాతీర తుమ్మపూడిపురాన రాజవీధులయందు నోజవెలయ
ముక్కోటి జేజేలు మునుకొని సేవింప భాగవతోత్తముల్ భక్తిఁగొల్వ
వరవిమానంబుల వామదేవుండును వాచస్పతియు సిద్ధివఱలుచుండఁ
గీ॥ గమ్మవారందఱత్తఱిఁ గ్రమభక్తి। రామనామామృతానందరసముఁ గ్రోలు
చుండిరందఱునడువంగఁ జోద్యగతుల। వివిధవాద్యనినాదముల్ వేడ్కఁ జేసె॥ 99
ఉ॥ శ్రీరఘురాముఁడయ్యెడఁ బ్రసిద్ధతరోత్తమవాహనస్థుఁడై
భూరిదయాసమేతుఁడయి పోడిమిమీఱఁగఁదుమ్మపూడియం
దారసిపుణ్యశాలులకు, నక్షయలోకఫలంబులీయనిం
పారఁగనెంచితావెడలె నంచితభక్తులుగొల్చుచుండఁగన్ 100
మ॥ పురుహూతాదులువాహనస్థులయి యింపుల్ సొంపుఁబెంపారఁగాఁ
బురవీధిన్ జనుదేర రామవిభునిన్ బాల్పొప్ప సేవించుచున్
బురకాంతామణులారతుల్ గొని మహాపుష్పంబులన్ జల్లుచున్
దిరమౌ భక్తినొసంగిరయ్యెడమదిన్ దేవుల్ నుతుల్ సల్పుచున్॥ 101
వ॥ ఇవ్విధంబునగరుడోత్సవరథోత్సవాదులు మహోల్లాసంబున, ద్రష్టృజనంబు
ళ కానందంబుసంధిల్లునట్లుసల్పిసకలజనానుకూలంబుగా మృష్టాన్నంబులిడుచు

దేవతాశ్రేష్ఠులందఱకు ఫలాహారంబులు సమర్పించుచు సంతృప్తులఁ జేసి
వాయుసుతు నాజ్ఞానుసారంబుగాఁ దత్ప్రధానభక్తు లిరువురు తద్దేవతానుగ్రహం
బు వడసి రత్నకీలితసింహాసనంబున సీతారామలక్ష్మణుల కల్యాణానంతరమున
నేగుదెంచియుండ, సకలదేవతలాశీర్వదించి యిట్లని స్తుతించి రెవ్వరేనియు
మిమ్ము శుద్ధాంతరంగులై సద్భక్తిని మీనామకీర్తనంబులు స్మరించిరేని భవ
బంధవిముక్తులై సంసృతిదూరులై ప్రాజ్యసాయుజ్యంబుఁ జెందఁగలారని పల్కి
రంతట వారువారినివాసంబులకుం జనిరి పిమ్మట. 102

గీ॥ నిత్యపక్షోత్సవంబులు నియమముగను। మానసోల్లాసములవడ మహిని జనులు
యోగవిజ్ఞానవంతులై యుచితముగను। సలుపుచుండిరి భక్తిచే సమరసమున॥

శా॥ శ్రీరాముం జిరతంబు నెమ్మనములన్ సేవించుచున్ బాడుచున్
గారాబంబున భక్తులందఱును దత్కారుణ్యసంప్రాప్తికై
పారావారగభీరులై తమమహాపాపంబులన్ దూలఁగా
సారోదారుని రాముఁ గొల్చిరి దయాసాంద్రున్ మహాభక్తితోన్॥ 104

సీ॥ శ్రీరామచంద్రుని స్థిరనివేదనలకుఁ గల్యాణమునకునై గరిమమెఱయ
నీనామభూముల నేపారనొసఁగుచు శ్రీహరినామంబుఁ జేయుచుండి
యంతరంగధ్యానమాసక్తిఁ జేయుచుఁ దద్భక్తవరులను దలఁచుకొనుచు
శమదమాదులచేతఁ జాలశోభిల్లుచు నానందపరవార్ధి నానఁగనుచు
గీ॥ చిత్తవిశ్రాంతిగైకొని స్థిరవిభూతి। సంసృతివిరాగులై జ్ఞానసాంద్రులగుచు
నుండి రచ్యుతియోగ్యులుద్దండగరిమ। శ్రీరఘూత్తము పదభక్తి చెలఁగుకతన॥ 105

వ॥ ఈవిధంబున శ్రీసీతారామలక్ష్మణుల కైంకర్యంబులు సల్పుచుండిరి. 106

తే॥ ఇలను శ్రీరామపరిణయం బెప్పుమీఱ। వినినఁ జదివినమనుజులు వివిధగతుల
సంసృతినిబంధనాత్మకశ్రమను వదలి। సంగతోత్సాహులగుట నిస్సంశయంబు॥
తే॥ రామనామామృతాస్వాదరతులఁ దేలి। శబరివాల్మీకిమొదలైన సరసులెల్ల
భవనిమగ్నతవిడనాడి పద్మనయను। సత్కృపను మోక్షమందరే శాంతమతుల॥
క॥ శ్రీరామునిబహుభక్తినిఁ। జేరి భజించినమహాప్రసిద్ధుల దయతో
నారాముఁ డురక్షించును। గోరికలను సఫలపఱచి కొలఁతలుదీఱన్॥ 109

మాలినీ॥ మునిజనచయవంద్యా ముక్తికాంతాభినంద్యా
మననఘననివాసా మంజుభాషాఢ్యదాసా
అనుపమనతపాలా యార్తరక్షానుకూలా
వినుతసుగుణధామా వేడ్కతో బ్రోవు రామా॥ 110

# కథాప్రారంభము.

చ॥ అలరుధరాతలంబున ననంతసుఖంబులకెల్ల నిక్కమై
సులలిత సౌధసంచరణ సుందరమందగతి ప్రభావ ని
స్తుల లలనామృదూక్తి పరిశుద్ధిమనోహరతా ప్రహృష్ట హృ
ద్వలిత సుపర్వసంచయము వాసిలినామ పురంబుడంబుగన్॥ 111

చ॥ ఎచ్చటఁజూచినంగనుల కింపుఘటించెడి సౌధరాజులిం
కెచ్చటఁజూచినన్ గనుల హెచ్చగుమేల్ కృతకాచలంబులున్
బచ్చల మేల్జిగిన్ మెఱయు ద్వారములుంచిన రచ్చపట్టులున్
ముచ్చటఁ గొల్పుచుండునట మొగ్గరపుం బ్రథకుం బ్రధానమై॥ 112

చ॥ అతి విమలాంబు సంభరితమైన కొలంకులు పద్మకైరవ
ప్రతతి మనోహరంబులయి భాసిలుచుండును దత్పురంబునన్
విత తరుజాన్వితాత్మ జనవి స్తృతసౌఖ్యము తద్గతాంబు సం
తతి, యమృతంబుపోల్కి, ఘనతంగలిగించునటండ్రు తద్విదుల్॥ 113

సీ॥ ఛాయాప్రధాన వృక్షవ్రాతమచ్చోట, నిలువ నీడయటన్న నియతిఁబొల్పు
సుమఫలప్రచురమామ్రమము లెల్లనుమూఁడుపూలాఱుకాయలై పొలుపుఁజూపు
శుకశారికామహోత్సుకనాదవాదముల్, గానతత్త్వమహత్త్వకలనఁదెలుపు
వారాంగనా కదంబకగీతికారుతుల్, గాంధర్వవిద్యాసుఖంబుఁదెలుపు

తే॥ రామపదభక్తి సంభృతభూమిపాల।విమలహృదయాంతరాళ సద్విధిమనోజ్ఞ
సుకృతకృతిరంజితంబువిశ్రుతిభరంబు।పురవరంబననదియయాంబురవరంబు॥ 114

మ॥ సరిదుత్తుంగతరంగవారికణికాసారంబు, తత్తీర భూ
తరు శాఖాంచిత పుష్పపల్లవ సముద్యద్గంధ సంబంధముం
బుఱబాహ్యోపవన ప్రసూనలతికా పుష్పంధయారావ సం
భరితంబప్పురినొప్పు మారుతము సర్వవ్యాప్త సంస్పర్శమై॥ 115

ఉ॥ ఆడినమాటఁదప్పరు సహాయమొనర్తురు దీనపాళికిన్
బోడిమివీడి దుష్పథముపొంతకుఁబోవరు ధర్మకార్యముల్
కూడి యనేకభంగుల నకుంఠితభక్తినిఁ జేయుచుండ్రు మో
మోడగ నిక్కముంబలుక యోగ్యులు తత్పురవాసు లెల్లరున్॥ 116

ఉ॥ పాఱులు వేదవేత్తలు, కృపాపరతంత్రులు, క్షత్రియోత్తముల్
భూరిపరాక్రమక్రములు, భూపదిపాలనదక్షు, లర్యు లి

ద్ధోరు ధనాఢ్యులీశ్వరగుణోదధిమగ్నులు, శూద్రజాతు లిం
పారుకృషిం గృతార్థులు మహామతులన్నిటఁ దత్పురంబునన్॥ 117

చ॥ నవరసపూర్ణ కావ్యకరణప్రతిభాగతిభాసురుల్ కవుల్
ప్రవిమలవాక్పురాణ పరిపాకప్రబోధకులౌ మహాబుధుల్
సవినయ శిష్యరత్నచయ సత్కృతసద్గురు రాజమూర్తులున్
భవజలధిప్రతారకులు వర్తిలుచుందురు తత్పురంబునన్॥ 118

సీ॥ ఏవాడఁగనుగొన్న గోవిందనామముల్ నోరారవచియించు ధీరగణము
లేచాయవీక్షింప నాచంద్రమౌళిశు నాత్మఁగొల్చుచునుండు నార్యగణము
లేచక్కిఁదిలకింప నాచండికాస్తుతుల్ మనసారఁబఠియించు మానినులును
నేతావునీక్షింపఁబూతసీతారామ, విగ్రహార్చనసేయు విబుధవర్యు

గీ॥ లెచటఁజూచిన మదన రాజ్యేందిరాధివాస శృంగారవత్యుక్తి వైఖరులును
గలిగి వాసిలిపురము చక్కనిప్రతిష్ఠగల్గు పురములలోఁజాలఘనతఁగాంచె॥

చ॥ కొనఁదగు నెల్లవస్తువులకున్ నిలయంబులు, కన్గొనంగఁ జ
క్కని నయనోత్సవంబొసఁగు కాంతిగలట్టివి, యమ్మువారి కిం
తనియనరాని లాభముల నప్పటికప్పుడె కూర్చునట్టివై
యనువుగనుండె నాపణము లచ్చట వేలకువేలు వీథులన్॥ 120

చ॥ ఆపురి వాసిరెడ్డికులమందుఁ జనించినమేటి సద్యశో
వ్యాపకుఁడర్థికల్పకము, త్ర్యంబక భక్తుఁడు మల్లిఖార్జునుం
డేపుగనేలె నవ్విభుని, యేలుబడిం దగి తత్పురంబు ల
క్ష్మీపతియేలు నమ్మధుర, చెల్వునఁజెల్వముఁగాంచె నిచ్చలున్॥ 121

గీ॥ ఆపురంబేలు భూపాలుఁడైంద్రవిభవశాలియై ధాత్రిఁగలరాజచంద్రులందు
శ్లాఘ్యతరశీలుఁడనఁగఁబ్రశస్తిగాంచినిష్కపట వర్తనుండయి నెగడెఁగీర్తి॥122

మ॥ పరమార్థజ్ఞుఁడు మల్లిఖార్జునుఁడు సంపచ్ఛాలి, సత్రంబులన్
బురమందచ్చటనచ్చటన్ నిలిపి, యెప్డున్ విప్రసంతర్పణల్
గరమున్ భద్రసయుక్తిఁజేయుఁడని యాజ్ఞాపింప రాత్రిందివం
బరరే భోజనకాలకీర్తనల బ్రహ్మానందమాసత్రముల్॥ 123

వ॥ ఇట్లుండ నొక్కనాఁడు॥ 124

సీ॥ ఆమల్లిఖార్జునుం, డతికుతూహలమునఁ గొలువుకూటంబునఁ గూర్మితోడ
నవరత్నసింహాసనంబునఁగూర్చుండి సుజ్ఞానముననుండ సొంపుమీఱ

విద్వాంసులందఱు, విద్యావినోదంబు, సక్రమంబుగఁ జూపి సరసనుండ
భాగవతోత్తముల్, భక్తిచే హరిహరనామ సంకీర్తనతో మెలంగ
గీ॥ వారవనితలు గానసంపత్తిచేత। హృదయపుటములకొక కొంత హేలఁ జూప
తచ్ఛ్రవణజాతసంతోష, తతమహీంద్ర। వర్యులద్భుతమగ్నులై వఱలుచుండ॥ 125
గీ॥ వందిమాగధచయములు, పార్థివునకుఁ బలుపరాకులు దెలుపుచుఁ బటిమ మెఱయ
రాజసన్నిధినుండంగ రమ్యముగను। బ్రవిమలానందమందందుఁ బ్రబలుచుండె॥
సీ॥ మదగజంబులబారు మదధారలొలుకంగ నడయాడుకొండల బెడఁగుఁ జూప
వాజిసంఘంబులు వరహేషితంబుల భూనభోంతరముల భోరుకొలుప
నుష్ట్రసంచయములు నుత్తమాంగంబులఁ బైకెత్తియొక కొంతపటిమఁ జూపఁ
బంజరంబులయందుఁ బలుసింహశార్దూలములు లోకభీకరములుగ నడర
తే॥గీ॥ దిక్కులన్నియుధ్వనులచేఁ దిరిగి మ్రోయ। శుకపికాదులు పొదరిండ్లసారిదిఁ గూయఁ
గలకలధ్వనులంతటఁ గలయుచుండ। వినఁగఁ గనఁగఁ బ్రమోదంబు వెలయుచుండె॥
వ॥ ఇట్లఖిలగుణసంపన్నంబగు నప్పురంబు నేలు మల్లికార్జునప్రభుండు విద్వచ్ఛ్లా
ఘ్య వితరణుండై విరాజిల్లుచుండ॥ 128
ఉ॥ ఆతని దేవి సాత్త్వికగుణాంచిత, భర్తృపదానురక్తయై
నీతిసమేతయై తగిననేమముగల్గి, యనేకధర్మముల్
ఖ్యాతి వెలుంగఁజేసి సుజనాదరముం గణియించి యన్నిటం
బ్రీతిఁ జనింపఁజేసెఁ బృథివిం బ్రథితాశ్రితకోటి కాదటం ॥ 129
చ॥ భువిజనులందఱుం నతులభూరివివేక విశాలబుద్ధిచే
నవిరళకీర్తిసంపద సమంచితయై ఖరిఁ బొందుసుందరిం
సవినయభక్తిచేఁ బొగడసాగిరి సుస్థిరమానసంబులం
వివిధపరోపకారయని వేడుకమీఱఁగ నెమ్మనంబులం ॥ 130
సీ॥ పల్లవమృదుపాణి, పార్వికాబ్జానన, కంబుకంఠి విశాలకంజనయన
బింబాధరోష్ఠి సద్వినుత మేచకవేణి మందస్మితాంచిత, మాననీయ
కనకకుంభోరోజగగనోపమితమధ్య, కనకాంగి మంథరగజసుగమన
సమదంతరుచివక్త్రి సరసవాక్యవిశాల, పరమపాతివ్రత్యభవ్యచరిత
తే॥ ఘనతరావిళ్లవారింటజననమంది నట్టిమానిని మనరాజునను గుఁ జెలియ
యైయరుంధతియోయనన న్నివిధుల నిహపరంబుల సత్కీర్తి సేవుమీఱె ॥ 131

“మల్లికార్జునునకు సదాశివుఁడను కొమరుండు పుట్టుట.”

మ॥ పరమానందసుశీలవర్తనలచే భాసిల్లి యాదంపతుల్
సురతానందముతో మెలంగఁగఁగడుఁ సొంపొప్పుపుత్రుండు శ్రీ
వరగంగాధరుభక్తుఁడై కలిగెనా, వామాక్షిగర్భంబునన్
బరమోత్సాహముతోడఁ దాఁడు ప్రజలంపాలించుచుండెన్వనన్ ॥ 132

వ॥ ఇట్లు కుమారోదయంబైన కొన్ని దినంబులకుఁ దద్బాలునకు నామకరణాది కృత్యంబులు నిర్వర్తించి సదాశివుండని నామకరణంబు చేసి మించియుండ మఱికొన్ని సంవత్సరములకుఁ దత్పట్టణనికటస్థలంబునం దొకయుద్యానవనంబునకు ననుదినంబు తద్రాజసుతునిఁ బరిసేవకులు వనవిహారంబునకై గొని పోవ నప్పుడప్పు డవ్వనశృంగారం బెట్టులుండెననిన, సాలరసాలపున్నాగ పారిజాతమాతులుంగ కురువక కురంటక కోవిదార ఖర్జూర నారికేళాశ్వత్థ చందనపిచుమందజంబు జంబీర శింశుపాశోక సహకారాది బహువృక్షంబులును, మల్లీమాఖ్య కేతకీచంపకవకుళ మాధవీప్రముఖంబులగు పుష్పప్రథానలతావృక్షంబులును, శుకపిక శారికామయూరాది సుస్వనపక్షినివహంబులును గలుగ నచ్చట నొక్కకమలాకరంబు గలదు. తత్ప్రాంతంబునఁ గొన్ని పూఁబొదరిండ్లు గలవందు ॥ 133

సీ॥ ఆమ్రపల్లవముల నాకంఠముగ మెక్కి, పికములు నాదముల్ వెలయఁ జేయ
దాడిమీఫలములఁ దనివారభుజియించి, శుకములు మృదురుతుల్ సొక్కిపల్క
ద్రాక్షాఫలంబుల రహిమీఱఁ దెగఁదిని శారికలతిమృదుస్వనముఁ జేయ
వనఫలంబుల నెల్ల ననువొప్పభక్షించి, బర్హిసంచయములు ప్రబలికూయఁ
తే॥ బుష్పలతలందు బంభరవ్యూహ మెపుడు। కుసుమరసపానమత్తమై విసువులేక
నాదమొనరించుచుండ నానందభరితుఁ।డగుచుఁ బ్రభుపుత్రుఁడలరు నిత్యమొకభాతి॥

తే॥ తద్వినోదంబు కనుఁగొన ధరణివిభుఁడు। ప్రవిమలానందమడరంగఁ బజ్జకేగి
చూడనారాచబాలుండు చోద్యమంది। పరిజనావళితో నిట్లు పలుకఁదొడఁగె॥ 135

ఉ॥ ఏమివిచిత్రమోయిచట నింపుదయింప సునాదమాధురీ
నామముతోడ గీతములు నాణెముగా గమనించిపాడుచున్
ప్రేమముతోడ నీకొలను నెక్కొనియున్న కతంబు దెల్పుమం
చామనుజోత్తముండడుగ నయ్యెడఁ బల్కిరి సేవకోత్తముల్ ॥ 136

వ॥ ఆనరరాజసింహశాబకునిఁ దత్తీరంబున మున్నా ప్రభువరుని తండ్రియగు మల్లికార్జున భూపాలుండు నిజవనవిహారసమయంబున విశ్రమించుట కనేక చిత్ర

విచిత్రపాషాణాదులచే నిర్మింపంబడినదని తెలిపి యొక్కవేదికయందుఁ గూర్చుండఁబెట్టి దచ్ఛేవకులు ముకుళితహస్తులై నిల్చి, తద్బాలవతంసంబునకు నచ్చటఁగల పుష్పలతా ఫలవృక్షాదుల నామంబులను వేర్వేఱఁ దెల్పుచుండి రెట్లనిన, నీయవి మల్లికాది పుష్పలతలు మఱి యియ్యవి కోకనదాది పుష్పజాతులు పద్మలతాదులీ మేటికొలంకునందు విలసిల్లుచున్నయవి, దీనితీరంబునందుండు ఫలపుష్పభూరుహంబులు కొన్ని ఫలపుష్పనమ్రశాఖంబులై యంతజ్జలస్పర్శంబు జేయుచున్నట్లున్నయవి. ఇట్టి విలక్షణవిశేషంబున నీసరోవరంబు స్వయంబుగ మృదురవంబులు సల్పుచున్నయట్లున్నయది, యన సానందమానసుండై యచ్చటి శీతవాతంబు సుగంధబంధురంబై తన్ను సేవించుచుండె నట్టియెడ॥

రాజకుమారునకు నొకవృద్ధబ్రాహ్మణుండు ప్రత్యక్షమగుట.

తే॥ వృద్ధబ్రాహ్మణుఁడొక్కండు వేడ్కమీఱ। దేవభక్తినిజపమాలఁ ద్రిప్పుకొనుచు
నచ్చటికి రాఁగఁ బ్రభుపుత్రుఁడమలభక్తి। నెదురుగాఁ జనికొనివచ్చి యిట్లుపలికె॥

చ॥ మునివర మీరలిచ్చటికి మోదముతోడుత రాఁగ హేతువే
మని యడుగంగ నాతపసి యానరనాథునితోడ నిట్లనెన్
వనజదళాక్ష నీకడకువచ్చితి నేనొకవార్తఁ దెల్ప నె
మ్మనమునఁ జింత నొందక సమంచితవైఖరి నాలకింపుమా॥ 139

మ॥ అని యిబ్భంగి ద్విజుండు తెల్ప నిజమాయాతీత విభ్రాంతియు
న్నని మాయన్ విడనాడి పూర్వకథసుజ్ఞానంబునం గాంచి తా
మునికిన్ మ్రొక్కి నుతించి పల్కె నపుడామోదానుసంధాయియై
కనుఁగొంటిన్ మిము దీర్ఘకాలమునకుం గౌతూహలం బేర్పడన్॥ 140

వ॥ అని యివ్విధంబునఁ బశుపతి యమ్మునిరూపంబున సాక్షాత్కరించి తొల్లిటి యారాచబాలుని వృత్తాంతంబంతయు నెఱింగింప, నబ్బాలుండు మాయావిదూరుండై నిజాంతరంగంబున యోచించి, యెట్టకేలకు గ్రహించి గౌరవించి యమ్మహాత్ముని దద్వేదికయందుఁ గూర్చుండ నియోగించి యన్యోన్యసంభాషణంబు సల్పుసమయంబున నారాజబాలకుని సేవకులందఱు, నవ్విప్రునిమహిమచేఁ దత్సంభాషణవాక్యంబు లెంతమాత్రముం దెలియంజాలక, నిర్విణ్ణులై తమప్రభుసన్నిధి నిలువంబడి యుండిరయ్యెడ॥ 141

ఉ॥ ఓనరరాజశేఖర ప్రయోజకతం దగు జ్ఞానమందకే
భూసుతకీర్తిచేమిగిలి భూరిగ మాయను జెందియుంటకున్

మానవనాథ; నీకిపుడు మంచిదిగాదిఁక దుర్భరమస్థితిన్ 142
మానుగవీడి నీవిపుడు మానితమార్గముఁ గాంచనొప్పెడిన్॥

తే॥ దునీ తండ్రియు మ్లేచ్ఛులంపు నెనరులేక। పోరి దురమున నిరువురు భూరిబాణ
హతులచేఁజావనుండిరి యాగ్రహమున। నపుడు నీతల్లి తద్వార్త నచటవినఁగ

ఉ॥ వీరపతివ్రతావిధిని వేగమ సమ్మతిఁ బ్రాణవల్లభుం
డారయ యుద్ధవాటికను నయ్యరిపోరునఁ జావఁగానె తా
భూరి పరాక్రమస్థితిని బొందుగ ఖడ్గముచేతఁ జచ్చె సం
సారమునందు వాంఛవిడి సారసలోచన మేను వ్రయ్యఁగాన్॥ 144

వ॥ కావున నీయన్వవాయంబు మునుపటినుండి మద్భక్తిసంయుక్తంబగుట నీవు
భవిష్యత్కాలంబునఁ గీర్తిప్రతాపవిభూతి విరాజమానుండవై యభివృద్ధినొం
దనున్నవాఁడవు. నిన్నినగరంబునుండి మన్మాయావృతులరై నీతలిదండ్రులు
త్తరపుణ్యక్షేత్రంబులకుం బంపనున్నవారుగావున నేతత్సంగతి నీకెఱింగింపవ
చ్చితినని తెల్పి యావృద్ధబ్రాహ్మణుండంతర్హితుండయ్యె నప్పుడు॥ 145

ఉ॥ రాజకుమారుఁడయ్యెడల రమ్యతరంబుగ సేవకోత్తముల్
భూజనులందఱుం బొగడఁ బొందుగ దద్వనవాటివీడుచున్
లాజలుపుష్పముల్ పురమునంగలకాంతలుచల్లనింటికిన్
దాఁజనిసౌధభాగమునఁ దత్కథఁజిత్తమునందలంచుచున్॥ 146

సీ॥ పరితాపమొందక ప్రబలసుజ్ఞానతఁ గురరిమాడ్కిని, దగఁగూర్మితోడ
మాతాపితలయొక్క మరణంబుఁదలఁచుచు, సుజ్ఞానబుద్ధిచే సురుచిరముగ
లోకులతోపాటు లోకేశ్వరుండును, వర్తించుచుండెను వసుధయందుఁ
దనపూర్వజన్మంబుఁదగఁదెల్పనమ్ముని, జాగరూకతనొంది జగతివిభుఁడు

తే॥ ప్రవిమలానందభరితుడై ప్రబలగతినిఁ జిఱుతప్రాయంబునందునఁ జిత్రముగను
మాయవిడనాడి సువివేకమహిమఁగాంచి నెమ్మిశివనామముఁదలంచు నెమ్మనమున

వ॥ ఇవ్విధంబునఁ గతిపయదివసంబులుజరుగఁ నొక్కనాఁడు గగనమణిమండల సం
కాశసాహసనిరర్గళార్గళభుజపరాక్రమ భూజనవినుత శాశ్వతైశ్వర్యధురంధర
మహేశ్వరుండును, సదాదానధారాప్రవాహుండును, నసమ సమరోత్సా
హసితవాహుండును, శ్రీశంకరపాదకమలధ్యాన పరాయణుండును, వల్లుట్ల
గోత్రోద్భవుండును; సాంద్రరాజ్యాభివృద్ధిసంపన్నుండును; నగు మల్లికార్జున
ప్రభువరుం, డధికవైభవసాంద్రుండై, రత్నస్థాపితద్వారబంధబంధుర లక్ష్మీ
విలాసజననసమయజలాంతరలక్ష్యమాణజలజసదనసమాగమనము సొంపుసం

పాదింపసాభోగయవనికాభ్యంతరాద్యసముద్యతయంత్రపాలికాసంచారంబులు జిలుఁగుదరఁగలమెఱుంగువెడలివచ్చు నచ్చరమెఱుంగుఁబోఁడులు తెఱంగు లెఱింగింపఁ జంద్రకాంతనిర్మితకుడ్యప్రతిబింబితచంద్రాననావదనంబుల, తరంగతరళనవేందుబింబంబులచక్కఁదనంబును బొందుపఱుప, నభినవస్ఫటికోపలసంస్థాపితసోపానపార్శ్వగజతుండాకారరేఖావిశేషంబుల ప్రతిబింబంబులతోఁ గూడికొనునట్లు సంజాయమాన సంక్రందనవేదండశుండాదండప్రచారంబులఁ బ్రసరింప విద్యోతమానమహాస్థానభువనంబున శ్వేతద్వీపనీకాశతనొప్పుచున్న యమూల్యముక్తామయసింహాసనంబున సుఖాసీనుండై మంత్రిబుధానేకవర్గంబులతో నుండుసమయంబున, గగనవాణిసభ్యులువిన నిట్లనియె॥ 148

ఆకాశవాణి మల్లికార్జునప్రభువునకు దురంబు ప్రాప్తంబగునని
సభ్యులు వినునట్లు చెప్పుట.

సీ॥ ఆధర్మదేవత యాకాశవీథిని, మృదుమధురోక్తులు గదురఁబలికె
రాజవర్యా నీదు రాజ్యంబు రిపులచే నారత్రయంబున బల్మిమెఱయఁ
గోల్పోవనున్నది కొమరొప్పదురమున, వైరులచే మృతివచ్చునీకు
నరయఁ రాఁగలకాలమందు మీవంశంబు, నభివృద్ధినొందు నీయవనియందు
తే॥ నేఁడు నీయన్వవాయంబు నిల్చు తెఱఁగు
కాంచుమనిపల్కె కనుచాటుగాఁగ నపుడు
వికల మానసుఁడై యుండె వివిధగతుల
మంతనంబునఁ జింతచే మనుజ విభుఁడు॥ 149

వ॥ అంతట నారాజశేఖరుండు దుఃఖాక్రాంతుండై యెట్టకేలకు మంత్రి బుధ బంధు మిత్ర జన హితోక్తుల దుఃఖోపశమనంబునొంది తన యిష్టదేవతా ప్రార్థనంబొనర్చి సాక్షాత్కరించిన యుమాపతిని సంస్మరింపుచు నిజయోగ మహిమాతిశయంబున నప్పలుకులుస్థిరంబనియెంచి తనభార్యను సభాస్థానంబునకుం జేరంజీరి, గద్గదస్వరముతో నిట్లనియె॥ 150

చ॥ వినుము సరోజనేత్ర; యిఁక వేగమ యేమరుపాటు పోవలెన్
ఘనతర రాజ్యవైభవము క్రచ్చఱఁ దొల్గును శత్రురాజుచే
ననువుగ ఘోరయుద్ధముననందఱుఁ జత్తురు బాణకీలలన్
మనమునఁజింతనొందకయ మానుగ వంశము నిల్వఁజూడుమా॥ 151

ఉ॥ భాసురశీల నీవిపుడు బానిసకత్తియమైన లక్ష్మితో
భూసురపాలకున్ విబుధపుంగవపోషకు శ్రీసదాశివున్

వాసిగఁ బుణ్యభూములకుఁ బట్టిన గొప్పధనంబుతోడ నే
యీసమయాన నేర్పు మెయి నింపుగఁ బంపుమ యుత్తరంబుగన్॥ 152

వ॥ అనిన నయ్యింతి దైన్యంబుదోఁప నిట్లనియె॥ 153

సుగంధి॥ ఏను పూర్వజన్మమందు నెంత దుష్టనైతినో
పూని యీశ్వరాజ్ఞ నేఁడు పొందఁగల్గె నిట్లుగా
నో నిజేశ సాంబునాజ్ఞ నుజ్జగించు టెట్లటం
చాననంబు వంచి పల్కె యా పెకూరె భూస్థలిన్॥ 154

తోటకము॥ భామరొ నీవిటు వారక యేడ్వన్। భామరులందఱు బాగుగ నిన్నున్
భూమిని నవ్వరె పోడిమి వీడన్। నీమదిఁ గుందక నిల్వుము వేగన్॥ 155

వ॥ అని మఱియు నిట్లనియె॥

ఉ॥ ఆపదగల్గ ధైర్యము సమంచితరీతినిఁ దాల్చియుండుమా
ప్రాపుగఁ జెప్పెదన్ వినుము పంబిన దుఃఖము మాని తెల్విపై
నాపదఁ బాపఁగాఁదగిన యా శివనామము సంస్మరించుచున్
భూపరిపాలనార్హుఁడగు పుత్రునిఁ బంపుము వేఱు చోటికిన్॥ 156

మ॥ అనుచున్ వేగమ తద్విభుండు పలుకన్ వారించి యద్దేవి తా
ననువొప్పన్ దమదాసిలక్ష్మి వెరవొ నచ్చోటికింబిల్చి నం
దనునిం గ్రచ్చఱ నొప్పగించి మది తద్ధ్యానంబునందంగని
ట్లనియెన్ దత్సభనున్న భూపతివినన్ న్యాయైక దృష్టిన్ వెసన్॥ 157

వ॥ ఓ ప్రాణనాథా! మనయెడ నీశ్వరానుగ్రహంబిటుల వచ్చెఁగదా యనన్ నా
పాలుండు వికల మనస్కుండై యుండె, నాసమయంబున॥ 158

ఉ॥ అంతటఁ దత్సభాస్థలమునందుననుండిన యార్యులందఱున్
వింతగ హాయటంచు మది వేగమె ధైర్యముతోఁ మెలఁకువన్
జింతనుమానుమంచు మృదుశిష్ట వచస్తతి జ్ఞానబోధమున్
సంతసమందఁ జేసిరతి శాంతముతోడను భూపమౌళికిన్॥ 159

సీ॥ మంత్రిబుధానేక మర్త్యులబోధచే విజ్ఞానవంతుడై విధినిఁదలఁచి
ప్రారబ్ధమనుభవింపక తీఱదని యెంచి తెలివి తేఁటలుగల్గు తెరువుగాంచి
దాసియాలక్ష్మికి ధనమిచ్చి తగునట్లు మాయన్వయంబును మనఁగఁ జేసి
తల్లిదండ్రుల మాఱుతగ వొప్పనీవును దల్లివై పోషించుదయను నితని

తే॥ ననుచుఁ బంపిరి బాలకునపుడు వార। లుత్తరక్షేత్రములు చాల నుచితమైన
పుణ్యభూములటంచును బొందుగాను। వింటివే వేగ నీవటు వెడలుమనియు॥ 160

వ॥ అంతట నాదాసి తద్రాజాజ్ఞవడసి, కళాపరిపూర్ణచంద్రాననుండును, శమదమా
ది సుగుణసంపన్నుండును, వృద్ధికాముండునగు సదాశివుంగైకొని, మాతా
పితృబంధుమిత్రపురజనంబులు నగరంబు వెడలనంపఁజనియెఁ దదనంతరంబ॥ 161

◆ హైదరుజంగుతనసేనతో మల్లికార్జునుని పట్టణంబుముట్టడించుట. ◆

ఉ॥ ఆయెడలోకభీకరుఁడు హైదరుజంగుపరాక్రమంబుచే
న్యాయముఁదప్పిసైన్యము సముచితనైఖరిఁగూర్చితానునా
నాయుధసంఘముంగొని, యనంతబలంబులుపిక్కటిల్లఁగాఁ
బాయనిమేటిపట్టుదలఁ బట్టణమున్వెసముట్టడింపఁగన్॥ 162

ఉ॥ అంతటమల్లికార్జునుఁడు నత్తఱివచ్చినశత్రురాజవృ
త్తాంతమునంతయున్విని సముచితవృత్తినిదానుగూడవే
మంతనమందుమంత్రులను మాన్యతరాఁబిలిపించిపల్కె భల్
పంతముతోడశాత్రవుఁడు పైబడవచ్చెనుబోరుఁగోరుచున్॥ 163

వ॥ ఈప్రకారంబుగానని, యాభూపతి, సభాస్థలస్థమంత్రిబుధపుంగవాదులతో శత్రు
రాజురాకడం దెల్పఁగాలోచితజ్ఞులగువారలు నాథరాపురందరునితో మనము
దురంబుసల్పు టుచితంబుగాదు, ఎవ్విధినైనఁబ్రత్యర్థితో సఖ్యంబుఁజేయుట
మంచిది, అని విన్నవింప నారాజు కొంచెమాలోచించి, నిర్హేతుకంబుగాముట్ట
డించిన మూర్ఖునితో సఖ్యంబుఁగోరుటుచితంబుగాదనితలంచియిట్లనియె॥ 164

మ॥ జననంబందితిఁ బెద్దవంశమున వంశఖ్యాతితూలంగనే
నసిలోమూర్ఖ, దురుష్క హైదరును బాణాగ్నింబడద్రోయ కే
ఘనతంగాంచుటయెట్లు, పూర్వనృపసంగ్రామంబులన్ విన్ననా
మనమీమూర్ఖుని సఖ్యముంగొనదు సుమ్మా, మీరుయోచింపుఁడీ॥ 165

వ॥ మున్ను బలిచక్రవర్తిచేఁ బరాభూతుండగుపాకశాసనుండు తచ్చక్రవర్తినిమ
రలజయించినటుల మనకునుజయంబుకలుగవచ్చును, జయాపజయంబు లొక
రిసొమ్ములుగావు, కావునమనమీయెడఁగదనంబుసల్పుటుచితంబయని తనమం
త్రిపుంగవుని, హైందరుజంగుసన్నాహంబుఁదెలిసికొనుటకై ప్రయాణంబుచేసి.

ఉ॥ మిత్రునిఁజూచియిట్లనియె మేలుగనీవిపుడేగిధీరతన్
శాత్రవవర్తనం దెలియ సంశయమూడఁగముచ్చటించిబల్
కృత్రిమవృత్తియేమిటికిఁ గీర్తివిహీనతవచ్చియుంటిరే
రాత్రముగానటంచడిగి యాపయిరమ్మటుభూసురోత్తమా॥ 167

చ॥ అనవుడుమంత్రిసత్తముఁడు నాత్మగతంబుననీప్రసక్తికిన్
దనిసిప్రభూత్తమాజ్ఞఁగొని దర్పకవైరిమదిందలంచుచున్
జనియెదురుష్క వీరబలు సన్నిధికిందగుపాటియుక్తియు
క్తినిరిపుతత్వముం దెలిసి దేవరకున్వినుపించుకోరికన్॥ 168

వ॥ అంతటమంత్రివరుండు హైదరుజంగునుజూడఁబోవ నిచ్చుటఁగమ్మదొర నిజభటులరావించి "మనపురంబులోనికి శత్రుబలప్రవేశంబు, కలుగకుండ మీమీశక్తిస్ఫురణంబులంజూపివర్తిలఁవుఁడు," అననాభటవర్గంబు స్వప్రభునానతి శిరసావహించి, యేరికిఁజొరనశక్యంబుగాఁబురంబుఁగాచియుండిరనంతరంబ

ఉ॥ పోయినమంత్రిమ్లేచ్ఛవిభుపొంతకుఁజేరి నిజమ్ము దెల్పఁగా
నాయన చారునిన్ బిలిచి యాతనితోఁగనరాక జేనికి
వీయెడఁదెల్పుమాయన సరేయని తెల్పిన మ్లేచ్ఛుఁడప్డు ర
మ్మాయన నీతఁడాతఁడు శుభాగమనూక్తులమించమంత్రియున్॥ 170

ఉ॥ ఓనరపాల మున్నె విభవోన్నతులై ధర త్రేండ్లకిచ్చి తా
మానన్ఁ గప్పముల్గొనుచు, నావిధివీడి నృపాలుప్రోలు పెన్
బూనికముట్టడింపఁ దగునోయగునో తగవిద్ది, నా, ధరా
జానివచించె మీప్రభువు చాలఋణంపడె నాకునంచిటుల్॥ 171

చ॥ అలఁటఋణంబుగాదు వినుమా సచివోత్తమ; మూఁడులక్షలే
వలనునఁదీర్పకున్న సిటువచ్చితిఁ బల్మఋనడ్గియడ్గి మే
ల్వలఁతివినీవు నీప్రభువుసజ్జవచించి ధనమ్ముపంపినన్
గలుగుశుభమ్ము లేనియెడఁ గల్గురణమ్ము నిజమ్ముపొమ్మనెన్॥ 172

వ॥ అత్తఱి నమ్మంత్రివర్యుండు కోపావృతమనస్కుండై సమయవైలక్షణ్యంబున, శాంతంబుప్రధానంబుగా నెంచి "రాజరత్నమా! మాయిలాపాలకుండుదేయంబగు కప్పంబునీయక, యింతకాలంబుండువాఁడుకాడు; ఈవిషయంబెన్నండు నాచేనశ్రుతచరఁబు! ఇంతఋణమేమి! ఇప్పటికంపకుండుటేమి! మాప్రభుస్వభావముంబట్టిచూడఁగప్పమింతకాలమంపకుండువాఁడుగాఁడు కావునఁదమకిఁదగిన బాకియే, యబద్ధమని తోఁచుచున్నది. ఎప్పటికప్పుడిచ్చినట్లు లెక్కగన్పట్టుచున్నది. వృథాగా నిట్లుకోరు టుచితంబుకా" దనిన నాహైదరుజంగుమ్మలికంబుపొంగ నిట్లనియె॥ 173

ఉ॥ పొమ్మధనమ్ముఁదెమ్మనుము భూపుని, లెక్కలతోఁబనేమిలే
లెమ్మిట రచ్చలేలయన లేవక మంత్రిశిఖాజ్ఞనిట్టి కా

లమ్ముత్కృష్టమయ్యె, నతిలాఘవమయ్యెనటంచు, మ్లేచ్ఛచి
త్తమ్ములగ్గరంగ సంఘలపితమ్ములవేడఁ దురుష్కుఁడయ్యెడన్॥ 174

ఉ॥ న్యాయమువీడి కప్పములనందెడివారముగాము, పోమెయ
న్యాయపథంబులందెపుడు, నార్యకులోత్తమ! యన్న, మంత్రిమీ
ఛాయగనుంగొనన్, బహుయశఃప్రదమౌను, ధరేంద్రులెందఱో,
పోయినత్రోవ, దానికొకపొచ్చెము రాఁదగదంచుఁ బల్కుఁడున్॥ 175

వ॥ మ్లేచ్ఛప్రభుండు సర్వంబు సంపన్నంబు, తమరు తప్పకదయచేసి తమప్రభువుచేఁ గప్పంబు నంపింపుఁడు; కాదేని రణసామర్థ్యంబుఁ జూపింపుమనుఁడు; అన మంత్రిపుంగవుండు సెలవుంగైకొని, గతతేజస్కంబగు మొగంబుతో "మనకు శుభకాలంబు గతంబయ్యె" నని, మనంబున నెంచికొనుచు, స్వప్రభుసన్నిధానంబున వంజలి జరిగినవృత్తాంతంబు నివేదించి శాత్రవాట్టహాసంబుఁ దెలిపి "మనమిప్పుడు కప్పమంపుటుచితంబు కాదనియుఁ దుచ్ఛమ్లేచ్ఛలక్షణంబులు శిక్షార్హంబులై యుండెననియు, మనకుయుద్ధవ్యాపారమిపుడు మంచిదనియు" విన్నవించిన, మల్లికార్జునప్రభుండు నిజమంత్రియగు గోవిందరావు నివేదించిన శౌర్యవాక్యంబుల కానందించి యిట్లనియె॥ 176

మ॥ సచివాగ్రేసర; భానుతేజ; తగ నాసంకోచముల్ వీడె, నో
యచలద్ధీరగుణా; భవద్వచనముల్ హత్తించెనానందమున్
రుచిచే, శాశ్వతశక్తిచే, నిచటఁ బేరుంగాంచుచున్ నిల్చిపె
ద్దచలమ్ముంగొని యుండుమే; రిపులయుద్ధమ్మందుఁ జెండాడెదన్॥ 177

ఉ॥ పేరుప్రతిష్ఠగల్గి యరివీరునిఁద్రుంపక, డాగియుండనీ
పేరునశించుఁగాలమిటు వెళ్లెను, శంకరునాజ్ఞయిట్టిదై
మీఱెను, మ్లేచ్ఛునిందునిమి మేలుగణించుటొ, లేకవానిచే
బోరునసిల్గుటో తెలియఁబూనెదఁ దూణముబాణపూర్ణమున్॥ 178

వ॥ అని సేనలుసమకూర్ప, సేనానాయకుండగు భీమసింగున కాజ్ఞయిడ, దేవేరి, యాపరిభూత్తమున కిట్లనియె "ఓప్రభుసార్వభౌమా; శత్రువులు మత్తిలియున్నప్పుడు జగడింప వేళకాదని, యుద్ధాసక్తినివీడుట శాస్త్రీయంబు; ఇట్లు ప్రాచీనాచారులందఱుఁ జేయుపనియే; అనుడుఁ బుడమిఱేఁడిట్లనియె॥ 179

తరల॥ పుడమిలో మనవారలందఱు పుట్టిగిట్టకయుండిరా
కడుముదంబున జ్ఞానహీనతఁ గాంక్షఁ శోఘనధీరతన్

వెడలకుండఁగ నెల్లకాలము వృద్ధిఁగాంచుచు నుండుమా
యిడుమలుఁ సమకూడువేళల నెట్లొ పొందక దీటునా॥ 180

క॥ తీఱెను నాతోఁబంధము। తీఱెను మీరాజ్యవిభవదీప్తులవెల్లన్
దీఱెను బృథివీభ్రాంతియుఁ। దీఱె నెమన పీటిపొందు తెలవాయరయన్॥ 181

ఉ॥ మాటికిమాటికీవిటుల మానిని! పల్కెదవేల నేను నా
పోటరిచేఁత చేసని రిపుంబరిమార్చి సురాధివాసపుఁ
గాటఁపుఁగల్మిఁగాంచి సుఖిఁగాఁదగుఁగాక వయస్సు జారియే
చోటనుబల్ రుజల్ కలఁప సుక్కఁగలేను గదే తలోదరీ॥ 182

క॥ భగవన్నామముసేయుచు। సుగుణంబులకలిమినుండి శుద్ధక్రియలన్
జిగిఁగాంచి జీవితంబెటొ। తగుపాటిగఁ గడపుకొనుము తత్త్వమెలర్పన్॥ 183

చ॥ అనవినిరాణ రాజుఁగని యక్కటికంబౌకకొంతదోఁపనో
జనవర! యాంధ్రరాజవర సన్నుతగణ్యచరిత్రుఁడైనమీ
కనుఁగుఁబడంతినై యిపుడహో బహునీచకులోక్తిసక్తమౌ 184
వ్వనిపడిపంచనోనిలక ప్రాణముపీడెద ఖడ్గధారతో॥

చ॥ అనుడునృపోత్తముండు నెలఁతా! భవదుక్తికిసంతసించితిన్
వినుమొకమాటనేను, రిపువీరులచేమృతిగాంతునేని నీ
వును ఘనఖడ్గధారమృతిఁబొందుము లేనియెడన్ జయోదయం
బున ననువొననుంగలసిపొందు మనిందితసాంద్రసౌఖ్యముల్॥ 185

వ॥ అనిపల్కిననమ్మానవతీశిరోమణి సంతసించియుండ నక్కాశ్యపీశ్వరుండు నేను యుద్ధంబునకుఁ జనుచున్నవాఁడ, నీకింకను జెప్పందగువిశేషంబులెవ్వియును లేవు. లక్ష్యవేదినివైయుండుము, అనిచెప్పుచు రణోత్సాహియై భీమసింగు ముఖ్యులరావించుకొని తత్తత్సన్నాహసహితుండై బయలువెడలిన॥ 186

శా॥ ఆమూజిప్రతిభార్భటిన్ విని తురుష్కాధీశుఁడయ్యారె మీ
రా! యిట్లేగుఁడు రండురండని స్వసైన్యాధీశులన్, బంటులన్
గేయంబైతగుయుద్ధశక్తి నొకచక్కింగూర్చి యాంధ్రేశ్వరున్
డాయంజొచ్చెశ్రుతిప్రభేదకధనుష్టంకారముల్ సల్పుచున్॥ 187

వ॥ ఇట్లుభయసైన్యంబులు కదిసినయనంతరంబున, వీక్షణీయంబగు కొంతసంకులవ్యాపారంబు సంక్రమించెఁ బదఁపడి తురుష్కరాజసేనానాయకుండగు ముఖరుజంగు నిజనృపునాజ్ఞచే మల్లికార్జునప్రభుసన్నిధికిం జని "ఇప్పుడుజరుగఁదగుయుద్ధంబు న్యాయవిధింజేయదలంచితిరా! లేక బలాబలానుసారంబు

న సల్పంబూనితిరా” యని యడుగ నమ్మహీవిభుండు తొంటివిధంబెయుక్తం
బన నీతంబును, దనప్రమాణవాక్కులచే నట్లె నిశ్చయించుకొనివచ్చి తనరా
జుంజూచి “కమ్మదొరసైన్యంబంతయు నుక్కుమిగిలి కయ్యంబునకుఁ గాలు
ద్రవ్వుచున్నయది, వారు, తద్రాజు, న్యాయయుద్ధము నల్పుద” మని చెప్పిరి
గాన మనము మనసైన్యంబులఁ బురికొల్పుకొని దురంబుసల్పవలయునని
విన్నవించెనంతట. 188

## ప్రథమదినయుద్ధము.

శా॥ అంతట నాబలంబు లతిహాంకృతిహుంకృతి సైన్యశబ్ద రా
ద్ధాంతము ఖడ్గముఖ్యవినదపరిభవాద్భుత మగ్నభూత మ
త్యంత భయంకరంబగు రణావనిఁబోరుచునుండ నప్సరః
కాంతలు నూత్నభర్తృకుతుకప్రభలై విహరించిరచ్చటన్ ॥ 189

వ॥ అప్పుడు కమ్మభూపాలుండు మ్లేచ్ఛరాజున కిట్లనియె “ఓతురుష్కరాజా! నీ
వెన్నువిఱువుచాలింపుము, పరమపాతకివై యెంతకాలంబిలనుండుదువు. నే
నొక్కబాణంబున నిన్నుఁబాతాళంబునకుంబుచ్చెద” ననుడుఁ దురుష్కుండు
మల్లిఖార్జునప్రభునితో “ఓధరావరా, నీకుమాటలయందుఁగలగట్టితనంబుక్రియ
యందుఁ గన్పట్టదు. జెట్టివేని యిట్టట్టనక గట్టిపనిఁజేయుము. ప్రల్లదంబులేల
యన” నాకమ్మదొర యాగ్రహించి యాతని ధిక్కరించి సమరంబుసల్పునెడ॥

ఉ॥ ఒక్కనిమించి యొక్కఁడతిరోచన బాణపరంపరల్ గుణ
న్యక్కృతివేయుచుఁ బ్రళయమందు వెలింగెడు రుద్రులట్టు లే
దిక్కునఁ జూరెయాచు వెలితింబడకుంట రణోర్వణాంగణం
బుక్కున ప్రమోసినట్లు బలియుర్ బళియౌననఁ బోరిరయ్యెడిన్॥ 191

మ॥ అపుడా హాయిదరుజంగు యుద్ధమున నాంధ్రాధీశుచేనొచ్చి స
త్రపుఁడై యుండఁగ, వాని సైన్యపతి ఖాదర్‌జంగు, రోషాగ్నిత
ప్తపుడై దగ్ధునిఁజేయ నాంధ్రవిభుపై నల్లంతదూఁకెన్ మహా
విపదంభోనిధిముంతు నిన్నని నిజోర్వీనాథుఁ బొప్పింగఁగన్॥ 192

ఉ॥ వచ్చినఖాదరున్ గదిసి వహ్వారె రమ్మని మల్లిఖార్జునుం
డిచ్చమెయిన్ బ్రభూతముల, హెచ్చగు ఖడ్గములన్ దడాబిడిన్
గ్రుచ్చి “యభాగ్య” నిన్నిపుడె కూల్చెదనంచుఁ గఠోరభాషలన్
బొచ్చెముగూర్చెవానికి గుభుర్కున గుండెలుబెండువాఱఁగాన్॥ 193

ఉ॥ సోదరు శృంగపాటుఁగని క్రుక్కుచు ముస్మిరుజంగు రాజుఁగో
బూదిమొనర్తు నిన్ని పుడపో నరకుంజరయంచు శక్తి పెం
పేదఁ బ్రలాపముల్ వలికి యించుక సేపు పెనంగ నాంధ్ర రా
జోదితిజోపమా, నిలిచియుండుము కాలునిఁజూడఁబంపెదన్॥ 194

వ॥ అనియిట్టి మదోన్మత్తుల నామహారాజుక్కడించి కొందఱఁ బరిమార్చి, రాక్షస
ధ్వంసకుండగు దైత్యారాతివిధంబున వెల్గుచుండెనయ్యెడ 195

* మ్లేచ్ఛరాజు భీమసింగు నోడించుట *

చ॥ ఇదియిటులుండ మ్లేచ్ఛపతి హెచ్చినపేర్మిసి భీమసింగు పెం
పదను చెడంగ యుద్ధమున నాతనిఁదాఁకె నతండు నీతఁడున్
గడిసి మహాహవంబు జనకాండమునివ్వెఱపాటునొంద నిం
పుదొలఁగఁబోరిరొండొరుల పొంకము వీరులుచూచి మెచ్చఁగన్॥ 196

గీ॥ అపుడుభీమసింగు, హాయిదరుజంగును, నెప్వబాణవితతి నువ్వుచుండ
మ్లేచ్ఛపతిమఱింత మెలఁకువకయితీరు ఖానురథముఁదోలగావిధంచె॥ 197

వ॥ ఇట్లు వీరు మహావీరపరాక్రమవిస్ఫురితులై, యుద్దండయుద్ధంబాచరించునెడఁ
గరులుమరణించె, శతాంగంబులు జీర్ణాంగంబులయ్యె, హయంబులుగతప్రా
యంబులయ్యె, సితరంబులగు పరికరంబులు శిథిలతాకరంబులయ్యె, నట్టిసమ
యంబున వెనుకంజవేయని కమ్మదొరసయిన్యంబుతత్కాలాభీల శరజాలవ
హ్నిజ్వాలల భీతిఁజెంది యుత్తలంపడజొచ్చె, నయ్యెడ నాంధ్రభూపాలుండు
బడలికలుదొలంగ నేఁటికి రణంబు విరమించి విశ్రమింతమసనెల్లరంగీకరించిరి॥

## ద్వితీయదినయుద్ధము

ఉ॥ అమ్మఱునాటిఁ యుద్ధమున హాయిదరుసైన్యమునెల్ల బిట్టుగా
సొమ్మసిలంగఁగొట్టె రణశూరుఁడు రామకిషన్ భటుండు, చి
త్తమ్మునహాయిదరప్డు పరితాపమునొందుచు వానినొంప బా
ణమ్ములవేయుఁడంచుఁ దననచ్చినబంట్లకు నాజ్ఞయీయఁగన్॥ 198

గీ॥ అప్పుడాకమ్మదొరసైన్యమయ్యదివిని। రామకిషనునకూఁతయైశాత్రవునకఁ
దురకదొరమేనిప్రాణాలఁదూలఁజేయు। పట్టుదలయుద్ధమొనరించుపటిమఁగసిమె

ఆ॥ వె॥ కాని రామకిషను కాలధర్మమునొందె। నాంధ్రరాజుచూచి యవనుసూతుఁ
బ్రాణములుతొలంగ బాణాలసేయనా। సూతుఁడీల్గు నంతక్షోభమందె॥ 201

వ॥ ఈరీతి నిరుకెలంకులవారికిని సాంఘికమరణంబు సంప్రాప్తంబగుచుండఁ బ్రధా
నప్రభులు దేహంబులఁగొందలంపడుచు భగవదాజ్ఞ యెట్లున్నదో, యా

థవారంబు శరబాధన్వ్యథితంబగుచున్నయది, యనుకొనుచుండ, నిటువైపున భీమసింగు ప్రభృతులును నటువైపున ముఖరజంగు ప్రముఖులును, దీండ్రించి చండభండనంబు సేయం జేయఁ గ్రమవ్యవాయంబున నిటునటుఁగల చతురంగ బలంబు చెల్లచెదరై బెండుపడ ననుయజ్ఞుండగు నాంధ్రవిభుండు తురుష్క రాజవరు చాపంబు ఖండించి సారథింబరిమార్చె నప్పుడు॥ 202

మ॥ యవనాధ్యక్షుఁడు సూతుఁడీల్గెనని తానయ్యాజిలోనుండకే
జవమొప్పన్రథమెక్కి యిక్కరిగెన్ సంత్రస్తుఁడై, యంతనాం
ధ్రవిభున్ మ్లేచ్ఛకుభృద్భటుల్, గవిసిరుద్యచ్ఛక్తితో హాత్తిఖా
న్ఫవుజూఖాన్ మొదలైనవారు పెనుబొబ్బల్ వెట్టుచున్ దట్టులై॥ 203

చ॥ పటుతరబాణపంక్తి నొకపట్టునవీరినిఁ గుంగఁగొట్టుచున్
భటతతితోడ నాంధ్రపతివర్తిల, నయ్యెడఖానులెల్లదు
ర్భటఘటశుద్ధిఁగాంచి యిలవ్రాలిరి యంతటమ్లేచ్ఛరాజు వి
స్ఫుటకుటిలప్రచారుఁడయి పోచ్చెరణంబున సింగునొంపఁగన్॥ 204

వ॥ ఇట్లయ్యవసరప్రవేశించినూతుంద్రుంచిరథహయంబులంజక్కడిమధ్యందినచం డభానునిక్రియ మండిపడుచుండి మల్లికార్జున యోధులగు పాబతుజంగుప్రము ఖులఁదార్కొని వారిచేవంచింపఁబడుచు, మరలఁదనశక్తిస్ఫురణంబున,రణంబు మహామరణంబు, చేయుచు నాంధ్రపతిసేనను జీకాకుపరుప నయ్యెడమల్లికా ర్జునుండు కమలనాళంబుఁద్రెంచు కరిభంగి మ్లేచ్ఛపతిసైన్యంబుల విగతజన్య ప్రాధాన్యంబులఁజేసి, హైదరుజంగుపై శరంబులువఱప నాతండు తోకఁద్రొ క్కిన త్రాఁచుచందంబునఁ గోపఘూర్ణితలోచనుండై యారాజుమీఁది పం తంబున నయ్యవనీకాంతు తురంగంబులవధియించి యొక్కయాయుధవిశేషం బున ధ్వజముందునుమాడి, సూతుని హతునొనర్చి విఱ్ఱవీఁగు సమయంబున॥

తే॥ మల్లికార్జునుఁడతిగోప మానసమునఁ గ్రొత్త తేరెక్కి భటులెల్లఁగొలుచుచుండ
గిరివరంబెక్కు కేసరిగరిమమెఱయ। రిపులగుండియలవయంగ రేఁగియార్చె॥ 205

వ॥ ఆసమయంబున నిరుదళంబులవారు సంద్రంబులు దార్కొనురీతి, నతిఘోరం బుగఁగదియుచు, శంఖంబులనొత్తుచు, సింహనాదంబులఁ జేయుచు, భటార్భ టుల వేలయించుచు, రోదసీకుహరంబునం గల భూతవ్రాతంబు భీతిల్ల దురం బు సల్పుచుండి రనంతరంబు॥ 206

### కమ్మదొర మ్లేచ్ఛరాజును బరాభూతునిఁ జేయుట.

క॥ కేసరిహారిణంబులపైఁ। భాసురముగ నేగురీతిఁ బతియార్చుచుఁ బె
ల్లీసున మ్లేచ్ఛునిపైపెన। వేసెన్బాణముల శక్తి వెల్లడిగాఁగన్॥ 207

వ॥ అప్పుడా మ్లేచ్ఛుఁడు తద్బాణంబులం ద్రుంచి కమ్మదొరనొచ్చునటుల లాఘవం
బున విశిఖంబులఁ బఱపుచుఁ గరిఁగరియును గిరిగిరియును ఘోరవిధంబున
నొండొరులు పిఱుతివియక, పరుషతరశిలీముఖ ప్రకరభయంకరంబగు దురం
బు సలుపునెడ॥ 208

సీ॥ మల్లికార్జునుఁడప్డు మదమృగేంద్రముఁబోలి యిష్టదైవతమును నెంచిమదిని
సునిశితాస్త్రంబుల సొంపుగాఁబఱపుచుఁ గేతనంబునుదున్మి కెరలుచుండ
నపుడల్లిమ్లేచ్ఛుండు నంబకంబులు వేయ,నయ్యస్త్రములఁదుంచి యవసివిభుఁడు
పటుబాణములు వేసి పరఁగంగసూతుని శిరమునుఖండించి శీఘ్రముగను

తే॥ రథహయంబులఁ జక్కాడి రౌద్రమెసఁగ
మార్గణంబులచే మయిమఱుఁగుఁజించి
విభుఁడు స్రుక్కంగఁ జేసెను వీఁకఁదాఁకి
తురకదొరసేన భీతిల్లి తొలఁగునటుల॥ 209

తే॥ వికలరథుఁడగు మ్లేచ్ఛుండు వెఱఁగుపడుచు।యుద్ధమునుమానిలజ్జచేనొత్తిగిలుచు
రథముఁ చాటుననిల్చి యూరాజుతోడ।ననియె నేరథహీనుండ నాగుమయ్య॥ 210

తే॥ నాదుశిబిరంబునకుఁబోయి నవరథంబు।నెక్కివచ్చెదనిలుమయ్య యేగువఱకు
విరథుతోఁబోరఁగూడునావీరవర్య।న్యాయదృష్టివహింపుమా యాంధ్రనృపతి॥

వ॥ అనిచన నాకమ్మదొర తురకదొర పలుకులకు ముసిముసినగవులనగుచుఁగరు
ణాయత్తచిత్తుండై యప్పటికి సూర్యుండపరాద్రి కేగినకతంబున యుద్ధంబు
చాలింపుదమని యుభయులును, నిశ్చయించుకొని తమతమ నెలవులకుఁ బరి
జనులతోఁజేరిశ్రమఁదీర్చికొని భోజనమజ్జనాదులంగృతార్థులైయుండిరనంతరంబ॥

◆ తృతీయదినయుద్ధరంగము. ◆

భీమసింగు మ్లేచ్ఛరాజుచే హతుండగుట.

ఉ॥ మూఁడవనాటి యుద్ధమున ముఖ్యబలంబులు రెంటువైపులం
గోడువడంగ శత్రువులఁగూల్చుచునుండఁగ మ్లేచ్ఛరాజు పె
న్వాడిమి భీమసింగుపసఁబట్టి యఘోరరణంబుసేయ వె
న్నాడ తురుష్కనాయములయందు శరంబులఁదూర్చె సింగటన్॥ 218

చ॥ తురకలఱేఁడు తానపుఁడు దోర్బలమేర్పడ బాణసంతతిన్
బఱపఁగసింగుపై, నపుడుభవ్య వయోబలుఁడాంధ్ర భూవిభుం
డఱిగి తురుష్కరాజు పయినంబకముల్ నిగిడింపనాతఁడున్
జరచరబాలసూర్యునిపసంబ్రుసరించి దురంబుసల్పఁగాన్॥ 214

వ॥ మల్లికార్జునుని నిటునటుం గదలనీయక, సిద్దీలసేనానాయకుండగు ఖుతుఖుఖా
నుండు మొదలుగాఁగలవారలందఱు, కమ్మదొర యరదంబుం గ్రమ్మికొని
శరంబులుపఱప నన్నరశేఖరుండు లెక్కసేయక సాళ్వంబుకలవరంబులంగదియు
చందంబునఁ దత్సైన్యంబుల నుగ్గాడుచు, శిరంబులఖండించుచు హస్తంబుల
ధ్వస్తంబులఁజేయుచు, నూరువులఁ బేరుమాపుచు, భూతభేతాళాదుల నాహా
రదానంబుచే సంతృప్తులంజేయుచున్న సమయంబున. 215

ఉ॥ ఆయెడ మ్లేచ్ఛరాజు వెసనాగ్రహసుందుచుఁ దజ్జయంబునుం
జేయఁగఁగోరి చాపమును జెచ్చెరఁద్రుంచియు సూతునాల్గిటన్
గాయముగ్రచ్చు తూపులను గట్టిగఁగొట్టుచు నొవ్వనేసి తాఁ
బాయక వాజులందునిమెఁ బార్థుఁడు నెవ్వగఁ జిన్నవోవఁగన్ ॥ 216

వ॥ అప్పుడు భీమసింగత్యంత కోపాద్రేకుండై కన్నులెఱ్ఱఁజేసి దురంబెటుల సల్పు
చుండెననిన ॥ 217

గీ॥ భీమసింగుగ్రకోపుఁడై భీమురీతి। యవనభూపాలు వెన్నాడియని వెలుంగు
పౌరుషోక్తులుపల్కెను బ్రభువుతోడ। నిల్వుమచ్చటఁద్రుంచెద నిక్కమనుచు॥

చ॥ ఇటులని మ్లేచ్ఛరాజుపయి నెన్నియొబాణములేసి సింగు తాఁ
జటులశరాగ్ని దగ్ధునిఁగసల్పుచు ఫాలమునన్ శరంబులన్
దటుకున వేయ రక్తమురుధారగఁగారుచునుండె నంతలోఁ
బటుమతి నాంధ్రభూపతియు బాణగణస్ఫురితాత్మహస్తుడై ॥ 219

చ॥ యవనకులేంద్రుచాపము ననంతపదంబుననిల్పి, ఔక్కమున్
భువిఁబడఁదన్ని, సూతునిఁజివుక్కునఁగూల్చి, తురుష్కరాజ! నీ
వెవడవు, నీయుపద్రవము లెట్టివి యించుకనిల్చెదేని, నీ
జవమును సత్వముం దెలియ, సాయకసంఘము నేర్చిపేర్చెదన్ ॥ 220

మ॥ వినుమా, డంబకుటీరమా, యిపుడు నీవే, నీమ్రప్రాణాలకున్,
బెనుముప్పున్ ఘటియింపఁజేసికొని, యుర్విన్ దాటనున్నావు, నా
ఘనబాహాబల మీవెఱుంగవె, తురుష్కక్ష్మాపతీ, భీమసిం
గన నాయంతటివాఁడు చూచికొను మా యావీర సౌభాగ్యమున్ ॥ 221

గీ॥ అనుచుఁ దనపతి, పలుకంగనపుడె యేచి। భీమసింగుగ్ర బాణముల్ పేర్మినేసి।
మ్లేచ్ఛనాయకుకవచంబు మేల్మిచెడఁగ। జేయమ్లేచ్ఛేంద్రుఁడును బాణశిఖుల నెఱపె॥

వ॥ అప్పుడా భీమసింగుగ్రుండై, తనవైచు బాణములచే యవనాధ్యక్షుని ననన్య
... దృష్టిఁగాఁజేసి యీసడింపనప్పుడు.

గీ॥ తురకదొరయల్గియప్పుడత్తూపులకును। దాపమందుచుగదఁగొని తానురథము
దిగుటఁగాంచియుసింగేగితివ్రుటమెఱయ। వరగదాయుతుఁడయివచ్చెవహ్వాయనుచు।
తే॥ వచ్చియున్నట్టిసింగునుబారఁజూచి। తురకదొరవల్కెనోరోరితుచ్ఛబుద్ధి
చూడుమామద్గదానాతిస్రుక్కఁజేసి। నినుయమాలయమునకిప్డేయనుపువాఁడ॥ 225
వ॥ ఇట్లన, నన్యోన్యజిగీషామనీషావిశేషంబుల, నానవిశేషయుద్ధంబశేషభూతవ,
గద్భుతంబై వెలయుచుండె ॥ 226
సీ॥ పోరాడుచుండునప్పుడు మించుబాణాల. యగ్నికణంబులయ్యనివెలుంగ
నానారథౌఘసన్నాహసుట్టసజాత ధూళిదిక్కులఁనెల్లఁద్రోఁచుచుండ
ఉద్దండభటసముద్యోగసంజనితాక్షి, తీవ్రదీప్త్యుజ్వహ్నిఁదెగడుచుండ
చండిమోత్కటధనుష్టంకారనిక్వాణమఖిలాద్రి గుహాలలో నలసినిల్వ
గీ॥ ననిమిషులదృష్టికత్యద్భుతాంశదోఁప। దిగ్గజంబులువడఁకుచు దెసలువిడఁగ
మ్లేచ్ఛపతిభీమసింగునున్నిలదాజి। పూర్ణపరికరసంయుక్తిఁ బోరిరపుడు ॥ 227
వ॥ ఇట్లుతలఁపడి, నానాప్రకారంబుల, సమరసముత్సాహంబుఁజూపుచు నోర్పును;
నేర్పును; లాఁతివారలకు వెఱగుపుట్టింప, భుజాదండానుపమబలంబుల, నుండా
రులన్యోన్యశక్తిసరకు సేయక, గదాప్రహారంబులనైు మఱుంగులు తుత్తుమురై
భూతలంబునంబడ మెలఁగిరప్పుడు ॥ 228
ఉ॥ తప్పినయప్పుడేటు తముఁదాకినయప్పు డనేకభంగులై
యొప్పినవాక్యముల్ మెఱయనుక్కయెడన్ సకలాంగకమ్ములన్
గప్పఁదలిర్చురోసమున గ్రమ్మెడురక్తములన్ సురవ్రజం
బప్పటికప్పుడింత! యనునట్టి బలంబునఁబోరిరేపునన్ ॥ 229
వ॥ ఇట్లేటువడక యాటోపంబున నిరువురు ఘోరగదాయుద్ధంబునలుప, గదాహ
తులచే శరీరంబులు రక్తసిక్తంబులైపుష్పితకింశుకవృక్షంబులంబోలియుండె.
అత్తఱి భూపాలుండెడపార్శ్వంబునకుం గదియరా, నదిలెక్కింపక, భీమసింగు,
పరిపరివిధంబులఁ దిరిగినఁ బెరిఁగిన యారసంబున నాయవనభూపతి రౌద్ర
మూర్తియైయుండమ్లేచ్ఛవిభుని, శిరస్త్రాణంబు నేలంద్రోయనతండల్గిదర్పంబుచే
నాతనినదలించి, గజంబుపైగఁదియుసింగంబుభంగిఁజనియాసింగుశిరంబు శకలం
బులుగాఁ బగులఁగొట్టి భిదురంబుచే గిరివరంబుకూలుచందంబున నాధీరుండు
కూలెనప్పుడు॥ 230
గీ॥ భీమసింగును నామ్లేచ్ఛవిభుఁడుచంప। నాంధ్రవిభుఁడదిచూచి తానతిశయుల్లి
పౌరుషోక్తులుపలుకుచుఁబటిమమెఱయఁ। దారసిల్లెనుమ్లేచ్ఛునిఁదాఁకుటకును॥

## కమ్మదొర తురకసేని జంపుట.

ఉ॥ పటుతరమైనకోపమున బాటిల మ్లేచ్ఛునిబాణవృష్టిచేఁ
జటుల పరాక్రమంబెసఁగ జక్కఁగ ముంచఁగ నాతఁడల్గియున్
దటుకున ఘోరమార్గణము దార్కొనఁ జొన్పఁగ నాంధ్రుఁడప్పుడున్
గుటిలుని నొవ్వఁ జేసె,నతిఘోరతరంబగు కోలలేయుచున్॥ 232

గీ॥ తోకఁద్రొక్కిన త్రాఁచులఁ జోకనపుడు వెనుకదీయక యిరువురుఁ బీకఁదాఁకి
తొల్లిబలియింద్రుడుం బోరుత్రోవ మెఱయ ఘోరసమరంబుసల్పిరి కుటిలవృత్తి॥

వ॥ అట్టిసమయంబున, షౌబతుజంగు వజీరుఖాను మొదలుగాఁగల మేటినాయకులు తార్కొని పరుషవాక్కులఁ బల్కుచు బాణపరంపరలు పఱప, సరకుసేయక, మధ్యందునుమాడి షౌబతుజంగు నొచ్చునటులఁ జటుమార్గణంబులేయఁ, దత్సేనానాయకుండల్గి, తనశత్రువునిఁ జూచి కఠినవాక్కులనుడువుచు, క్రూరాస్త్రంబులచే నాతని నొవ్వనేసి, వారిరువురు ఘోరసమరంబు సల్పుచుండిరయ్యెడ॥ 233

క॥ వినురా యోరిదురాత్మక నినుఁగాలునిపురికి నేను నేర్పుగఁ బుత్తున్
అనుమానమెంతమాత్రము మనమున నిడికొనకు తుచ్ఛమతి! నీవిపుడున్॥ 234

క॥ ఘోరాస్త్రంబుల నాల్గిఁట, భూరిహయంబులను నేసె భువియద్రువంగా
నారాచంబుల మూఁడిట నారాద్వరుకత్తళంబు ననువుగ నేయన్॥ 235

క॥ కన్నడదేశాధీశుఁడు।కన్నుల కెంపతిశయింపఁ గఠినాంబకముల్
వెన్నాడుచుఁ దాఁదీసియు నెన్నికసేయక యవేసె నింపుగ నతనిన్॥ 236

సీ॥ ప్రళయరుద్రునిఁ బోలి ప్రాభవదర్పంబు, సంభవింపఁగ శౌర్యసాహసమునఁ
బటుబాణచయము చేఁబరఁగ సూతునిఁ జంపి కోలలమూఁడింటఁ గూల్చి హయులఁ
జటులపరాక్రమచాకచక్యంబుతోఁ, జాపంబుఁ దునుమాడి సాంద్రముగను
వక్షస్స్థలము నాఁట వరుసగాఁ గోలలు సంధించి వేయంగ సరసముగను
తే॥ విరథుఁడై చాల వెతఁజెంది వేగఁ దనదు।ఖడ్గముం గొని రయమున ఘనరథంబు
దిగుచు రౌద్రానలజ్వాల దీటుకొనఁగ।దురకదొర రాజుఁ గదిసెను దుచ్ఛగతిని॥

తే॥ సకలసైన్యంబు చూడంగ సాహసమునఁ।బటురయంబున విశిఖముల్ పఱప నతఁడు
లెక్కసేయక సూతుని నిక్కముగను।శిరము ఖండించి వైచె దాశీఘ్రగతిని॥ 238

చ॥ పటుతరశక్తి సారథినిఁ బైకొని చంపఁగ నాతఁడల్గియున్
గుటిలుని ఖడ్గహస్తమును గొబ్బున ద్రుంచియు బాణయుగ్మమున్

జటులపరాక్రమంబెసఁగఁజక్కఁగ మ్లేచ్ఛునివక్షమందునన్
దటుకున నాఁటనేయఁగను దత్తరపాటునుజెందిరత్తఱిన్॥ 239

క॥ భుజదర్పంబునరాజును।నిజముగఁజంపెడనటంచు నిశ్చితమతిచే
సుజనులుగొండాడంగను భుజగేంద్రునిరీతిఁగదిసె భువియదరంగన్॥ 240

గీ॥ తుచ్ఛకులమునఁబుట్టినతురకవీవు।సమరమొనరింపనాతోడఁజాలియుంటె
న్యాయమెచ్చటఁగల్గునోయచటజయము। సంభవించునటందురుసకలబుధులు॥

తే॥ కానఁజూడుమునినుద్రుంతుగట్టిగానె। యనుచుగాఢతరంబుగానాంధ్రవిభుఁడు
బాణసంఘంబుఁబఱపితాఁబ్రబలగతిని। మ్లేచ్ఛశిరమునుదునుమాడెమెప్పుగాను

తే॥ అమరులందఱు నాశ్చర్యమందిరపుడు।కుసుమవర్షంబుగురిపించికూర్మితోడ
దుష్టవధఁగాంచిహర్షంబుతోడ్పడంగఁ। జూచుచుండిరిసాధువుల్ సురుచిరముగ॥

♦ హాయిదరుజంగుసేన తనుదొరచనిపోవుటంగాంచి కమ్మటేని ముట్టడించుట. ♦

సీ॥ తత్సమయంబునఁదగవొప్పసిద్దీలు, సిక్కులుకడుఁగఁడుశీఘ్రముగను
బటుతరంబైనట్టిపరశుపట్టసముఖ్యసాధనంబులఁబూని సత్వరముగ
దూకొనిదైత్యులధోరణిగాఁగ్రమ్మఁబరుపవాక్కులచేతఁబటిమమెఱయ
నాంధ్రభూపాలుపై నాగ్రహంబందుచు బాహుబలోన్నతిపరిఢవిల్ల

గీ॥ నోరిరాజాధమా! నిన్ను నొప్పుగాను।బట్టిచంపకవిడతుమా వాఱిపోకు
మానృపోత్తముఁగూల్చినమనుజవిభుఁడ। యిలకుబరువైతివీవిప్డు కలికతమున॥

క॥ అని లోఁబాఱక నిలువుము। ఘనముగనీ బాహుబలముకడుశీఘ్రముగా
ననుపమయుద్ధములోపల। వనధింగల్పెదమురమ్మ వసుధాదీశా॥ 245

క॥ మును కౌరవబలమప్పా।ర్థునిపుత్రునిఁగవిసినట్లు రోషాన్వితులయి
యనిలోనాంధ్రనృపాలుని।నను వెప్పఁగ ముట్టడించి రచ్చటివైరుల్॥ 246

చ॥ పటపటఁబండ్లుగీటుచును బాహుబలోన్నతితోడఁ దార్కొనన్
జటులపరాక్రమస్ఫురణఁజండతరంబుగ నాతురుష్కులున్
గుటిలులు ఘోరపాపులు గొబ్బున బాణపరంపరార్చులన్
నిటలమునందుఁజేర్పనర నేతయు నేయఁగనార్చిరత్తఱిన్॥ 247

క॥ మాభూపాలునిఁజంపిన।నీభీకరహస్తములను నేఁడేమా యీ
యాభీలఖడ్గములచేఁ।బ్రాభవమడరంగఁద్రుంచిపడవైతుమిలన్॥ 248

మ॥ అని యిబ్భంగి నృపోత్తమున్ గదిసి తుచ్ఛాలాపమేపారఁగా
ఘనబాణంబులవేయుచున్ హాయముల న్గాఢంబుగాఁగొట్టుచున్

వనజాతాక్షునిఁ గ్రమ్మనూర్ఘ్వభటులున్ బాణంబులన్నింపఁగా
ననఘుండత్తఱిఁ దీవ్రకోపమున నత్యంతోగ్రతన్ దాకుచున్॥ 249

సీ॥ పటురోషశిఖి హెచ్చఁ బాటించిరిపులపై బాణముల్ జొనుపుచుఁబటిమమెఱయ
వ్యాఘ్రంబు గోబృందమనువుగా విదళించు, రీతిని శౌర్యనిర్నిద్రుఁడగుచు
నాంధ్రభూపాలుండు నాగ్రహంబందుచుఁ జెండాడె వైరుల గండఁడగుచు
శిరములఖండించి శీఘ్రమమ్మె కొందఱ, బాహువుల్ దునుమాడి ప్రబలముగను

తే॥ ప్రళయకాల మహారుద్రపటుతఁదాల్చి। నుగ్గునూఁచంబు సేయఁగా నొచ్చిబలము
గుండెలవయంగఁ బెనఁగెడికోర్కె విడచి। గడగడవడంకెఁ జాలభాగంబు సేన॥

వ॥ అంతట హతశేషులయిన తురుష్కభటులు, నిజనృపు సేనానాయకుండగు
షౌబతుజంగుకడకేగి విమలమనస్కులై యతిదుఃఖంబు చేఁబొరలుచు హైదరు
జంగు కమ్మదారచే మృతుండగుటయుఁ దదాంధ్రభూపాలునిచేతన తమకుఁ
గల్గిన పరాభవంబంతయు విన్నవింప నప్పుడు॥ 251

• షౌబతుజంగు మల్లికార్జునుని దార్కొనుట. •

గీ॥ యవనభూపాలుమృతిని,దుఃఖాబ్ధిమునిఁగి సైన్యమంతయు సమకూర్చి షౌబతపుడు
భూరికోపోగ్రమూర్తియై పౌరుషమునఁ। గ్రమ్మెనయ్యాంధ్రవిభునిఁ దాఁగఠినగతిని

శా॥ రాజుం జూచుచుఁ దీవ్రకోపమున నిర్ఘాతాఘుమగ్నాంగుఁడై
రాజీవాక్షుఁడు తన్నృపోత్తమునితో రౌద్రానలజ్వాలచే
నాజిన్నిల్వుము పారకుండ నిపుఁడు ద్యద్దీప్తి బాణంబులన్
నీజీవంబెడలించి కాలుపురికిన్ నేఁ బంపెదన్ జూడుమా॥ 253

వ॥ అని యీప్రకారంబున నిజరాజమరణంబునకు వందురుచు, ధైర్యంబవలంబిం
చి, తమభూపాలుని యన్యాయవర్తనంబుచే నిటుల సంఘటిల్లెనని తలంచి,
యయ్యాంధ్రరాజోత్తమునిపైఁ దొలకరివర్షంబుక్రియ, నిజభుజాబల సాహ
సంబులు వెలయింపఁ బెక్కుభంగుల నాతనిపైవిశిఖంబులవఱప వానింద్రుంచి
మరల, విశిఖంబులఁ బఱపుచుండెనప్పుడు॥ 254

క॥ ఏరా నీచకులోత్తమ। యారాటంపడుచు నీవు హంతకుభంగిన్
బోరాడుటకై నాతోఁ। గారాడుచు వచ్చినిల్వ ఘనతయె నీకున్॥ 255

క॥ నాబాణజ్వాలలచే। నీబలుకోలలనుద్రుంచి నేర్పుదనరఁగా
నాబాలవృద్ధమందఱు। శేబాసని మెచ్చునటులఁ జెండెదనిన్నున్॥ 256

మ॥ అనుచున్ రాజతి తీవ్రకోపమున హాహాకారముల్ సంధిలన్
వినుతుల్ సేయుచు దేవతాచయము నిర్విణ్ణత్వముం బొందఁగా

ననుకూలంబుగ బాణపాళి రిపుసైన్యంబందు బిట్టేయఁగా
ననిలోఁ దన్నృపుకోలలందునుముచున్ వ్యాఘ్రోగ్రకోపంబునన్॥ 257

వ॥ నేఁడు యుద్ధవాటికను మద్బాణాగ్ని జ్వాలలచే నిన్ను రూపఱఁజేసెదనని, యన నప్పుడతండిట్లనియె॥ 258

క॥ మాటలచేతం గార్యము। పాటిలదని నీవువినవా భావ్యత మెఱయన్
బూటకపుమాట లేటికి। పాటిగ ననిగెల్చి కొనుము సత్కీర్తి నిలన్॥ 259

వ॥ అని యిత్తెఱంగున, వీరాలాపంబులు వలుకుచు వెనుకడుగిడక మహాభయంకరమూర్తులై యిరువురు పోరుసమయంబున, నుభయపక్షంబులవారు, భీతిల్లి "నేఁడు మనము తలలెత్తి పోడనూపునెడ, మనప్రాణంబులు దక్క" వని హాహారవంబులుసల్పి యెట్లో దూరంబుచేర, నాయవసేంద్రుండగు సైదరుజంగు కుమారుఁడు జంగుబహాదరు, కమ్మదార శ్యాలకుండగు రావిళ్ల మల్లానాయునితోఁ దార్కొని, ఘోరసమరంబు సేయునెడ నొకరికొకరు మాఱుమసలుచు, బాణప్రయోగ విదగ్ధులై సేనలోని కొందఱిశిరంబులు దున్నసేయుచు, మఱికొందరిహస్తంబులకు నికృంతనంబుఁ గావించుచు, హతశేషులందఱు మహాత్రాసపలాయితులగుచుండ, సూర్యుండస్తాద్రి కేఁగ, నప్పుడా దొరలు సాయంసమయంబయ్యెనని, దురంబుచాలించి, తమతమశిబిరంబులకుం జని, యర్హకృత్యంబులఁ దీర్చికొనియుండ, నప్పుడు జంగుబహాదరు, తనతండ్రిమరణంబువిని, వగచుచుండ, షౌబతుజంగు మొదలగువారు, శాంత వచనంబులనూఱడింప, నాసమయజ్ఞుండగు జంగుబహాదరు, చ్ఛ్వసితమానసుండై యుండెనంతట॥ 260

## నాలవనాఁటి యుద్ధము

ఉ॥ కాలవశమ్మునం దనరుఁ గల్గిన పశ్చిమఖండవాసమే
లీలను వెళ్లఁబుచ్చుకొని, తేచిపయోజహితుండు, ప్రాక్ప్రియా
లోలతఁ గాంచు వేళ, రణలుబ్ధులు, దక్కిన సేనతోడ నా
నాలవనాఁటియుద్ధమున నైజబలోద్ధతి వచ్చిరంతటన్॥ 261

గీ॥ ఉదయకాలంబుననువారు యుద్ధమునకు। శ్రద్ధవహించిరెంచు పక్షంబులందు
వ్యూహాముల బన్నుతలఁపుననుండిర పుడు వర్ణ్యమగు శోభ యొకకొంత ప్రబలెనచట

సీ॥ సిద్ధిలరబ్బీలు సిక్కులు మిక్కిలి, క్షాత్రతేజముతోడ సాంద్రగతిని
బటుప వాగ్విసరముల్ పలుమాఱును మువ్వుచు, మానరాజఁ జంపిన మత్తుఁబట్టి

యాయుధంబులచేత ననువుగా యమపురి,కంపిన వేగ మేయశము మనకు
సంప్రాప్తమౌనని సకలయోధులుపల్క, ఘనబలులందఱుఁ గదనమునకుఁ
తే॥ గాలుద్రవ్వుచునని మొనఁగదలకుండ నిల్చిరయ్యెడఁ, బోలుపొప్ప నేర్పుమీఱ
రాజసుతునకుఁదోడుగా రమ్యముగను బ్రళయరుద్రులపోలికఁ బ్రజ్వరిల్లి॥ 263
గీ॥ ఇరు కెలంకులవారును నేపుమీఱి బాణములు వేయఁదొడఁగిరి పటిమ మెఱయ
దిక్కులదరంగనార్చుచు దిట్టముగను జూచువారికినత్యంతచోద్యమొదవ॥ 264
గీ॥ మల్లికార్జునుఁడతిరౌద్రమహితుఁడగుచు। బాణసంఘాగ్ని యుప్పొంగఁ బ్రబలగతిని
జంగుబహాదరు నేసెఁజగతివణఁక। నపుడుతద్బాణవృష్టి చేనతిశయించి॥ 265
శా॥ చండాశీవిష ఘోరసాయకములం జక్కాడి యామ్లేచ్ఛుఁడున్
సిండారన్ విశిఖాగ్నులన్ నృపుపయిన్ నేర్పొప్పఁగాగుప్పుచున్
గొండాడన్ సురలెల్ల మెచ్చునటులన్ దోర్దర్పమున్ జూపఁగా
శుండాలారిసముండు కమ్మదొర మ్లేచ్ఛుం గ్రుచ్చె బాణంబులన్॥ 266
వ॥ అంతట నయ్యాంధ్రదేశాధీశ్వరుని స్యాలకుండగు రావిళ్ల మల్లానాయుఁడు,
సహాయభూతుండై, కదనంబునం దేరికిం దేఱిచూడరానియటుల నుద్దండతూ
త్ర తేజంబున వెలింగె॥ 267
క॥ మల్లానాయని సైన్యము తొల్లిటిమల్లులవిధానదోర్బలములతో
నుల్లాసముతోఁ బోరఁగ ముల్లోకాలేలువారు ముదమందిరటన్॥ 268
గీ॥ ఇరుకెలంకుల సైన్యంబు లేపుమీఱి। తారసిల్లెనుదంతియూథమువిధాన
ఘోరసమరంబు సల్పుచుఁ గూర్మితోడఁ దొంటివానరదానవతుల్యగరిమ॥ 269
గీ॥ కొందరాయుధపాణులై కొంతబలము గంగఁగలసెడివడువునఁ గట్టిశక్తి
నాహవంబునవికలాంగులలజడిఁగనఁగాల్బంబుల వడివీడఁగదిసిరపుడు॥ 270

మల్లానాయఁడు జంగుబహాదరు ప్రభృతులఁదునుమాడుట.

మ॥ ఒకవంకన్ రిపుసేననాయకునితో నొప్పారఁగాఢంతలో
నకలంకాధిపుఁడైన కమ్మవిభుఁడత్యంతోగ్రదర్పంబునన్
బకునింజంపినభీమసేనునిక్రియన్ బాగొప్పఁగా నాయెడన్
వికలత్వంబును గల్గునట్లు వెనఁదాఁ వేవేగ నొప్పింపఁగన్॥ 271
తే॥ ఆతఁడల్గుచుఁబటుబాణపాతములను నొవ్వనేయంగ నాంధ్రుండు నివ్వటిలఁగ
గడుసుఁగోలలఁదూలించి కదనమందు। జంగుబహాదరుతోఁ బల్కె శౌర్యఫణితి॥ 272
క॥ ఏరాదుష్టకులోత్తమ నీరజగర్భాదులకును నేర్పలరంగా
నీకోజునఁగదనంబున శూరతతో నిన్నుఁజంపి శుద్ధింగాంతున్॥ 273

వ॥ అనవుడు జంగుబహాదరు మల్లానాయనితోనిట్లనియె. 274

గీ॥ పెక్కుమాటలచేనీవుపిచ్చటిల్ల।లాభముండునె! యిత్తఱిలలితమైన
మాటలనుబల్కి ననుఁగెల్వుమంచిగాదె।శక్తి వెలయింపుమా,చూచినంతసింతు॥

మ॥ అనుచున్ బాణము వేయఁగానతడు హాహాకారముల్ సేయుచున్
ఘనతన్ గాండముల్ మహాపటిమచేఁ గాలాంతకుంబోలి తాఁ
జొనుపన్ దద్విశిఖంబులందునిమియాశుస్ఫూర్తితోఁ జేగఁగా
వనజాతాక్షుఁడు పార్థతుల్యుఁడయి యొప్పన్ దీవ్రకోపంబునన్ ॥ 276

వ॥ అప్పుడత్తురకదొర వేయు బాణములను దునుమాడి తదనంతరంబున. 277

క॥ యవనాధీశునిభూవిభుఁడవకాశంబందకుండన త్తఱినృపుఁడున్
జవమున బాణము లేయఁగ।నవియెల్లను ద్రుంచివైచె యవనుండంతన్॥ 278

క॥ అపుడామల్లానాయఁడు విపులభుజాదర్పమెసఁగ వే, బాణముల
గపటియగుమ్లేచ్ఛసంధుల। నెపమెన్న క వేసితనదుసేర్పుంజూపెన్॥ 279

గీ॥ మ్లేచ్ఛనాయకుఁడతికోపమిళితుడగుచుఁ।బటుతరంబైన బాణముల్ పఱపిమల్ల
నాయకునిఫాలభాగాననాఁట నేయ।రక్తధారలుకురిసెనురౌద్రమెసఁగ॥ 280

వ॥ అప్పుడివ్విధంబునఁజటులపరాక్రమ భుజాబలంబతిశయిల్ల నిరుదళంబులఁబాద ఘట్టనజాతరజంబు దిక్తటులనాక్రమింపఁజూపఱకతిభీతిజనింప, నానావిధా యుధంబులచే, నుభయపక్షంబుల వారనేండొరుల బలంబులఖండించుచుఁ గానుచుండఁబలలాశనంబులగుకంకగృధ్రాది పక్షినంతానంబురణాంగణంబునఁదిరుగుచుఁదన్మాంసంబుదినుచు, సంతసించుచుండ, నప్పుడు. 281

క॥ రయముగమల్లానాయఁడు।జయభేరిని వేయనుడి వెసద్భటతతితో
భయకంపస్వేదంబుల।వియుతింబగగుండెలవియ,నియమించి వెసన్॥ 282

ఉ॥ భీకరబాహుదర్పమున, బెబ్బులిబోలుచు,నార్చి వేగమే
యాకులపాటునొందఁగ, సమంచితరీతిని, వేసెమ్లేచ్ఛుపైన్
భూకుటిలస్థలంబునను, భూరిశరంబులనా,టునట్లుగాఁ
జేకువతోడమ్లేచ్ఛుఁడతి తీవ్రతఁదావిశిఖంబులేయఁగన్॥ 283

ఉ॥ అంతటఁదద్విభుండు వెసనాగ్రహమందుచుబాణపంక్తిన
త్యంతకుభంగిమ్లేచ్ఛుపయి నార్చుచునేయనతండుక్రమ్మరన్
వింతగఁగోలలన్ రిపుని వేడ బమారఁగఁజేరివాజులన్
బంతముతోడసారథిని బర్వినకోలలనొవ్వనేయఁగన్॥ 284

చ॥ తనఘనబాహుదర్పమునఁ దార్కొనియాతఁడుకోపదృష్టిచే
ఘనతరబాణముల్ దొడిగి గట్టిగ మ్లేచ్ఛునిచాపమూయెడన్
దునియలుసేయ, నాతఁడును దొందరపాటున వేఱువిల్లుచే
య్యనగ్రహియించి, తద్విభుని నంటఁగ నేసెను బాణజాలమున్॥ 285
తే॥ దండతాడితభుజగంబు దారి మెఱయ మ్లేచ్ఛునిధ్వజంబు దునుమాడి మించినృపుఁడు
పటుశరంబులసూతునిఁ బడఁగఁ ద్రోసెఁ। యార్చి తార్కొనె శాత్రవుండ దరునట్లు॥
తే॥ రథము తానె నడుపుచుండి, రాజవరుఁడు। సునిశితాస్త్రాళి శాత్రవుస్రుక్కఁ జేసెఁ
గంకటంబును ఖండింపఁగఠినగతిని। మల్లనాయఁడు కోపించి మంతనమున॥ 287
క॥ తనయిష్టదైవమున్ మది। ననువొప్పఁగఁ దలఁచి వేగనంబకసమితిన్
ఘనరథహయముల శిరములఁ। దునుమాడెనతండు శక్తిధూర్వహుఁడగుచున్॥
క॥ అపుడా మ్లేచ్ఛుఁడు రథమును। నిపుణత దిగి పటిమఁ దాఁకె నిఖిలజనంబుల్
విపులతరాశ్చర్యంబున। నుపమింపఁగ రాని కళల నొందుచునుండన్॥ 289
క॥ పడవై చెదనిను నీయెడఁ। దడయక యిటునిల్వుమచుచుఁ దటుకున ఖడ్గం
బిడుకొని కరమున మ్లేచ్ఛుఁడు। కడు రౌద్రముతోడ నేగఁ గమ్మవిభునిపై॥ 290
వ॥ అప్పుడా కమ్మదొర, తురకయేలికంగాంచి, కోపించి॥ 291
క॥ చండతరంబగు బాణము, నిండారం దీసివేయ, నేర్పుకొలందిన్
ఖండితమయి యాతనికర। దండము, భువిఁ ద్రావాలె, సేనతల్లడపడఁగన్॥ 292
క॥ అంతట నాయవనుఁడు కడుఁ। బంతంబున నెడమచేతఁ బరశువుఁ గొని తా
నంతకు రీతిన్ మెఱయుచు। సంతసమున నృపునిధ్వజముఁ జక్కాడంగన్॥ 293
క॥ కొంకక రౌద్రోద్రేకత। బింకము చెడకుండ రాజు బెబ్బులిమాడ్కిన్
సంకటపడుచునె మేగడి పంకాంకుని యవనుఁ ద్రుంచెఁ బటుబాణములన్॥ 294
క॥ అత్తఱి నిర్జరులందఱు। చిత్తంబులసంతసించి శ్రీహరికరుణన్
మత్తిల్లు శత్రురాజుల। మొత్తిననృపుఁ జూచి మెచ్చ మొదలిడిరచటన్॥ 295
గీ॥ అపుడు మ్లేచ్ఛుని సైన్యంబు, హతులఁ జూచి।
రాజు మృతినొందుటయుఁ గాంచి, రౌద్రమెసఁగ।
గమ్మదొరనటునిటు గూడఁ గదలనీక।
కదనమొనరింపసాగెను మదము మీఱ॥ 296
సీ॥ రావిళ్లమల్లయ రాజవరేణ్యుండు, సంగ్రామసింహప్రశస్తిఁ గాంచి
త్రొంటిపార్థాత్మజు దోర్దర్పమునమించి, విశిఖముల్ పఱపంగ వేగరిపులు

సిద్దిరబ్బిలుసిక్కులుగ్రక్కునఁదాఁకొనవారలధైర్యమెసఁగ
శిరములుఖండించి, స్థిరముగాఁ దత్సైన్యహయముల నుగ్గాడి యధికశక్తి

తే॥ బాణముల్ వేయ,నత్తఱిబలులుకూడి పైకొనంగనె యారాజుపటిమమెఱయ
ఖడ్గముంగొనినుగ్గాడెఁగదనమందు గొట్టియలద్రుంచు కాసాయిగొనబుదోఁప॥

వ॥ ఇవ్విధంబున ధైర్యస్థైర్యసాహసంబులచే యోధానుయోధులొక్కనిఁదా
ర్కొని, యామల్లానాయనితోఁ బోరునెడ నారాజు, రథంబుడిగ్గి, ఖడ్గహస్తుం
డై, దంతావళసంతానంబుఖండించు మృగేంద్రంబుచాడ్పునఁ, దద్బలంబుల
నుగ్గునూఁచంబుసేయుచు ప్రత్యర్థిప్రయుక్తబాణప్రహారంబుల, దప్పించు
కొనుచు, ఘోరరణంబుసల్పునెడ. 298

గీ॥ సైన్యమంతయుఁజెలరేగిసాహసమున నొక్కమాఱేగికదిసిరియుగ్రగతినిఁ
గమ్మదారగారినయ్యెడఁ, గాలగతిని,దుక్కిటెద్దులునాబోఁతుద్రొబ్బిరిటు॥ 299

క॥ పులిగోవులఁగబళించెడు, లవినయ్యాంధ్రపతిసిక్కులనుదక్కొరులన్
గల హస్థలిఁజక్కాడెను కులిశసఖాత్యుగ్రబాణకోటీధాటిన్॥ 300

సీ॥ ప్రళయరుద్రులఁబోలి భటులందఱాయెడ నుగ్గాడఁగొందఱనూనగతిని
మూలబలంబునముఖ్యులై యున్నట్టి సిద్ధిఖానుండను శ్రేష్ఠబలుఁడు
సర్జంగుబహదరుసారసింగనువాఁడు నార్చుచువిభునిపై కఱిగివేగ
భిండివాలంబులాభీకరాకారత బాగొప్పజంకించి పటిమమెఱయఁ

గీ॥ బరుషవాక్కులుపల్కుచుఁ బాటెలంగ నేఁడునినుఁబట్టిఖండించినియమముగను
శమనుపురికంపెదముచూడుసారసాక్షయనుచుఁగఠినతఁబల్కరత్యాగ్రహమున

ఉ॥ సారసనేత్రుఁడాయెడల సాహసధైర్యసమంచితాత్ముఁడై
యారిపువీరులంగదిసి యాగ్రహమందుచుఁ బోరుచుండెఁదా
నారయవాయుసూనుక్రియ నత్తఱివేగమె క్షాత్రశక్తితో
భూరివిపక్షసంఘములు బొల్వగబెగ్గిలి స్రుక్కునట్లుగన్॥ 302

గీ॥ ఒకనిఁజంపుచుఁ గత్తళమూడనేసి మఱియునొక్కనిఁజంపుచు మండిపడుచు
సాహసంబున వారలసమయఁజేయనెంచుచుండెను నృపుఁడతిహేలతోడ॥ 303

క॥ వారలునతివేగంబున దారుణకోపంబుతోడఁ దహతహపడుచున్
సారసనేత్రునిఁజూచుచు ఘోరశరజ్వాలలడరఁగ్రూరతయుపనుల్॥ 304

క॥ నలుగురు సర్జంగాదిగ బలులాతఱివేగరాజుపైఁ గవియంగా
నలవునుజలమునుబలమును బలువురుమెచ్చంగనతఁడుబాగుగఁబోరెన్॥ 305

గీ॥ ప్రబలియుద్ధంబు సేయుచుఁ బటిమ మెఱయఁగ దనమునఁ గల్గు కష్టంబు కడకుఁ ద్రోచి
కోదమసింగంబు కరులను గదిమి చంపునట్టి రీతిగఁ బోదువంగ నవని వడఁక॥ 306

గీ॥ అప్పుడు వారలు భయకంపమందకుండఁ గదిసి పోరంగ నాతఁడు ఖడ్గమంది
యందఱకు నన్నిరూపులై యతిశయిల్లి చంపె సర్జంగు భువిఁ గూలఁ జగతివిభుఁడు॥

గీ॥ ప్రబలుఁడైనట్టి సర్జంగు పాటిదప్పి చావ సైన్యంబుఁ జూచి ముజ్జగములదరఁ
గదిసి మల్లయధీరునిఁ గదలనీక న్యాయమిడన య్యెడలఁ ద్రుంచి రాదిభటులు॥ 308

మల్లానాయని, సిద్దీలు మొదలగు యోధులు చంపఁగా మల్లికార్జునుఁడు చూచి
వారలఁ దార్కొనుట.

గీ॥ అచట నాంధ్రనృపాలుండు యవనుల ద్రుమలట్లు పోరాడిరొండురులధికకోప
వహ్నిసంతప్తహృదయులై బాణపుంజములను వేల్పులు నాశ్చర్యమునఁ గనంగ॥

వ॥ ఆసమయంబున మల్లానాయఁడు కదనంబున మృతినొందెనని యాంధ్రభూపా
లుండు విని యనంతరంబ॥ 310

క॥ పోరున మల్లానాయఁడు క్రూరుల చేఁ జచ్చెననుచుఁ గుందుచు మదిలో
ఘోరంబగు దుఃఖముచే సారసనేత్రుండు మిగుల శౌర్యోన్నతుఁడై॥ 311

గీ॥ విడువని ధైర్యముతోడన్ మడుగునఁ గలమకరి తిరుగు మాడ్కిన్ నృపుఁడున్
బుడమిని దిరుగుచుఁ గోలలు పడవైచెను బలులనధికపటిమ దలిర్పన్॥ 312

గీ॥ జంగుబహాదరు సైన్యంబు క్షణములోన నందఱును జచ్చిరనుచు నయ్యావనిజనులు
చెప్పఁగాఁ గడుఁ జింతించి చెడ్డవగల నందికాలంబుగాదని యాత్మఁ దలఁచి॥ 313

చ॥ పటుతరమైన బాణములు పాటిలనేయఁగ రాజుతోడనే
చటులపరాక్రమం బెసఁగఁ జక్కఁగఁ ద్రుంచియు, మార్గణంబులున్
నిటలమునాటఁగాఁ జొనుప నెత్తుటిధారల మేను సిండఁగాఁ
బటిమ దలిర్పఁగా నతఁడు బాలరవిప్రభఁ దోఁచె నత్తఱిన్॥ 314

గీ॥ మ్లేచ్ఛుఁ డతికోపమందుచు మిహిరుఁ బోలి సునిశితాస్త్రంబు లేయంగ సోలి రాజు
సేదఁ దొలఁగించుకొని వేవిశిఖచయంబుఁ బఱపి తురకను నలసటపడఁగ నేసె॥ 315

గీ॥ ఇరుగెలంకుల వాతశేషులేపు మీఱి, నృపులకిరువంకఁ దోడుగా నేగి వేగఁ
గదిసి యార్చుచు, నత్యంతకఠినవృత్తిఁ "బోడువుఁడీ కొట్టుఁడీ" యంచుఁ బొల్పుగాను

సీ॥ భటముఖ్యులందఱు బాగొప్పగు మిగూడి దూఁకొని రాజుపై దూఁకి రాఁగ
బాణత్రయంబుచేఁ బటిమతో భూపతి బిట్టార్చుచును వేగ భీకరముగఁ
దురకదొరనృపుఁడు, తోడ్పడి విశిఖముల్ వఱపంగ నన్నిటిఁ బారఁ గొట్టి
భూవిభుసైన్యంబు భూర్యాయుధంబుల జంగుబహాదరుపైఁ జక్కఁ జేయ

గీ॥ నాతఁడతికోపమందుచునాగ్రహమున జలజనేత్రుని కోలలునిలఁబడంగఁ
దునిమి సేనలఁజెండాడెదోర్బలమున నార్చి రేసియుఁజెలరేఁగియతిభయముగ॥ 317

ఉ॥ భీకరబాహుదర్పముల భీతిలనార్చుచు, బాణవర్షములన్
వీఁకనుదాఁకనేయ, నతివేగమ యన్నిటిఁ ద్రుంచివైచి, యు
త్సేకముతో నృపోత్తముఁడు, ధీరులశక్తి వెలుంగ దీటుగా
నాకులపాటుఁజెందఁగను, నత్తఱిమ్లేచ్ఛుని నొవ్వనేయఁగన్॥ 318

క॥ ఆయవనాధీశ్వరుఁడతి। సాయకములఁబఱపి వేగ సాహసమడరన్
శ్రీయున్ హెచ్చఁగ ధ్వజమును। శ్రీయముపడంగ నేసె, శీఘ్రిత, రవుఁగన్॥ 319

గీ॥ మల్లికార్జునుఁడతికోప మగ్నుఁడౌచుఁ
దనపతాకంబు కూలంగఁ దామసపడి
ధైర్యసంయుక్తి నాయెడ దారుణముగ
బాణవృష్టిని గురిపించెఁ బ్రభువుమీఁద॥ 320

గీ॥ కత్తళంబును బగులంగ ఘనత నేసి
మార్గణంబులసూతుని మదమడంప
మ్లేచ్ఛుఁడాయెడఁ దార్కొనిమిహిరుఁబోలి
శకలితమొనర్చె నృపుశిరస్త్రాణమపుడు॥ 321

వ॥ అప్పుడామల్లికార్జునుండు, చటులసాహసధుర్య పరాక్రమంబెసఁగ, విపక్షునిఁ
దార్కొని, హరిహరియును, గిరిగిరియును, ఘోరుచందంబునఁ, గదనంబున
ల్పుచుఁ, బటుమార్గణంబులఁ దురకదొరస్యందన హయంబుల ఖండింప, నప్పు
డాయవనుండాగ్రహంబునఁ, బిరుతివియక, విశిఖత్రయంబున, మల్లికార్జును
రథసూతుఁజంప నయ్యెడ॥ 322

గీ॥ కఠినమార్గణములచేతఁ గదనమందు। మ్లేచ్ఛుఁడాయెడ సూతునిమించి త్రుంప
నప్పుడా రాజు కడురోషమావహిల్లి। యతిదృఢంబైన చాపంబునట్టివేగ॥ 323

క॥ కోపావేశముతోడన్। భూపాలుఁడు తునుమఁ బ్రకటభూరిబలుండై
యాపాపజాతిసిద్దీ। నేపారఁగఁ జంపెనప్పుడిల వడఁకంగన్॥ 324

గీ॥ కరులు గిరిరాజముననుండి, ఘనతదిగిన।
చందమున, వారలాయెడఁ జక్కఁగాను
వికలగతులయి, వేవేగవిపులగతినిఁ
దిగిరిరథముల శౌర్యంబు, దీటుకొనఁగ॥ 325

క॥ బలవంతులు పరుషోక్తులు। పలుకుచు, నతిరౌద్రమెసఁగఁ, బంతముతోడన్
వలయాకారతఁ దిరుగుచుఁ। గులగిరులనుబోలివారు ఘోషించిరొగిన్॥ 326
క॥ పదఘట్టనంబుచేతను। బృథివీస్థలికదలనార్చి, పెంపుగనృపులున్
గదలనుహస్తంబులఁగొని, యుదయార్కులఁ బోలిపోరిరుగ్రతనపుడున్॥ 827
మ॥ నినునేఁజంపెదనంచు నాంధ్రవిభుఁడున్ నేర్పొప్పఁబల్కన్ వెసన్
ఘనతన్ భీకరబాహుదర్పగరిమన్, గాఢంబుగాఁబోరిలో
ననుఁగెల్వంగను మెత్తురందఱతి సన్మానంబుచేభూమిలో
ననుచున్ మ్లేచ్ఛుఁడనంగఁ దన్నృపుఁడు నత్యంతోగ్రరోషంబునన్॥ 328
క॥ చూవరులతిభీతింగన। భూపాలురుగదలతోడ, భువనములదురన్
దాపముసంధిలమొత్తుచుఁ। గోపంబులఁబెనఁగిరధిక ఘోషముపుట్టన్॥ 329
క॥ వలపలదాపలగదుముచు। నెలకొనిగదనేయఁదురక, నియతిన్నృపుఁడున్
బలమఱిగదచేమూర్ఛిలి। యిలఁబడ భటవర్గమొక్క యేపునఁదాఁకెన్॥330
గీ॥ తురకదొరవేగఁదార్కొని దురమునందుఁ
గమ్మదొరసైన్యమునుజంపఁ గఠినరోష
మగ్నుఁడై రామసింగను మనుజుఁడతని
బాకుచేఁబూని వర్మంబుఁ బగులఁగొట్టె॥ 331

వ॥ అంతటఁ గమ్మదొర సేఁదదేఱిమేల్కాంచి యతిశౌర్యధుర్యపరాక్రమంబుచే,
మ్లేచ్ఛునిఁదార్కొననయ్యెడ॥ 332

మ॥ పటురోషంబునఁ దద్విభుల్ గదలచేఁ, బాటించిపోరాడఁగాఁ
జటులోద్ధూతతఁ, గమ్మభూవిభుఁడు, చంచద్దీప్తిచే వారలన్
గుటిలత్వంబునఁగొట్టితద్విభునిబల్ కోపంబుచేనాయెడన్
నిటలంబున్ బగులంగనేయఁబడె హృన్నిర్ముక్తుఁడై మ్లేచ్ఛుఁడున్॥ 333
గీ॥ జంగుబహదరుమూర్ఛచే,జగతిఁబడఁగ।నతనిహతశేషభటులెల్లవితతమైన
యాగ్రహంబంది,యాంధ్రుపైనధికరోష।మెసఁగఁదార్కొనిరుజ్జ్వలత్ప్రసరణమున
గీ॥ అప్పుడామల్లికార్జునుఁడధికరోష।మెసఁగగదచేతమొత్తుచుహెచ్చుగాను
గదిసిభటులనుమనువాఁడెగఠినగతిని।మించుపక్షులఁడేగఖండించుభంగి 335.
చ॥ దురమునమల్లికార్జునుఁడు దోర్బలసిద్ధపరాక్రమంబునన్
నిరుపమయుక్తిధీరతను నేర్పుగమేటులసిక్కులందఱన్
ధరఁబడఁగూల్చుచుంబటిమఁ దార్కొనియుండఁగవైరులెల్లఁదా
మరమరలేకవేత్రులనునాయెడ వేయఁగఁబొందుచున్ వెసన్॥ 386

వ॥ అప్పుడాయవనదేశాధీశ్వరుండు మల్లికార్జునునిగదా ప్రహారంబున మూర్ఛ
పోయి, యెట్టకేలకుఁ దేఱి, మున్ను కాలయవనుండు, శ్రీకృష్ణునిపైఁ దాఁగొ
న్న చందంబున, నెదిరించియిట్టట్టుపోనీక కుక్కుటంబులరీతి నొండొరులుగదు
ముకొనుచు, శిరస్త్రాణంబులుపగుల,గొట్టుకొనుచు వైరశుద్ధియెట్టులసంఘ
టించునోయను తలంపున, గదలుజళిపించుచుఁ గత్తళంబుల నుగ్గునూచంబొన
ర్చుకొనుచు రక్తసిక్తారుణదేహులై మందేహరక్షోయుద్ధవిస్ఫురద్భానునిభంగి
వెలుంగువారలై సంగరాయాసంబున నల్లల్లదురంబునల్పునెడ 337

ఉ॥ ఆయెడనానృపోత్తములు, నాగ్రహమొందుచు శాత్రశక్తిఁ దోఁ
బాయనికోపదృష్టులను, బాటిలఁ జూచుచునొండొరుల్ మహా
శ్రేయముఁ జేయనౌమదిని, శీఘ్రమ కోరుచు సాంద్రకోపులై
యీయిలవైరశుద్ధియెటు లేర్పడు, నట్టులె పోరుచుండ్ వెసన్॥ 338

మ॥ గదలన్ జక్కఁగఁ బూనివారిరువురుం, గాలాంతకోదగ్రులై
యెదుటన్ నిల్చినవారుభీతిఁగననెం, తేశక్తితోఁ బొల్చియా
యుదయార్కప్రతిభన్ వహించి తగఁనయ్యుద్ధంబునందొప్పుగా
మెదలంజాలకకూలిరొండొరుల బల్మిన్ మెచ్చుకొంచున్ ధరన్॥ 339

సీ॥ సంగరభూమినిసారసాత్త్వులుపడ దిగ్భ్రామమయ్యెడదీటుకొనియె
సురసంఘములుగూడివిరసుఁడౌ మ్లేచ్ఛునిఁదలపోయుచుండిరితడయకవుకు
కుటిలవృత్తినివాఁడుఘోరసాహసమున సైన్యంబుతోఁగూడసమసిపోయె
మల్లికార్జునుఁడనుస్మరహరభక్తుండు మరణించెనీయెడమానుగాను

తే॥ ఏమిచెప్పంగవలయు నేఁడీశ్వరాజ్ఞ చూపరులకెల్లనత్తఱిఁ జోద్యమమర
భూరియుద్ధస్థలంబునఁ బొలుపుఁదోలఁగి పడెను నృపుఁడని విబుధులు పరితపింప॥ 340

వ॥ ఆసమయంబున భూపతులిరువురు యుద్ధస్థలంబున, నిశ్వాసోచ్ఛ్వాస సంత్యక్తాత్ము
లై, పడియుండిరయ్యెడ॥ 341

గీ॥ ఇనపరాక్రమసారసాహిత్యవేది రవిప్రభూత్తములిరువురు క్రమందఁ జూచి
చండతరకాంతిహీనుఁడై యుండెఁ, జూచువారలును దీనులై చింతఁ బరఁగిరపుడు

మల్లికార్జునుఁడు రణపతితుండయ్యెననుమాట భార్యవిని విముక్తప్రాణయగుట.

క॥ ఆసమయంబున వేగమ యాసరసునిభటుఁడువచ్చి యతిఖేదముతో
వాసిలిపత్తనమందున నీసమసిననృపుచరిత్ర మేర్పడఁ దెలిపెన్॥ 342

వ॥ ఏతద్వార్తాశ్రవణంబు కొందఱకు నొకపాటిచింతఁగలిగింపఁ బట్టణస్థజనసమూ

హంబు, నిర్ఘాతసమవార్తయని వందురుచుండ, నపుడీయవనీకాంత కాంతామ
ణింజేరుకొని, డగ్గుత్తికతో విన్నవించెనిట్లు॥ 344

ఉ॥ సారసనేత్ర, నీవిభుఁడు సంగరరంగమునందు మెచ్చఁగాఁ
బోరుచుఁ క్షాత్ర తేజమున భూపుఁ డురుష్కునిఁ జంపి చచ్చెవా
రారని దీర్ఘకోపమున నయ్యెడ ఘోరతరంపుయుద్ధమ
న్నాఁ; రయ మొప్పమల్లులక్రియన్ విభులిర్వురుసల్పిరుద్ధతిన్॥ 345

మ॥ అనియిబ్భంగిభటుండు తెల్ప వినితానాపార్వతీరాజ్ఞి నె
మ్మనమందున్ దనభర్తృసద్గతికిఁ గర్మన్యాప్తికిన్ గొంతచిం
తనపాటించి శరీరమస్థిరముగాదాయంచు వేనైజమా
తనువున్ ఖడ్గముచేత వ్రచ్చుకొని, సిద్ధస్వర్గకాంక్షాత్మయై॥ 346

క॥ పతిమరణంబుఁదలంచుచు సతియొక్కతెఱంగుఁగాంచి సాక్షాన్మోక్ష
స్థితినెంచుచుసంబంధము గతమయ్యెనటంచు వీరకాంతయెఱింగెన్॥ 347

చ॥ తనసఖురాండ్రఁబిల్చి విభుధర్మసతీహిత ధర్మమార్గవ
ర్తనల నెఱుంగఁ జేసి, తనదైవము భర్తరణాంగణంబునం
దునఁ బరభోగమందెనని, ధోరణిగావచియించి, యాత్మలో
సునిశితఖడ్గ ధారఘట శుద్ధిఘటించునటంచుఁ జెప్పుచున్॥ 348

సీ॥ ఎంతకాలంబున్న నీశ్వరాజ్ఞకు వార లేదుగా వేఱుగారాదుగా దె
కలకాల మొకరీతి కాదుగా లేదుగా, సాధింపరాని యేసరణియైన,
సంగరారంభనిస్తంద్రులౌ నలహరిశ్చంద్రాదులేజాడసాగిచనిరో
సదసద్విచారణాసారజ్ఞులౌ మానులేచాయఁదమచాయనెంచుకొనిరో
తే॥ అట్టినిర్గుణపరతత్త్వమందనెంచి ప్రాణవిభుఁడాజిఁ దనప్రాణపంచకంబు
గ్రహనిబద్ధంబుగాఁ జేస ప్రథితరాజ వినుతపదభాగ్యమందె పృథ్వియెభ్రమింప॥

వ॥ అని యీప్రకారంబున నవ్వీరపతివ్రతాతిలకంబు తనతోడిరాజాంగనలతోఁ
బౌరుషవాక్కుల విరాగమార్గంబుఁదెల్పి మానవతులైన స్త్రీలు, పతులయ
నుజ్ఞకు బద్ధలౌటుచితంబనితలంచి, తొల్లి తనభర్తయనుజ్ఞమనంబునందలంచి
త్యక్తప్రాణయగుటకు నుత్సహించినయప్పుడు॥ 350

శా॥ ఆయాటోపముమాన్పి యామెసఖులా న్యాయంబు యుక్తంబె, మీ
చాయల్ వీరపతివ్రతాధికత హెచ్చంజేయవే, మైనమే
మీయుక్తుల్ సమయస్థితిం దెలుపఁగానే చెప్పుచున్నాము స
ద్గేయంబౌ పదమందఁబోవునెడ మీకే, యౌను స్వర్భోగముల్॥ 351

వ॥ ఇట్లు పలుకుచుండి, పరస్పరోక్తివిలాసంబులఁ దత్రత్యలగు పాతివ్రత్యశిరో
మణులు, త్రిదివమార్గంబుననుసరింప, వీక్షించువారాశ్చర్యోద్విగ్నమానస
లై యుండిరి॥ 352

గీ॥ అచటఁగొందఱు సంభ్రమంబందుచుండి। రింకఁగొందఱునాశ్చర్యమొనయుచుండి।
రౌర; యిదివీరవనితల దారియనుచు। స్వస్వమానస సంక్రాంతభవ్యదృష్టి 353

వ॥ అప్పుడాపట్టణంపు దేవియగు పార్వత్యంబ వీరవనితల కనువగు జననవిరామం
బునొంద, నాపురంబందలి స్త్రీపురుషవతంసంబులెల్లరును, నుల్లంబులు పల్ల
టిల్ల "సకలరాజశిరః కిరీటమణిదీపనీరాజితపాదపంకేరుహుండగు మనరాజేం
ద్రుండు వీరలక్ష్మీస్వయంవృతుండయ్యె, అమ్మహాసీయు ధర్మపత్నియుఁ దద్భ
ర్తృసేవార్థంబు, తోడనచనె, మఱియు నెందఱో లోకాభరణభూతులగు
భూతలేశ్వరులు, నాకంబలంకరించిరి. మనకిటఁ దోడునీడ జగదీశ్వరుండువినా,
కనఁబడకుండె" నని తలంచుచు॥ 354

ఉ॥ ఏమని చెప్పవచ్చు మనమెన్నఁడు నిట్టివిచిత్రవర్తనం
బీమహిలోపలన్ వినము, యివ్విధిఁ బ్రాణపరిచ్యుతిస్థితిన్
భీమపరాక్రమాఢ్యుఁడగు, బెబ్బులిఁబోలినభర్త యాజిలోఁ
బామరుఁజంపి స్వర్వసతిభాగ్యముఁగాంచెనటంచు దేవియున్॥ 355

ఉ॥ మానధనాంగనామణులమార్గముగైకొని ఖడ్గధారతో
మేనొకకొంతవచ్చికొని, మేకొనెభర్తృసహాధివాసమున్
మానిపతివ్రతల్ నియమమాన్యలుపొందెడిరీతి, నంచువా
చ్యాన్వితతుల్ జనంబులు భృశంబుఁదలంచిరి రాజభక్తిచేన్॥ 356

వ॥ ఇవ్విధంబునఁ బ్రజలు ప్రజలరీతిఁ బొగులుచుండ "మల్లికార్జున ప్రభుగోత్ర
దాయాదులీదేశంబునఁ గన్పట్టరు. ప్రభువనఁబిత్రుసముండు, కావున వీనిదహ
నాదికృత్యంబులు నిర్వర్తనీయంబులు, అని మంత్రిప్రముఖులుతలంచి తత్క్రి
యలజరిపించి, తద్రాజవిత్తవస్తువాహనాదుల యవనరాజు మనుమండాక్ర
మింపంగలండని, ధర్మార్థంబుగా వినియోగించి, రాజమరణదుఃఖంబొక్కపట్టు
న, యవనభూపాలకరిష్యమాణకష్టంబులాగతంబగునని యొక్కపట్టునఁదలంచి
స్థానత్యాగంబొనర్చి దక్షిణపుణ్యక్షేత్రదర్శనంబుసేయ నేగిరయ్యెడ, 357

ఆ॥ ఈమహీశుచరితమిట్టులనుండఁగ యవనరాజబలచయంబువార్త
మిగిలియున్నవారిమేలుతోఁ శేషించె నాంధ్రవిభునియంకురాంకమట్లు॥ 358

వ॥ మ్లేచ్ఛరాజబలంబున హతశేషులు, నిజరాజమరణంబునకు, వగచి, శవవిహితకార్యంబులుసేయించి శాస్త్రవిధి "పాతిహ"లిప్పించి స్వస్థలప్రవేశ మొనర్చి జరిగినవృత్తాంతంబు ద్వాదశవత్సరప్రాయుండగు రాజపౌత్రునకు నివేదింప, నారాజశాబకుండు "కాలచక్రవర్తనం" బను యందఱకు దుఃఖోపశమనంబు సేయుచు మనోవైకల్యంబుమాన్ప నందఱుజ్ఞానవంతులై యుండిరయ్యెడ॥ 360

మాలిని॥ సుగుణగణవిభూషా, సుందరాకారవేషా
యగణితజయనామా, యవ్యయానందభూమా
నిగమవినుతపాత్రా, నిత్యకళ్యాణసూత్రా
విగతకలుషధామా, విశ్వరక్షాభిరామా॥ 361

గద్యము.

ఇది శ్రీసీతారామచంద్ర కరుణాకటాక్ష వీక్షావిశేషసంప్రాప్తకవిత్వవైభవ, శ్రీమదఖండ సచ్చిదానంద స్వరూపరాజయోగానందానుభవ, పవిత్ర వల్లుట్ల గోత్ర వాసిరెడ్డి వంశసంభవ, వెంకమాంబా సూరయనామధేయ తృతీయ తనూభవ, బుధజనవిధేయ, సమ్యక్కృతాతిథేయ, సత్సహవాస, వెంకటసుబ్బదాస ప్రణీతంబైన వాసిరెడ్డివంశచరిత్రమునందుఁ బ్రథమాశ్వాసము సంపూర్ణము.

శ్రీ సీతారామార్పణమస్తు.







శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# వాసిరెడ్డివంశచరిత్రము.

## ద్వితీయాశ్వాసము.





రఘువీర, వారిదశ,రీర నిజాశ్రితసంఘపోషణో
దార, ధరాత్మజావదన, తామరసారుణ, మోక్షకారణా
క్రూరసురారిసంహారణ, కోవిద, దేవ, దయాంతరంగదు
ర్వారతరాఘశోషణప,రాత్పరవామ ధరావరోత్తమా॥ 1

వ॥ అని శ్రీరామచంద్రు నుద్దేశించి, యాంజనేయుండు నివేదించిన, యవ్వాలి కథావృత్తాంతం బెట్టిదనిన॥ 2

మల్లికార్జునపుత్రుఁడగు సదాశివప్రభువంశానుక్రమణిక.

ఉ॥ శ్రీగిరిమల్లికార్జునుని, చిత్తమునం జిలఁగల్గినట్టి ధీ
సాగరుఁడైనపుత్రునిఁ బ్ర,శాంతయుదాసియునైనలక్ష్మితో
బాగుగనంప నయ్యబల,బాలునిదెచ్చుచు జంద్రసన్నిభున్
వేగమకృష్ణకుందరిని వెల్గెడి నూతకిపట్టణానకున్॥ 3

ఉ॥ మన్నువసిష్ఠపుత్రుఁడతి, మోదముతోడుతఁ దత్పురంబునన్
బన్నగభూషణాలయము, భక్తిమెయిన్ నిలుపంగ దానిలో

సన్నుతమూర్తిశక్తియుత, సాంద్రరుచిన్ గరుణించియుండి యా
పన్నశరణ్యుఁడై కలుషపర్వతనిర్జరనాథుడై తగన్॥ 4

క॥ తద్దేవాలయమందునఁ, బెద్దలచే సెలవునొంది, ప్రేమదలిర్పన్
ముద్దులుగుల్కెడిబాలుని నొద్దికచేదాసిలక్ష్మి, యొప్పగనుంచెన్॥ 5

వ॥ అప్పుడప్పురజనంబులు, తద్దేవాలయంబునకరుదెంచి, యబ్బాలుని, యాగమ
నాది సర్వవృత్తాంతంబుల, నెఱింగి యతనిరూపరేఖావిలాసంబుల కచ్చెరువడి
తమమనంబులనిట్లు వితర్కించుకొనుచుండిరి॥ 6

సీ॥ చానరో! యీతండు, చంద్రుండుగాఁబోలు, జంద్రుఁడేమైన నాజాడలేదె
కొమ్మరో! యీతండు, గోపాలుఁడాయేమి, లేరెగోపికలు నీ,ధీరుదరిని
రాజీవనేత్రరో!, రఘురాముడందుమా, నీలమేఘచ్ఛాయ, లీలలేదె
కోమలీ! యీతండు, గోత్రారియందుమానురబృందమాచెంతఁ, జూడబడదె
యనుచునాబాలులీలల, నాత్మశక్తి,కొలఁదినూహించుకొనుచున,క్కువలయాక్షు
లెందుఁగలరూపెఱుంగక, యిందుధరునిభక్తుఁడనిమాత్రమొకదారిఁ,బరఁగిరవుడు॥

క॥ ఆతఱినాతనిఁగనుఁగొని, శీతకరాననుసి, సుగుణసింధు మనోజ్ఞున్
బూతచరిత్రులు నార్యులు, చేతంబులమోదపడిరి, శ్రీయుతుఁడంచున్॥ 8

క॥ ఈకుట్టనితలిదండ్రులు, శ్రీకలితులు, దివ్యభవ్యచేష్టావహులున్
గాకున్ననిట్టిపుత్రుం,డేకరణిని సంభవించు, నేనాఁడైనన్॥ 9

ఉ॥ ఈకొమరుంగనుంగొనిన, హెచ్చగురాచకొలంపుఁబోడుముల్
లోకవిలక్షణద్యుతులు, లోచనపర్వవినోదవైఖరుల్
వాకొనకుండనే తెలియ, వచ్చుచునున్నవి యిట్టిబాలుఁడీ
జోకనఖండకష్టవనిఁజొచ్చుట దాసిగ్రహించుటేలొకో॥ 10

తే॥ ఇట్టులచ్చటివారల,నేకగతుల, నూహసేయుచు నచ్చట, నున్న దాసిఁ
గాంచి యిట్లనిపల్కిరో, యంచితాంగి తెల్పుమీబాలుచరితంబ,నల్పమిపుడె॥

వ॥ అనవిని, యాదాసి మృదుమధురోక్తుల వారలకిట్లనియె॥ 11

సీ॥ మానవోత్తములార, మనుజనాథునిఱింకి, వివరించి తెల్పెద వేడ్కమీఱ
నెల్లూరిసీమలో, నెలవైన నగరంబు, వాసిలి యనుపేర, వసుధఁగలదు
తత్పట్టణవిభుండు, తరణిసంకాశుండు, మల్లికార్జునుఁడను, మానధనుఁడు
వాసిరెడ్డ్యన్వయ, వారాశిచంద్రుండు, రాజ్యపాలనకృత్య, రామసముఁడు

గీ॥ అతనిదేవేరి గుణగణ్య, యమలహృదయ। పార్వతీనామ్ని యట్టిదం,పతులుగనిరి
వృద్ధికామునినీరాజ విభుకుమారు, నారపిందుభమ్మై వంశ మలరుకొఱకు॥ 12

క॥ శ్రీరామునితలిదండ్రులు। శ్రీరామునిఁ బెంచినట్లు, చిత్తములలరన్
గా రామునఁబోషించిరి। శ్రీరమ్యుని నిక్కమారు, జిగిఁదలిదండ్రుల్॥ 13

వ॥ ఆసమయంబున, నిబ్బాలుని తలిదండ్రు లతిమోహంబున, భూపరిపాలనంబు, తమమంత్రియగు సుయోధనునకొసంగి, యెల్లకాలంబున బ్బాలుని క్రీడాతిశయ మహాహ్లాసంబుల కానందించుచు, నేకపుత్రాభిలాషంబుననితరవ్యాపారంబుల మఱచి, తత్సంతోషమగ్నులై కాలహరణంబు సేయునెడ నొక్కనాఁడు సభాస్థానంబున సకలపండిత కవిగాయకాదిగోష్ఠీసంతుష్టుండై కొలువుదీఱియుండ నప్పుడాకాశవాణి యొక్కస్త్రీరూపంబున సాక్షాత్కరించి భూపాలుండువిన "నోరాజోత్తమా! నీరాజ్యసంపద తొలంగు కాలంబు సన్నిహితంబయ్యె, వారత్రయంబులోన తురుష్క దేశాధీశ్వరునితో నీకు దురంబు సంధిల్లు, నాదురంబున జయంబన్యాధీనంబగుఁ గొంత కాలంబువరకు నీయన్వయాభివృద్ధియుఁగాఁగలదు, గాన నీవంశంబునిల్పు నదుపాయంబుఁజూచుకొనుము" అని వాక్రుచ్చి యంతర్ధానంబునొందెనంత॥ 14

ఉ॥ భారతిపల్కులన్ విని ప్ర, భాకర తేజుఁడు దుఃఖమగ్నుఁడై
శ్రీరమణీమనోహరునిఁ, జిత్తములోపల సంస్మరించుచున్
ధీరతఁబోవ నీకపటు, దీప్తిచెలంగఁగ నన్ను నత్తఱిన్
గౌరవబుద్ధితోఁబిలిచి, గద్గదకంఠముతోడ నిట్లనెన్॥ 15

క॥ మమ్మోడఁబాయక యెప్పుడు। నిమ్మగ మాసాధమందు, నింపలరంగా
నమ్మిక నంతఃపురమున। సమ్మతితోఁ బ్రేష్యకృతులు, సల్పితి వబలా॥ 16

క॥ నారీమణి విను దెల్పెద। నారాయణమూర్తికరుణ, నాయెడలేమిన్
నారాజ్యభోగమంతయు। నేరూపుననైనఁ దొలఁగు, నిల శాత్రవుచే॥ 17

క॥ మాబాలుని నీవిప్పుడు। నీబాలునిఁగానెయెంచి, నేర్పుకొలందిన్
నీబహుళశక్తిఁబ్రోవుము। యేబాధయులేక వృద్ధి, నెనసెడి భంగిన్॥ 18

ఉ॥ కోమలి, మాదువంశమది, గొప్పదియాట నెఱుంగుదీవు, నీ
భూమిని మాకులోద్భవుల, పోడిమినాగయఁగానమెచ్చుటన్
మేమెమదిన్ దలంచి యిటు,మించిన యుక్తివచించినామిఁకన్
నీమనసొప్పఁగానిపుడు, నెర్పుదనీతనిఁ గావుమొక్కటన్॥ 19

వ॥ అని మఱియునిట్లనియె॥ 20

సీ॥ సారసాక్షిరో నీవు,సరసంబుగా మాదు,వంశాభివృద్ధి యేర్పడెడికొఱకు
నీబాలుఁగొనిపోయి, యీయిలఁజక్కనిపుణ్యభూములయందు, బాలుత్రుగాను

నేతీరుచేనైన, నీనీరజాక్షుని, నీపుత్రుఁగానెంచి, నేర్పుతోడఁ
బోషింపుగా నీవు, పూర్ణమా ప్రేమతో నిందురేఖావృద్ధి, నందునట్లు
గీ॥ కాలగతియిట్లు కాఁదగి,కష్టసమితి, మమ్ముఁబైకొనె మాపుత్రు, మనుచుభార
మెల్లనీయదేయని చెప్పి యెంతొవగచె నామహారాజుమమ్ముంపు,నట్టివేళ॥ 21
వ॥ అని యిట్లువగచినవాఁడై, యీరాజెట్టకేలకు ధైర్యమువహించి, తనసభమె లంగు సకలబుధమంత్రివర్గంబులు తమకిట్టి యిక్కట్టువచ్చినందులకు వగచుచుండ వారినందఱను మహారాజమౌళి "మీరువగవంజనదు. దేహికిఁ గష్ట సుఖంబులు క్రమప్రాప్తంబులు గావునఁ గష్టవేళదుఃఖించి ,సుఖసమయంబున సంతోషించుట ధర్మంబుగాదు" అనియూఱడించి, యీశిశుసంతానము వృద్ధినొంది రాజపరంపర పెరుగవలసియున్నది. అయ్యది మహాతేజోవంతము కాఁగలదు. అనియు, నితనియభివృద్ధి యుత్తరపుణ్యక్షేత్రములయందుఁ గాదగెననియుఁజెప్పి, యిక్కొమరుని నాతోఁబంపించెఁగావున॥ 22
క॥ మారాజునాజ్ఞగైకొని।శ్రీరామునిమతిఁదలంచి, స్థిరచిత్తముతో
నీరీతిబాలుఁగైకొని, చేరితినిచ్చటికి రాజు, చెప్పినయటులన్॥ 23
క॥ నాపేరులక్ష్మియందురు।భూపాలునిసతికి నేను, బూవులమాలల్
శ్రీపార్వతీశుకృపచే। నేపారన్ముసుచుచుందు, నెల్లపుడచటన్॥ 24
గీ॥ కన్నదియెకానిరాణి యీ,చిన్నవాని, ననుదినంబును స్తన్యదా, నాదివిధులఁ
బెంచితిని నేనె కావునఁ, బృథ్విపతియునుంచె నాతలనీభార,మంచితముగ॥ 25
గీ॥ అనుచునీరీతిదాసితా,న నెడివేళ, విన్న పురజనులెల్లరు, వెఱఁగుపడుచు
నార, రాసుతుఁజేడవి,ట్లంపుటేడ, దైవచిత్రంబునుమియంచుఁ,దలఁచుచుండి॥
ఉ॥ పెద్దలుపిన్నలందఱతిప్రేమదలిర్పఁగ రాచబాలు పెన్
ముద్దులుగుల్కుమోముఁగని, మోదమునొందుచుఁ జుంచుదువ్వి బి
ట్టొద్దికతోఁగవుంగిటను, నొయ్యనఁజక్కఁగఁజేర్చికొంచుబల్
పెద్దగ గారవ్రొక్కులను, బేర్కొనుచుండిరి రాజభక్తిచే॥ 27
గీ॥ ఇట్లుచూపఱులందఱు, నింపుమీఱ, సంగతోత్సాహమలవడ, సాహసాది
పటిమతోఁజుతనారాచ, బాలునందు దైవభావంబునుంచిరి తత్క్షణంబ॥ 28
వ॥ మఱియు నీబాలశశాంకుని రూపరేఖావిలాసమృదుమధురోక్త్యాదులనారయ నీతండు శివప్రసాదంబున నాంధ్రదేశాధీశ్వరుండగు శ్రీ గిరి మల్లికార్జునుని గర్భంబున నుద్భవించెనుగాని మనుష్యమాత్రుండుగాఁడని తత్పురజనులు తలంచిరప్పుడీ నీరజాక్షుని నిచటనుంచుట భావ్యంబుకాదు. మనరాజువినిన మనల్ఁగోపించునని శంకించి, మనరాజగు కొండాలిరామభూపతిసౌధంబునకుంగొ

నిపోప్రభుచితంబనితలంచి యామాణవకుని ప్రియతాధారయగు, లక్ష్మికే
త్సంగతిం దెలియంజెప్ప నాభామామణి, సదాశివబాలకున కీసంగతిని విన్న
వింప, నతశిరస్కుండై కొంతవడికాపెనుజూచి యిట్లనియె॥ 29

ఉ॥ పుట్టితి రాజగర్భమున, భూరిగుణాకరభోగభాగ్యముల్
బిట్టుగఁబొందినేనిపుడు, భీకరబాహుపరాక్రమాఢ్యులై
నట్టిభటాదులన్ విడిచి, యాతలిదండ్రులవీడి శ్రేష్ఠమా
పట్టణముంద్యజించి యిటు,వచ్చితి దైవబలంబు నెంచుచున్॥ 30

శా॥ అంచున్ బాలుఁడు దారపుత్రనివహ, వ్యాపారభూపాలయా
భ్యంచద్గేహములందునుండుటకుని, ష్టాభావముంజూపిత్వ
త్సంచారామరగేహవాసమునిని, చ్చన్ మెచ్చి కాలస్థితిన్
మించుంజూపులనెల్లవర్తనకు నెమ్మిం, జూపెనాలక్ష్మితోన్॥ 31

వ॥ అచ్చటనుండిన యార్యజనంబులంగాంచి యధికవినయ విధేయతలతో
నిట్లనియె॥ 32

క॥ మీరందఱుకడుఁ బెద్దలు। కారుణ్యముతోడనన్నుఁ గడదేర్చుడునా,
భారముఁ వహింపుఁడీయనె నారాజసుతుండు మృదుతరాలాపములన్॥ 33

సీ॥ అపుడార్యులందఱాయవనీశసుతుమృదు, మధురోక్తులనువిని మానసములఁ
గౌతూహలంబంది ఘనదుఃఖమునంది, కడుఁగడు వెతఁజెందికరుణగల్గి
ఈమాణవకునకు నేడువర్షంబులు భాషలనరయంగఁబటిమహెచ్చ
నీమహాధీరునకేపారు ధయిర్యంబు, కడుశ్లాఘనీయమైకానుపించు

గీ॥ నపుర,యీశౌర్యమీధైర్యమమలభక్తి,యశ్రుతచరంబులిట్టియీయర్భకునకు
నీవిధంబున దురవస్థనేర్పఱిచిన దేవునేమనవచ్చు సందేహమాను॥ 34

క॥ మనపుణ్యఫలముచేతను ఘనుఁడీతఁడుమాణవకుఁడు గౌరవమలరన్
మనకో వెలకేతెంచెను వనజోదరుకరుణచేత వాంఛలుతీరన్॥ 35

మ॥ మనమీబాలకునిన్ నిరంతరము సమ్మానార్హుఁగా నెంచుచున్
ఘనతన్ జూచుచు నాదరించుచును ప్రఖ్యాతిన్ మహామూర్తియై
మనరాజైన కొండాలిరామనృపుతో మాన్యంబునేతత్కథన్
వినయాంచత్పృథుకాగమంబుఁ దెలుపన్ వేపోదమంచెంచుచున్॥ 36

వ॥ కొంతదనుక నచ్చటియార్యులు రాచబాలకునితో "నీవుసుఖంబుగనుండుము
నీకెందునగొఱంత లేదు. వలయు వస్తుసముదయంబును మేమె నీకు సమ
కూర్చెదము" అని యోదార్చి చెప్పి తమగేహంబులకుంజనిరప్పుడు॥ 37

క॥ ఆదేవళంబుదాపున। నేదనరుకుటీరమందు నీరాజసుతుం
డాదాసియువసియించెరి। యాాదార్యాంచితులు సాయమట్టెటుసేయన్॥ 38
క॥ ఆరాత్రి యచటనుండఁగ। వారిన్ బూజారికాంచి పరమాదరణన్
సారోదారునకిచ్చెను। భూరిప్రసాదంబునతఁడు భుజియించెనట‌న్॥ 39
గీ॥ ఆప్రసాదంబుభుజియించి హర్షమెసఁగ। దద్గృహంబున శయనించెదానుదాసి
మున్ను పాండుకుమారులు మొనసివిప్రు।నింటనిద్రించురీతినినింపుమెఱయ॥40
సీ॥ కనకసౌధములోనఁ గాంచనపుమ్మనుల్ మృదుశయ్యయందుండమేలుగాను
శయనించునీయయ్య, శ్రమకోర్చి యీరాత్రి నీశ్వరాలయమునసనిలఁబరుండె
షడ్రసోపేతభోజనముచేసెడివాఁడు, బ్రాహ్మణునన్నంబుఁ బరఁగఁదినియె
సేనలు కొలువవసించుచుండెడివాఁడు, తానొక్కరుండయి తనరెనేఁడు
గీ॥ చామరంబుల నచ్చటిజనులువిసర దీపకళికలు వెలుఁగఁగాఁ దేజరిల్లు
నీనృపాత్మజుఁడిప్పుడు నిరుకుచోట దీపమేలేనియింటనుదిగిపరుండె॥ 41

వ॥ అంతట నారాజబాలుండు, మఱునాఁడు వేకువన, లేచి కాల్యకృత్యంబులుతీ
ర్చికొని, తిలకధారియై, యతిమనోహరంబులగు బాల్యచిహ్నలచేఁ బశుపతిం
దలంచుచుఁ, దత్ప్రదేశంబున నెట్లుసంచరించుచుండెననిన॥

ఉ॥ అందెలు గజ్జెలున్ మెఱయ, హారములున్ బటుకంకణాదులున్
సందడినందముంగొలిపి చక్కనిశబ్దముచేయుచుండ నం
దందువికాసభాసురముసౌ ముఖదీప్తివెలుంగ బాలకుం
డందఱకున్ మహాముదమునప్పుడె కల్గఁగజేసె నయ్యెడన్॥ 43
పురజనులు సదాశివునిరాకను, కొడాలి రామభూపతితోఁ జెప్పుట.

చ॥ పురజనులందఱయ్యెడ, నపూర్వముదంబునఁబోయి తత్పురీ
నరపతికిన్ కొడాలికులనాథునకున్ బ్రభురామనేతకున్
మురియుచు నిక్కుమారకుని ముచ్చటలన్ వినిపింప నాప్రభుం
డరిమురి నాతనింగనఁగ నప్పుడె కౌతుకమందె నెమ్మదిన్॥ 44

వ॥ పదంపడి యారామభూపతి తన సేవకు నొక్కనింబిలిచి, నీవీక్షణంబున వెడ
లి మనదేవళంబునందుండు రాజకుమారకుం గనుగొని "మాదొర మిమ్ముఁ
జూచుటకు రానుద్యోగించియుండె"నని తెలుపంబంపె నంతట నాతండు
త్రద్రాజబాలుని సన్నిధికింబోయి యనంతరంబున॥ 45

క॥ మ్రొక్కుచు రాజాత్మజునకు। మక్కువతోఁదెల్పె వేగ మారాజిపుడున్
గ్రక్కునమిమ్మున్ జూడఁగ। నక్కఱమెయిరాఁగలండటంచుం బేర్మిన్॥ 46

వ॥ అనినవిని యబ్బాలకంఠీరవుండా యనుజీవి తెల్పిన సంగతినివిని, యోజించుకొని యతనితో నిట్లనియె॥ 47

చ॥ విదితకులోద్భవుండనయి వీరధరాధిపు పుత్రకుండనై
యదనిటులాట నేనిచటికట్టిటు చేరితినీశ్వరాజ్ఞచే
సదమలమూర్తి, రాజు, నను సమ్మతిచేఁ గననెంచునేని యి
య్యది సమయంబుగాదనుమ, యాగ్రహమొందకుడంచుఁ జెప్పుమా॥ 48

వ॥ ఇట్టి యాబాలునివాక్యంబులాలించి, యాసేవకుండు నిలువంబడియుండ సదాశివబాలకుండు "నేను బాలుండను, నాపలుకులంతఁ బోటుకులున్నఁ దప్పుగా నెంచకుఁడు" అని రాజునకుఁ జెప్పునట్లు సెలవీయఁ దత్సేవకుండు రాజసన్నిధికంజని యెట్లువిన్నవించెననిన॥ 49

సీ॥ తమయాజ్ఞఁ గైకొని తడయక నేఁబోయి, వినయవిధేయతావిధము మీఱ
నయ్యాంధ్రవిభునకు యావదుదంతంబు, పూసగ్రుచ్చినయట్లు పొలఁజెప్ప
నాయయ్యసరియని యనక సంకోచించి "విధివిదూరుఁడ నేను, పృథ్వీరాజ
భూతిసంక్రాంతుండు, భూరిభోగేంద్రుండు; కావున ననుఁ జూడఁగాంతు రేల
గీ॥ దైవవశమున నిప్పుడీదేవళమున। నిల్చియుంటిని నీవు నేర్పుకొలఁది
నమ్మికను రాజుగారితో నెమ్మిఁ జెప్పు। మా"యటంచ నెమర్యాదయుచ్చువడఁగ॥

వ॥ ఇట్లు చెప్పినంత॥ 51

క॥ నిజసేవకువచనంబులు। సుజనుండగు రాజు, విని, విశుద్ధదలిర్పన్
విజనస్థుఁడైన బాలుని। గజిబిజి లేనట్టిమతికిఁ గౌతుకపడుచున్॥ 52

సీ॥ ఈసుందరాంగకుండేడువత్సరముల పసిబాలుఁడనివింటిఁ బ్రబలముగను
గమలాక్షుఁడీతఁడొక్కండుగానుండియు నిరుపమానస్థైర్యనియతినుండఁ
బటుధీరతాశుద్ధిఁ బరఁగియయ్యభిమన్యునుపమయొక్కింతతానొందుచుండె
గంభీరవచనవిక్రాంతిచేవినువారి కాశ్చర్యముదయింపననువునిచ్చె॥
గీ॥ ననుచు నాతనిగుణములనధికముగను। గణన సేయుచు నారాజు గారవమున
విలసితానందమగ్నుఁడై వేగనపుడు। యోజనమొనర్చెలోన నారాజవరుఁడు॥ 53

వ॥ ఎట్టులనిన? "నీబాలచంద్రుండు సామాన్యుండుగాఁడు, ఏతద్వయం, బీయుదాగు వాగ్విలాసనాడుల చేతనే తేలుచున్నయది, ఈయన యీప్రదేశంబు విడిచిపోవుటుచితంబుగాదు, గావున నీయనకును భోజన భాజనాది వ్యాపారవిహీనవస్తుసామగ్రిమనముసంపుటుచితంబు" అని తలంచి తనసేవకులతోఁ జెప్పదఁగు వైఖరి వచింపి, బాలసేవయందు నియమితులం జేసెనప్పుడు. 54

గీ॥ రాజునానతిసేవకరాజికంబు। నియతిఁదప్పకభోజననియతికిఁదగు
వస్తువులఁబంపుచుండెనవ్వారిగాఁగ। రాజసుతునకుగౌరవప్రథిమమెఱయ॥ 55
క॥ బాలుఁడులలితమనోహర। శీలుఁడుతగుకాలవిధినిజకృత్యులువడుచుఁ
గాలముఁగడపుచునుండెను। శ్రీలీలాధిపతులిచ్చుసిరులంగనుచున్॥ 56

సదాశివుండువిద్యనభ్యసించుటకుగూర్చినిజదాసితోఁదెల్పుట.

చ॥ ఘనమతి, విద్యలంజదువఁగాంతు జనించినిజావనస్థితిన్
మునుకొనులక్ష్మిఁగాంచివినుమో వనితాననువిద్యనేర్వఁగాఁ
బనుపుముపాఠశాలలకుఁబర్వత నాథసుతేశునాజ్ఞచేఁ
గనెదనువిద్యలంగలుగుగౌరవముల్ సరివారుమెచ్చఁగాన్॥ 57
గీ॥ నేనెయీదివసంబున, నెమ్మితోడఁ। బాఠశాలకుఁజనుదెంచిభవునికృపను
బ్రాప్తమగువిద్యఁజదివెదభవ్యముగను। బంపుమానన్నునీవనెఁబారఁజూచి 58
ఉ॥ ఆయెడసుందరాంగిమదిహర్షముఁగాంచుచుఁబల్కెనిట్టులో
ధీయుతపుత్ర ! నీకుఁదగుతీరునవిద్యగ్రహింపుటొప్పగున్
బాయకబాల్యమందెనృపబాలురు విద్యలఁగాంచి రేనియొం
తో యశమబ్బుఁబంపెదనుదోరపుగౌరవముప్పతిల్లఁగన్॥ 59
వ॥ అనుచుఁదదంగనామణితత్పురపాఠశాలకరుదెంచి, యందలియుపాధ్యాయులఁ
బొడఁగాంచి నమస్కరించియణఁకువమెఱయ "నో బ్రాహ్మణోత్తమా! యీ
బాలుండునృపాలవంశజుండు, దైవవశంబున, నీదృగవస్థాస్థితుండయ్యె నందు
వలనఁ దామీతనియందనుగ్రహంబుంచివిద్యాదానంబు సేయుదురని మిమ్ము
వేఁడంజనుదెంచితి" ననిననాయుపాధ్యాయుండు సుదినంబాలోచించియీదినం
బె మంచిదిగానబాలునిఁ బాఠశాలకుఁ దోడ్కొనిరమ్మని తెల్ప నప్పుడు॥ 60
క॥ ఆయువిద బాలుఁదోడ్కొని। శ్రీ యలరఁగఁ బాఠశాలఁ జేరెన్ వేగన్
శ్రేయోర్థియైనబాలున। కాయె ముచ్చటలఁజెప్పి చర్మిలి మెఱయన్॥ 61
వ॥ చేరి యాదాసి యచ్చటి యుపాధ్యాయునితో నిట్లనియె॥ 62
ఉ॥ భూసురవర్య, నీవిపుడు భూరి కృపారసమేర్పడంగ నీ
భాసురమూర్తికిన్ సుగుణహార్థికిఁ జక్కని జ్ఞానసంపదన్
గాసిలనట్టి మేను గసుగందని శిశును విద్దెపోడిమిన్
మోసపువృత్తిలేమియును ముఖ్యముగాదయసేయుఁడిత్తఱిన్॥ 63
శా॥ బాలుండీతఁడు రాచబిడ్డఁడు సదాబాల్యప్రచారాది కృ
త్యాలోలుండయి సంచరించుచు జనన్యాది ప్రహీణాత్ముఁడై

శ్రీలక్ష్మీపతి చక్కఁజూడనియెడన్ జేడ్పడ్డ రాజ్యప్రభన్
హేలందిర్గుచునుండఁ దెచ్చితిని నేనీయర్భకున్ గ్రచ్చనన్॥ 64

వ॥ ఇత్తెఱంగున నీదేవళంబుననుండ నేఁటిరాత్రి నీబాలశశాంకరుం బు గన్గొని స్వప్నం
బున నిట్లనియె॥ 65

క॥ శివనామమెప్పుడునుపల్కుచు। సవినయముగ దేవళమునఁ జక్కఁగ నాతం
గువలయపతిసూనుండవై। విరళముగఁ జదువఁగోర్కెయగు నాకనుచున్॥ 66

వ॥ అనినవిని నేనాబాలుని మీసన్నిధికిందోడితెచ్చితినని విన్నవింప, నాభూసు
రోత్తముం డిట్లనియె॥ 67

గీ॥ చెలియ, నీవిట్లు పలుమాఱుపలుకనేల। యీకుమారుని చిన్నెలనెన్ని చూడ
రాజసుతుఁడీతఁడని చెప్పనోజ తేలె। ముఖము తెల్పునుగా సర్వమును బడంతి॥ 68

ఉ॥ బాలుని గారవోన్నతులఁ బాటిలఁగాంచియె సంతసించితిన్
లాలనచేత నెప్డు సకలప్రథితాగమ బోధచేసెదన్
లాలితమూర్తి నీతని నెలంతరో! నిత్యము పాఠశాలకే
హేలలులేక పంపుమనహింపుము నీనివియోగమత్తఱిన్ ॥ 69

వ॥ అంతట నాదాసి యాయుపాధ్యాయుని వాక్యంబులాలించి విశ్వసించి యా
బాలకు ననుదినంబుం బాఠశాలకంపుచుండె, నచ్చటనాతం డెట్లుండెననిన॥70

సీ॥ బాలార్కతేజుఁడా బాలురమధ్యను, చుక్కలందునఁ జంద్రురీతి నమరి
మోమునఁ జిఱునవ్వు మొలకలెత్త సతంబు, కంబువుంబోలు కంఠంబు తోడఁ
సిద్ధంపుముద్దుల నెలవైనమోముపైఁ, గుంతలచ్ఛవికొంత వింతఁ దెలుప
ఫలకసన్నిభగండపాళిఁ గ్రొంజిగిఁజూపు మెఱుఁగారు కనుదమ్ము లురుతఁగాంచ

గీ॥ నామనుష్యేశ్వరాత్మజుఁ డఖిలబాల। సంఘమున విద్యచే బుద్ధిఁ జతురతాప్తి
మొదటివాఁడయి సుకృతపుంబుంజమెల్ల। రాశియైయున్న యట్లటఁ గ్రాలుండె॥

క॥ చుక్కలలోఁ జంద్రునివలెఁ। జక్కని మతిచేతఁ దనదు చదువేపనిగా
మక్కువఁ జదువుచునుండును। గ్రక్కున విద్యను గ్రహింపఁగలకోరికతోన్॥

క॥ చూడఁడు బాలురవైపున। యాడఁడు తనసాటిపిల్లలందఱితోడన్
వీడఁడు విద్యాపఠనము। వాడఁడు కాలంబువృథగ బాలుండెపుడున్॥ 73

గీ॥ పాఠశాలనువీడి యాబాలుఁడెపుడు। విపణిమార్గాన కేతెంచు వెంట నమతి
గేహమును జేరి పాఠాలఁ గెరలి చదువు। విద్యపైనున్న యాస్థచే వినుచు నెపుడు॥

క॥ అన్నము పెట్టుమటంచున్। మన్నన నాయవ్వనడిగి మవ్వపుఁ బలుకుల్
చిన్నెలు మీఱఁ బచింపుచుఁ। జిన్నాతఁడు సతము ముద్దుచెప్పలనలరున్। 75

మ॥ అనఘుం డెప్పుడు నూరకుండఁడు, మహా హర్షోక్తులన్ బల్కుచున్
ఘనవాంఛాయుతుఁడై నిరంతరముఁ జక్కన్నేర్చుచున్ శాస్త్రముల్
గనఁగా నబ్బురపాటుగల్గునటు విఖ్యాతిన్ గనంజూచుచున్
మనుజాధీశ్వరసూనుఁ డొప్పెఁగడు సన్మానార్హ చిత్తాబ్జుఁడై॥ 76

వ॥ ఇవ్విధంబున నారాజబాలుండు విద్యాభ్యాససాంద్ర దీక్షంబూని యితరవ్యాపారముల చెంతఁబోక, భగవదనుగ్రహంబున, ననవద్య విద్యావిశేషంబులు గ్రహించుచున్న యెడ॥ 77

గీ॥ ఈశ్వరానుగ్రహంబుచే నేపుమీఱఁ। దత్పురవిభుండు నిద్రించుతరుణమందు
స్వప్నమందున నొకశుభవార్త పొడమె। భావివర్తనమారీతిఁ బరఁగుకతన॥ 78

ఈశ్వరుఁడు, రామభూపతిస్వప్నంబున, నతనికుమార్తెను, సదాశివున కిమ్మని చెప్పుట

వ॥ ఆస్వప్నవృత్తాంతం బెట్టిదనిన॥ 79

ఉ॥ ఓయి కొండాలిరామనృప, యోగ్యతమా, భవదీయ పుత్రికన్
శ్రీయుత, రాజపుత్రునకుఁ, జెచ్చెరనిచ్చి వివాహకార్యము
శ్రేయముగా నొనర్పుమని, శ్రీగళుఁడానతియిచ్చె నాకలన్
దోయరుహాక్షుఁడా విభుఁడు తోరపుఁగూరిమి పంతగింపఁగన్॥ 80

గీ॥ అట్లు వచ్చినస్వప్నంబునందు లక్ష్య।ముంచ కేపాఁసె రామభూపోత్తముండు
ధనమదంబడి తలకెక్కి దాటి జూప, నెవ్వరేమాట నేనియు నెట్లు వింద్రు॥ 81

ఉ॥ అంతట శంభుఁడున్, బరమహర్షముతోఁ డుత, దాసిలక్ష్మికిన్
సంతసమారనయ్యెడల సత్రములోపల, నిద్రవోవు న
య్యింతికి స్వప్నమందుఁబడఁతీ! వినుమొక్కటి దివ్యవాక్కు నీ
వింతకుఁ దత్ప్రయత్నమున నేగవలెన్ శుభమిందుఁగావలెన్॥ 82

ఆ॥ అల కొండాలిరామయాధీశుదరిఁ జేరి। యతనిపుత్రినితని కనుగలముగ
నిచ్చి పెండ్లిసేయనింతిరో! రామభూ।వరుని వేఁడుమనుచు వలను మెఱయ॥ 83

వ॥ ఇట్లు శంకరుండానతీయ, మఱునాఁడు, తత్కోమలాంగి, స్వప్నవృత్తాంతంబునకు సంతోషించి, 'గౌరవపాత్రుండగు నీరాజపుత్రుండు వేఱొక్క రీతియం దుండఁగా నేనిటుసేయ యుక్తమా' యని సంకోచించియు, శివానుగ్రహంబుకతంబున నీకార్యము సఫలమగునని తలంచి యీసంగతి తమ రాజబాలునకు విన్నవింప, నాతండు సస్మితాననుండగుచుఁ, బారశాలకుంబోన, నీలక్ష్మియు, యుక్తకాలంబాలోచించుకొని యప్పుడు॥ 84

క॥ శివునాజ్ఞశిరమునంగొని। సవినయముగ దాసి లక్ష్మిసంతోషముతోఁ
భవమానసఘానుఁ దలఁచుచుఁ। బ్రవిమలగతిఁ రాజు కథను బాగుగ నేగెన్॥ 85

చ॥ సరసిజనేత్ర, దివ్యగుణసాంద్ర, వివేకవిధేయతాఢ్య, తా
నరవరు సన్నిధిన్ నిలిచి నమ్రతతోడుత బుద్ధియోజనన్
గరుణ దలిర్పఁగాఁ బలికె గౌరవముం దనరారునట్లుగా
వెరవున రాజు మెచ్చునటు వీలోకయించుక దోఁప నయ్యెడన్॥ 86

క॥ ఓరాజోత్తమ! వినుమా। మా రాజతనూజునకును మహితగుణునకున్
మీ రాజ్యలక్ష్మి నిచ్చుచు। నారయాశిగఁ బెండ్లిసేయుమా యవనీశా॥ 87

మ॥ అని యిబ్భంగి మృదూక్తులం బలుకఁగా నా రామభూపాలుఁడున్
విని యామాటల నవ్వి చిట్లనియె నీవేళన్ యథేచ్ఛంబుగా
వనజాక్షీ! మృదులోక్తులం బలికి వహ్వా, శంక లేకుండ నీ
ఘనతం జూపితి వేరు చెప్పిరి యశస్కాముల్ మతిన్ నీకెటుల్॥ 88

వ॥ అనిన నయ్యింతి యిట్లనియె॥ 89

క॥ నాకీభువిలోఁ సెంచఁగ। మీకున్ దెలియంగరాని మిత్రులు గలరా
మీకిట్టి శంక లేటికి। నాకొక శంకరుఁడె, సర్వనాయకుఁ డధిపా॥ 9)

గీ॥ ఈశ్వరానుగ్రహంబుచే నిట్టిబుద్ధి। నాకు జనియించె, నోనరనాథమౌళి
యితరులెవ్వారు నాకు నీహితనియుక్తిఁ। దెల్ప లేదయ్య వేయేల తెలియుమయ్య॥

వ॥ అనిన విని యా రాజోత్తముండా దాసితో నిట్లనియె॥ 92

క॥ మీ రెవ్వరు మేమెవ్వరు। మీరాజే వంశమునకు మేటియొ నాకున్
నారీమణి! తెలియదుగద, యేరీతిగ నాదుపుత్రి నితనికి నిత్తున్॥ 93

గీ॥ మున్ను మీ భూపవరునకు నున్న పదవి। యెట్టిదో కొంత యోచించి యెలమి మిగులఁ
బుత్రి నిచ్చెద మీ రాజపుత్రునకును నెల్లతరముల వారలు నుల్లసిల్ల॥ 94

వ॥ అని యీప్రకారంబున నా రామభూపాలుండా రామామణికిఁ బ్రత్యుత్తరం
బీయ, మనోవికలమై, యీశ్వరానుగ్రహంబున్ దలంచుకొని 'మహావంశసం
జాతుండగు మా రాజపుత్రునకు మీకొమిరె నిమ్మని కోరుటయె నాయది తప్ప
ని, మనంబున నెంచుకొని, తన స్వస్థానంబున కరిగెనంతట॥ 95

క॥ ఆనరనాథుండొక నిసి। మానుగ నిద్రించియుండ, మనవార్ష్వముగా
భూనుత శశిధరుఁడా యెడ। నానరవరుఁ గాంచి పల్కె నత్తఱి మిగులన్॥ 96

చ॥ మదయుతులైన పాపులకు మానవదార్యజనోక్తు లెప్పుడున్
ముదము నొసంగఁజాలవది మూర్ఖబలంబు, నృపోత్తమా! దయా
స్పద మతివైభవత్సుతను జయ్యన నానృపసూతికిచ్చి స
మ్మదమునఁ బెండ్లిసేయుము, యమందసుఖంబుల నందుమా ధరన్॥ 97

ఈశ్వరుండు రామభూపతికి స్వప్నమందు సదాశివప్రభుకుమారు వృత్తాంతంబుఁ దెల్పుట

ఉ॥ ఆ నరనాథపుత్త్రుఁ డఖిలార్య నుతోత్తమ సద్గుణుండు, స
న్మాన సమంచితాన్వయుఁడు, మాన్యుఁడు రాజకళాధురంధరుం
డానవనీతమానసుని యంతటి బాలురఁ గానమెచ్చటన్
గాన, మదాజ్ఞనీతనికిఁ గన్యనొసంగుము కీర్తిఁ గాంచుమా॥ 98
గీ॥ అరయ నీసుతకగ్గె నాయానసీకు। సర్వగుణధన్య రాజ ప్రశంసనీయ
దీనికన్నిట ముఖ్యుఁడై తేజరిల్లు। వరుఁడన సదాశివుండె యౌరా నరవరేణ్య॥
సీ॥ భూపాల నీవిట్టి బుద్ధియోచనచేత నీతని శంకియు నెంచుటకును
నీవెంతవాఁడవు నీప్రయత్నంబున, నీతనిసంబంధ మింపుమీఱ
నీకబ్బనేరదు, నిజముగా నాచేత, సంఘటింపంబడె, సత్యముగను
శ్రీలక్ష్మికళచేతఁ, జెలఁగియీనీపుత్రి, నీయింటఁబుట్టెను నృపవరేణ్య
గీ॥ యితని సంబంధమంతగా నెంచనేల। నేను జెప్పినమాటయే నీవునమ్మి
పెండ్లిసేయుము శుభములు పెరుఁగునెపుడు। వీరిదాంపత్యమెప్పుడు వృద్ధిఁగాంచు
వ॥ అని యీప్రకారంబున నాభూపాలుని స్వప్నమందు సాంబుండు సాక్షాత్క
రించి నాభక్తుండగు సదాశివునకుఁ గన్యనిచ్చి పెండ్లిసేయుమని తెల్పి యదృ
శ్యుండయ్యె, నంతట నయ్యనంతావల్లభుండు, మేల్కాంచి యిటునటుఁ జూచి
యేమియుంగానక, యీశ్వరమాయయని, తలంచెనప్పుడు॥ 101
గీ॥ రాజు తనమది నీకలరాణఁగాంచి। స్వామి గిరిజాధిపుఁడు నాకు సకరుణమతి
నిట్టులానతియిచ్చె నేనెంతొ ధన్యుఁడను మదన్వయమెంతొ పావనతఁగాంచె॥
గీ॥ మృత్యుహరునాజ్ఞ మీఱుటమేరగాదె। యింతదుర్భరమహిమచేనిపుడు శంభుఁ
డతిశుభాస్పదమైనట్టి యాసువార్త। స్వప్నమందునఁ దెల్పె నాశంకదీఱ॥ 103
క॥ నాపూర్వజన్మఫలమున। నీపావని గోష్ఠిఁ దెలిపి యింపారంగా
నాపాపనిమ్మటంచున్। శ్రీపరమేశ్వరుఁడు పలికె చెలువొప్పారన్॥ 104
గీ॥ అనుచుఁ దనసతికీవార్తనతఁడు తెల్పి। విలసితానందమగ్నుఁడై వేడ్కమీఱ
నిది మహాదేవుమహిమచే నింతి! మనకు। జేకుఱెనటంచు మిగులసుశ్రీవహింప
వ॥ అయ్యెడ నయ్యుత్తమాంగనయు సంతసించి నిజనాథునితో నిట్లనియె॥ 106
క॥ మీయిష్టమె నాయిష్టము। మీయెడ నేనితరరీతి మెలఁగందగునా
నాయెడ వేఱెంచకుఁడీ। మీయిచ్ఛను జేయుఁడయ్య మేలగు మనకున్॥ 107
వ॥ అంతట నారాజు మిగుల సంతోషించి, కొల్వుకూటంబునకేతెంచి, మంత్రి
ముఖ్యులనందఱరావించి, స్వప్నవృత్తాంతంబుం దెలియఁజేయ, వారెల్లరును,

సంతోషించి, "ఓరాజా! యీకార్యంబవశ్యాచరణీయంబు, శీఘ్రంబుగ కర్త
వ్యంబు. ఈరాజపుత్రు వృత్తాంతంబును, దొల్లి దక్షిణదేశ యాత్రలకై వెళ్ళి
వచ్చిన మాపెద్దలెఱుంగుదురు, వీరివంశంబు మహాగౌరవభాజనంబు, శూర
తానిధానంబు, పరమేశ్వరు ననుగ్రహంబున మనకీసంబంధంబు ఘటిల్లించుచు
న్నదిగాని, వేఱొండుగాదు. సంకోచింపక, పుత్రికనిచ్చి రాజపుత్రునకు వివా
హంబుసేయుము" అని విన్నవించెనయ్యెడ॥ 108

చ॥ సకల జనానుమోదముగ, సాంద్రరుచిన్ శుభకార్య మయ్యెడన్
సుకరముగా నొనర్చుటకు, సొంపుదలిర్పఁ దలంచి వెంటనే
యొక ధరణీసురోత్తముని, నొప్పుగఁబంపిరి లక్ష్మిచెంతకున్
బ్రకటితపాణిపీడనపు, వార్తనెఱుంగఁగఁజేయ నెమ్మితోన్॥ 109

రాజు తనపుత్రికను సదాశివునకిచ్చెదనని తెలుపుట.

గీ॥ శుభముహూర్తంబు నార్యులు, సుస్థిరముగ।
మోదమలరంగనియమించి, ముఖ్యముగను
వ్రాసియిచ్చినశుభలేఖఁబట్టుకొనుచు
భూసురోత్తముఁడరిగె, నప్పుడుశుభముగ॥ 110

గీ॥ సరసిజాక్షుండు సంస్థానశాలయందుఁ। బటిమ చెన్నారఁగూర్చుండి, ప్రబలముగను
నిజహృదుల్లాసమగ్నత, నెగడియుండు। సమయమందునవిప్రుండు, సరసకేఁగె॥

గీ॥ అమ్మహారాజబాలుఁడో, నవనివిభుఁడు। వచ్చియున్నట్టిద్విజుఁగాంచి, ప్రతిభ మెఱయ
మోమునందునఁజిఱునవ్వు, మొలకలెత్తఁ। గుశలవార్తలనడుగుచుఁగూరుచుండి

గీ॥ బ్రాహ్మణుండిచ్చుశుభలేఖ, ప్రభునకపుడు।
సంతసముఁగూర్చె మానస, సారసమున
దానిఁదిలకించి బాలుండు, దైవకృపకుఁ
దనరియుండెనుమిగులఁ గృ, తజ్ఞుఁడగుచు॥ 112

వ॥ ఇట్లుపార్థివతనయుండు, సంతుష్టచిత్తుండై, బ్రాహ్మణుంజూచి యిట్లనియె॥ 118

క॥ శంకరుదయచేత నిరా। తంకముగా సకలశుభవి, ధానము వెలయన్
బంకజముఖి నిచ్చెదనని। కొంకక రాజిపుడు వార్త గొప్పగఁ దెలుపన్॥ 114

క॥ శుభలేఖ వ్రాసినాఁడని। రభసంబునఁదనదు దాసి, రాఁజేరిమహా
ప్రభతోఁడఁజెప్పెనాతం। డభిముఖుఁడై యాత్మహర్షమట్టుమీఱఁగన్॥ 115

ఆ॥ ఓసి యీవిచిత్రమూహింపనేమాను। దొల్లినీకు రాజధూర్వహుండు
కన్యనీనటంచు; గద్దించిచెప్పియుఁ। దిరిగి మనసునెట్లు ద్రిప్పుకొనెనో॥ 116

మ॥ అనుచుర్ బాలుఁడు లక్ష్మితోఁ దెలుపఁగా, హర్షాతిరేకంబునన్
వనజాక్షుంగని దాసియిట్లనియెఁద, ద్వార్తావిధానస్థితిన్
మనముక్కంటికృపన్ ధరావరుఁడు సన్మానంబుగాఁబుత్రి నీ
కనుప్రెప్పంగ నొసంగనెంచె నిజమోయయ్యా యిటానెంచఁగాన్॥ 117

క॥ ఈభూసురుచేఁబంపెను। శోభనమగువార్తరాజు, సురచిరబుద్ధిన్
నీభావంబలరారఁగ। నోభువనఖ్యాతబుద్ధి, యూహింపఁగన్॥ 118

వ॥ అనినవిని యారాజబాలుండు, తనప్రియతాపాత్రంబగు లక్ష్మికనుమతంబుగా నాభూసురోత్తమునకు, భోజన భాజనాది గౌరవంబాచరించి, తాంబూలాదులమన్ననంజూపి, యాశుభలేఖార్థంబులకు సంతసించి, యాయనకు గమనానుజ్ఞ నిచ్చుసమయంబున, నాపాఱునింగాంచి, దాసీవతంసంబగులక్ష్మి "యో భూసురోత్తమా! మారాజబాలునకు, సర్వైశ్వర్యప్రదాత లీయుమామహేశ్వరులేగావున, నీవివాహంబు నిర్దేవళంబునందే చేయనిష్టంబు, ఈవార్తమ రాజునకెఱింగింపుమనిన యనంతరంబున॥ 119

మ॥ పరమానందముతోడ నయ్యువతిత, ద్బాలోత్తముంజూచి యీ
తఱిలో శంకరుకన్న లేరు మనకున్, దాయాదులెవ్వారు నీ
పురిలోఁజూడఁగఁ గానమీయెడల శంభున్నమ్మియుండంగ సు
స్థిరతన్ గార్యముఁ జక్కఁజేయుసతఁడున్, శీఘ్రంబుగానిప్పుడున్॥ 120

వ॥ ఇట్లు పేరొంచుకొనుచుండ, నాబ్రాహ్మణోత్తముండు రాజుసన్నిధికింజని,సర్వవృత్తాంతంబు నివేదించి, బహూకృతుండై వెడలిన యనంతరంబున॥ 121

గీ॥ పెండ్లిపనులన్నియును జేయఁ, బృథ్వివరుఁడు
వలయువస్తువులన్నియుఁబంపెనపుడు
మనసుగుదిరినమీఁదట మహిపతులకు
నెందును గొఱంతగఁనుగునే, యెంచిచూడ॥ 122

చ॥ సచివునిఁజేరి భూవిభుఁడు, సారసనేత్రను బాలికామణిన్
శుచిగుణుఁడైన యాంధ్రపతి, సూనునకిచ్చి వివాహకార్యమున్
బ్రచురముగాను జేయ సదు, పాయము నేను దలంచియుంటి నీ
యచల సువార్తలోకులకు, నందఱకుం దెలియంగఁజేయుమీ॥ 1"3

వ॥ అని మఱియు నిట్లనియె॥ 124

మ॥ పురవాసుల్ సరసాంకచిహ్నములతోఁ బూర్ణప్రమోదంబుతో
నిరవందన్ ఘనరుద్యగేహచయముల్, హేలాలవాలంబుగా

సరసోల్లాసము సంఘటించునటులన్, సాంద్రంబుగాఁ జేయఁగా
స్థిరమౌనాజ్ఞను జేయుచున్న సచివ, శ్రేష్ఠుండు మేటౌ నరా॥ 125

మ॥ అపుడామంత్రి సమస్తపౌరజనులన్, హర్షంబుతోఁ బిల్చి యీ
నృపుసత్పుత్రికి పెండ్లికాపునను, సాధింపార భూపాలుఁడున్
నిపుణత్వంబున వేగమే నిజగృహా నింద్యప్రభాలంకృతుల్
విపులోల్లాసముతోడఁ జేయుఁడని తా, ల్పెన్ నాకుమీఁగున్ వినన్॥ 126

వ॥ అని మంత్రిపుంగవుండీప్రకారంబుగా, నఖిలపురసౌధాదుల నలంకరింపఁ బుర
జనులకాజ్ఞాపించి, కొందఱ వధూవరాలంకరణంబులనియమించి, రాజాజ్ఞచే
బంధుగణంబులరావింప, విప్రోత్తములఁబంప, వారలేతత్సంగతివిని, సంతు
ష్టాంతరంగులై పరిణయార్థంబరుగుదెంచి రనంతరంబ॥ 127

సీ॥ రచ్చలువీథులు, రాజమార్గంబులు, శోధనచేయించి, శుభ్రముగను
బచ్చనితోరణాల్, బాగుగాఁగట్టించి, రంగవల్లులు దిద్ది, రంగితముగ
సౌధప్రాకారాది, సకలస్థలములకును, సున్నముల్ గొట్టించి సొగసుగాను
జేగురుల్ దీర్పించి, చిత్రచిత్రంబుగాఁ, బందిళ్ళువేయించి యందముగను

గీ॥ నగరమెల్ల నలంకర, ణంబుచేత। స్వర్గమును ధిక్కరించెడి, సొరుగాంచె
రాజసుత పెండ్లియనఁ బురి, రాజవదన। సకలసౌభాగ్యమంది ప్రశస్తిఁ గనెను॥

క॥ ఇరువంకల బుధులందఱు। నిరుపుగమృదుభాషణముల, నింపుగ నృపుతోఁ
బరశివుసన్నిధియందునఁ। బరిణయమును జేయుమనిరి, పరిపరి విధులన్॥ 129

చ॥ బుధజనులందఱామెడలఁ, బొందుగఁ దెల్పఁగఁ సంతసంబునన్
మధురిపుసేవకోత్తముఁడు, మాన్యముగావిని వారిమాటల
త్యధిక సుపూజ్యతన్ బరిణ, యంబును శంకరు దేవళంబునన్
విధి నియతిన్ బొనర్చునెడ, వేల్పులుమెత్తురు మేల్పొసంగెడున్॥ 130

మ॥ అని యాభూపతి నిశ్చయించుకొని దా, యాదుల్ తదన్యుల్ మహా
ఘనులౌ మిత్రులు వచ్చియుండగ సుతా కళ్యాణమెంతో జగిన్
మనముప్పొంగఁగఁ జేయ నెంచె నటులే, మంజుప్రభన్ వెల్గుచుం
డెను సన్నాహము రెండుచోట్ల సమదృష్టిన్ నిల్పఁగా నత్తఱిన్॥ 131

క॥ పరిణయ కార్యోద్యోగము। సరసముగాఁ బెద్దలపుడు, సమకూర్పంగాఁ
బరమేశ్వరు కృపచేతను। గరమున్ భాసిల్లుచుండె, గుమ్మవరు గృహమున్॥

మ॥ ఇరుపార్శ్వంబులనుండునార్యులు మహా, హేలన్ వివాహంబు సు
స్థిర శక్తింబటుదీప్తిఁ జేయ, బహుళ, శ్రీయుక్తి నెంతో కళా

కరమై వేల్పుల మెచ్చఁజేసె సురసం, ఘుంబప్డు సంతుష్టిచేఁ
గురిపించెన్ సుమవృష్టి సర్వజనముల్, కోర్కెన్ బ్రశంసింపఁగన్॥ 133

క॥ మురువుగ నటనుండు వధూ। వరు లతిసుందరతఁగాంచి, నైవాహిక శో
భరహింబొందిరి పదుగురు। పరితోషంబందఁ బెండ్లి, వల్లాలచేతన్॥ 134

వ॥ అప్పుడా ప్రేమ్యారత్నంబు, తత్పరిణయకాలంబున, వివాహకన్యకు, సము
చితాలంకార నికరంబు సమర్పింప, నత్తటి నారామభూపాలుండు, తత్పట్టణ
పశ్చిమభాగసీమయును, గజ హయోష్ట్ర గోకులాదికంబును, సమస్త మణి
స్తోమంబును, జామాతకిచ్చి, యేతచ్ఛుభకార్యాగత సమస్తభూసురాద్యుత్త
మకోటికి, బహుమతులొసంగి, స్వకీయ పరకీయ భృత్యనిచయంబులకు, నను
పగుహసదనంబు లిచ్చియుండిరంతట॥ 135

గీ॥ బంధుమిత్రాదులందఱు, పరమమోద, మొనయఁబరిణయమును దామ, మునసుదీఱఁ
జూచి యుత్సాహమందిరిచోద్యములను గరము విలసిల్లు కన్నుల, కఱవుదీఱ॥

గీ॥ పరిణయంబున కేగిన, బంధుమిత్రులెల్లఁ దమతమయుత్సాహమినుమడింప
నేగిరంతటఁ దమతమ, యిరవులకును బరమసంతోషమగ్నులై భవ్యమతుల॥

సీ॥ ఆనవధూవరులుని, త్యానందమూర్తులై, చంద్రికాచంద్రప్రశస్తిఁగాంచి
హృదయమనోరథ, హేలానివాసులై, నిరుపమశోభచే, నెగడుచుండి,
కొంత కాలము దాఁకఁ గౌమరారు కాంక్షల, మెఱయుచునటుమీఁద, మృదులవృత్తి
నతికుతూహలమంది, యానుమసాయకు, కేళులఁదమమదిఁ గీలుకొలిపి

తే॥ పొంగురంగారు సుకావన, భోగమునకు, ననుపమఫలంబనఁగఁ జెల్లునట్టిగోష్ఠ్య,
కృత్యములనారితేతిఱ యెం, తేఁ ప్రసిద్ధ వర్తనలమించియుండిర, వ్వారిగాఁగ॥ 138

క॥ ఈ రీతిఁగొంత కాలము, వారేపుసమిథునకృత్య, వాంఛాయుతులై
సారోదారతమెలఁగుచు, నారూఢింగనిరి కాల, యాపనవిధులన్॥ 139

సదాశివునకు మల్లికార్జునుఁడను పుత్రుఁడుకలుగుట.

క॥ అలదంపతులిరువురకున్ లలితాకృతిమెఱయుభవ్యలక్షణుఁడును వి
స్తులభోగశాలియగు సుతతిలకుండుదయించె దివ్య, ధీవిలసనుఁడై॥ 140

ఆ॥ అతనిపేరు మల్లికార్జునుఁడందురు మల్లికార్జునాంఘ్రి, మలయునట్టి
చిత్తవృత్తిగల్గి, చెల్వొందువాఁడౌట, నఖిలబుధులుతత్త్వ, మరసియరసి॥ 141

సీ॥ ఆమహామహునకు, నాచావఝారింటి, పుత్రికనిడి పెండ్లిపొల్పుగాను,
జేయంగ వారికి, శ్రీమంతులైనట్టి నలువురుపుత్రులు, న్యాయ్యవిధులు

శ్రీశైలపతియును, శ్రీమల్లికార్జునుం, డిరువురు తమ్ములహీనగుణులు
ఘనసదాశివుండును, గంగాధరుండును, బుట్టిరివారలు, పొల్పుమీఱ,

తే॥ భువినిసత్కీర్తివడసిరి పొందుగాను
నైభవోన్నతిఁజెన్నొంది వసుధయందుఁ
బ్రబలశౌర్యప్రభాఢ్యులై, భవ్యరుచిని
భుజబలవిహారులై చాలఁ, బొలిచిరపుడు॥ 142

వ॥ అమ్మహోద్దాములయిన సోదరులలో, జ్యేష్ఠుండగు శ్రీశైలపతికిఁ, గట్టావారి ప్రియపుత్రికయగు, శ్యామలాంబనిచ్చి, పరిణయంబుఁజేసిరి. ఆయనసహోదరులలో మల్లికార్జునుండును, గంగాధరుండును, బరిణయాపూర్వంబునన, మృతులైరి. తృతీయుండగు సదాశివునకు, మల్లికార్జునుండును, ఆయనకు వీరరాఘవుండును, ఆయనకు లింగమనీఁడును, ఆయనకు వీరపనీఁడు, మల్లినీఁడు, మాదినీఁడు, బొజ్జనీఁడునను, నలువురుపుత్రులుపుట్టిరి. తత్సోదరులలో ద్వితీయచతుర్థులకు, సంతానంబు లేకపోయె. వారిలో జ్యేష్ఠుండగు వీరపనీనికి సింగమనీఁడు, లింగమనీఁడు, మాదినీఁడు, మూలమనీఁడు, నని నల్వురు వంశపావనులుకల్గిరి. వారలలోఁ దృతీయచతుర్థులకు సంతులేదయ్యె. జ్యేష్ఠుండగు సింగమనీఁడు, శేకూరుపురంబునను, ద్వితీయుండగు లింగమనీఁడు,కంతేరు పురంబుననుండి, యాయాగ్రామాదుల గౌరవంబబ్బి, యచ్చటనభివృద్ధిఁబొందిరి. వీరపనీని ద్వితీయసోదరుండగు, మాదినీఁడు, ఆత్మకూరు నిడమర్రుమొదలుకుఁ, జౌదరియైయుండె ననంతరంబు॥ 143

సీ॥ మల్లికార్జునునకు, మఱిజ్యేష్ఠపుత్రుఁడౌ, శ్రీశైలపతికిని, స్థిరయశుండు
వేంకటాద్రియనంగ, వీరాగ్రగణ్యుండు, నావిర్భవించె నీ,యవనియందు,
నాతంఁడుకాంచె భవ్యదగుణోపేతుల, శౌర్యసాహసకృత్యసాంద్రమతుల,
గంగినీఁడనఁగను,ఘనుఁడు మాదన వెంకటాద్రులు గురవనయనెడిఘనుల

తే॥ నట్టివారల, సహజుండ, హీనయశుఁడు
ఘనుఁడు వీరపనీఁడను, కంజనయనుఁ
డనఁగఁబ్రబలెనుభువియందు, వినుతికెక్కి
నిరుపమోత్సాహవిభ్రమ, నేతయగుచు॥ 144

వ॥ ఆసోదరులైదుగురధికబలపరాక్రమాఢ్యులై, గంగినీఁడు మోవులూరుపురంబునను, మాదన్న తాడిగుమ్మపత్తనంబునను, వెంకటాద్రి పల్లగిరి నగరంబునను, గురవన్న పోపూరుగ్రామంబునను, వీరపనీఁడు నందిగామపేటను నివసించి

యాయాఖండములకుఁ బ్రభువులయియుండిరి. మఱియు నాయానగరంబుల నుండువారి, యన్వవాయక్రమం బెట్టిదనిన॥ 145

శేకూరు కుదుటి లింగమనీని వంశానుక్రమణిక.

క॥ శ్రీసింగమనీఁడు సదా। శ్రీసాంబుని నామమాత్మ, శ్రేయంబలరన్
దాసంస్మరించుచుండును। వాసింగను మోక్షపదవి, వచ్చునపేక్షన్॥ 146

సీ॥ అట్టిసింగమనీనికి, నాత్మజాతు।
లిరువురుదయించి రతిసుకృతేచ్ఛులగుచు
నందు జ్యేష్ఠుండు నారసిం, హాఖ్యుఁబరఁగు
నతనితమ్ముండు భాస్కరా, ఖ్యాతుఁడలరు॥ 147

వ॥ తత్సోదరులలో ద్వితీయుండగు భాస్కరనాయనికి, సంతానంబు లేదయ్యె, జ్యేష్ఠుండగు నారసింహునకుఁజినసింగమనీఁడును, రంగప్పయు, విశ్వనాథుఁడును, వేంకటాద్రియు, ముకుందుండు నను నైదుగురుసుపుత్రులుపుట్టిరి. అందుఁ జినసింగమనీనికి నారసింహుండు, బాపినీఁడు, చినసింగమనీఁడను ముగ్వురు పుత్రులుగలిగిరి. అందు జ్యేష్ఠుండగు నారసింహుండు, సింగమనీఁడు, పెదకన్న, చినకన్న, పద్మనాభుఁడు, మూలప్పయను, నలువురుకుమారులనుగాంచె. నందుసింగమనీఁడును, బెదకన్నయుసంతానహీనులైరి. తృతీయుండగుచినకన్నకుఁదిరుపతన్నయు, నాయనకుమాదన్నయు, నాయనకు గోపన్న, సింగమనీఁడునను నిద్దరుకుమారులుకలిగిరి. అందుగోపన్నకుసక్కన్నపుట్టె. ఆతనికిసంతు లేదయ్యె. ఆయనతమ్ముండగుసింగమనీనికి బాపయ్యయు, నాయనకుఁబిచ్చయ్య, కోటయ్య, వెఱ్ఱెయ్యలనుముగ్గురుకుమారులు గలిగిరి. అందు జ్యేష్ఠునకు మాదయ్య, ద్వితీయునకు హనుమయ్య, లింగయ్య, నాగయ్యలను ముగ్గురుకుమారులు గలిగిరి. ఆకోటయ్య కనిష్ఠసోదరుండైన వెఱ్ఱెయ్యకు సంతు లేదయ్యె. నారసింహునకుఁ జతుర్థపుత్రుండగు పద్మనాభుఁడు సంతానహీనుండయ్యె. పంచమపుత్రుండగు మూలప్ప, నారసింహుని ద్వితీయసోదరుండగు పెదబాపినీనికి దత్తపుత్రుండయ్యె. ఆమూలప్పకు జోగన్న, పీరన్నలను నిర్వురు కుమారులుకల్గి, యనపత్యులైరి. నారసింహునకుఁ దృతీయభ్రాతయగు చినబాపినీనికి, వెంకన్న రమణప్పలను నిద్దఱుకుమారులు కల్గిరి. అందు వెంకన్నకుఁ దిరుపతన్న, పాపన్నలను నిరువురు జన్మించిరి. వెంకన్న ద్వితీయసోదరుండగు రమణప్పకుఁ బెదపీరన్న, చినపీరన్న, నరసన్నలను ముగ్వురాత్మజులుద్భవించిరి॥ 148

గీ॥ నారసింహుని సహజుండు ధీరమూర్తి। సుగుణశీలుండు రంగప్ప సుందరాంగ
డంచితార్యమహోల్లాససంచయుండు। కీర్తి చేయించె జనులెల్లఁ గనిపొగడ॥ 149

సీ॥ ఆపుణ్యమూర్తికి, నతిసుందరాంగులు పుట్టిరి నల్వురు పొందుగాను
వారిలో జ్యేష్ఠుండు, వరగుణానందుండు లింగమనీఁడను నంగవిరతి
మాదన్న యనువాఁడు మహనీయుఁడాయన సుగుణసంపత్తిచే సొంపు మీఱ
రఘునాయకుండను రాజవర్యుండొప్పె బాహుగర్వమునఁ బ్రబలుఁగాను

గీ॥ విశ్వనాథుఁడు సువ్రత విధిహితుఁడనఁ। బరఁగి రయ్యెడ బహుకీర్తి పాలిలంగ
వంశపావనులోయన వసుధయందు। నిహపరంబుల కన్వాలె నేపుమీఱ॥ 150

ఉ॥ లింగమనీనికిన్, ఘనబలి ప్రతిభాఢ్యులు, గల్గిరిద్దరం
రంగుగ వెంకయాఖ్యుఁడును, రంజిలె వేంకటకృష్ణుఁడో యనం
బంగరు రంగశాయియన, భవ్యయశుండగు మాదయాఖ్యుఁడున్
సంగరశీలురాముపురు, సారవయస్కులు పుత్రవంతులున్॥ 151

వ॥ ఆసోదర త్రయంబున నగ్రజుండగు వేంకయాఖ్యునకు లింగన్న, వీరన్న, రామకృష్ణమ్మలను, నలువురు పుత్రులు పుట్టిరి. అందు జ్యేష్ఠుండగు లింగన్నకు నరసన్న, ఆయనకు సూరన్న, వీరన్న, వెంకన్న మాదన్నలను నలువురు పుట్టిరి. అందు జ్యేష్ఠుల కిరువురకు సంతు లేదయ్యె. తృతీయుండగు వెంకన్నకు సూరయ్యాయు, నాయనకుఁ గృష్ణయ్య, సుబ్బయ్యలను నిరువురు కుమారులు కలిగిరి. అందు నరసన్న చతుర్థపుత్రుండగు మాదన్నకు వెంకయ్య, వెంకటప్పయ్య, నరసయ్యలను ముప్వురు పుత్రులు కలిగిరి. అందు జ్యేష్ఠునకు మల్లయ్య, సీతారామయ్యలను నిరువురు కుమారులు కల్గిరి. వెంకయ్య సోదరుండగు వెంకటప్పయ్యకు, సీతారామయ్య పుట్టె. ఆ వెంకటప్పయ్య తమ్ముఁడు నరసయ్యకు, సంతానప్రాప్తి లేదయ్యె. వెంకన్న జ్యేష్ఠ పుత్రుండగు లింగన్న తమ్ముఁడు వీరన్నకు, పుల్లన్న, వీరన్నలను కుమారులు కలిగిరి. ఆ వెంకయ్య ద్వితీయపుత్రుఁడు రామన్నకు, బాలకృష్ణుఁడు వెంకయ్యయను నిరువురు వంశపావను లుద్భవించిరి॥ 152

సీ॥ ఆబాలకృష్ణున, కార్వురు పుత్రకు, లుదయించిరిద్ధర, నొప్పుగాను
వీరన్న యను మహావిపుల వక్షశ్శాలి, మాదన్న యను మృదు, మార్గగామి
వెంకన్న యనువాఁడు, వేదాంతకుశలుండు, శివన్న యనువాఁడు, స్థిరయశుండు
సుబ్బయాభిఖ్యుండు, సుందరాకారుండు, సోమన్న యనువాఁడు, శూరమూర్తి

తే॥ యుద్భవిల్లిరి వారలత్యుగ్రగతిని। సకలసుగుణాంబురాసులై, సరసముగను

దీనరక్షణబుద్ధిచే దివ్యసుతులు। ప్రజ్వరిల్లిరి భూమిపైఁ, బ్రాభవమున॥ 153

గీ॥ బాలకృష్ణుని జ్యేష్ఠుఁడౌ, బలయశుఁడు వీరయాహ్వయునకుఁ గల్గె, వేడుకలర
సుగుణశీలురు నలుగురు, సుందరాంగు।లరయ నతిధర్మవర్తనులనఁగఁ బరఁగి॥

వ॥ ఆవీరయాహ్వయునకు, జ్యేష్ఠుండగు రామయ్య, హనుమయ్య, లింగయ్య, నాగయ్య యను నలుగురిలో, జ్యేష్ఠద్వితీయ చతుర్థులకు సంతానంబు లేదయ్యె. తృతీయుండగు లింగయ్యకు నాగయ్య పుట్టె. ఆయన తాత బాలకృష్ణుని ద్వితీయ పుత్రుండగు మాదన్నకు, సంతతి లేకపోయె. ఆయన తమ్ముఁడు వెంకయ్యకు నాగయ్య, ఆయనకు వెంకటసుబ్బయ్య, వారల నాలవపినతండ్రి శివన్నకు గుమారులు లేరైరి. ఆయనతమ్ముఁడు సుబ్బయ్యకు నాగయ్య వెంకయ్య యను నిర్వురు కల్గిరి. వారల జనకుని సోదరుఁడగు సోమయ్యకుఁ గోటయ్య పుట్టె. ఆబాలకృష్ణుని ద్వితీయ సోదరుఁడైన వెంకన్నకు నాగయ్య కల్గిసంతానహీనుండయ్యె. ఆబాలకృష్ణునితండ్రి రామన్నకుఁ జతుర్థ సోదరుఁడైన కృష్ణమ్మకు లింగయ్య మాదన్న సోమన్న వెంకన్న నాగన్నలను నైదుగురు కుమారు లావిర్భవించిరి. అందు లింగన్న మాదన్నలను వారలకుఁ బుత్రులు లేరైరి. వారల తృతీయభ్రాతయగు సోమన్నకు శివరామయ్య వీరయ్య లింగయ్యలను మువ్వురు కుమారులు కల్గిరి. అందు జ్యేష్ఠుఁడగు శివరామయ్యకు నాగయ్య సుబ్బయ్య రామలింగయ్యలను పుత్రులు కల్గిరి. అందు నాగయ్యకు శివరామయ్య, రామయ్యలను నిద్దఱు కుమారులు కలిగిరి. ఆనాగయ్య తమ్ముఁడు సుబ్బయ్యకు సోమయ్య, ఆసోమయ్య తాత శివరామయ్య తమ్ముఁడు వీరయ్యకు రామలింగయ్య వెంకయ్యలను నిర్వురు కుమారులుపుట్టిరి, అందు రామలింగయ్యకు వీరయ్య శివరామయ్యయును, కుమారులైరి. ఆవీరయ్య తాతయగు వీరయ్య తమ్ముఁడు లింగయ్యకుఁ గుమారులు లేరైరి. లింగయ్య తండ్రి సోమన్న సోదరుఁడు వెంకన్నకు వీరయ్య పుట్టె. ఆవీరయ్యకు హనుమయ్య పుట్టె. వారితాత వెంకన్నకుఁ బంచమభ్రాతయైన నాగన్నకు మాదయ్య సంగయ్యలను నిరువురు కుమారులు పుట్టిరి. ఆమాదయ్య ప్రపితామహుండగు వెంకన్నకు ద్వితీయభ్రాతయగు వెంకట కృష్ణునకు నలువురుసుపుత్రులు పుట్టిరి. 155

సీ॥ వారన్నదమ్ములు, వైభవోన్నతితోడ, వర్ధిల్లుచుండిరి, వసుధయందుఁ
దద్భ్రాతృచయములోఁ, దగ జ్యేష్ఠుఁడైనట్టి, సంజీవరాయఁడౌ, సమరసుందు

నాగయాభిఖ్యుండు, నయగుణోపేంద్రుండు, రామన్న యనుసుధీ, రాజనరుఁడు
వంశపావనులన, వసుధయందొప్పిరి, శివభక్తులైయుండి, స్థిరవిభూతి

తే॥ నిట్టివారన్నదమ్ములు, నేపురిలోఁ బరమసద్భక్తి నెన్నుఁ దిరి, భవ్యగుణచిం
సత్యమేనిక్కమనివారు, సాంద్రముగ నునన్నియుండిరిసుజనులౌ, సరసముఖులను॥

వ॥ ఆసంజీవరాయనికి, శివయ్య, వీరయ్యలను నిరుపుగురుకుమారులు పుట్టిరి. అందు శివయ్యకు మాదయ్య, వీరయ్యలును, కలిగిరి. ఆమాదయ్యకు వెంకయ్య సుబ్బయ్య, సంజీవరాయండునను ముప్వురు పుత్రులు గల్గిరి. అందు వెంకయ్యకు, రామయ్య, లక్ష్మీపతి, యను నిరువురుపుట్టిరి. ఆవెంకయ్యతమ్ముఁడు సుబ్బయ్యకు నాగయ్య, వెంకట్రామయ్యలను నిరువురుపుత్రులు జన్మించిరి. ఆసుబ్బయ్యసహజుండు సంజీవరాయనికి వెంకయ్య, లక్ష్మయ్య, నాగయ్యలను ముప్వురుద్భవించి, వీరవల్లిపాటిపురంబుననుండిరి. ఆసంజీవరాయనితండ్రి తమ్ముఁడు వీరయ్యకు, రామయ్య, సోమయ్య, వెంకయ్య, నాగయ్య, శివయ్యలను నైదుగురుపుత్రులుపుట్టిరి. అందు రామయ్యకు, నాగయ్య, పిచ్చయ్యయును, గుమారులైరి. వీరలతాత తమ్ముఁడు సోమయ్యకు నాగయ్యపుట్టె. ఆయనజనకునిసోదరుఁడు వెంకయ్యకు సంజీవరాయఁడు వెంకటప్పయ్యయను సిద్ధఋపుత్రులావిర్భవించిరి. వారలతండ్రి తమ్ముఁడు నాగయ్యకు సంతానము లేదయ్యె. ఆయనసోదరుఁడు శివయ్యకుఁ గృష్ణయ్య, వీరయ్య, వెంకట్రామయ్య, శ్రీరామయ్యలను నలుగురు కలిగిరి. వారల ముత్తాత శివయ్య తమ్ముఁడు వీరయ్యకు వెంకయ్య నాగయ్యలను నిరువురుపుట్టిరి. అందు వెంకయ్యకు సంతానంబు లేదయ్యె. ఆయనతమ్ముఁడు నాగయ్య సుగుణగణనీయుండై సత్కీర్తిచే నతిశయించి, నరసయ్య, రామయ్య, లక్ష్మీపతి, పిచ్చయ్య, వెట్టెయ్య, సూర్యనారాయణలను నార్వురుపుత్రులంగనె. అందు నరసయ్యకు వీరయ్య, వెంకట్రామయ్య, సీతారామయ్య, నాగయ్యలను, నలుగురు పుత్రులుకలిగిరి. అందు వీరయ్య సంతానహీనుండయ్యె. ఆయనతమ్ముఁడు వెంకట్రామయ్యకు, సూర్యనారాయణవరప్రసాదనాయఁడు, మల్లికార్జుననాయఁడు నను నిరువురుపుట్టిరి. వారలతాతతమ్ముఁడు రామయ్య సంతానహీనుండయ్యె. ఆయనతమ్ముఁడు లక్ష్మీపతికి, నారాయణ వెంకటసుబ్బయ్యలను వారు కలిగిరి. వారలతండ్రితమ్ముఁడు పిచ్చయ్యకు సంతులేదయ్యె. ఆయనతమ్ముఁడు వెట్టెయ్యకు నాగయ్యయనుకుమారుండుగలిగె. ఆయనపినతండ్రి సూర్యనారాయణకు నాగయ్యపుట్టె. ఆయన నాలవతాత సంజీవరాయనితమ్ముఁడు

నాగన్నకు, రామన్న, వీరన్న, సుబ్బన్నలను ముప్వురుపుత్రులుపుట్టిరి. వారిలో జ్యేష్ఠునకు సంతులేకపోయె. ఆయనతమ్ముఁడు వీరన్నకు, వెంకయ్యపుట్టె. ఆయనకుఁ జినవెంకయ్యపుట్టె. ఆయనకుఁ గోటయ్య, చినకోటయ్యయను నిరువురుపుట్టిరి. వారల మూఁడవతాతయగు వీరన్నతమ్ముఁడు సుబ్బన్నకు మాదయ్య, రామయ్య, నాగయ్య, వీరయ్య, నరసయ్య యను నైదుగురాత్మజులు కలిగిరి. అందుఁ బ్రథమ,తృతీయ, చతుర్థులకు సంతులేకపోయె. ఆసోదరులలో రెండవవాఁడు రామయ్యకుఁ గుటుంబయ్యపుట్టె. ఆయన మహాదేవపురంబునందుండెను. ఆయనతండ్రికి మూఁడవతమ్ముఁడు నరసయ్యకు, లింగయ్యగలిగె. ఆయనతాతతమ్ముఁడు రామన్నకు సంతులేదయ్యె. ఆరామన్నతండ్రియగు వెంకటకృష్ణుని తమ్ముఁడు మాదన్నకు, వీరన్నకలిగె. ఆయనకుఁ జినవీరన్నపుట్టె. ఆయనకు, పుల్లయ్యపుట్టె ఆయనకు మాదయ్యకలిగె. ఆయనకు రామయ్య భద్రయ్యలను నిరువురు పుత్రులుపుట్టి, వారలు వీర్లపాటియందుండిరి. వారల యాఱవతాత లింగన్నతమ్ముఁడు మాదన్నకు, వీరయ్య, అచ్చన్న, యను నిద్దఱుపుట్టిరి॥ 157

గీ॥ వీరయాఖ్యునిపుత్రుఁడై, వీరవర్యుఁ
డతులగుణశీలుఁడుత్తముఁడనఁగఁబరఁగె
నతనిసహజుండు వీరయా, హ్వాయుఁడనఁగ
నంచితోల్లాసుఁడై యుండె, ననుగుణముగ॥ 158

వ॥ ఆయన తండ్రితమ్ముఁడు, అచ్చన్నకు నర్సయ్య, చల్లయ్యయను నిద్దఱుకుమారులు కలిగిరి. వారల ప్రపితామహుండగు మాదన్న భ్రాత రఘునాయకులకు, మాదన్నపుట్టెను ఆయనపినతండ్రి విశ్వనాథుఁడుసంతానహీనుఁడయ్యె. ఆవిశ్వనాథునితండ్రి రంగప్ప తమ్ముఁడు, విశ్వనాథునకు, మాదన్న, నారసింహుఁడు, కృష్ణమ్మ యను ముగ్గురు కుమారులుదయించిరి. అందు మాదన్నకుఁ గాశీపతిపుట్టె. ఆయన సంతానహీనుఁడయ్యె. ఆయన పినతండ్రినారసింహునకు లింగన్నపుట్టి,పదియాఱవవర్షంబుననే,మరణించె. ఆయన పినతండ్రి కృష్ణమ్మకు, అక్కన్నపుట్టె. ఆయనకు మహాదేవుఁడు, నరసన్న, సోమన్న, శివన్నలను నలువురుపుత్రులావిర్భవించిరి.అందు మహాదేవునకు నరసన్నపుట్టె. ఆయనపినతండ్రి నరసన్నకు మాదన్నపుట్టె, ఆయనపినతండ్రులిరువురు సంతానహీనులైరి. వారి మూఁడవతాత విశ్వనాథునితమ్ముఁడు వెంకటాద్రి. రామలింగన్న, సింగన్న, నారసింహుఁడు, యల్లప్ప యను నల్వురు పుత్రులంగనె.

అందు రామలింగన్నకు రాజలింగముపుట్టె. ఆయనకుఁ జంద్రమౌళి, లింగన్నలనువారు పుట్టిరి. అందు జ్యేష్ఠునకు సంతులేదు. సింగన్నకు లక్ష్మయ్య పుట్టె. ఆయనకు హనుమయ్య జనించి బలుకూరులోనుండెను. ఆయన ముత్తాత తమ్ముఁడు మహాదేవునకు మల్లన్నపుట్టె. ఆయనకు విస్సన్న, రామన్న మాదన్న, లింగన్న, వెంకయ్య యను నైదుగురు పుత్రులవతరించిరి. వారలతాత తమ్ముఁడు వెంకన్నకు సంతులేకపోయెను.

ఆయనపినతండ్రి సింగన్నకు మాదన్నపుట్టె. ఆయనకు మల్లన్నపుట్టె. ఆయనకు వీరన్నకలిగె. ఆయనకు నరసన్నజనించె. ఆయనతాతతమ్ముఁడు నారసింహునకు మాదన్న పద్మనాభుఁడు నను నిరువురుపుత్రులు గలిగిరి. అందు మాదన్నకుఁ జినమాదన్న జన్మించె. ఆయనకు మల్లన్న, సింగన్న, సోమన్న, మాదన్నలను నలుగురుపుత్రు లుద్భవించిరి. అందు మల్లన్నకు సుబ్బన్న విశ్వన్న యను నిద్దఱుపుత్రులుకల్గిరి. వారలతండ్రి తమ్ములు సింగన్న, సోమన్న, సంతానహీనులయిరి. వారలతమ్ముఁడు మాదన్నకు నరసన్న సోమన్న యను నిద్దఱుపుత్రులుపుట్టిరి. వారలతాతతమ్ముఁడు పాపన్న వంశాంకురహీనుఁడయ్యె. ఆయనతాతతమ్ముఁడు పద్మనాభునికి రమణప్ప లింగన్న, వీరన్నలను ముగ్గురుపుత్రులుగల్గిరి. అందు రమణప్పకు మల్లన్నపుట్టె. ఆయనపినతండ్రి లింగన్నకు మాదన్న, సోమన్న, నాగన్నలనుకుమారులుకల్గిరి. వారల జనకునితమ్ముఁడు వీరన్నకు నారసింహుఁడుపుట్టె. ఆయనతాతతమ్ముఁడు యల్లప్పకు లింగన్న, మాదన్న, వెంకయ్యలను ముగ్గురుపుత్రులు పుట్టిరి. అందు జ్యేష్ఠుఁడు లింగన్నకు మహాదేవుఁడు భగవానులు సంజీవరాయుఁడు నను ముగ్వురు కుమారులుకలిగిరి. వారలు సంతానహీనులయిరి. వారల పినతండ్రి మాదన్న చరిత్రంబు వర్ణించెద॥

సీ॥ మాదన్నగాంచెను, మానుగానేడ్వుర, సంజీవరాయండు, నరసయకుఁను
యల్లయాహ్వయుఁడను,నతిసుందరాంగుండు, సోమన్న యను వాఁడు సుస్థిరుండు
పాపయ్యమాదన్న, భవ్యచరిత్రులు, శివన్న యక్కన్న, సింహధీరు
లందుజ్యేష్ఠుండు పుణ్యాత్ముఁడునయశాలి, సంజీవరాయండు, సమరపముసఁ

తే॥ గీ॥ గాంచె మాదన్న సుబ్బన్న, ఘనుల సహజులైన చల్లన్న వీరన్న, యనఁగ వారి
ముద్దుతమ్ముఁడుశివన్న, మోహనాంగుఁడనఁగఁ బరఁగిరి యైదుగు,రవనిసుతులు॥

వ॥ వారలలో మాదన్నకుఁ జెల్లన్న,సుబ్బన్న వెంకటాద్రియను ముగ్వురుద్భవించిరి. అందుఁజల్లన్నకుఁ బెద్దబ్బి,శివరామయ్య యను నిరువురు పుట్టిరి. వారలలోఁ

బెద్దబ్బికి సంతులేకపోయెను. ఆయనతమ్ముఁడు శివరామయ్యకు భద్రయ్య, కోటయ్య, వెంకటప్పయ్య, నాగయ్యలను నలుగురు కుమారులుపుట్టి కంతేరుపురంబుననుండిరి. వారలతాత చెల్లన్నతమ్ముఁడు సుబ్బన్నకుఁ, దమ్ముఁడు వేంకటాద్రి రెండవకుమారుఁడు శివరామయ్య దత్తుఁడాయెను. ఆయనకుఁ గోటయ్యకలిగి వీరవల్లిపాటియందుండెను. ఆకోటయ్యతాతతమ్ముఁడు వెంకటాద్రికి రామయ్య, శివరామయ్య, వీరయ్య, మాదయ్యలను నలువురుపుత్త్రులుపుట్టిరి. అందు రామయ్యకు సుబ్బయ్య, చంద్రమౌళి, వెంకటప్పయ్యలను ముగ్గురుపుత్త్రులుజన్మించి, గొడవర్తియనుగ్రామములోనుండిరి. (వారల పినతండ్రి దత్తుఁడని పైనవ్రాయఁబడినది,) ఆయన తమ్ముఁడు వీరయ్యకు వెంకటాద్రి మాదయ్యయను నిరువురుగలిగి వీరవల్లిపాటియందుండిరి. వారలపినతండ్రి మాదన్న సంతానహీనుండయ్యె. ఆయనతాతతమ్ముఁడు సుబ్బన్నకు సంతున్నట్లుతెలియదు. ఆయనతమ్ముఁడు చల్లన్నకు, అబ్బయ్య, మాదయ్యలను నిరువురుపుత్త్రులుపుట్టిరి. అందు నబ్బయ్యసంతానహీనుండయ్యె. ఆయనతమ్ముఁడు మాదయ్యకు, అమరయ్య, రామయ్య, లక్ష్మయ్యలను మూగురుపుత్త్రు లుద్భవించి వారలు వడ్లమూడిలోనుండిరి. వారలతాతతమ్ముఁడు వీరన్న సంతానహీనుండయ్యె. ఆయన సహజుఁడు శివన్నకు రంగయ్యయు, నాతనికి శివయ్యయుఁ గలిగి, పినపాటిలో నుండిరి. ఆయనముత్తాతతమ్ముఁడు యల్లన్నకు మాదన్న, వీరన్న, లింగన్న, రామన్నలను నలువురు కలిగిరి. అందు మాదన్నకు వీరన్న, సోమన్న, లింగన్నలను ముప్వురుపుత్త్రులుపుట్టిరి. అందు వీరన్నకు సంతులేకపోయె. ఆయనసోదరుఁడు సోమయ్యకు లక్ష్మయ్యజన్మించి చేకూరిల్లోనుండె. ఆయన జనకునిసోదరుఁడు లింగయ్య సంతానహీనుండయ్యె. ఆయనజనకునితమ్ములు ముప్వురకు సంతులేదయ్యె. వారలజనకునిసోదరత్రయమునకు సంతుకనఁబడక వారలతమ్ముఁడు శివన్నకు హనుమయ్యపుట్టె. ఆహనుమయ్యపినతండ్రి, అక్కయ్యకు మాదన్నపుట్టె. ఆయనకుఁ బాపయ్యపుట్టె. ఆపాపయ్యకు మాదయ్య, సుబ్బయ్య, నాగయ్య వెంకయ్య, రామయ్యలను అయిదుగురుదయించిరి.అందుమాదయ్య సంతానహీనుండయ్యె. ఆయనసోదరుఁడు సుబ్బయ్యకు నాగయ్యపుట్టె. ఆయనకు భద్రయ్య, పిచ్చయ్యలను నిరువురుపుట్టి చేబ్రోలునందుండిరి. వారలతాతతమ్ముఁడు నాగయ్య సంతానహీనుండయ్యె. ఆయనసోదరుఁడు వెంకయ్యకు సుబ్బయ్యగలిగె. ఆయనపినతండ్రి రామయ్యకుఁ గోటయ్య, భీమయ్య, సూరయ్యయను ముప్వురుపుట్టి, చేబ్రోలునందుండిరి. వారలమైదవవంశంబునఁబుట్టిన

మాదన్నతమ్ముఁడు వెంకన్నకు మహాదేవుఁడుపుట్టె. అమ్మహాత్మునకుఁ బాపయ్యయను పురుషోత్తముండుపుట్టె. ఆయనతోఁ జేకూరుకుదురు ముగిసె
ననంతరంబు॥ 161

కంతేరుకుదురుమూలపురుషుఁడు లింగమనీనివంశానుక్రమణిక.

శా॥ యాదోరాశిగభీరమూర్తి కరుణావ్యాప్తాంతరంగుండు బా
హాదర్పాంధనృపాల దోర్బలయుతాహంకారపాషాణటం
కాది ప్రోజ్జ్వల ఖడ్గహస్తుఁడు ప్రసిద్ధౌదార్యధుర్యుండు తా
శ్రీదుండేయనమెప్పె సంపదల, వా,సింగాంచదాత్రంశచేన్॥ 162

క॥ ఆలింగమనీఁడు మహాశీలుండు కవీంద్రవినుత, చేష్టాపరుఁడున్
శ్రీలావణ్యాంచితుఁడై। యేలెన్ ధరనీతిమెఱయ, నెంతో కీర్తిన్॥ 163

సీ॥ లింగమనీఁడు బల్, నిర్మల తేజుండు, కంతేరుపురమున, ఘనత కెక్కి,
తానే కొండొంటుకుఁ,దగుచౌదరాంగంబు,బాగొప్పఁ జేయుచుఁ,బటిమ మెఱయ
దానధారోన్నతి, తారసిల్లఁగఁ జేసి, విప్రుల మెప్పించెఁ బృథ్వివరుఁడు
సతనికిఁగలిగిరి, వితతశౌర్యాబ్ధులు, మువ్వురాత్మజులును, మోదమలర

తే॥ వీరరాఘవుఁడనఁగను విమలయశుఁడు వరసదాశివుఁడుదితుఁడు, వసుధవిభుని
సహజుఁడక్కయధీరుఁడౌ, సమరసుండు ప్రజ్వరిల్లిరివారలు, భవ్యరుచిని॥ 164

వ॥ వారలలో వీరరాఘవునకు వీరన్న, లింగన్న, అయ్యన్న, చినవీరన్నలను నలువురుకుమారులుకలిగిరి. అందు వీరన్నకు సంతులేదయ్యె. ఆయనసోదరుఁడు లింగన్నకుఁ బెరుమాళ్లు, మల్లన్న, తిరుపతన్న, లింగన్నలను నలువురు జన్మించిరి. అందు జ్యేష్ఠునకు సంతులేదయ్యె. ఆయనతమ్ముఁడు మల్లన్నకు, సుబ్బన్న, వీరన్న, పిచ్చయ్యలను ముగ్గురుపుత్రులుపుట్టిరి. అందు సుబ్బన్నకు రామన్న యుదయించె. ఆయనకు లింగన్నపుట్టె. ఆయనతాతతమ్ముఁడు వీరన్న సంతానహీనుండయ్యె. ఆయనతమ్ముఁడు పిచ్చయ్యకు నరసయ్య వీరయ్య వెంకయ్యలను మువ్వురుపుత్రులుపుట్టిరి. వారలతాతతమ్ముఁడు తిరుపతన్నకు సంజీవి, వీరన్న, మారన్న, శివన్న, రామన్న, అచ్చన్న, అను నాలుగురు వంశపావనులుద్భవించిరి. అందు సంజీవి సంతతిశూన్యుఁడయ్యె. అతని తమ్ముఁడు వీరన్నకు లింగన్నపుట్టె. ఆయనకుఁ బెదకోటయ్య, చినకోటయ్య యను సిరువురుకలిగిరి. అందుఁ బెదకోటయ్యకు లింగయ్య సీతారామయ్యలనువారలు పుట్టి తుమ్మపూడిలోనుండిరి. వారలతాతతమ్ముఁడు మారన్నకుఁ దిరుపతన్నపుట్టె. ఆయనపినతండ్రులు మువ్వురు సంతానహీనులైరి. వారల తండ్రితమ్ముఁడు లింగన్నకు వెంకన్న, నల్లన్నయనువారలావిర్భవించిరి. అం

డు వెంకయ్యకు సంతులేదు. ఆయనతమ్ముఁడు నల్లన్నకు వెంకన్న, లింగన్న
లనువారవతరించిరి. వారలముత్తాతతమ్ముఁడు, అయ్యన్నకు లింగన్న, భీమ
న్నయనువారలు కలిగిరి. అందు లింగన్నకు వెంకన్న, సీలాద్రి, వెంకట్రామ
న్న, మాదన్న, పాపన్న, సాంబశివుఁడునను నార్గురుపుత్రులు జన్మించిరి.
అందు వెంకన్నకు వెంకటశివుఁ డుద్భవించెనయ్యెడ॥ 165

క॥ ఆవేంకటశివుఁడుసదా। భావంబునశివునినిరతిఁ, బాయనిదీక్షన్
సేవించుచుభక్తిస్థితి। సేవంకను మనసునిడక, యిలఁజరియించెన్॥ 166

సీ॥ ఆపుణ్యమూర్తికి, నంచితోల్లాసులు, మువ్వురుపుట్టిరి మోదమలర
రాజలింగనయన, రాజపరేణ్యుండు, శివలింగయాఖ్యుండు, స్థిరయశుండు
శక్తిలింగనయను, శాత్రవవిజయుండు ప్రజ్వరిల్లెనుభువి, భవ్యరుచిని
నందుజ్యేష్ఠుఁడుగాంచె,నయగుణోపేతుఁడై,సాంబయాఖ్యాకుఁడై సరసయశుని

తే॥ కేపుమీఱంగ నలువురు, సిద్యగుణులు
రాజయాఖ్యుండు శివ్వయ్య, రమ్యయశుఁడు
నాగయాభిఖ్యుఁడనఁగ ననంతవిభుని
తమ్ముఁడుదితుండు వీరయ్య ధార్మికుండు॥ 167

వ॥ అప్పుడా నలువురిలోఁ బ్రథమద్వితీయులకు సంతులేకపోయె. తృతీయుండగు
నాగన్నకు సుబ్బయ్యపుట్టె. ఆయనకుఁ బినతండ్రియగు వీరయ్యకుఁ గోట
య్యపుట్టె ఆకోటయ్యముత్తాతతమ్ముఁడు శివలింగయ్యకు మహాసుగుణశా
లులు, సత్త్వగుణప్రధానులు, సుశ్రీయుతులునగు, వెంకయ్య, రామస్వామి
యను సుపుత్రులిరువురుద్భవించిరి. అందు వెంకయ్యకు, నాగయ్య, మీన
య్య, వెంకటసుబ్బయ్యలను ముప్వురుపుత్రు లుద్భవించిరి. అందు నాగయ్య
కు, సీతారామయ్య, కోటయ్య, వెంకటప్పయ్యలనువారు కల్గిరి. వారిపినతం
డ్రి మీనయ్యకుఁ గోటయ్యపుట్టె, ఆయనపినతండ్రి వెంకటసుబ్బయ్యకు, వెం
కటప్పయ్యపుట్టె. ఆయనతాతతమ్ముఁడు, రామస్వామికి, మాదయ్య, దుర్గ
య్య, వెంకటప్పయ్య, వెంకయ్య, శివలింగయ్యలను నైదుగురుపుట్టిరి. అందు
వెంకయ్యగాక తక్కిన వారలకు, సంతులేదయ్యె. వారలతాతతమ్ముఁడు,
శక్తిలింగానకు, శివయ్యపుట్టె. ఆయనకు వీరభద్రయ్య, శక్తిలింగము, కో
టయ్య, వెంకటసుబ్బయ్యయను నలువురుకుమారులుద్భవించిరి. వారల నాల
వతాత వెంకన్నతమ్ముఁడు సీలాద్రికి లింగన్నపుట్టె. ఆయనతండ్రితమ్ముఁడు
వెంకట్రామన్నకు, సంతానంబులేదయ్యె. ఆయనతమ్ముఁడు, మాదన్నకు,
శాయన్న, లింగన్నలను నిరువురుపుట్టిరి. అందు శాయన్నకు, మాదయ్య,

లింగయ్య, సుబ్బయ్యలను పుత్రులుదయించిరి. అందు మాదయ్యను లింగయ్యపుట్టె. ఆయనకుఁ బినతండ్రియైన లింగయ్యకు, శాయన్నపుట్టె. ఆయన పినతండ్రి సుబ్బయ్యకుఁ గోటయ్య, భద్రయ్య, శ్రీరాములు ననువారుపుట్టె పెదపాలెములోనుండిరి. వారలతాతతమ్ముఁడు లింగన్నకు, బాపనయ్య, రామయ్యయను నిరువురుపుత్రులుద్భవించిరి. అందు జ్యేష్ఠునకు, వీరయ్య, వెంకయ్యయను నిరువురుకలిగిరి. అందు వీరయ్యకు, లింగయ్యపుట్టె. వీరు తుమ్మపూడిలోనుండిరి. వారలతాతతమ్ముఁడు రామయ్యకు, వెంకట్రామయ్య పుట్టె. ఆయనమూఁడవతాత మాదన్నతమ్ముఁడు, పాపన్నచరిత్రంబు వివరించెద॥ 168

మ॥ అకలంకాత్ముఁడు, సత్కృపాపరుఁడు ని,త్యానందసంపన్నుఁడుఁ
సుకుమారుండగపుత్రికావరమన, శ్శుద్ధాంతసంచారిన
త్యకథాకర్ణసభూరిమోదకలనా, వ్యాప్తుండు పాపయ్యతా
సుకరాక్షీణమతిప్రభన్ జనులహో, చ్చుంగూర్మిఁబాలించెడిన్॥ 169

సీ॥ నిమిషమాత్రంబైన, నిర్వికల్పసమాధి, రహితుఁడై యుండఁడా రాజయోగి
యిహసౌఖ్యముల్ వీడి, హితతత్త్వోల్లాసుఁడై పరచింత సేయుచుఁబటిమ మెఱయ
ధనదారపుత్రవర్తనమిథ్యయనియెంచి సద్భక్తిచేతను, సారసాంక
వృత్తిచేమెలఁగెను సత్తైనూ,జయమని, శివనామమే ప్రొద్దుఁ జిత్తమలర
తే॥ సంస్మరించుచు నిరతంబు, సమరసమున
మోక్షమేనిక్కమనియెంచి, మోదమలర
నిర్మలానందమగ్నుఁడై, నెగడియుండెఁ
బూర్ణభావంబుతోడను, బొంపసగాను॥ 170

వ॥ ఈట్టిపాపయాఖ్యునకు, గోత్రపావనులైన వీరభద్రప్ప, నందయ్య, లింగయ్యలను పుత్రులుకల్గిరి. అందు జ్యేష్ఠునకుఁ బాపయ్య, కోటయ్యలను నిరువురు కల్గిరి. అందుఁ బాపయ్య సంతానహీనుండయ్యె॥ 171

సీ॥ కోటయాహ్వయుఁడగు, కులపావనుఁడుగల్గె సద్గుణైశ్వర్యప్రశస్తుఁడగుచు
హరిహరధ్యానని, త్యానందబాష్పముల్, గురియంగసతతంబు, గుహ్యగురుని
కరుణాకటాక్షంబు, కలుగునట్లుగమది సంస్మరించుచుఁదాను సమరసమున
నిర్వికల్పసమాధి నిష్ఠచేఁబూర్ణుఁడై నిండుభావంబున, నెగడియపుడు
తే॥ మంగళాద్రినినివసించి, మహిమగలుగు నారసింహునిసేవ చె,న్నారఁజేసి
పరమసత్యమటంచును, భవ్యరుచినిఁ బరమభాగ్యోపభోగియై ప్రబలుచుండె॥

తే॥ నియతిఁ బ్రాకారమంటప, చయము లెల్లఁ
గట్టి నియమించి ధన ముల్లి, గంజసయను
పనులకై కొల్ల పెట్టుచు, భక్తిచేత
మెలఁగుచు నెయుండె నచ్చోట, మేలుగోరి॥ 173

చ॥ అనుదినమచ్చటన్ నిలిచి, యబ్జదళాక్షుని సేవ సేయుచున్
ఘనతవహించి మోక్షమును, గాంచఁగలట్టి వివేకమార్గమే
యనయము, జ్ఞానదృష్టిఁగని, యారయఁబ్రాక్తన భక్తులట్లుగా
ననువగు వర్తనన్ మెఱసె, నక్షయసౌఖ్య సమీహితాత్ముఁడై॥ 174

సీ॥ అమ్మహానీయున, కనురాగసతియగు, లచ్చమాంబయనంగ, లలితఘోష
సూర్యదేవరవంశ, సువ్రతశీలుఁడౌ, జోగయామాత్యుఁడగు, భాగవతుని
భార్యయౌ సుబ్బాంబ, భాగ్యశాలినియౌచు, వారలకునుబుట్టె, వరసుగంధి
పరమపతివ్రతా, పరతత్త్వవేత్త్రియౌ, నమ్మత్తకాశిని, యందుఁగలిగె

తే॥ నరసయాభిఖ్యుఁడనఁగ వినయయుతుండు
సీతరామయ్యయను మహాస్థిరయశుండు
వేంకటప్పయ్యయనఁగను, వీరవరుఁడు
పుట్టిమువ్వురుపుత్త్రులు, పొందుగాను॥ 175

వ॥ అందు జ్యేష్ఠుండు నరసయ్యకు శ్రీరాములు, పిచ్చయ్యయను నిరువురుకుమారులుకలిగిరి. అందు జ్యేష్ఠుండు కాంచనాంగుండును శశిసభాననుండును మహాసుందరుండునగు శ్రీరాములను శ్రీవాసిరెడ్డివంశ ప్రతిష్ఠామూర్తులైన శ్రీ రాజా వాసిరెడ్డి వెంకటలక్ష్మినరసమ్మ మన్నె సుల్తాన్ బహాదరుగారు దత్తునిఁ జేసికొనిరి. ఆయనజనకునితమ్ముఁడు సీతారామయ్యకు సుబ్బయ్య, పార్థసారథి వరప్రసాదనాయఁడనను నిరువురుపుత్రులుదయించిరి. వారలపినతండ్రి వెంకటప్పయ్యకు వెంకయ్య, నారాయణ, మల్లికార్జునుఁడను మువ్వురుపుత్రులుపుట్టిరి. వారలముత్తాతతమ్ముఁడు వీరయ్యకు శివరామయ్య దత్తుండయ్యె. ఆయనకు, అప్పయ్య, వీరయ్య, నరసయ్య, వెంకటప్పయ్య, సుబ్బయ్య, కోటయ్యలను నారుగురుపుట్టిరి. వారలముత్తాత వీరభద్రప్పతమ్ముఁడు నందయ్యకు, సుబ్బయ్య, నాగయ్య, భద్రయ్య, లింగయ్యలను నలువురుపుత్రులు జన్మించిరందు॥ 176

తే॥ సుబ్బయాఖ్యుండు ధార్మిక, సుగుణశాలి యవతరించెనుసత్కీర్తి, యతిశయిల్ల
సకలవిభవాతిశయముల, సాంద్రగతినిబ్రబవిమలానందభరితుఁడై, ప్రజ్వరిల్లె॥ 177

క॥ ఆరామకూపదేవా। గారంబుల శుద్ధబుద్ధిఁగట్టించిధరన్
గౌరీనాథుంగొలుచుచు। భూరియశంబందెనితఁడు పుణ్యాత్ముండై॥ 178

వ॥ ఆయశశ్శాలికి నరసయ్య, నాగయ్య, కోటయ్యలుపుట్టిరి. అందు నరసయ్యకు శక్తీశ్వరుండు, సుబ్బయ్య, వెంకటప్పయ్యలనువారుపుట్టిరి. వారిలపినతండ్రి నాగయ్య, వెంకటప్పయ్య మల్లయ్య సుబ్బయ్యయనువారలఁ గనెను. వారల పినతండ్రి కోటయ్య, సంతానహీనుండయ్యె. ఆయనపినతండ్రి నాగయ్యకు వెంకయ్య, నందయ్యలను కుమారులు గలిగిరందు॥ 179

ఉ॥ వెంకయనామధేయుఁడతి, వీరవరేణ్యుఁడు కీర్తిశాలియున్
శంకరుసాంద్రవత్సలత, సారసనేత్రుఁడు భాగ్యవంతుఁడై
శంకయొకింతలేకతన, సత్యమెశ్రేయమటంచు నీయిలన్
బంకజనాభుసంస్మరణ, బాగుగసల్పుచునుండెఁ ధీరతన్॥ 180

వ॥ ఆవేంకయాఖ్యునకు శ్రీరాములు, వెంకటప్పయ్య, పాపయ్య, శక్తీశ్వరుండు కోటయ్య, నాగయ్యలను నార్వురుపుత్రులుపుట్టిరి. అందు శ్రీరాములకు రంగనాయకులు, శ్రీకృష్ణయ్యయనువా రుద్భవించిరి. వారలపినతండ్రి వెంకటప్పయ్యను, ఆయనతాతతమ్ముఁడు లింగయ్యకుమారుఁడు వెంకయ్యదత్తుఁజేసికొనెను. ఆవెంకటప్పయ్యతమ్ముఁడు పాపయ్య సకలగుణగణనియుండును, సుందరాంగుండును నగు, ఆయనను రాజా వాసిరెడ్డి చంద్రమౌళినాయఁడు మన్నె సుల్తాన్‌బహాదరుగారు దత్తుఁజేసికొనిరి. వారికి శ్రీమంతు రాజా యార్లగడ్డ మల్లికార్జునప్రసాదనాయఁడు బహాదరుగారి తృతీయపుత్రికనిచ్చిరి. ఆయనతమ్ముఁడు నాగయ్యను, ఆయనపినతండ్రి నందయ్య దత్తుఁగైకొనెను. ఆనందయ్య పినతండ్రి భద్రయ్యకు, పిచ్చయ్య, నాగయ్యలుపుట్టిరి. అందు పిచ్చయ్యకు భద్రయ్య, నరసయ్య, అప్పయ్య, మల్లయ్యలను నలువురు పుట్టిరి. వారలతాతతమ్ముఁడు లింగయ్యకు వెంకయ్యపుట్టె. ఆయన వెంకటప్పయ్యను దత్తుంజేసికొనియె. ఆయనతాతతమ్ముఁడు లింగయ్యకుఁ బాపయ్య, రాజయ్య, రామయ్య, మల్లయ్య, కనకయ్యలను నైదుగురు పుత్రులుపుట్టిరి. వారిలో మొదటినల్వురు సంతానహీనులైరి. ఐదవవాఁడగు కనకయ్యకు లింగయ్యపుట్టె. ఆయనముత్తాత పాపయ్యతమ్ముఁడు సాంబశివునకు, సుబ్బన్న మాదన్నలనువారుపుట్టిరి. వారలతాతతమ్ముఁడు భీమన్నకు నరసయ్య, అయ్యన్న, శివన్న, రామన్న, వెంకన్నలను నైదుగురుపుట్టిరి. అందు నరసన్నకు సుబ్బన్నపుట్టె, ఆయనరెండవపినతండ్రి శివన్నకు భీమన్నకలిగె. తక్కిన

వారు సంతానహీనులైరి. వారలముత్తాతతమ్ముఁడు చినవీరన్నకు విస్సన్న వెంకటకృష్ణులు కలిగిరి. అందు విస్సన్నకు అక్కన్న, పాపన్న, రమణప్ప, నాగన్న, వీరన్న, విస్సన్నలనువారు జన్మించిరి. అందక్కన్నకు వీరన్న, అచ్చన్నలనువారుపుట్టిరి. అందువీరన్న యనపత్యుఁడయ్యె. అచ్చన్నకుఁ జందిరిమాళిపుట్టి, గొడవర్తియందుండెను. ఆయనతాతతమ్ముఁడు పాపన్నకు వీరన్న, విస్సన్న, వెంకన్న, కృష్ణమ్మలను నలువురుపుట్టిరి. అందు వీరన్నకు శాయన్నపుట్టె. ఆశాయన్నకు వెంకయ్య, అప్పయ్య, మల్లయ్యలను ముగ్గురుపుట్టిరి.అందువెంకయ్యకువీరయ్య, వెంకటామియ్య,సుబ్బయ్యలను పుత్రులుపుట్టిరి.వారలపినతండ్రులుసంతానహీనులైరి. వారలపినతండ్రి విస్సన్నకు,మల్లన్న,వీరన్న,పాపన్నలనువారుకల్గిరి. అందుఁబ్రథమద్వితీయులుసంతానహీనులైరి. తృతీయుండగు పాపన్నకు, వీరయ్య, మల్లయ్యలను నిద్దఱుపుట్టిరి. వారిలో వీరయ్యకు విస్సయ్య, శివయ్యలను నిరువురుపుట్టిరి. వారలపినతండ్రి మల్లయ్యకుఁ గృష్ణయ్య, సూరయ్య లనువారుపుట్టి, తుమ్మపూండిలోనుండిరి. వారిముత్తాతతమ్ముఁడు వెంకయ్య సంతానహీనుండయ్యె. ఆవెంకయ్యతమ్ముఁడు కృష్ణమ్మకు, వెంకయ్యపుట్టె. ఆవెంకయ్యకు వీరయ్యపుట్టి, యాయన మీానవ్రోలులోనుండెను. ఆయనముత్తాతతమ్ముఁడు రమణప్ప యసంతతికుండయ్యె. ఆయనతమ్ముఁడు నాగన్నకు వీరన్న, అక్కన్నలను నిరువురుపుట్టిరి. అందు వీరన్నకు వెంకయ్య, భద్రయ్య, రామయ్య, విస్సన్న లను నలువురు పుట్టిరి. అందు జ్యేష్ఠుండసంతానుండయ్యె. ద్వితీయుండు భద్రయ్యకుఁ, బాపన్న, సుబ్బన్న, పెదవీరన్న, చినవీరన్న, రామన్నలను నైదుగురుపుట్టిరి. అందుఁ బాపన్న నిరంకురుఁడయ్యె. ఆయనతమ్ముఁడు వెంకన్నయు నష్టుఁడై,మరణించె, ఆయనపినతండ్రితమ్ముఁడు పెదవీరన్నకు భద్రియ్య, శివరామయ్య లుద్భవించిరి. అందు శివరామయ్య, పెదపాలెములోనుండి వీరయాఖ్యునకు దత్తుఁడయ్యె. వారలపినతండ్రి వీరన్న సంతులేనివాఁడయ్యె. ఆయనతమ్ముఁడు రామన్నకు రామలింగము, పాపన్న, వెంకటామిన్నలను ముప్వురుపుట్టిరి. వారలతాతతమ్ములిరువురు సంతానహీనులైరి. వారలతండ్రితమ్ముఁడక్కన్నకు, మాదన్నపుట్టె. ఆయనకునాగయ్య, సుబ్బయ్యలుకలిగిరి. వారలముత్తాతతమ్ముఁడు వీరన్నకు మల్లన్న, నాగన్న,సుబ్బన్న లుద్భవించిరి. వారలపినతండ్రి విస్సన్నకు సంతులేదయ్యె. ఆయనతండ్రితమ్ముఁడు వెంకటకృష్ణునకు వీరన్న, మాదన్నలను పుత్రులుగల్గి రనంతరంబు॥ 181

గీ॥ వీరయాఖ్యుండు సుజనుండు, వీరవర్యుఁ
డార్తరక్షణకుశలుండు, శౌరిమూర్తి
యతనితమ్ముఁడు మాదన్న, యనఁగఁబరఁగె 182
నిరువురెంతో ప్రయోజకు, లెంచిచూడ॥

క॥ ఆవీరయభూపాలుఁడు। శ్రీవిస్ఫూర్తిన్ వెలుంగు, చిత్రాకృతులన్
భావజ్ఞపాదభక్తులఁ। దా వేడ్కంగనియెసుతులఁ, దనసతియందున్॥ 183

వ॥ ఆవీరన్నకు జ్యేష్ఠుండు, మల్లన్న, అతనితమ్ములు, అయ్యన్న, కృష్ణమ్మ అను వారు. వారిమువ్వురిలో మల్లన్నకుఁ, దిరుపతన్న, సుబ్బన్న, వీరన్నలని మువ్వురుపుత్రులుకలిగిరి. అందుఁ దిరపతన్నకు, వీరయ్య, వెంకయ్య, మల్లయ్యలని ముగ్గురుపుట్టిరి. అందు వీరయ్యకు, భీమయ్యపుట్టె. ఆయనపినతండ్రి వెంకయ్యకు, సంతులేదయ్యె. ఆయనతమ్ముఁడు మల్లయ్య, పినతండ్రియగు వీరయ్యకు దత్తుండయ్యెను. ఆయనకుఁబ్రహ్మయ్య, శ్రీమంతులనువారలుజన్మించిరి. వారలముత్తాత మల్లన్నతమ్ముఁడు, అయ్యన్నకు, వీరయ్య, సుబ్బయ్య, నాగయ్య, వెంకయ్య, లింగయ్యలను నయిదుగురుద్భవించిరి. అందు వీరయ్యకు లక్ష్మయ్య, సుబ్బయ్య, వెంకయ్య, సాంబయ్య, జయరామయ్యలను నైదుగురు కుమారులు కలిగిరి. అందు జ్యేష్ఠుఁడు లక్ష్మయ్యకు, మల్లయ్యపుట్టె. ఆయన పినతండ్రి సుబ్బయ్యకు, లింగయ్యపుట్టె. ఆయనపినతండ్రి వెంకయ్యకు, వెట్రియ్యపుట్టె. ఆయనపినతండ్రి సాంబయ్యకు, కృష్ణానాయఁడుపుట్టె. ఆయన తాత వీరయ్యతమ్ముఁడు సుబ్బయ్యకు, సంతులేదయ్యె. ఆయనతమ్ముఁడు నాగయ్యకు లింగయ్యపుట్టె. ఆయనపినతండ్రి వెంకయ్యకుఁ గోటయ్యపుట్టె. ఆయనపినతండ్రి నాగయ్య యసంతతికుఁడయ్యె. ఆయనపినతండ్రి కృష్ణమ్మకు సంతులేకపోయె. ఆయనతండ్రి వీరన్నతమ్ముఁడు మాదన్నకు, వీరన్న, వెంకన్న, తిరుపతన్న, చినవెంకన్నలను నలువురుపుట్టిరి. అందు వీరన్నకు, బావనయ్య, అయ్యన్న, అక్కయ్య, వీరయ్యలను నలువురుకల్గిరి. అందు బావనయ్యకు వీరయ్యపుట్టె. ఆయనపినతండ్రులు, అయ్యన్న, అక్కన్న, సంతానహీనులైరి. వారితమ్ముఁడు వీరయ్యకు, భద్రయ్యపుట్టె. ఆయనకు, రామయ్య, కోటయ్య లనువారుపుట్టి జిల్లేపల్లిగ్రామములోనుండిరి. వారితాత వీరన్నతమ్ముఁడు వెంకన్నకు మల్లన్న, లింగన్న, మాదయ్యలు, పుట్టిరి. ఆమల్లయ్యకు, శేషయ్యపుట్టె. ఆయనకు, వెంకయ్య, కోటయ్యలనువారుకల్గిరందు వెంకయ్యకు వెంకటసుబ్బయ్యపుట్టి వారు తుమ్మపూడిలో నుండిరి.

వారిపినతాత లింగన్న, ఆయనపినతండ్రి తిరుపతన్నకు దత్తుఁడయ్యె. ఆయన. తమ్ముఁడు మాదయ్యకు, బసవయ్య, రామస్వామి, నరసయ్య, కృష్ణయ్యలను నలువురుపుత్రులుజన్మించిరి. అందు జ్యేష్ఠునకు, లింగయ్య లక్ష్మయ్యలను వారుకల్గిరి. అందు లింగయ్య, పినతండ్రి రామస్వామికి, దత్తుఁడయ్యె. ఆయన తమ్ముఁడు నరసయ్యకు, నరసయ్యపుట్టె. ఆయనపినతండ్రి సంతానహీనుండయ్యె. వారలతాతతమ్ముఁడు, తిరుపతన్న దత్తకుమారుఁడు, లింగయ్యకు, లక్ష్మయ్య, నాగయ్య, నరసయ్య, రామయ్యలను నలువురుపుట్టిరి. అందు లక్ష్మయ్యకు నరసయ్యపుట్టె. ఆనరసయ్యకు, లక్ష్మయ్యజనించె. ఆలక్ష్మయ్యతాత తమ్ముఁడు నాగయ్యకు, వెంకయ్య, లింగయ్య కోటయ్యలను ముగ్గురు కుమారులు కల్గి, యవపోలులోనుండిరి. వారలతాత తిరుపతన్నతమ్ముఁడు చిన వెంకన్నకు, సీతయ్యపుట్టె. ఆయనకు, బసవయ్య, లక్ష్మయ్యలను నిరువురు కుమారులుకల్గిరి. అందు బసవయ్యకు, మాదయ్య, కృష్ణయ్య, కోటయ్య, రామస్వాములనునలువురావిర్భవించిరి. వారితండ్రితమ్ముఁడు లక్ష్మయ్యకు, బసవయ్యయు, వెంకయ్యయుఁ బుట్టిరి. వారు కోపల్లెగ్రామవాస్తవ్యులైయుండిరి. వారలకేడవవంశపువాఁడగు, వీరరాఘవునితమ్ముఁడు, సదాశివునిచరిత్రం బెట్టిదనిన. 184

గీ॥ ఆసదాశివుఁడతిభక్తి, నధిగమించి
శంకరునిపూజసల్పుచు, శంక లేక
పరమవైరాగ్యశాలియై, పటిమమెఱయఁ
గాంచె ముప్వురఁబుత్రుల, ఘనతమీఱ 185

సీ॥ వెంకన్నయనుమహా, వీరాగ్రగణ్యుండు, నారాయణప్పనా, భూరిబలుఁడు
లింగన్నయనువాఁడు లీలావిలాసుండు, పరఁగిరిముప్వురు, ప్రబలయశులు
నందుజ్యేష్ఠుండగు, నావెంకయాఖ్యుండు, వీరన్నయనిమెడి, విమలయశునిఁ
గాంచె నాయనకును, గౌరవస్థానంబు, కృష్ణమ్మకలిగెను, గీర్తిశాలి

తే॥ అట్టివానికిఁగల్గెను, ననుపముండు
పాపయాఖ్యుండు సదయుండు, భవ్యగుణుఁడు
బుధనుతుండతిసువ్రత, పుణ్యమూర్తి
పుత్రహీనతమరణించె, భువినతండు 186

వ॥ ఆపాపన్న ముత్తాతతమ్ముఁడు నారాయణప్పకు, లింగన్న, నారసింహులు, వెంకన్న, పాపన్నలను నలువురుపుట్టిరి. అందు లింగన్న సంతానహీనుండయ్యె.

ఆయనతమ్ముఁడు నాగసింహుఁడనువానికి రమణప్పపుట్టె. ఆయనకు మాచన్న పుట్టె. ఆయనకుఁ గృష్ణమ్మయనువాఁడు దత్తుఁడై సుగుణసంపత్తిచేఁ బ్రఖ్యాతిల్లె. ఆయనకు మాదయ్య, బాపనయ్య, బుచ్చినాయఁడు నను ముగ్గురు వంశపావను లుద్భవిల్లిరందు. 187

ఉ॥ మాదయభూవరుండనఁగ, మానుషమూర్తిఁ, వివేకశాలియై
మేదిని మర్త్యసత్తముల, మించినవాఁడయి, తెల్విఁగల్మిచే
బీదలసాదరంబునిచి, ప్రీతిగఁజూచుచు గౌరవించుచున్
సాదరమానసాబ్జుఁడయి, యంచితవృత్తి వెలింగె నిద్ధరన్ 188

వ॥ ఆయనకు రామలింగన్న పుట్టె. ఆయనకు మాదన్న కలిగె ననంతరంబు 189

క॥ ఆయనపినతండ్రిమహా। శ్రీయుతుఁడౌ బాపనయ్య శ్రీయాంబలరన్।
బాయనిశంకరుకృపచే। నీయిలసత్కీర్తి గాంచి, హెచ్చెన్ గల్మిన్ 190

వ॥ ఆయనకులక్ష్మీపతిపుట్టె. ఆయనకుఁజంద్రమౌళి, వెంకట్రామన్న। బాపనయ్య లను ముగ్గురుపుట్టిరి. వారలతాతతమ్ముండగు బుచ్చినాయని చరిత్రంబు వర్ణించెద॥ 191

సీ॥ ఆబుచ్చినాయండు, నయగుణోపేతుండు, సకలవిద్యాపారీణమతియుతుఁడు।
శూరుండుధీరుండు, సుందరాంగుండతి, సువ్రతకాముండు, సుస్థిరుండు।
గుణగణనీయుండు, గణనాలుకూలుండు, బుధపాదభక్తుండు, పుణ్యయశుఁడు।
వీరాగ్రగణ్యుండు,వీతరాగాత్ముండు,సాహసాధికుఁడుసజ్జనవరుండు।
తే॥ గానవేతాదృగవనీంద్రుఁ గానమనుచు।
నతనిమన్ననఁగాంచిన, యఖిలబుధులు।
చెప్పుచుండెడిమాటలు, స్థిరములెకద।
యమ్మహాత్మునికులమెంత, యిమ్ముగనెనొ॥ 192

వ॥ ఆయనకు భానుప్రసాదు, శ్రీకృష్ణుఁడు,సదానందము, చినభానుప్రసాదు, అనునలువురుపుట్టిరి.అందుశ్రీకృష్ణునకుబుచ్చినాయఁడనుకుమారుఁడుగల్గె.ఆయనయొఅవతాతయగు నాగసింహునితమ్ముఁడు, వెంకన్నకుఁ దిరుపతన్న, చినపాపన్న వీరన్న,లింగన్న,శివన్న, నాగన్నలను నార్వురుపుత్రులుగల్గిరి. అందుఁదిరుపతన్నకు లింగన్న,రామేశము,దర్శన్న,వెంకన్న,మల్లన్న పద్మన్నలనునార్వురు పుట్టిరి. అందులింగన్నకు,మాదన్న,నాయఁడమ్మ, అనునిరువురుపుట్టిరి. అందు మాదయ్య సంతానశూన్యుండయ్యెఁ బిమ్మట. 193

సీ॥ ఆతనిసోదరుం, డతిసుందరాంగుండు, నాయఁడమ్మయనంగ, శ్రీయుతుండు
ధనురుగ్రవిద్యను, ద్వంద్వయుద్ధంబు, లందు బాహాస్ఫూర్తి నందువాఁడు
ధైర్యసాహసకళా, దర్పవిభ్రమధాటి, శాత్రవద్గణముపైఁ గవియువాఁడు
ముఖవైఖరీదృష్టి, మొదటిధౌర్త్యమడంగి, రిపులుతల్లడమంద రేఁగువాఁడు

తే॥ మిత్రబాంధవపరికర, మేళనమున
నిట్టిఁడౌవఁడన్న యెన్నిక, నెనయువాఁడు
సర్వదాజ్ఞానదృష్టిచే, సమయమెల్లఁ
గడపుచుండెడివాఁడు, నిష్కంటకముగ॥ 194

ఉ॥ రాజులనందఱన్ మిగుల, రౌద్రరసంబునఁ జూచుచుండకే
యాజినినోడఁజేయుచును, హంకృతిపీడఁగఁజేయుచున్ మహా
రాజవిభూషణుండగుచు, రాజిలుచుండెననన్యశక్తిచే
నాజయశాలిఁబోలు నచలాధిపతుల్ మఱివేఱు లేరనన్॥ 195

సీ॥ నైజాముసేనలు నైజదర్పముచేత, పల్లెలంబురములఁబటిమదోఁచ
సమ్మహావిక్రముండ దలించియందఱఁ, మదమృగేంద్రునిఁ బోలిమనుజవరుల
దార్కొనివారల, ధట్టించిపోరిలో, నుగ్గునూఁచముసేయ, దిగ్గునన్నృపు
లేచితుపాకుల, నేసడించుచువేయ, నతనియూరుద్వయ, మందుఁజొచ్చి

తే॥ రక్తధారలుగ్రమ్మఁగా, రంగుమీఱి
యతనుధీరతవిడువక, యందఱకును
నన్నిరూపులఁగనుపించి, యాగ్రహమునఁ
జంపెఁదత్సైన్యమును, నాజి, జనులుమెచ్చ॥ 196

వ॥ ఆక్షాత్రవత్తేజోవిలాసుండగు నాయఁడమ్మకు సుబ్బయ్యపుట్టె, ఆయనకులింగయ్య,నాయఁడమ్మ,మాదయ్య, సరసయ్య,రామయ్యలను నయిదుగురుపుట్టిరి. అందులింగయ్యకు వెంకటప్పయ్య,భద్రయ్య సూరయ్యలను ముగ్గురుపుత్రులు పుట్టిరి. వారిజనకునిసోదరుండు నాయఁడమ్మకు, సుబ్బయ్య, పిచ్చయ్య, కృష్ణయ్యలను మువ్వురుపుత్రులుగలిగిరి. వారలపినతండ్రి మాదయ్యకు శ్రీరాములు, సీతారామయ్యయను నిరువురుజన్మించిరి. వారితండ్రితమ్ముఁడు నరసయ్య సత్వగుణప్రధానుండును సుగుణశీలుండునునగును. ఆయనకుఁజినకోటయ్య వెంకటకృష్ణయ్యలనునిరువురుపుట్టిరి. వారలజనకునికనిష్ఠసోదరుండు రామయ్యచరిత్రంబెట్టిదనిన॥ 197

క॥ రామయనామకుఁడెప్పుడు। శ్రీమంతుడుధైర్యరాశి, శ్రీకరగుణుఁడున్
భీమబలుండైవర్ధిలె। శ్రీమన్సీతేశుకరుణ, చేతన్ధాత్రిన్॥ 193

వ॥ ఇట్లువర్ధిల్లినమహాభాగ్యవంతునకు సుబ్బయ్య, కోటయ్య, శ్రీకృష్ణనాయఁడు,
నరసయ్య, లక్ష్మీపతి, నారాయణయనునార్వురు పుత్రులుపుట్టిరి. వారలనాల్గ
వతాతసోదరుఁడు రామేశానకుసంతులేదయ్యె. ఆయనసోదరుండగు దర్శన్న
కు వెంకయ్య, పాపన్నలను నిరువురుపుట్టి సంతానహీనులయిరి. వారలపినతండ్రి
వెంకన్నకు నరసన్న, మాదన్నలనువారుకలిగిరి. అందునరసన్నకు మల్లయ్య పు
ట్టె, ఆయనకుపుల్లయ్యకలిగె. ఆయనతాతతమ్ముఁడుసంతానహీనుఁడయ్యె. ఆయ
నతండ్రి వెంకన్నతమ్ముఁడు మల్లన్నకుఁదిరుపతన్న, నరసింహము, వెంకయ్య, రా
మయ్య, లింగయ్యయనునైదుగురుపుట్టిరి. అందు జ్యేష్ఠునకుమాదన్నపుట్టె. ఆ
యనపినతండ్రులునలుగురు సంతానహీనులయిరి. వారలతండ్రితమ్ముఁడుపెద్ద
న్నకుసంతులేదయ్యె. ఆయనజనకునిసోదరుడగు చినపాపన్నకు నరసన్న, వెం
కన్న, అమరలింగన్న బుచ్చయ్యయను నలువురుకుమారులుపుట్టిరి. అందునరస
న్నకు బాపయ్య, వెంకయ్య సూరయ్య, అప్పయ్యలను నలువురుపుట్టిరి. వారల
తండ్రితమ్ములు వెంకన్న, అమరలింగన్న, సంతానహీనులయిరి. వారలతమ్ముఁ
డుబుచ్చయ్యకు అమరలింగయ్య, శివయ్య, జగన్నాయకులను ముగ్గురుపుట్టిరి
వారుమోవులూరిగ్రామ వాస్తవ్యులయియుండిరి. వారలతాత చినపాపన్నత
మ్ముఁడువీరన్నకు మాదన్న, వెంకట్రామన్న, చంద్రమౌళి, అక్కన్న, మల్లన్న
లింగన్నలను నార్గురుపుట్టిరి. అందుమాదన్నకు శివరామన్న కలిగె. ఆయనకు
మాదయ్యపుట్టె, ఆయనకు, అప్పయ్యపుట్టి సంతానహీనుండయ్యె. ఆయనము
త్తాతమాదన్నతమ్ముఁడు వెంకట్రామన్నకుసంతులేదయ్యె. ఆయనతమ్ముఁడు
చంద్రమౌళికి సూరయ్యపుట్టె. ఆయనకు మాదయ్య, సుబ్బయ్య, మల్లయ్య
నరసయ్య, కృష్ణయ్యలను నయిదుగురుపుట్టిరి. అందుమాదయ్యకుఁజంద్రమౌళి,
సూరయ్య, రాజమౌళి, యనుముగ్గురావిర్భవించిరి. వారలపినతండ్రిసుబ్బయ్యకు
సంతులేదయ్యె. ఆయనసోదరుఁడుమల్లయ్య దత్తుడయ్యె. ఆయనతమ్ముఁడువీర
న్న సంతానహీనుండయ్యె. ఆయనతమ్ముఁడునరసయ్యకు రామలింగన్న, రాజ
మౌళియను నిద్దఱుపుట్టిరి. అందురామలింగన్నకు మాదయ్య, సూరయ్య, య
నువారు జన్మించిరి. వారలతాతనరసన్నతమ్ముఁడు కృష్ణయ్యకు, వీర
య్య, భుజంగము, పాపయ్య, సుబ్బయ్య, ఉరఫ్, అప్పయ్య, అనునలువురుకుమా
రులుకలిగిరి. అందువీరయ్యకు వెంకటప్పయ్య, చంద్రమౌళియనువారుద్భవిం
చిరి. వారలరెండవపినతండ్రిపాపయ్యకుఁగోటయ్యగలిగె. ఆయననాలవవంశపు

వాఁడగు చంద్రమౌళిసోదరుఁడు, అక్కన్న చరిత్రంబు వివరించెద. 199

తే॥ సుగుణశాలియు, ధీరుండు, సుందరుఁడు
ప్రవిమల జ్ఞానవంతుండు, భవ్యబుద్ధి
శంకరుని సంస్మరించుచుఁ, బొంకములను
వెలసెనక్కయ్యనృపుఁడెంతొ లలితుఁడగుచు 200

ఉ॥ ఆతఁడుగాంచెఁ బుత్రులన, మంచితవర్ధనులైన ముప్వురన్
ఖ్యాతిగ సుబ్బయాఖ్యుఁడును, నాతనితమ్ముఁడు మల్లయాహ్వయుం
డాతని సోదరుండనఁగ, నంచితధీరుఁడు రాజలింగుఁడున్
భూతలమందు ధీరతను, బొందుగనుండిరి సుస్థిరంబుగన్ 201

వ॥ ఆ రాజలింగన్నకు, వెంకటచలపతిపుట్టె. ఆయనతాత, అక్కన్న తమ్ముఁడు మల్లన్నకుఁ, గృష్ణయ్య, నరసయ్య, బుచ్చయ్య, వెంకట్రామన్న, రమణప్పలను నైదుగురుపుట్టిరి. అందుఁ గృష్ణయ్య, రమణప్పకుమారుఁడు, మాదయ్యకుఁ దత్తుఁడయ్యె. ఆయనసోదరుఁడగు నరయసయ్యకు, వెంకయ్య, వీరయ్యలను వారుపుట్టిరి. వారిపినతండ్రులు, బుచ్చయ్య, వెంకట్రామన్నలు, సంతానహీనులైరి. వారలతమ్ముఁడు రమణప్పకు, వీరయ్యపుట్టె. ఆయనతాతతమ్ముఁడు లింగన్నకు నూరయ్య, మాదయ్య, రాజయ్యలను, ముగ్గురుపుట్టిరి. అందు నూరయ్యకు, సంతులేదు. ఆయనతమ్ముఁడు మాదయ్యకు, నూరయ్యపుట్టి సంతానహీనుండయ్యె. ఆనూరయ్యతండ్రితమ్ముఁడు రాజయ్యకు, రంగయ్య, అమరలింగయ్య, వెంకయ్యలను ముగ్గురుపుట్టిరి. అందు రంగయ్యకు, మాదయ్య, సదాశివుఁడునను నిద్దఱుకొడుకులు కలిగిరి. అందు మాదయ్యకు, సంతులేదు. ఆయనతమ్ముఁడు, సదాశివునకు, వెంకటప్పయ్యపుట్టె. ఆయనతాత తమ్ముఁడు, అమరలింగయ్యకు, నూరయ్య, గంగాధరుఁడు, వెంకటకృష్ణయ్య యను ముగ్గురుపుట్టిరి. వారలతండ్రితమ్ముఁడు వెంకయ్య సంతానహీనుండయ్యె. ఆయనతాత వీరన్న సోదరుఁడు లింగన్నకు, సంజీవరాయఁడుపుట్టె. ఆయనకు, లింగయ్య, సుబ్బయ్య, శివరామయ్యలను ముప్వురుజన్మించిరి. అందు లింగయ్యకు, సంజీవరాయఁడు పట్టాభిరామయ్యయను నిద్దఱుపుట్టిరి. వారలపినతండ్రి సుబ్బయ్యకు, వీరయ్య, రామయ్యలిద్దఱుపుట్టిరి. అందు వీరయ్యకు, వెట్టెయ్యపుట్టె. ఆయనతండ్రితమ్ముఁడు రామయ్యకు, సుబ్బయ్య నాగయ్యలనువారుపుట్టిరి. అందు సుబ్బయ్యకుఁ, గోటయ్యపుట్టె. ఆయనతండ్రితమ్ముఁడు నాగయ్యకు, రాజమౌళినాయఁడు, నారాయణయను నిరువురుపుట్టి

రి. వారలతాతతమ్ముఁడు శివరామయ్య విదేశగతుఁడయ్యెను. ఆయనతాత లింగన్నతమ్ముఁడు శివన్నకు, వెంకన్న, మాదన్న, అక్కన్న యనువారలుద యించిరి. 202

తే॥ వారుముగ్వురుప్రబలులై, వసుధయందు
నధికసత్కీర్తి వడసిర, త్యంతనిరతి
సత్యమేనిక్కమనియెంచి, సరసముగను
సాధురక్షణఁజేసిరి, సమరసమున॥ 203

తే॥ అందు వెంకయధీరుండు, నవనివిభుఁడు
కాంచెఁబుత్రులనిరువుర, ఘనతఁబూని
జల్లయాఖ్యుండునాతని, చారుసోద
రుండువీరన్న యనఁగను, రుంద్రయశుఁడు॥

వ॥ ఆచల్లన్నకు, శివన్న, నరసన్న, సుబ్బన్న, మాదన్నలను నలుగురుద్భవించిరి. అందు జ్యేష్ఠులిరువురు, సంతానహీనులైరి. తృతీయుండగు సుబ్బన్నకు, అబ్బయ్య, ఉరఫ్ బైరాగియను కుమారుండుకలిగి, కోనాయపాలెములోనుండెను. ఆయనసోదరుండగు మాదయ్యకుఁ, జల్లయ్య, కోటయ్యలను వారుపుట్టిరి. అందుఁజల్లయ్యకు, భద్రయ్య, మాదయ్యలుకలిగి వరగానివురవాస్తవ్యులై యుండిరి. వారలపినతండ్రికోటయ్యకు,భద్రయ్యపుట్టె.ఆయనకైదవతాత వెంకన్న తమ్ముఁడు పాపన్నకు, మల్లన్న, చినలింగన్న, వెంకన్నయనువారు పుట్టిరి. అందుమల్లన్నకు లక్ష్మీపతిపుట్టె. ఆయనకు, మాదన్న, మల్లన్న, బలరామన్నయను పుత్రులుపుట్టిరి. అందుమాదన్నకు, వెంకయ్యపుట్టె. ఆవెంకయ్యజనకుని తమ్ముఁడు మల్లన్నకు, లక్ష్మీపతి, నరసయ్యయనువారు పుట్టిరి. అందులక్ష్మీపతికి, వెంకయ్యపుట్టె. ఆయన పినతండ్రినరసయ్య, ఆయన పినతండ్రి జయరామయ్యకు, దత్తుఁడాయె. ఆయనకు, మల్లయ్య, జయరామయ్యలుపుట్టిరి. వారల నాలవతాత మల్లన్నతమ్ముఁడు చినలింగన్నకు, సుబ్బన్న, బలరామన్న, వీరన్న యను ముగ్గురుపుట్టిరి. అందుసుబ్బన్నకు, మాదన్న శింగరయ్య, వెంకయ్యలను, ముగ్వురుజన్మించిరి. అందుమాదయ్యకు, సూరయ్యపుట్టె. ఆయనకు, వీరభద్రయ్య, శింగయ్య, కృష్ణయ్య, పిచ్చయ్యలను నలువురు కలిగిరి. వారలతాతతమ్ముఁడు శింగరయ్యకు,సుబ్బయ్య, లింగయ్య యను నిద్దఱుకుమారులు జన్మించిరి. అందుజ్యేష్ఠుండగు సుబ్బయ్యకు లక్ష్మీపతిపుట్టె. ఆయనపినతండ్రిలింగయ్యకుఁ బెరుమాళ్లు, మల్లయ్య, రామయ్య,

యనుముప్వు రావిర్భవించిరి. వారిలతాతతమ్ముఁడు వెంకయ్య సంతానహీనుండయ్యె. ఆయనజనకునిసోదరుఁడు బలరామన్నకుఁ, బాపయ్య, జానకిరామయ్య, వెంకయ్య, బలరామయ్యలను నలుగుఁరుపుట్టిరి. అందుఁబాపన్నకు, వెంకటాద్రిమన్న, జానయ్య, యనుఁనిరువురు పుట్టిరి. అందుజానయ్యకు బాపయ్యపుట్టె. ఆయనతాతతమ్ముఁడు జానకిరామయ్య, వెంకయ్య, సంతానహీనులైరి. వారలతమ్ముఁడు బలరామన్నకునారసింహుఁడుపుట్టె. ఆయనతాతతమ్ముఁడుపీరన్నకు, మల్లయ్య,శివయ్యలను నిరువురుపుట్టిరి.అందుమల్లయ్య సంతానహీనుండయ్యె. ఆయనతమ్ముఁడు శివయ్యకు వీరయ్య,రామయ్య,లక్ష్మీపతి,అనుమువ్వురుపుట్టిరి. అందువీరయ్యకుశివయ్య,మల్లయ్యలనునిద్దఱుపుట్టిరి. వారలనాలవతాత చినలింగన్నసోదరుఁడు వెంకయ్యసంతానహీనుండయ్యె. ఆయనపితామహుఁడు నారాయణప్పతమ్ముఁడులింగన్నకుమాదన్నపుట్టె. ఆయనకువీరన్నరమణప్పలనునిరువురుకలిగిరి. అందువీరన్నకు మాదన్నపుట్టె. ఆయనకుఁగోటీశ్వరుఁడు,నల్లన్న, బుచ్చన్న,వెంకన్నలను నలుఁగురుపుట్టిరి. అందువెంకన్నకుఁ బాపన్నపుట్టె ఆయనమూఁడవతాతతమ్ముఁడు రమణప్పకు సుబ్బన్నలక్ష్మీపతియను నిరువురుకుమారులుకలిగిరి. అందుఁలక్ష్మీపతికి మాదయ్యయను వంశోద్ధారకుండుదయించె. ఆయనతోఁ గంతేరుకుదురుముగిసెను. 205

ఆత్మకూరికుదురుమూలపురుషుఁడు మాదిసీనివంశానుక్రమణిక

సీ॥ మాదిసీడఁనుమహా, మతిరామభక్తుండు, సుందరాంగుండువిశ్రుతనృపుఁడు
ఆత్మకూరిపురంబు,నందునెల్లప్పుడు, ధార్మికుండనఁనొప్పె ధరణిలోన
వైరాగ్యనిధియైన,యారాజునకుఁబుట్టి, రనుపమగుణగణఖ్యాతులగుచు
రాయరాఘవులువ,ర్తనమించులింగయ్య,సుగుణసంపత్తిచే, సుస్థిరముగ

తే॥ ధరణి సత్కీర్తిఁజెన్నొంది, తగఁజరించి
విజితరిపుధీరుఁడానంద వేత్తయనఁగఁ
బ్రబలియున్నట్టి సదయుఁడౌ, భాగ్యశాలి
యైదుగురఁబుత్రులంగాంచె, నఘములడఁగ 206

వ॥ వారలనామంబులు, అందుఁ బ్రథముండక్కన్న, ప్రతాపుఁడు, వీరరాఘవుఁడు రఘునాథము,కమలనాభుండను నైదుగురుపుత్రులుద్భవించిరి. అందుఁ బ్రథమద్వితీయులకు సంతానంబులేదు. తృతీయుండగు వీరరాఘవులు నిడమర్తి నగరవాసుండయ్యె.నీవీరరాఘవునిచరిత్రంబుముందు నిడమర్తికుదురున వివరించెద. ఇతనితమ్ముఁడు రఘునాథునిచరిత్రంబువివరించెద. 207

గీ॥ పరమపావనుఁడతిభక్తవరుఁడనంగఁ బరఁగి శివపూజసేయుచుఁ, బ్రబలగతిని
సాంఖ్యముఖపద్ధతులలోని, సారమెఱిఁగి యాత్మసుఖము పురాణసుఁ [illegible] వెలింగె
తే॥ ఆయనకుఁ గల్గె నక్కన, యనెడిసుతుఁడు సుగుణశీలుండు విగ్రహానందరుండు
పావనుండతిశాంతుండు, వానికవలమువ్వురాత్మజులుదయించి రివ్వసుధను
వ॥ వారలనామంబులెవ్వియనఁ బాపన్న, విస్సన్న, కొండన్నలు, అందు. 210
గీ॥ పాపయాఖ్యుండు సుగుణసంపన్ని ధాన, మంచికీర్తిఘనుఁడవనినెసఁగ, బరఁగి
యాత్మకూరనుశివునకు, హర్షమెసఁగ దేవళంబొండుగట్టించె దీప్తమొప్ప।
క॥ కులపావనుఁడనఁబరఁగుచు। నిలసత్కీర్తినిఁజెలంగి, యెల్లరుమెచ్చన్
గలుపవిదూరతసతతము। నిలశశిధరుస్మరణచేత, నెసఁగె దివికిన్। 212
వ॥ ఆవంశపావనుండయిన పాపన్నతమ్ముఁడు విస్సన్నకు లింగన్న, రామన్నలను నిద్దఱుపుట్టిరి. అందులింగన్నకు విస్సన్న, వీరన్నలనువారుపుట్టిరి. వారిలో వీరన్నకుసంతులేదయ్యె. విస్సన్నకువీరన్న పద్మన్నలుపుట్టిరి. అందువీరన్నసంతానహీనుండయ్యె. పద్మన్నకు వీరన్న, కొండన్న, భగవానులు, లింగన్న, అనువారు పుట్టిరి. అందు జ్యేష్ఠుండనపత్యుండయ్యె. ద్వితీయుండగుకొండన్నకు సుబ్బన్న వెంకయ్య, వీరన్న యనుమువ్వురుకలిగిరి. అందుసుబ్బన్నకు బసవయ్యపుట్టె. ఆయనకునాగయ్యకలిగి చేబ్రోలులోనుండెను. ఆయనతాతతమ్ముఁడు వెంకయ్యకుఁ బెదశివయ్య, కోటయ్య, యనువారుకలిగిరి. అందు జ్యేష్ఠునకు నరసయ్య సీతారామయ్య యనువారుదయించిరి. వారలపినతండ్రికోటయ్యకు నరసయ్యకల్గె ఆయనతాతతమ్ముఁడు వీరన్నకుబసవయ్య, చినశివయ్యయనునిద్దఱుకలిగిరి. అందు జ్యేష్ఠునకు సంతులేదు. కనిష్ఠుండగుచినశివయ్యకుసీతారామయ్య ఈరభిచ్చయ్యకలిగె. ఆయనకువెంకటపతిదత్తుఁడయ్యె. ఆయననాలవవంశపు వాఁడగు కొండన్నతమ్ముఁడు భగవానులు, లింగన్నసంతానహీనులయిరి. వారలనాలవవంశపువాఁడగు విస్సన్నకనిష్ఠసోదరుండు కొండన్నకుమాదన్నపుట్టె. ఆయనకువీరన్నకలిగె. ఆయనకుసుబ్బన్న, వెంకయ్య, వీరయ్యయనువారుపుట్టిరి. అందు జ్యేష్ఠుండనపత్యుండయ్యె. తృతీయుండగువీరన్నకుబుచ్చయ్య, పరమన్న రామన్నలను ముగ్గురుకల్గిరి. అందు బుచ్చయ్యకు, వెంకయ్య, చల్లన్న, సుబ్బయ్యలను ముగ్గురుపుట్టిరి. అందు జ్యేష్ఠునకు సంతులేదయ్యె. ద్వితీయుండగు చల్లన్నకు, శివయ్య, బ్రహ్మయ్య, చల్లయ్యయను ముగ్గురుపుట్టిరి. అందు జ్యేష్ఠుండు సంతానహీనుండయ్యె? ద్వితీయుండగు బ్రహ్మయ్యకు నర్సయ్య, శివయ్య, వీరయ్యలనువారుపుట్టిరి. వారిజనకునితమ్ముఁడు చల్లయ్యకు, సీతా

రామయ్య, కృష్ణయ్య, యను నిరువురుపుట్టిరి. వారునంబూరిలోనుండిరి. వారిముత్తాతతమ్ముఁడు పరమన్నకు జగ్గయ్యపుట్టె. ఆయనజనకునిసోదరుఁడు రామన్నకు, శివన్నయను కుమారుఁడుపుట్టె. ఆత్మకూరికుదుటిసంతతిముగిసినది.

### నిడమర్తికుదుటిమూలపురుషుఁడు వీరరాఘవుని వంశానుక్రమణిక.

సీ॥ వీరరాఘవుఁడనఁగను, వీరవరుఁడు వినవుమేఁతరిభక్తుండు, విమలకీర్తి
యార్తరక్షకుఁడనఁపగ, నవనియందుఁ బటుతరంబుగ నిడమర్తి, బ్రభువనంగ
గీ॥ ఆతనికిఁగల్గెమాదన, యనఁగఁబరఁగి దానధర్మాలచేఁ గీర్తి,తగగడించి
యిహపరంబుల కర్హుఁడై, యేపుమీఱ వంశపావనుఁడనఁగను వసుధయందు

వ॥ ఆమాదన్నకు నయ్యపనీఁడు, రుద్రప్ప, రంగప్పయను ముగ్గురుపుట్టిరి. అందు జ్యేష్ఠునకుఁ, గోదండప్ప, మాదన్న, రంగప్ప, నరసన్న, రామన్నలను నైదుగురుకుమారులుకల్గిరి. అందు జ్యేష్ఠునకు, సంతులేదయ్యె. ఆయనతమ్ముఁడు మాదన్నకు, అయ్యన్న, వెంకయ్యలను నిరువురుపుత్రులుకల్గిరి. అందయ్యన్న సంతానహీనుండయ్యె. ఆయనతమ్ముఁడు వెంకయ్యకుఁ జల్లన్న, అమరలింగన్న, వీరన్న, రామన్నలను నలువురుకుమారులుకల్గిరి. వారలతండ్రితమ్ములు, రంగప్ప, నరసన్నలు సంతానశూన్యులైరి. వారిసోదరుఁడు రామన్నకు మాదన్నపుట్టె. ఆయనతాతతమ్ముఁడు రుద్రప్పకు, అక్కన్న, నాగన్న అయ్యన్న, బుచ్చన్నలను నలుగురుజన్మించిరి. వారిజనకునిసోదరుఁడు రంగప్పకు బుచ్చయాహ్వయుఁడగు కుమారుఁడు కల్గి నిరంకురుఁడయ్యె. ఈకుదుటిపురుషులింకనున్నట్టు తెలియదు. 216

### మోపులూరికుదుటిమూలపురుషుఁడు గంగినీనివంశానుక్రమణిక.

తే॥ గంగినీఁడనుభూపతి, ఘనముగాను మోపులూరిపురంబున, మోదమలర
ఛాదరివిధానమున ఖ్యాతి,చాలఁగాంచి యధికుఁడనఁనొప్పె సత్కీర్తినధిగమించి
ఉ॥ ఆతనికిన్మహామతుల, నంతయశస్సునుదాల్చినట్టి ప్ర
ఖ్యాతిపరుల్ జనించిరతి, కాంచనతేజులు ముప్వురొప్పగా
భూతిఁజెలంగు సుందరులు, పుణ్యకృతిప్రకటాత్ములోయనన్
జేతులదానధర్మములు, సేయుచునుండిరి వారలాదటన్. 218

వ॥ తద్భ్రాతలలో జ్యేష్ఠుండు పెదబాపినీఁడు, ఆయనతమ్ములు, చినబాపినీఁడు, వెంకటాద్రియనువారు, అందుఁ జినబాపినీనికి, వెంకటపతిపుట్టె. ఆయనకు లింగన్నజనించె. ఆయనకు, కిచ్చన్న, వీరన్న, వెంకయ్య, శివయ్యలను నలు

పురుపుట్టిరి. అందుఁ గిచ్చయ్యకు, జల్లన్న పుట్టె. ఆయనకుఁ బెదబాపనయ్య చిన్నబాపనయ్యలను నిద్దఱుపుట్టిరి. వారలతాతతమ్ముఁడు సింగన్నకు, రామన్న, లక్ష్మన్నయను నిరుపురుపుట్టిరి. వారల జనకునిసోదరుఁడు నాగయ్యకు, లింగన్న, అక్కన్న, రామన్నలను ముగ్గురుకొడుకులుపుట్టిరి. వారల వంశాభివృద్ధిని యోజింపఁగా నెందునుంగానంబడదయ్యె. 219

## తాడిగుమ్మకుదుటిమూలపురుషుఁడు మాదన్న వంశానుక్రమణిక.

తే॥ మాదయాఖ్యుండు సదయుండు, మానధనుఁడు
పరఁగ భూసురభక్తిచే, భవ్యరుచిని
సుప్రతోన్నతిఁ జెన్నొంది, సుస్థిరముగఁ
దాడిగుమ్మపురేంద్రుఁడై, తనరుచుండె. 220

తే॥ ఆతనికిఁగల్గెనయ్యన్న, యనెడిసుతుఁడు బుధజనావళి సద్భక్తిఁ బూజచేసి
యిహపరంబులకర్హుఁడై, హితమనీష వైభవోన్నతిచేనింపె, వసుధయందు

వ॥ ఆయయ్యన్నకు, మాదన్న, వీరన్న, వెంకన్న, అక్కన్న, చినక్కన్న, సీతన్నయను నార్గురుకుమారులుపుట్టిరి. అందు మాదన్నకు, వీరన్న పుట్టె. ఆయనకుఁ జినవీరన్న కల్గె. ఆయనకుఁ బాపన్న జనించె. ఆపాపన్న ముత్తాతతమ్ముఁడు వీరన్నకు, విస్సన్న, నాగన్న, సుబ్బయ్య, వెంకయ్య, అయ్యన్న, మల్లన్న, పాపయ్యయను నేడుగురుపుత్రులుపుట్టిరి. అందు విస్సన్నకు, రామయ్య పుట్టె. ఆయనపినతండ్రి నాగయ్యకు, నరసయ్యపుట్టె. ఆయనకు రామయ్య పుట్టె. ఆయనకు, నరసయ్య, రామన్న, వెంకయ్యలనుముగ్గురుపుట్టిరందు. 222

సీ॥ పౌరుషవాక్కులఁ, బ్రబలుచునున్నట్టి, నయగుణోపేతుఁడౌ, నరసయాఖ్యుఁ
డాతనిసోదరుం డతిభుజబలశాలి రామయాహ్వయుఁడగు, రాజవరుఁడు
భీకరాకారత, బెబ్బులింబోలిన, వేంకటాహ్వయుఁడగు, వీరవరుఁడు
వీరిమువ్వురశత్రు, వీరులుగనుఁగొన్న, గుండెలుబ్రద్దలై క్రుంగిపోదు
తే॥ రౌరయవ్వారిధైర్యము, హత్త్వమెన్న నేరితరమౌనుబుద్ధిచే, నెంతొమించి
వైభవోన్నతిఁ జెన్నొంది, ప్రాభవమునహెచ్చియుండిరి రాజేంద్రులెల్లమెచ్చ

వ॥ అందునరసయ్యకు, నాయఁడమ్మపుట్టె. ఆయనకు, తుక్కయ్య, అప్పయ్య రామయ్య, వెంకయ్య, నరసయ్యలనువారలుకలిగిరి. వారలపితామహుఁడు నరసయ్యరెండవతమ్ముఁడు వెంకయ్యకు. సంతులేదయ్యె. ఆయనవ్యవహితభ్రాతరామయ్యకు, మాళయ్యపుట్టె. ఆయనకు నాగన్నపుట్టె. వారలు కోనూరిలోనుండిరి. ఆయన నాలవతాత నాగన్నతమ్ముఁడు సుబ్బయ్యకుఁ

బాపయ్య పుట్టె. ఆయనపినతండ్రి వెంకయ్యకు విస్సన్న పుట్టె. ఆయనకు వెంక న్న పుట్టె. ఆయనకు లింగన్న, సంజీవరాయఁడునను నిరువురు కల్గిరి. అందు లింగన్నకు శేషయ్య పుట్టె, ఆయనకు బసవయ్య, సుబ్బయ్యలను నిద్దఱు పుట్టిరి. వారు వడ్లమూడిలోనుండిరి. వారలపితామహునితమ్ముఁడు, సంజీవరాయనికి, లింగయ్య, శేషయ్య, వెంకయ్యలను మువ్వురు కలిగిరి. వారల నాల్గవ తాత వెంకయ్య తమ్ముఁడయ్యన్నకు, కిచ్చన్న పుట్టె. ఆయనపినతండ్రి మల్లన్నకుఁ బాపన్న పుట్టె. ఆయనపినతండ్రి పాపన్నకు, లింగన్న యావిర్భవించె. ఆయన తాతతమ్ముఁడు వెంకయ్యకు, రాజులు, అక్కన్న, చల్లన్న, నాగన్న యను నల్గురు పుట్టిరి. అందు రాజులకు సుబ్బయ్య, పకీరయ్య, అను వారు జన్మించిరి. వారలజనకునితమ్ముఁడక్కయ్యకు, సుబ్బయ్య పుట్టె. ఆయనపినతండ్రి చల్లయ్యకు, మాదన్న పుట్టె. ఆయనపినతండ్రి నాగయ్యకు, అక్కన్న పుట్టె. అక్కయ్యకు, చల్లన్న, మాదయ్య, వీరయ్య యను మువ్వురు జన్మించిరి. ఇంతవఱకు, తాడిగుమ్మకుదురు ముగిసెను. 224.

## పల్లగిరికుదురు మూలపురుషుఁడు వెంకటాద్రివంశానుక్రమణిక.

శా॥ సారాచారవిచారశోభితుఁడు స, త్సౌందర్యధుర్యుండు బల్
వీరాగ్రేసరుఁడంచితుండు రిపురాడ్భీకారి, యౌదార్యగం
భీరుండుత్తమసంస్తుతుండు బుధసంప్రీతిక్రియాశ్రీయుతుం
డారాజన్యుఁడు వేంకటాద్రియను మర్త్యాధ్యక్షుఁడొప్పారెడిన్ ॥ 225

తే॥ పల్లగిరిపట్టణంబునఁ, బ్రబలగతిని। నార్తరక్షకుఁడననొప్పి, యవనివిభుఁడు
శశినిభాననుఁడతిధైర్య, శాలి కాంచె। సుతులనిరువుర, భువనాధిపతులనంగ॥

వ॥ వారలలో జ్యేష్ఠుండు మాళయ్య, కనిష్ఠుండు రామయ్య, అందు మాళయ్యకు, నాగన్న పుట్టె. ఆయనకు సూరయ్య జన్మించె. ఆయనకయ్యపనీడు కలిగె. ఆయనకు వీరన్న, నారసింహుఁడు, సూరయ్య, యను మువ్వురావిర్భవించిరి. అందు వీరయ్యకు బుచ్చయ్య కల్గె, ఆయనపినతండ్రి నారసింహునకు, కిచ్చన్న, మాదయ్యలు పుట్టిరి. అందుఁ గిచ్చన్నకుఁ, గిచ్చన్న, నాగయ్య, మాదయ్య, వెంకయ్య, నరసయ్యలను నలుగురుద్భవించిరి. అందుఁ బ్రథమ, తృతీయ, చతుర్థ, పంచములకు, సంతు లేదు. ద్వితీయుండగు నాగయ్యకుఁ జంద్రమౌళి, కిచ్చయ్య, రాజమౌళి, యను మువ్వురు వంశపావనులు పుట్టిరందు॥ 227

తే॥ చంద్రమౌళియనంగను, నింద్రనిభుఁడు,
నైభవోన్నతిఁ జెన్నొందె, వసుధయందు

కమ్మకులభూషణుండన, ఘనతకెక్కి
సకలశాస్త్రవివేకియై, సమరసమున॥ 228

శా॥ శ్రీలక్ష్మీకరుణాకటాక్షజనిత, శ్రీపూర్ణభద్రాత్ముఁడై
ఫాలాక్షున్ వరదానదక్షుమదిసం, భావించుచున్ నిచ్చలున్
జాలంగా సుజనావళీ విమలవాంఛాపూర్తిఁగావించుచున్
మేలుంగాలమువెళ్లఁబుచ్చుచుధరన్ మిత్రాళితోవర్తిలున్॥ 229

వ॥ అయ్యనఘాత్మునకు వెంకటకృష్ణయ్య సూరయ్య, భద్రయ్యలను ముగ్గురు కల్గిరి. అందుజ్యేష్ఠునకు శ్రీమంతుపుట్టె. ఆయనకుఁ జంద్రమౌళిజనించె. ఆయనపినతాత సూరయ్యకు, సకలవిద్యావివేకియగు వెట్టయ్య, జన్మించె. ఆయనపినతండ్రి భద్రయ్య సంతానహీనుండయ్యె. తజ్జనకునితమ్ముఁడు కిచ్చయ్య చరిత్రమును వర్ణించెద॥ 230

తే॥ సుగుణశీలుండు విజయ యశోధనుండు
నిర్మలాత్ముండువిపులాంగ, నియతుఁడరయఁ
గుటిలదూరస్థుఁడటుగాంచెఁ గూర్మితోడఁ
బ్రబలపుత్రుల నలువురఁ, బటిమమీఱ॥ 231

వ॥ అక్కుమారులకునాగయ్య, వెంకయ్య, మొట్టయ్య, నరసయ్యయని యథాక్రమంబుగ నామంబులొప్పె. అందునాగయ్యకుఁ గోటయ్యపుట్టె. ఆయనకుఁ గిచ్చయ్యపుట్టె. ఆయనపినతాతవెంకయ్యకుఁ గోటయ్య, వెంకటప్పయ్య, చంద్రమౌళి, వెంకటకృష్ణయ్య, వెంకటసుబ్బయ్యయను నైదుగురుపుత్రులుపుట్టిరి. వారలపినతండ్రి మొట్టయ్యకు వెంకటకృష్ణయ్యపుట్టె. ఆయన తాతతమ్ముఁడు రాజమౌళిచరిత్రంబువర్ణించెద॥ 232

తే॥ పరమపావనుఁడుదితుండు, భవ్యయశుఁడు
వీతరాగుండు విజ్ఞాన విభవమూర్తి
పాపదూరుండు సకలార్థపరవివేకి
సత్యసంధుండు తగహరిశ్చంద్రుఁ డనఁగ॥ 233

సీ॥ ఆడినమాటనేనాఁడు తప్పనటన్న, గరిమచేఁగాలంబుఁ గడపువాఁడు
ఆర్తరక్షణకృత్య, మన్ననాసొమ్మన్న, పూనికనామరణంబుఁ, బూనువాఁడు
సర్వేంద్రియజయప్ర, సక్తినాహక్కన్న, నెఱదీక్షఁదగుపట్లఁ, బరగువాఁడు
విద్వత్కవిప్రభావప్రోద్వర్తనజ్ఞాన, మఖిలార్థసాధకం, బనెడువాఁడు

తే॥ విపులవక్షఃకవాటుండు, వివిధనృపతి।మూర్ధమకుటోజ్జ్వలన్మణీ, పుంజరంజి
తాంఘ్రిసరసీరుహుండు ది, వ్యాంతరంగుఁ।డలరెనారాజమౌళిసి, స్తుతప్రశస్తి
వాసిరెడ్డిమహావంశ, వర్ధనుండు॥ 234

తే॥ సూర్యదేవరవారింట, సొంపుగాను।జోగయామాత్యుపత్నియౌ, సుబ్బమాంబ
యందుజన్మించె మిగులఁబు,ణ్యవతిసుమతి।వెన్నమాంబయనంగను,విమలచరిత॥

మ॥ పరమానందమయాంతరంగయగుచు, న్విజ్ఞానసంపన్నయై
వరసాధ్వీమణియైన యయ్యువిద, న. వ్వారెంతొసంతుష్టితో
సరసత్వంబుననిచ్చి వృద్ధిపఱుపన్, సత్కాలదివ్యప్రభన్
బరవంశోద్భవుఁ బెండ్లిఁజేయఁగను ద,ద్వామాక్షిగర్భంబునన్॥ 236

తే॥ హనుమయామాత్యుఁ డనఁగను,హర్షమెసఁగ
నిష్కళంకుండు, ధీరుండు, నియతిపరుఁడు
నిహపరంబులకీర్తిచే, నేపుమీఱు
భాగ్యవంతుండుపుట్టెను, బ్రబలెభువిని॥ 237

తే॥ అమ్మహాత్మునిసోదరుం, డవనివిభుఁడు
సుందరాంగుండు, యోగ్యుండు, సువ్రతుండు
ధార్మికగుణుండు, సీతాప, దప్రయుక్త
రామయాఖ్యుండుజన్మించె రహిఁజెలంగి॥ 238

సీ॥ బాలార్కతేజుండు, పార్వకాబ్జాస్యుండు, వితతవక్షశ్శాలి, భీమబలుఁడు,
గంభీరవచనుండు, కమలాయతాక్షుండు, కాంచనగాత్రుండు, ఘనభుజుండు
శ్రీకారసమకర్ణ, సిద్ధిగల్గినవాఁడు, ధైర్యసాహసలక్ష్మి, తనరువాఁడు
శాత్రవవిజయవి, శాలకీర్తిధనుండు, శరశోభికరకంజ, సంయుతుండు

తే॥ వితరణాసక్తిమదినెప్డు, వెలయువాఁడు
వాసిరెడ్డ్యన్వయాంభోధి, వనజవైరి
ధర్మపథవర్తిసీతాప, దప్రయుక్త
రామయాహ్వయుఁడొప్పారు, భూమియందు॥ 239

వ॥ ఈసీతారామప్రభుండు రాజశేఖరుండగు రాజమౌళినాయనికి దత్తుండయ్యె। ఆసీతారామయ్య తాతతమ్ముఁడు మాదయ్యకు వీరభద్రయ్యపుట్టె. ఆయనకు నాయఁడమ్మ, నరసయ్య యనుసిద్దఱుపుట్టిరి. అందునాయఁడమ్మకు వీరయ్య, సుబ్బయ్య, మాదయ్య, వెంకయ్య లను నలుగురుపుట్టిరి. అందువీరయ్యకు

కమ్మకులభూషణుండన, ఘనతకెక్కి
సకలశాస్త్రవివేకియై, సమరసమున॥ 228

శా॥ శ్రీలక్ష్మీకరుణాకటాక్షజనిత, శ్రీపూర్ణభద్రాత్మజుం
డాలాత్మున్ వరదానదక్షుమదిసం, భావించుచున్ నిచ్చలున్
జాలంగా సుజనావళీ విమలవాంఛాపూర్తిఁగావించుచున్
మేలుంగాలమువెళ్లఁబుచ్చుచుధరన్ మిత్రాళితోవర్తిలున్॥ 229

వ॥ అయ్యనఘాత్మునకు వెంకటకృష్ణయ్య సూరయ్య, భద్రయ్యలను ముగ్గురు కల్గిరి. అందు జ్యేష్ఠునకు శ్రీమంతుపుట్టె. ఆయనకుఁ జంద్రమౌళిజనించె. ఆయనపినతాత సూరయ్యకు, సకలవిద్యావివేకియగు వెట్టయ్య, జన్మించె. ఆయనపినతండ్రి భద్రయ్య సంతానహీనుండయ్యె. తజ్జనకునితమ్ముఁడు కిచ్చయ్య చరిత్రమును వర్ణించెద॥ 230

తే॥ సుగుణశీలుండు విజయ యశోధనుండు
నిర్మలాత్ముండువిపులాంగ, నియతుఁడరయఁ
గుటిలదూరస్థుఁడటుగాంచెఁ గూర్మితోడఁ
బ్రబలపుత్రుల నలువురఁ, బటిమమీఱ॥ 231

వ॥ అక్కుమారులకునాగయ్య, వెంకయ్య, ముత్తయ్య, నరసయ్యయని యథాక్రమంబుగ నామంబులొప్పె. అందునాగయ్యకుఁ గోటయ్యపుట్టె. ఆయనకుఁ గిచ్చయ్యపుట్టె. ఆయనపినతాతవెంకయ్యకుఁ గోటయ్య, వెంకటప్పయ్య, చంద్రమౌళి, వెంకటకృష్ణయ్య, వెంకటసుబ్బయ్యయను నైదుగురుసుపుత్రులుపుట్టిరి. వారలపినతండ్రి ముత్తయ్యకు వెంకటకృష్ణయ్యపుట్టె. ఆయనతాతతమ్ముఁడు రాజమౌళిచరిత్రంబువర్ణించెద॥ 232

తే॥ పరమపావనుఁడుదితుండు, భవ్యయశుఁడు
వీతరాగుండు విజ్ఞాన విభవమూర్తి
పాపదూరుండు సకలార్థపరవివేకి
సత్యసంధుండు తగహరిశ్చంద్రుఁ డనఁగ॥ 233

సీ॥ ఆడినమాటనేనాఁడు తప్పనటన్న, గరిమచేఁగాలంబుఁ గడపువాఁడు
ఆర్తరక్షణకృత్య, మన్న నాసామ్మన్న, పూన్కి నామరణంబుఁ, బూనువాఁడు
సర్వేంద్రియజయప్ర, సక్తినాహా కన్న, నెటిదీక్షఁదగుపట్లఁ, బరగువాఁడు
విద్వత్కవిప్రతిభాప్రౌఢ్వ, ర్తనజ్ఞాన, మఖిలార్థసాధకం, బనెడువాఁడు

తే॥ విపులవక్షఃకవాటుండు, వివిధనృపతి।మూర్ధమకుటోజ్జ్వలన్మణీ, ప్రూజరంజి
తాంఘ్రిసరసీరుహుండు ది, వ్యాంతరంగుఁ।డలరెనారాజమాళిసి, స్థులప్రశస్తి
వాసిరెడ్డిమహావంశ, వర్ధనుండు॥ 234

తే॥ సూర్యదేవరవారింట, సొంపుగాను।జోగయాహ్వాయుపత్ని యా, సుబ్బమాంబ
యందుజన్మించె మిగులఁబు,ణ్యవతిసుమతి।విస్సమాంబయనంగను,విమలచరిత॥

మ॥ పరమానందమయాంతరంగయుఁదిద, వ్యజ్ఞానసంపన్నయై
వరసాధ్వీమణియైన యయ్యువిద, న. వ్వారెంతొసంతుష్టితో
సరసత్వంబుననిచ్చి వృద్ధిపఱుపన్, సత్కాలదివ్యప్రభన్
బరవంశోద్భవుఁ పెండ్లిఁజేయఁగను ద,ద్వామాక్షిగర్భంబునన్॥ 236

తే॥ హనుమయాహ్వాయుఁ డనఁగను, హర్ష మెసఁగ
నిష్కళంకుండు, ధీరుండు, నియతిపరుఁడు
నిహపరంబులకీర్తిచే, నేపుమీఱు
భాగ్యవంతుండుపుట్టెను, ప్రబలెభువిని॥ 237

తే॥ అమ్మహాత్మునిసోదరుం, డవనివిభుఁడు
సుందరాంగుండు, యోగ్యుండు, సువ్రతుండు
ధార్మికగుణుండు, సీతాప, దప్రయుక్త
రామయాఖ్యుండుజన్మించె రహిఁజెలంగి॥ 238

సీ॥ బాలార్కతేజుండు, పార్వికాబ్జాస్యుండు, వితతవక్షశ్శాలి, భీమబలుఁడు,
గంభీరవచనుండు, కమలాయతాక్షుండు, కాంచనగాత్రుండు, ఘనభుజుండు
శ్రీకారసమకర్ణ, సిద్ధిగల్గినవాఁడు, ధైర్యసాహసలక్ష్మి, తనరువాఁడు
శాత్రవవిజయవి, శాలకీర్తిధనుండు, శరశోభికరకంజ, సంయుతుండు

తే॥ వితరణాసక్తిమదినెప్డు, వెలయువాఁడు
వాసిరెడ్డ్యన్వయాంభోధి, వనజవైరి
ధర్మపథవర్తి సీతాప, దప్రయుక్త
రామయాహ్వాయుఁడొప్పారు, భూమియందు॥ 239

వ॥ ఈసీతారామప్రభుండు రాజశేఖరుండగు రాజమాళినాయనికి దత్తుండయ్యె। ఆసీతారామయ్య తాతతమ్ముఁడు మాదయ్యకు వీరభద్రయ్యపుట్టె. ఆయనకు నాయఁడమ్మ, నరసయ్య యనునిద్దఱుపుట్టిరి. అందు నాయఁడమ్మకు వీరయ్య, సుబ్బయ్య, మాదయ్య, వెంకయ్య లను నలుగురుపుట్టిరి. అందువీరయ్యకు

సంతులేదయ్యె. ఆయనసోదరుఁడు సుబ్బయ్యకు వెట్టెయ్య, వెంకటాద్రి యను
యిద్దఱుపుట్టిరి. వారిపినతండ్రి మాదయ్యకు భద్రయ్య, నాయుఁడమ్మ యను
నిద్దఱు జన్మించిరి. అందు భద్రయ్యకు రామస్వామి, వెంకటసుబ్బయ్య యను
నిద్దఱుపుట్టిరి. వారలతాతతమ్ముఁడు వెంకయ్యకు వీరయ్య, కోటయ్య యను
నిరువురు జన్మించిరి. వారలతాతతమ్ముఁడు సరసయ్యకు వీరయ్యపుట్టె. ఆయు
న సంతానహీనుండయ్యె. ఆయననాల్గవతాత నారసింహునితమ్ముఁడు సూర
యాఖ్యుని ప్రభావము వివరించెద॥ 240

సీ॥ సూరయాహ్వయుఁడన, శూరుండు ధీరుండు, సువ్రతశీలుండు, సుగుణుండు
నిర్వికల్పసమాధి, నిష్ఠచేనాతండు, బుధహితుండై గొప్పె, భూమిఁ
నమ్మహామహునకు, నంచితోల్లాసులు, భవ్యచరిత్రులు, ప్రబలయశులు
వీరయాహ్వయుఁడను, వీరాగ్రగణ్యుండు, సుబ్బయాఖ్యుండను, సుగుణుండు

తే॥ మల్లయాభిఖ్యుఁడనఁగను, మానధనుఁడు
బుచ్చయాహ్వయుఁడనఁగను, బుద్ధిశాలి
పుట్టిరినల్వురుత్తమ, పురుషులనఁగఁ
గీర్తిచేమించిరఘుశూన్య, మూర్తులగుచు॥ 241

తే॥ అందువీరయయనఁగన, నంతబుద్ధి। సంగరోల్లాసుఁడత్యంత, శక్తిశాలి
ఆర్తరక్షణపరుఁడును, హాగురుండు। శుభ్రమానసుఁడతిహిత, సుకృతిపరుఁడు॥ 242

శా॥ ఆరాజన్యసహోదరుండు సుగుణ, వ్యాప్తుండు సుశ్రీయుతుం
డౌరా యంచు నుతింపనర్హమగు మే, లౌశీలముంగల్గువాఁ
డేరిశత్రులటంచు నిర్భయముగా, నెగ్గెత్తిగర్జించి వి
స్తారప్రాకటశక్తినీ, శ్వరుకృపన్ సాధించువాఁడెప్పుడున్॥ 243

సీ॥ సకలగుణాఢ్యుండు, సారసనేత్రుండు, చంద్రనిభాస్యుండు, జగతివిభుఁడు
క్షాత్రతేజోమూర్తి, శ్యామలగాత్రుండు, సంగరశీలుండు, సాంద్రయశుఁడు
రాజరాజైనట్టి, రాజవరేణ్యుఁడౌ, గజపతియనురాజ, ఘనునిగోర్కె
దర్శనంబొనరించి, తగుగౌరవంబున, మన్ననమర్యాద, మనుజవిభుని

తే॥ పేరనందెనుసత్కీర్తి చెన్నుమీఱ
వంశపావనుఁడైనట్టి, వాసిరెడ్డి
సుబ్బయాహ్వయుఁడనఁగను, శూరవరుఁడు
ప్రజ్వరిల్లెనుబటిమచే భవ్యరుచిని॥ 244

సీ॥ ఏవేళఁజూచిన, నీబలాఢ్యుఁడు రాజులసన్నిధి, రమ్యముగను
నంచితోల్లాసత, నతిధైర్యపటిమచే, దద్భూమివరులచే, ధరణియందు
సంమానములనొంది, సారసనేత్రుండు, నిజశక్తిపటిమచే, నిరుపమముగఁ
బాటిల్లిసతతంబు, బాగుగానృపులతో, సఖ్యంబుసేయుచు, సాహసమున
తే॥ సంగరావనిలోఁదాను, భంగపడక
ధైర్యమేపారభుజదర్ప, ధాటిమెసఁగ
రాచచిన్నెలనలరారు, రాజవిభుఁడు
సర్వవిషయసమర్థుఁడై,జగతిఁబ్రబలె॥ 245

వ॥ ఆయనతమ్ముఁడైన మల్లయాహ్వయుండు శివపూజాధురంధరుండును, రాజసమ్మానపాత్రుండునునై యతిశయిల్లె. ఆయనతమ్ముఁడు బుచ్చయాహ్వయుండు సుగుణసంపత్తిచే నతిశయిల్లె. అతని జ్యేష్ఠసోదరుండైన వీరన్నకు సంతులేదయ్యె. ఆయనతమ్ముండును పైనుదాహరింపఁబడినవాఁడును నగు సుబ్బయాహ్వయునకు, రమణయ్య, వెంకయ్య, నాగయ్య, శాయన్నలను, నలువురుపుట్టిరి. అందురమణయ్యకు, అచ్చయ్య, సూరయ్య, మాదయ్య, లింగయ్యలను నలువురావిర్భవించిరి. అందచ్చయ్యకు వీరయ్య, లక్ష్మయ్యయను నిద్దఱుపుట్టిరి. ఆయచ్చయ్యతమ్ముఁడు సూరయ్యప్రభువంశంబువివరించెద. 246

గీ॥ సూరయాహ్వయుఁడనఁగను, సువ్రతుండు
సత్యసంధుండు సమగస, సంగతుండు
నిర్మలానందుఁడయి మంచి, నియతివలన
గౌరివిభుభక్తిచేఁదద్ద, ఘనతఁగాంచె॥ 247

గీ॥ జోగమాఖ్యాభిభార్యయగా, సుందరాంగి సుబ్బమాంబయనందగు, సుగుణరాశి
కూర్మిచేఁగాంచెనొకలేమ, గోత్రభూప బుధనుతోత్తరమైనట్టి, బుద్ధిమతిని 248

సీ॥ వెంకమాంబయనంగ, విజ్ఞానశాలిని, బాల్యప్రాయమునుండి, భవ్యనియతి
వీతరాగయుమహా వీరపతివ్రత, సద్గుణసంపత్తి, సంగతయును
గురుకటాక్షంబంది,గుణుతులన్నియుఁగాంచి, విజ్ఞానఘనయాచు వెలిఁగిపూర్ణ
నిర్వికల్పసమాధి, నియతిచేఁదనరారి, నిర్మలపరతత్వ, నేత్రియగుచు
తే॥ నలపరబ్రహ్మయోగమో, దానుభావ
మందితగుసాధ్విపరిణయంబందిసూర
యాహ్వయుఁడుకాంచెఁ బుత్రులహర్షమెసఁగ
శాంతమూర్తులనలువుర, సరసమతుల॥ 249

గీ॥ అందు జ్యేష్ఠుండు కోటయా, హ్వాయుఁడు శ్రేష్ఠుఁ
డంచితుం డుత్తముండు ది, వ్యద్యశుండు
శ్రీయుతుండును సుగుణుండు, స్థిరగుణుండు
రాజపూజ్యుండు బహుదీనరక్షకుండు॥ 250

గీ॥ దానధారాసముద్భూత, తతయశుండు
పరమభక్తుండు బుధజనా, దరరతుండు
భగవదానందపరుఁడు కృపాళుఁడగుచు
గోత్రపావనుఁడై యొప్పెఁ, గూర్మిఁ గోడ 251

గీ॥ అట్టి కోటయనాయని, కవనివిభున
కుద్భవించెను బుధపోష, ణోచితుండు
జోగయాహ్వయుఁడనగను, భోగశాలి
సత్యవాక్తత్పరుండును, సరసతముఁడు॥ 252

తే॥ అట్టి జోగయ్యకును బుట్టె, హర్షమెసఁగ। సుగుణశీలుండు ధీరుండు, సుందరుండు
కోటయాహ్వయుఁడనఁగను, కుశలబుద్ధి, లలితలావణ్యతనుకళా, లక్షణుండు 253

క॥ అమ్మనీయు నిజనకుని। తమ్ముఁడు విజితేంద్రియుండు, ధర్మాత్ముఁడు ని
త్యమ్మును సీతారాముఁడు। కమ్మకులాధ్యక్షుఁడనఁగ ఘనత వహించెన్ 254

గీ॥ రామకార్యానుకూలుండు, రమ్యమూర్తి
పరమభాగవతుండును, భవ్యయశుఁడు
భాగ్యవంతుండు సుగుణుండు, పావనుండు
నిష్కళంకుండు సుముఖుండు, నిర్మలుండు॥ 255

గీ॥ శాఖమూర్వంశజాతుండు, సమరసుండు। మించె సత్కీర్తి చేతల, తిమ్మపతియనఁగ
నతసి సతియగు శ్యామలాంబాఖ్యయింతి। వారలకుఁ గల్గెను బ్బాంబ వనజనేత్ర॥

గీ॥ ఘనముగా నాపెసతియయ్యెఁ గాంతి మెఱయ। రాణ సీతాపదాంచిత రామయకును
వారలిరువురు గాంచిరి, భూరితేజు। సుబ్బయాభిఖ్యు ననవద్య, సూరిభక్తు॥ 257

గీ॥ నాగమాంబ యనంగను నలిననేత్ర। యైనయొక పుత్రిక యుఁగల్గె నంచితముగ
ప్రథమభార్య గతింపఁగాఁ బార్వతిసతి। యందుఁ గోదండరామయ్య యనజనించె॥

గీ॥ ఆయన పితృవ్యుఁడయినట్టి యవనివిభుఁడు। విమలవైరాగ్యశీలుండు, విపులకీర్తి
వంశపావనుఁడో యన, వాసికెక్కి। ప్రజ్వరిల్లెను నిష్కల్మష భావమునను 259

గీ॥ వివిధవిద్యలు చదివిన, యవనివిభుఁడు। రాజసన్నుతిపాత్రుండు రమ్యగుణుఁడు
గురుతరంబగు మన్ననల్ గొన్నవాఁడు। మెఱసె వెంకటసుబ్బయ్య మిన్నయనఁగ 260

గీ॥ సారవార్థ్యంబువాక్యంబుగలుగునట్లు
హూణభూపాలకులచేత నొప్పు మెప్పు
గాంచినమహత్త్రయశుండు ఘనభుజుండు
దివ్యగుణమూర్తివిమలసంభావ్యకీర్తి॥ 261

సీ॥ నియతిచేనైజాము నిజభూములందున నధికారవులఁజాలనందముగను
సత్యసంధుండను పరసాంకములతోడఁబాలన చేసిన ప్రభువరుండు
గురురాజుపాదుషా గరిమార్హుఁడగుతేని దర్శనంబందినతతయశుండు
రామదేవాలయం, బీమేదినినిగట్టఁజేసిన పుణ్యప్రసిద్ధిగుణుఁడు

తే॥ వనతటాకాదిసత్ప్రతి,ష్ఠనుబొనర్చి,
మేలుఁగాంచినధన్యుండు మిత్రకంజ
మిత్రుఁడైయుండెమదిలోన, మించుభక్తి
సొంబుఁగొల్చుచుశుద్ధచిత్తాబ్జమందు॥ 262

గీ॥ అట్టివానికినన్నయా, నవనిపభుఁడు
రాణసీతాపదాంచిత, రాముఁడెపుడు
తమ్మునకుఁదోడుగానుండి, సమ్మతముగ
ధర్మకార్యంబులను జేసె, నిర్మలముగ॥ 163

గీ॥ అట్టివెంకటసుబ్బదాసాహ్వయుండు పటిమచేమించివర్ధిల్లెఁ బ్రబలగతిని
నిహపరంబులకర్హుఁడై, యేపుమీఱియొక్కయోషనుబెండ్లాడెనొప్పుగాను॥ 264

వ॥ ఆమెజననీజనకుల నామంబులవివరించెద॥ 265

సీ॥ సూర్యదేవరవంశ, సుప్రసిద్ధుండైన, సంజీవరాయని, సతియసంగఁ
బరమపతివ్రతా,వరమణియైనట్టి, రంగమాంబాభిఖ్య, రమణియందు
సుబ్బమాంబాభిఖ్య,సొంపైనపుత్రిక, యుద్భవించెనునొక్క,యుత్తమాంగి
తత్తన్విఁశత్సుబ్బ,దాసుండుపరిణయం, బాడెనుఁబ్రీతిచేననుపమోఱయ

తే॥ కాంచిరవ్వారునార్వురఁగాన్పునందు।నందుఁబెద్దదియన్నపూర్ణాంబయనఁగ
సత్యగుణపేటివిజ్ఞాన,సాంద్రబుద్ధి, యామెసోదరిసీతమ్మ,యబ్జనేత్ర॥ 266

ఉ॥ సుందరమూర్తియుఁబ్రబల, సువ్రతశీలుఁడు సారసాత్వుడున్
మందరధీరుఁడున్ మిగులమాన్యుఁడు భూరిభుజాప్రకాశుఁ డిం
పొందఁగ గౌరవోన్నతుఁడు, నుత్తమవంశవిభూషణుండు చే
న్నొందెను శ్రీసదాశివుఁడు, యోగ్యతమంబగునామమొప్పఁగన్॥ 267

సీ॥ ఆతనితమ్ముండు, శీతాంశువదనుండు, సుందరాకారుండు, సుస్థిరుండు
బాలార్కతేజుండు, పటుధైర్యశాలియు, నిర్మలగాత్రుండు, నిలిపెరుండు
పార్థసారథిపద, ప్రచురప్రసాదనా, యుఁడనంగనొప్పెడు, నంచితుండు
సహజుఁడాతనికిఁగం, జదళాక్షుఁడగు రామ, నాయండనంగ న, మీయనిష్ఠ
తే॥ యతనికనుజుండు, శ్రీమల్లికార్జునుండు। సుస్థిరయశుండుజ్ఞానని, శుద్ధబుద్ధి
వీరికినమంగుసోదరి వెంకమాంబ। కవినుండిరి తుమ్మపూడీపురమందు 268

వ॥ వారల తండ్రిసోదరియగు వెట్టెమాంబయను కన్యకారత్నంబును, శాఖమూరివంశోద్భవుండగు సుబ్బయాఖ్యునకిచ్చి, పరిణయంబును గావించిరి. ఆమె పినతండ్రులు మాదయ్య, లింగయ్యలు, సంతానహీనులైరి. వారిపినతండ్రులు ద్వితీయతృతీయులు సంతానహీనులైరి. వారితమ్ముఁడు శాయన్నకు నాగయ్య, సూరయ్య, మాదయ్య, వెంకయ్యయను నలుగురుపుత్రులు పుట్టిరి. అందు నాగయ్యకులక్ష్మయ్యపుట్టె. ఆలక్ష్మయ్యకునాగయ్యపుట్టె. ఆయనన ష్టె మూడిలోనుండెను. ఆయనముత్తాతతమ్ముఁడు సూరయ్యకు నర్సయ్య, సుబ్బయ్యలను నిద్దఱుపుట్టిరి. వారిపినతండ్రి మాదయ్యకు శివరామయ్య, నాగయ్యలుజన్మించిరి. అందుశివరామయ్యకు లింగయ్య, వెంకటప్పయ్యలను నిద్దఱుపుట్టిరి. వారిలో వెంకటప్పయ్య వైష్ణవభక్తుండును, సద్గుణసంపన్నుండును, బ్రహ్మచారివ్రతుండునై ప్రసిద్ధికెక్కె. వారల పినతండ్రి నాగయ్యకు శివరామయ్యపుట్టె. ఆయనతాతతమ్ముఁడు వెంకయ్యకు శాయన్న, వీరయ్య, సుబ్బయ్య, నర్సయ్యయను నలువురుపుట్టిరి. అందుశాయన్నకుఁ గోటయ్య, వెంకటప్పయ్య, నాగయ్య, హనుమయ్యయను నలువురుపుత్రులుపుట్టి సంతానహీనులైరి. వారల తండ్రితమ్ముఁడనపత్యుండయ్యె. ఆయన ముత్తాతతమ్ముఁడు మల్లన్నకు, బుచ్చయ్య, సుబ్బయ్య, వీరయ్యలను ముగ్గురుపుట్టిరి. అందు సుబ్బయ్యకు వీరన్నపుట్టె. ఆయనకు లక్ష్మయ్యకలిగె. ఆయనతాతతమ్ముఁడు బుచ్చయ్య సంతతిశూన్యుండయ్యె॥ 269

## పోపూరికుదుటిమూలపురుషుఁడు గురవన్నవంశానుక్రమణిక

సీ॥ గురవన్నయనుమహాంతరుఁడు,సత్యారోగ్య,వైరాగ్యపురుషుండు,వసుధవిభుఁడు
శివనామమేపొద్దు, స్థిరబుద్ధిస్మరియించి, నియతిచేసుగుణసంచయముచేతఁ
బోపూరిపురమందు, బుధపాలకుండౌచు, నార్తులరక్షించె, నందముగను
అట్టిభూవిభునకు,ననువొప్పఁగాఁగల్గె, సుగుణశీలుండును,సుందరుండు॥
తే॥ సత్యమాదిసిఁడుసారసంగతుఁడగు। ప్రభువుగాంచె వంశపావనులను
నార్వురనుప్రసిద్ధ,హరభక్తులనునిత్య। భోగపూర్ణగతుల,భూరిరుచిని॥ 270

వ॥ వారలనామంబు లెవ్వియన జ్యేష్ఠుండు చంద్రప్ప ద్వితీయుండు, మూలప్ప తృతీయుండు పెదవెంకటాద్రి, చతుర్థుండు చినవెంకటాద్రి, పంచముండు తిరుమలప్ప, షష్ఠుండు నారాయణప్ప, అందుఁ జంద్రప్పకుఁ గృష్ణమ్మ, వీరన్న యను నిద్దఱు పుట్టిరి. అందుఁ గృష్ణమ్మకు లింగన్న పుట్టె. ఆయనకు నాగన్న జనించె. ఆయన తాతతమ్ముఁడు వీరన్నకు శివన్న, రఘుపతి, రాజన్న యను మువ్వురు పుట్టిరి. అందు జ్యేష్ఠుఁడు సంతానహీనుఁడయ్యె. తృతీయుండగు రాజన్నకు వీరన్న పుట్టె ఆయనకు రాజయ్య పుట్టి మహాదేవపురమందుండెను. ఆయన ముత్తాత మూలప్పకు వీరన్న పుట్టె. ఆయనకు సీతారామన్న జన్మించె. ఆయన చరిత్రంబు వివరించెద. 271

తే॥ ధర్మనిరతుండు సీతాప, దప్రయుక్త
రామయాఖ్యుండు భూజన, రంజకుండు
ప్రవిమలానందపరుఁడు, దివ్యస్వభావుఁ
డై వెలింగెను భువిలోనఁ, జేవమీఱి॥ 272

సీ॥ అట్టిసీతారామ, యాహ్వయునకుఁ, బుత్రులుదయించి రెంతొ యింపొదవువార
లందు శివ్వనయను, నయగుణోపేతుండు, నిరతాన్నదాతయై నెగడెభువిని
నాయనసహజుండు, శ్రీయుతనేత్రుండు, పాపన్నయనుబుధ, భక్తియుతుఁడు
తద్ఘనుతమ్ముండు, దానధర్మరతుండు, వేంకయాహ్వయుఁడను, వితతబుద్ధి
తే॥ కతనితమ్ముండు శాయన్న యనఁగనిరతి
నిర్వికల్పమనస్కుఁడై, నెమ్మిప్రబలి
ప్రబలయోగానుభవముచే, భవ్యరుచిని
బరము సాధించినట్టి శ్రీ, పావనుండు॥ 273

తే॥ అమ్మహాత్ముని సోదరుం, డనఁగఁబరఁగు
నరసయాఖ్యుండు సుగుణుండు, నళిననేత్రుఁ
డతని కనుజుండు లింగన్న, వితతయశుఁడు
విపులసుజ్ఞానశాలియై, వెలిఁగె భువిని॥ 274

తే॥ పరమసుగుణాతిశయముల, భవ్యరుచిని
వెలయు రఘురాముఁడను వాఁడు, వేత్తయనఁగ
గణన కెక్కెనుగడుఁగడు, గౌరవమున
లింగయాఖ్యునితమ్ముండు, భంగురుండు॥ 275

సీ॥ రఘురామయాఖ్యుని, రాజిల్లుతమ్ముండు, జానకిరామన్న జననుతుండు
ఆయనసోదరుం; డయగుణోపేతుండు, కోదండరామన్న, ఘోరబలుఁడు
కంజదళాక్షుండు, ఘనరాజగణ్యుండు, పార్వికచంద్రవి, భ్రాజిముఖుఁడు
రాజచిహ్నాలచేత, రంజిల్లిధరయందు, సద్యశంబందెను, సమరసమున
తే॥ గారవంబందినృపులచేఁ, గాంతుమీఱ, నగ్రగణ్యరాదిసత్కార, మందెనతఁడు
వంశపావనుఁడాయన, వాసిరెక్కి, ప్రబలెనురుతరదీప్తిచే, భవ్యగతిని॥ 276

వ॥ అందు శివన్నకుఁ బాపయ్యపుట్టె. ఆయనకు సుబ్బయ్యకలిగి సంతానహీనుఁడయ్యె. ఆయనపినతాత పాపన్నకు వీరన్నపుట్టె. ఆయనతండ్రితమ్ముఁడు వెంకయ్యకు మృత్యుంజయలింగము, పట్టాభిరామయ్య యను బిడ్డలుకలిగిరి. అందు మృత్యుంజయలింగమునకు, వెంకయ్య, శాయన్న, నరసయ్యలను ముగ్గురుపుట్టిరి. అందు వెంకయ్యకుఁ గోటయ్య, సీతారామయ్య, వెంకటలక్ష్మీనృసింహనాయఁడను ముప్వురుజన్మించిరి. అందుఁగోటయ్యకు వెంకటకృష్ణయ్యపుట్టె. ఆయనపినతండ్రి సీతారామయ్య సంతానహీనుండయ్యె. ఆయనతమ్ముఁడు వెంకటలక్ష్మీనృసింహనాయఁడు, రాజావెంకటలక్ష్మమ్మ మన్నసుల్తాన్‌బహదరుగారికి దత్తపుత్రుండయ్యె. ఆయనపినతండ్రి శాయన్నకుఁ బట్టాభిరామయ్య, మల్లయ్యయను నిరువురు కుమారులు కలిగిరి. అందుఁ బట్టాభిరామయ్య, సీతారామయ్యయను చిన్నవానిని దత్తుఁజేసికొనెను. ఆయనపినతండ్రి మల్లయ్యకు, వెంకటసుబ్బయ్య, వెంకటకృష్ణయ్యయను వారు జన్మించిరి. వారిపినతాత నరసయ్య యనపత్యుండయ్యె. ఆయనపినతండ్రి పట్టాభిరామన్నకు సంతులేదయ్యె. ఆయనపినతండ్రులుశాయన్న, నరసన్న లింగన్న, రఘురామన్న, జానకిరామన్న, యనువారు సంతానహీనులైరి. వారితమ్ముఁడుకోదండరామన్నకు, రామస్వామిపుట్టె. ఆయనకు వెంకటప్పయ్య, సుబ్బయ్య, బుచ్చిరాఘవయ్యయను ముగ్గురుపుట్టిరి. అందు జ్యేష్ఠునకు వెంకటనరసయ్య, లక్ష్మీపతి, సీతారామయ్యయను ముగ్గురుదయించిరి. వారిలో సీతారామయ్య, తుమ్మపూడిపురవాస్తవ్యుఁడగు పట్టాభిరామయ్యకుదత్తుఁడయ్యె ఆయనపినతండ్రి సుబ్బయ్యకుఁ గోదండరామయ్య, కోటయ్యలను బిడ్డలుకల్గిరి. వారిపినతండ్రి బుచ్చిరాఘవయ్యకు, అప్పయ్య, నారాయణ, అను నిరువురుపుట్టిరి. వారినాలవవంశపువాఁడగు మూలప్పతమ్ముఁడు పెదవెంకటాద్రి సంతానహీనుఁడయ్యె. ఆయనతమ్ముఁడు చినవెంకటాద్రికి మాదన్నపుట్టె. ఆయనకు నారాయణప్ప, హనుమయ్య యను బిడ్డలుపుట్టిరి. అందు నారాయణప్పకు వెంకయ్య, హనుమయ్యలుపుట్టిరి. వారు కంతేరులోనుండిరి. వారిపిన

తండ్రిహనుమయ్య సంతానహీనుండయ్యె. ఆయనపినతండ్రితిరుమలప్పకు వెంకట్రామన్న, పాపన్న, కృష్ణమ్మ, మల్లన్న, లింగన్నలను నైదుగురుకల్గిరి. అందు వెంకట్రామన్నకు సంజీరాయఁడుపుట్టె. ఆయనపినతండ్రి పాపన్నకు మాదన్న, నాగన్నలనువారుపుట్టిరి. వారిపినతండ్రులు కృష్ణమ్మ మల్లన్నలు సంతానహీనులైరి. వారితమ్ముఁడు లింగన్నకు, వీరయ్య, శేషయ్య, రామయ్య వెంకయ్య, మాదయ్యయనువారు పుట్టిరి. అందు వీరయ్యకు శేషయ్య, లింగయ్య, వెంకయ్య యను ముగ్వురుకల్గిరి. అందు శేషయ్యకు సీతారామయ్య, మాదయ్యయను నిద్దఱుపుట్టిరి. వారితాతతమ్ముఁడు శేషయ్యకు, వెఙ్కటయ్య, లక్ష్మయ్య యను నిద్దఱు కల్గిరి. వారిపినతండ్రి మాదయ్యకుఁ గోటయ్యపుట్టె. ఆయననాలవవంశపువాఁడగు వెంకటాద్రితమ్ముఁడు నారాయణప్ప సంతానహీనుండయ్యె. ఆయనతమ్ముఁడు వీరన్నకుఁ గృష్ణమ్మపుట్టె. ఆయనకు వీరన్న, మాదయ్యయను నిద్దఱుకల్గిరి యందు. 277

సీ॥ వీరన్నయనుమహా, వీరాగ్రగణ్యుండు, సంతానహీనుఁడై, సమసెనతని
సహజుండుమాదయ్య, సరసీరుహాక్షుండు, కాంచెనునలువుర, ఘనగుణులను
రాయన్నయనుమహా, శాంతుండుదారుండు, వీరభద్రప్పయన్, వీరనేత
ఆతనిభ్రాతయు, బ్జాయతనేత్రుండు, కిచ్చన్నయనఁగను, గీర్తిపరుని
తే॥ సోదరుండగులింగయ్య, సుస్థిరుండు । వైభవోన్నతిఁజెన్నొందె, వారుభువిని
సకలగుణగణనీయులై, సమరసమునఁ । బటిమచేఁబ్రజ్వరిల్లిరి, భవ్యగతిని॥ 278

వ॥ వారలలో రాయన్నకువెంకయ్యజనించె. ఆయనకు వీరన్నపుట్టె. ఆయనకు సుబ్బయ్య, వెంకయ్య, మాదయ్యలను ముగ్గురుపుట్టిరి. అందుసుబ్బన్నకు ఆనందము, సోమయ్యయను వారిరువురుపుట్టిరి. అందానందము సంతానహీనుండయ్యె. ఆయనతమ్ముఁడు సోమయ్యకు, తమ్మన్నపుట్టె. ఆయనకుసోమన్న పుట్టె. ఆయనకు నాగయ్య, జానయ్యయను నిద్దఱుపుట్టిరి. అందు నాగయ్యకుఁ దమ్మన్నపుట్టె. ఆయనకు నెనిమిదవ వంశపువాఁడగు రాయన్నతమ్ముఁడు వీరభద్రప్ప, సంతానహీనుండయ్యె. ఆయనతమ్ముండు కిచ్చిన్నకు విస్సయ్య, వెంకయ్య, పాపయ్యయను ముగ్వురుజన్మించిరి. అందుఁ గనిష్ఠులిరువురు సంతానహీనులయిరి. జ్యేష్ఠుండువిస్సయ్య, పెదబాపనయ్య, చినబాపనయ్యయను నిరువురంగనెను. అందు జ్యేష్ఠునకు నాగయ్య, కిచ్చయ్య, కోటయ్య, లక్ష్మయ్య, వెంకయ్యయను నైదుగురుద్భవించిరి. అందునాగయ్య తనతృతీయసోదరుని కుమారుఁడు వెంకటకృష్ణయ్యను దత్తుఁజేసికొనెను, ఆయన పినతండ్రి కిచ్చయ్య సంతానహీనుండయ్యె. ఆయనతమ్ముండు కో

టయ్యకు వెంకటప్పయ్య, వెంకటకృష్ణయ్యయను నిరువురుజన్మించిరి. వారల పినతండ్రి లక్ష్మయ్యకు, వెంకటకృష్ణయ్య, వెంకటరామయ్యయను నిరువురుపుట్టిరి. వారిపినతండ్రిసంతానహీనుండయ్యె. ఆయనపినతండ్రిచినబాపనయ్యకు వెంకయ్య, నరసయ్య, కృష్ణయ్యయను ముగ్గురుకుమారులుకలిగిరి. అందువెంకయ్యకు భద్రయ్య, వెంకయ్యయనునిరువురు పుట్టిరి. వానిపినతండ్రి నరసయ్యకు, వెంకటకృష్ణయ్య, వీరయ్య, బసవయ్యయనుముగ్గురావిర్భవించిరి. వారిపినతండ్రికృష్ణయ్యకు సుబ్బయ్య, కోటయ్యయను నిద్దఱుపుట్టిరి. వారినాలవతాత కిచ్చన్నతమ్ముఁడు, లింగన్నకు. వీరన్నపుట్టె. ఆయనసంతతంబు వివరించెద॥ 279

ఉ॥ సంగరశీలుఁడుం బ్రబల,సాహసవంతుఁడు క్షాత్రవంతుఁడున్
మంగళమూర్తియున్ సుమతి,మానుషవర్యుఁడు వీరయాఖ్యుఁడే
పుంగవిజ్ఞానదీపమున,భూరిమహత్త్వముగాంచియొప్పుచున్
సంగవిహీనతన్ శివునిఁజక్కఁగఁ గొల్చుచునుండెనిద్ధరన్ 280

వ॥ ఆవీరయాహ్వయునకుసిద్దఱు కుమారులుద్భవించిరి. వారలనామంబుల వివరించెద॥ 281

తే॥ గీ॥ కృష్ణయాహ్వయుఁడనఁగనుగీర్తిపరుఁడు
అతనిసహజుండుశాయన్నయార్యబుద్ధి
యనఁగనిరువురుపుట్టిరి, ఘనసుగుణులు
పటిమఁజెన్నొందిరిద్దఱు,భవ్యరుచిని॥ 282

వ॥ ఆకృష్ణయాహ్వయునకుఁ గిచ్చయ్య, లింగయ్య, అయ్యన్నయను మువ్వురుపుత్రులుకలిగిరి. అందుజ్యేష్ఠునకు సంతులేదయ్యె. తృతీయుండగు నచ్చన్నకుసాంబయ్య,శివయ్యయను నిద్దఱుపుట్టిరి. వారిలోసాంబయ్యకు, బుచ్చయ్య, సుబ్బయ్య, వెంకయ్య, నాగయ్యయను నలుగురుపుట్టిరి. అందువెంకయ్యకు, వీరయ్యపుట్టె, ఆవీరయ్యతాతతమ్ముఁడు శివయ్యకువీరయ్యపుట్టె. ఆయనకు మాదయ్య, శివయ్య, వెంకయ్య, రామలింగయ్యయను నలుగురుపుట్టిరి. వారల నాలవవంశపువాఁడగు కృష్ణమ్మతమ్ముఁడు శాయన్నకు వెంకయ్యపుట్టె.ఆయనకుశాయన్న నాగయ్యయను నిద్దఱుజన్మించిరి.అందుశాయన్నకు అప్పయ్యపుట్టె, ఆయనకు వెంకయ్య పిచ్చయ్యయను నిరువురుద్భవించిరి. వారిపినతండ్రి పిచ్చయ్యకు సంతులేదయ్యె. వారినాలవవంశపువాఁడగు శాయన్నతమ్ముఁడు నాగయ్యవంశంబువివరించెద॥ 283

సీ॥ నాగయాహ్వయుఁడను, నయగుణోపేతుండు, రాజలక్షణుఁడైన, రాజవరుఁడు
అమ్మహాధీరుండు, సమ్మతచరితులఁ గాంచెనిర్వురనుజ, క్కనిసుతులను
సుబ్బయాభిఖ్యుండు, సుగుణశాలవాలుండు, స్వాశ్రితరక్షణ, వ్యాపృతుండు
ఆయనసోదరుం, డతిసుందరాంగుండు, లింగయ్యయనెడి స, త్సంగతుండు

తే॥గీ॥ వసుధఁజెన్నొందియాతండు, పసవెలుంగఁ
బ్రీతిచేదత్తుఁగైకొనెఁబ్రేమమీఱ
సుబ్బయాఖ్యునిఁగాంక్షచే, సుస్థిరముగ
వైభవోన్నతితనరార, వన్నెమీఱ॥ 284

## నందిగామపట్టణాధ్యక్షుఁడగు వీరపనీని వంశానుక్రమణిక.

సీ॥ వీరపనీఁడను, వీరాగ్రగణ్యుండు, శ్రీమంతుఁడై యుండి, స్థిరవిభూతి
నందిగామాభిఖ్య; నగరంబునందున, నసమానశూరత, నధిగమించి
దుష్టులశిక్షించి,దురితముల్ వోవంగ, శిష్టులఁబోషించి, చెలువుమెఱయఁ
దత్కార్యములచేతఁ, దరణిసన్నిభుఁడయి, సత్కీర్తిచేమించె, సమరసమున

తే॥గీ॥ నట్టిభూపతితాఁగాంచె, హర్షమెసఁగ।సుగుణవారాశియనఁదగు, శూరమణిని
సుందరునివేంకటాద్రిని, సుస్థిరముగ।భువిససత్కీర్తి చెన్నొందఁబొందుగాను॥

వ॥ ఆవేంకటాద్రికి వీరపనీఁడు, చినవీరన్న, బెజ్జనీఁడు అనుకుమారులుకల్గిరి. వారి
వంశంబువర్ణించెద॥ 286

సీ॥ ఆవేంకటాద్రికి, నరయజ్యేష్ఠుండగు, వీరపనీఁడను, వీరవరుఁడు
సుందరాకారుండు, మందరధీరుండు, సుగుణాలవాలుండు, సువ్రతుండు
రవిసమతేజుండు, రాజవరేణ్యుండు, రాకాశశాంకసాంద్రరుచిముఖుఁడు
నిరతాన్నదానంబు, నియతిచేఁజేయుచు, సత్కీర్తిచేమించె, సమరసమున

తే॥ నట్టిభూపాలునకుమించి, పుట్టెనవనిఁబ్రజ్వరిల్లినప్రభువుల, భవ్యరుచినిఁ
గానమైతిమనంగను, గౌరవమున।మెలఁగెనాకమ్మవంశజుం, డలఘుగతిని॥ 287

ఉ॥ సారసనేత్రలుర్, సుగుణ, సాంద్రవివేకలు, సుందరుల్ బ౯
యారయలక్ష్మియంశలన, హర్షమొసంగెడి యక్కచెల్లెలుర్
నీరజనాభభక్తుఁడగు, నిర్మలకీర్తికి రాజమూర్తికిన్
వీరపనీనికిన్ గరిమఁ, బెంచెడిముద్దులభార్యలైరిలన్! 288

శా॥ ఆకాంతామణులుద్భవిల్లిరి లస, ద్వ్యాపారసంధాత్రులై
శ్రీకల్యాణవిలాససౌధవసతి, శ్రేయోబలాన్వితలై

నాకాధీశ్వరుఁబోలుభోగి, రణస, న్నాహుండు, సద్భావుఁడౌ
శ్రీకట్టాకులనారసింహునకు, సు, శ్రీమించుయోగోద్ధతిః ॥ 289

తే॥ ఆయిగురుబోండ్లనామంబు, లమరఁగల్గెఁ
బెద్దయంగమ్మయను మహా, ప్రేమపేటి
చిన్నయంగమ్మయను సదా, స్థిరవిభూతి
ప్రజ్వరిల్లిరిభువియందుఁ బ్రాభవమున॥ 290

వ॥ ఆవీరపనీని ప్రథమభార్యయగు పెదయంగమ్మకు, వేంకటాద్రి, బెజ్జసీఁడు, రామచంద్రుండునను ముగ్గురుపుట్టిరి. అందువేంకటాద్రికి, రామన్న, రంగపతి యను నిద్దఱుపుట్టిరి. అందురామన్నకుఁ, బాపయ్య, అక్కయ్యయనువారుజన్మించిరి. అందుఁబాపయ్యకు, రామన్న, వీరన్న, బుచ్చన్న, శివన్న, పాపన్న యను నైదుగురు పుత్రులుపుట్టిరి. వారలతండ్రితమ్ముఁడక్కయ్యకు, నాగయ్య పుట్టె. ఆయనతాతతమ్ముఁడు రంగప్పకు, నారసింహుఁడు, రామన్నయనునిద్దఱుపుట్టిరి. వారలతాతతమ్ముఁడు, బెజ్జసీనికి, గంగప్ప, కమలప్పయను నిరువురు పుట్టిరి. అందురంగప్పకు, వీరన్న బెజ్జసీఁడు, నారసింహుఁడు, విశ్వపతియనునలుగురుపుట్టిరి. అందువీరన్నకు శాయన్నపుట్టె. ఆయనపినతండ్రికి, నాగన్న పుట్టె. ఆయనతండ్రితమ్ముఁడునారసింహునకువీరన్నపుట్టె. ఆయనకు నరసన్న, మాళయ్య,బుచ్చయ్య,సూరన్నయనునలుగురుకల్గిరి. అందునరసన్నకుచల్లయ్య వీరయ్యకలిగిరి. అందుఁజల్లయ్యకు రాజయ్య, పిచ్చయ్య వరప్పురామయ్యయనునిరువురుకలిగిరి. వారలపినతండ్రివీరన్నకు పకీరయ్యపుట్టె. ఆయనకు నరసయ్యజనించె. ఆయనకు శీతయ్య, కోటయ్యయనునిద్దఱుపుట్టిరి. అందుసీతయ్యకు నరసయ్య, సుబ్బయ్య పకీరయ్యయనుముగ్గురుకల్గిరి. వారిపినతండ్రికోటయ్య, సంతతిశూన్యుండయ్యె. ఆయననాలవతాత నరసన్నతమ్ముఁడు మాళయ్యకు, రాజయ్య, వీరన్న,బుచ్చయ్యశాయన్నలనునలుగురుపుట్టిరి. అందురాజయ్యకు,జోగయ్య,వెంకయ్య,రామయ్యయనుముగ్గురుపుట్టిరి. అందుజోగయ్యకు, రాజయ్య, పిచ్చయ్య, జన్మించిరి. వారిపినతండ్రివెంకయ్యకు, వీరయ్య పుట్టి, కొండవటికంటిలోనుండెను. ఆయానపినతండ్రిరామయ్యకు, శివయ్యపుట్టె, ఆయనతాతతమ్ముఁడు వీరన్నకు నానయ్య,రామయ్య, యనునిద్దఱుపుట్టిరి.అందునానయ్యకుఁగోదండరామన్నపుట్టె.ఆయనపినతండ్రిరామయ్యకు,వెంకయ్య, సుబ్బయ్యయనువారుకల్గిరి.అందు వెంకయ్యకు, బాపనయ్య, బ్రహ్మయ్య, నానయ్యయను ముగ్గురుపుట్టిరి.అందుబాపనయ్యకు, రామలింగయ్య వీరయ్యయను నిద్దఱుపుట్టిరి. వారలతండ్రి రెండవతమ్ముఁడు నానయ్యకు, నరసయ్య

పుట్టె. ఆయనతాతతమ్ముఁడు సుబ్బయ్యకు: లక్ష్మయ్య, శేషయ్య, అప్పయ్య యను ముగ్గురుకల్గిరి. అందు జ్యేష్ఠులిరువురు బాల్యప్రాయంబుననే మరణించి రయ్యెడ॥ 291

సీ॥ అప్పయామాత్యుఁడను, నతిధర్మతత్పరుం, డనుపమతేజుండు, జనవిభుండు
బహుపరాక్రమశాలి, బంధుసముద్రుండు, చంద్రాస్యుఁడాశ్రిత, సౌరశాఖి
వంశపావనుఁడన, వసుధనువర్ధిల్లి, భక్తిఁబెద్దలయందుఁ, బఱపువాఁడు
విద్వాంసులనుమాట,విన్నయంతటఁదాను,రావించిదయహెచ్చ,(బోవువాఁడు

తే॥ సమరసుండతిశాంతుండు, సత్యవశుఁడు
మాతృపితృదైవగురుభక్తి, మలయువాఁడు
చాలయోచించిపనిసేయ, సాఁగువాఁడు
నింతవాఁడెవ్వఁడనుకీర్తి, నెనయువాఁడు॥ 292

వ॥ ఈయనఘునకుఁ గోటయ్య, రామనాథము, దుర్గయ్య, విశ్వనాథమునను నల్వురుకల్గిరి. ఇట్టి యప్పయామాత్యుని ముత్తాత, వీరన్నతమ్ముఁడు, బుచ్చయ్యకు, వెంకయ్య, చినరామయ్య యనువారుకల్గిరి. అందు వెంకయ్యకు వెంకటప్పయ్య, సుబ్బయ్యయను నిద్దఱు పుత్రులుపుట్టిరి. అందు వెంకటప్పయ్యకుఁ గోటయ్య, నాగయ్య, యనువారుకల్గిరి. వారిపినతండ్రి సుబ్బయ్యకు, మాళయ్యపుట్టె. ఆయనపినతాత చినరామయ్యకు,బాపనయ్యపుట్టె. ఆయనకప్పయ్య,సుబ్బయ్యయనుపుత్రులుకల్గిరి. వారిముత్తాత బుచ్చయ్యతమ్ముఁడుశాయన్నకు,వెంకయ్యపుట్టె. ఆయనకులక్ష్మయ్య,శేషయ్య,రామయ్యయనువారుద్భవించిరి. అందు లక్ష్మయ్య, శేషయ్యయనువారు, గోకనపల్లి గ్రామస్థులైయుండిరి. వారలతమ్ముఁడు రామయ్యకు వెంకయ్యపుట్టె. ఆయననాలవవంశపువాఁడగు మాళయ్యతమ్ముఁడు బుచ్చయ్యకు, అప్పయ్య, పట్టయ్య యనువా రావిర్భవించిరి. అందప్పయ్యకు, బుచ్చయ్యపుట్టె. ఆయనకప్పయ్య నాయఁడమ్మ, లక్ష్మయ్య, కోటయ్యయను నలువురుపుట్టిరి. అందు జ్యేష్ఠుండనపత్యుండయ్యె. ఆయన తమ్ముఁడు నాయఁడమ్మకు, గురవన్నపుట్టె. ఆయనపినతండ్రి లక్ష్మయ్యకు వీరయ్య, రామయ్య, లక్ష్మయ్యలను ముగ్గురుపుట్టిరి. వారలపినతండ్రి కోటయ్య సంతానహీనుండయ్యె. ఆయనపినతండ్రి పట్టయ్యకు, వెంకయ్య, సింగయ్యయను నిరువురుకల్గిరి. అంప జ్యేష్ఠునకు సుబ్బయ్య పట్టయ్య యనువారు పుట్టిరి. అందుఁ బట్టయ్యకు వెంకయ్యపుట్టె. ఆయన తాతతమ్ముఁడు సింగయ్యకు, అచ్చయ్య లక్ష్మయ్యయను నిరువురుపుట్టిరి.

వారలముత్తాతతమ్ముఁడు సూరయ్యకు, అచ్చయ్యపుట్టె. ఆయనకు బాపనయ్య, బ్రహ్మయ్యయనువారుకల్గిరి. వారల నాలవవంశపువాఁడగు నారసింహుని తమ్ముఁడు విశ్వపతికిఁ బద్మన్నపుట్టె. ఆయనతొంత రంగప్పతమ్ముఁడు కమలప్పకు, వీరన్న, బెజ్జనీఁడును బుట్టిరి. వారితోఁత బెజ్జన్నతమ్ముఁడు గామచంద్రుఁడు సంతానహీనుండయ్యె. ఆయనతండ్రితమ్ముఁడు చినవీరన్నకుఁ జొట్టన్న, పాపయ్యయను కుమారులుకల్గిరి. అందుఁ జొట్టన్న ముగ్ధ్యాలపురీపవాసుఁడయ్యెను. ఆయనతమ్ముఁడు పాపయ్యకుఁ గిచ్చయ్యపుట్టె. ఆయనకు మాళయ్యపుట్టె. ఆయనకు వీరన్నకలిగె. ఆయనకు గంగన్నజనించి, గొల్లమూడిలోనుండెను. ఆయనకైదవవంశపువాఁడగు చినవీరయ్యతమ్ముఁడు బెజ్జన్నకి వెంకటపతి, చినవెంకటపతి, చిట్టినారసింహుఁడు బాపనారసింహుఁడు ననునల్వురుకల్గిరి. వారలతండ్రి పెద్దన్న వీరపనీని ద్వితీయభార్యయగు చినయంగమ్మవలనఁగలిగిన వారల వంశంబు వివరించెద. 293

**వీరపనీని చినభార్య చినయంగమ్మ పుత్రులవంశానుక్రమణిక.**

సీ॥ వంశపావనుఁడైన, వరవీరవిభునకు, నుద్భవించిరినల్గు, రొప్పుగాను
రామన్నయనుమహా, రాజలక్షణశాలి, పటుతరధైర్య ధీ,వ్యద్భులుండు
తత్సోదరుండన,ధర్మకృత్యయనుండు, రాఘవనాయడ॥ రాజమౌళి
యాయనసోదరుం, డబ్జదళాక్షుండు, చంద్రమౌళియనంగ, జగతివిభుఁడు

తే॥ అరయ నారాయతమ్ముఁడౌ,నతివివేకి। రాజశేఖరనాయుండు, రమ్యమూర్తి
యనఁగ వారలుజన్మించి, రందముగను। ధరణిపాలకులైయులఁ,దనివిదీఱ॥ 294

గీ॥ రాజశేఖరనాయుండు, రమ్యయశుఁడు। బాల్యప్రాయంబునందునే, పరమశివుని
భక్తిసేవించియిలయందుఁబ్రబలగతిని। నేగెఁగైలాసమునకుఁదాసంపుత్రుఁడ॥

చ॥ పటుతరమైనధైర్యరమ, పాటిలనేలిరినందిగామను
త్కటముగుధీప్రభావమున, గౌరవముప్పతిలంగమువ్వురున్
స్ఫుటతరవిక్రమంబెసఁగ, శుద్ధహృదంతరసత్కృపాప్రభా
ఘటననసన్యసాధ్యమయి, కన్పడుశక్తినిశత్రుహాంతలై॥ 296

వ॥ ఈప్రకారంబునఁ గొన్నివర్షంబు, లసమానతేజోవిలాసులై భూమింబాలించు సమయంబున, దజ్జనకుండగు వీరపనీఁడుత్తరకాలంబునందు, రాజ్యకాంక్షచే, నిజపుత్రులు వివాదపడఁగలరనియెంచి, వారికిఁ దానేరాజ్యంబుపంచియిచ్చి, మాగంటిపురంబున రామయాహ్వయుండును, రాఘవపురంబున రాఘవ

భూపాలుండును, చింతలపాటిప్రోలునఁ జంద్రమౌళియును నుండునట్లు నియమించి, నిరీతికంబుగ రాజ్యంబు సేయుండని చెప్పి యనంతరంబున, గురుకటాక్షంబుతోడుగా, మహాదేవనామస్మరణచేయుచు, గొంతతడవునకు నడపి, పరమపదంబందె ననంతరంబున॥ 297

మాగంటిపట్టణాధీశ్వరుండగు రామన్న వంశానుక్రమణిక.

సీ॥ ఆరామభూపతి, కంచిశోల్లాసులు, సుతులుద్భవించిరి, వితతకీర్తి
లందు జ్యేష్ఠుండగు, ననఘుండు రాఘవ, నామధేయుండయ్యె, నైజశక్తి
శత్రులఁదూలించి, సాహసస్ఫూర్తిచే, విజయంబుఁగాంచెను, వీరవరుఁడు
సువ్రతశీలుఁడై, సొంపుగానటియించె, సత్యంబుఁదప్పక శాంతవృత్తి
తే॥ నట్టిరాజేంద్రునకునపత్యంబు లేద। యతనిసహజులుపరిశుద్ధమతులు చిన్న
పద్మనాభుండుశివభక్తవరులుచంద్ర। మౌళియునురాజలింగన్న, మఱియువీర
నాఖ్యుఁడును క్షాత్రధర్మవి, ఖ్యాతబలులు॥ 298

వ॥ వారిలో. నాచినపద్మనాభునకు, సుతసంతతి లేకుండుటచేఁ, బెదపద్మనాభుని జ్యేష్ఠపుత్త్రుండగు, బుచ్చిరాఘునయ్యయనువాఁడు, దత్తుండయ్యెను, ఆయన యుసంతానహీనుండయ్యె. ఈతనిపినతండ్రులు నిట్టివారైరి. ఈపినతండ్రుల తమ్ముఁడు వీరపనేఁడుమాత్రము, తేజోవంతుండగు సూరయాహ్వయునింగనె. నాయనచరిత్రంబు వివరించెద॥ 299

సీ॥ ఆసూరయాహ్వయుం, డంచితోల్లాసుండు, భూపరిపాలనం, బునుప్రసిద్ధిఁ
జేయుచునత్కీర్తి, స్థిరముగానార్జించి, విభవాతిశయముల, విస్తరిల్లెఁ
దద్రాజవరునకు, ధర్మప్రధానులు, నరసయాభిఖ్యుండు, ధరణివిభుఁడు
బాహుదర్పంబునఁ, బాపుశౌరిపులను, గల్లోలపఱచి చిం, తిల్లఁజేసె
తే॥ నమ్మహాత్మునిసోదరుం, డంచితుండు। ఘనుఁడుచినరామలింగన్న, గౌరవనిధి
సుగుణశీలుండుధీరుండు, సుజనమౌళి। పరఁగెసత్కీర్తిచేభువి, భవ్యరుచిని॥ 300

వ॥ మాగంటికుదురు చినరామలింగన్నతోనశించెను॥ 301

రాఘవపురాధీశ్వరుండగు రాఘవయ్య వంశానుక్రమణిక

సీ॥ రాఘవాహ్వయుఁడన, రాజవరేణ్యుండు, రాఘవపురసీమ, రంజిలంగ
రాజ్యంబు నేలుచు, రమ్యంబుగానుండఁ, దద్రాజునకుఁ బుట్టెధరణివిభుఁడు
పెదపద్మనాభుఁడ, బ్ధిగభీరుఁడునుదాత, పటుశౌర్యధుర్యుండు, ప్రబలకీర్తి
యాదాజునకుఁగల్గి, రత్యంతశూరులు, సాహసధుర్యులు, బాహుబలులు

తే॥ బుచ్చిరాఘవనాయఁడు, భూరిచంద్ర। మౌళిరామన్నయనఁగను, మనుజనేత
యచ్చయాఖ్యుండునాగన్న, యనఁగఁబరఁగెఁబంచశరధిక్కరణరూప, పటుబలవిభూతి

తే॥ బుచ్చిరాఘవనాయుండు, బుధహితుండు
దత్తుఁడయ్యెనుప్రబలవిమల, ధర్మవిధిని
జింతపలియెంటుదొరయగు, చిన్నపద్మ
నాభిరామునకనుఘొంద, నవనియందు॥ 303

వ॥ ఆబుచ్చిరామయ్య తమ్ములచరిత్రంబు వర్ణించెద॥ 304

తే॥ చంద్రమౌళ్యాహ్వాయుండను, జగతివిభుఁడు
పరిణయాత్పూర్వమందెయ, ప్పరమశివుని
యందునైక్యంబునొందె న, మంచితముగ
వంశపావనుఁడితఁడన్న వాసిఁగాంచి 305

ఉ॥ ఆతనిసోదరుండు సుగు, ణాంబుధి రామనృపాలకుండు తా
భూతకులాధినేతయగు, భోగివిభూషణుభక్తిఁగొల్చుచుఁ
బ్రీతివహించియుండునెడఁ, బేరిమినాతనికుద్భవించి ర
త్యాతతశక్తిసంయుతు ల, నంతమతుల్ సుతులిర్వురొప్పఁగ॥ 306

వ॥ అయ్యాత్మజులలో జ్యేష్ఠుండుపద్మన్న కనిష్ఠుండువీరన్న వీరిరువురనపత్యులైరి. తద్వంశపావనులతమ్ముఁడచ్చన్నకు, వెంకట్రామన్న, పద్మనాభుఁడు, రామలింగన్న, రాజలింగన్నయను నలువురావిర్భవించిరి. అందువెంకట్రామన్నకుఁ గోదండరామన్న, అచ్చన్నయను బిడ్డలుపుట్టిరి. అందుఁ గోదండరామన్నకు సంతులేదయ్యె. ఆయనతమ్ముండచ్చన్నకు, శివయ్య, చల్లయ్య, రామయ్య, పాపయ్యయను నలుగురుపుట్టిరి. వారిలో శివయ్య, వరగానిలోనుండి వెంకయ్య, నరసయ్య, లక్ష్మయ్య, యను వారింగనెను. అందు వెంకయ్య సంతానహీనుండయ్యె. ఆయనతమ్ముఁడు నరసయ్యకు వెంకటప్పయ్యపుట్టె. ఆయనపినతండ్రి లక్ష్మయ్యకుశివయ్యపుట్టె. ఆయనముత్తాతతమ్ముఁడు చల్లయ్యకు జగ్గయ్య, బుచ్చయ్యయనువారుపుట్టిరి. వారిలో జగ్గయ్యకు, భద్రయ్య, అప్పయ్యయనువారుపుట్టిరి. వారిపినతండ్రి బుచ్చయ్యకు, అప్పయ్య, రామానాయుండు జన్మించిరి. వారలముత్తాత చల్లయ్యతమ్ముఁడు రామయ్యకుఁ, గోటయ్య, నరసయ్యయను బిడ్డలుజన్మించిరి. అందుఁ గోటయ్యకు సంతులేదయ్యె ఆయనతమ్ముఁడు నరసయ్యకు, భద్రయ్య, రామయ్యయనువారుపుట్టి కోనాయపాలెములోనుండిరి, వారలతాత రామయ్యతమ్ముఁడు పాపయాహ్వాయుం

డు, సుప్రసిద్ధుండయ్యె. ఆయనముత్తాతతమ్ముఁడు, పద్మన్న సంతానహీనుండయ్యె. ఆయనతమ్ముఁడు వెంకయ్య, వరఘు వెంకటపతికిఁ, బాపయ్య, సుబ్బయ్యయను నిరువురు జన్మించిరనంతరంబ. 307

తే॥ పాపయాఖ్యుండువరదేవ,భక్తుఁడనఁగ।
వినుతగుణశీలుఁడై యుండె,విమలబుద్ధి
నతనికినిగలైనుగుణాఢ్యుఁడధికబలుఁడు
బుచ్చయాహ్వయుఁడనఁగను, భూరియశుఁడు॥ 308

వ॥ ఆబుచ్చయాహ్వయునకు శివరామయ్య, సుబ్బయ్య,యను నిరువురుపుట్టిరి. అందుశివరామయ్య, సంతానహీనుండయ్యె, ఆయనసోదరుండు సుబ్బయ్యకు, బుచ్చయ్యకలిగి రావిరాలలోనుండెను. ఆయనముత్తాతపాపయాహ్వయునితమ్ముఁడు సుబ్బయ్యకు రామయ్యపుట్టె. ఆయనకుఁగోటయ్యజన్మించె. కోటయ్యకు, వెట్టెయ్య, శీతారామయ్యయను నిరువురావిర్భవించిరి. అందుజ్యేష్ఠునకు, మల్లికార్జునుఁడు, రామయ్యయను నిరువురుకలిగి మహాదేవపురములో నుండిరి. వారలకెనిమిదవవంశపునాఁడగు వెంకట్రామన్నతమ్ముఁడు పద్మనాభుఁడు, సంతానహీనుండయ్యె. ఆయనతమ్ముఁడు రామలింగన్నకు, వెంకయ్య బుచ్చిరాఘవయ్య, నరసయ్య, రామయ్యయను నలువురుపుట్టిరి. అందుబుచ్చిరాఘవయ్యకుఁ గోదండరామలింగన్నపుట్టె. తక్కినముువ్వురు సంతానహీనులయిరి. వారలపినతండ్రి రాజలింగన్నకుఁ బద్మన్న, అచ్చన్న, చల్లన్నయను ముువ్వురుపుట్టిరి. అందచ్చయ్యకుఁగోటరాజలింగన్నగలిగె. తక్కినయిరువురుసంతానహీనులయిరి. వారితాతయచ్చన్నతమ్ముఁడు నాగన్నచరిత్రంబు వివరించెద॥ 309

సీ॥ నాగయాభిఖ్యుండు, భోగదేవేంద్రుండు, బాహాబలోన్నత,పటిమమెఱయఁ
దనభ్రాతలైనట్టి,ధరణీపతులుపుత్రు, లసమర్థులౌటచే, ననువుమెఱయ
భూపరిపాలనంబునుదద్దఁజేయుచు, సత్కీర్తి చేతను, సారసాక్షుఁ
డశ్రాంతగుణగణాభ్యంచితవిజయుండు, లలితయశస్సార,కలితుఁడగుచు॥

తే॥ వైభవోన్నతిఁజెన్నొందె, వాసిరెడ్డి వంశపావనుఁడనఁగను, వాసికెక్కి
మిగులవిక్రమశాలియై, మించెజగతి! నిరుపమౌదార్యసాహస, నేతయగుచు॥

సీ॥ తద్రాజవంశజుల్, ధర్మతత్పరమతుల్, నరసభూజానిసో, దరులయందు
నాచినరాఘులిం, గాభిధానుండును, వారన్నదమ్ములు వాంఛదీఱ

మాగంటియొంటున, మనుజవరేణ్యులు, బాహుబలోన్నత, పటిమమెఱసి
పాలనంబొనరించి, భవ్యయశస్సుచేఁ బరలోకగతులైరి, ప్రోవలగుచు
తే॥ నట్టిగుణవంతులకు సపత్న్యంబులేమి। భోగరాజేంద్రుఁడై నట్టి, నాగయాఖ్య
నికటవంశజుఁబాటచే, నిరుపమముగ। నితఁడుజ్ఞాతులనదలించియేఘనుఁడు॥ 311
క॥ స్వాగతుఁడై యట్టిమెఱఁగ। సాఁగినరిపులఁ జయించి, శౌర్యప్రతిభన్
సాగరధీరుఁడునాగయ। రాగవిదూరతనురాజ్య, రమఁగాపాడెన్॥ 312
ఉ॥ ఆనరపాలసింహునకు, నంచితబుద్ధులు శక్తిమంతులున్
మానవనాథులున్ ఘనులు, మంజులశీలురు మువ్వురెప్పుడున్
మానముతోడశంకరుని, మానసమందున సంస్మరింపుచున్
శ్రీనిధులై వెలుంగఁదగు, చేష్టలఁగన్గిరికోర్కెదీరఁగన్॥ 313
మ॥ వనజాతాయతలోచనుండు సుజన, వ్యాసంగశీలుండు దు
ర్జనదూరుండగు జగ్గయాహ్వయుఁడు ధ, ర్మప్రజ్ఞనధిల్లురా
మనభూపాలుఁడు భ్రాతృవత్సలుఁడు సా, మ్యశ్రీనిధానుండు మీఁద
గనుశ్రీమంతుఁడు నాయఁడమ్మనిఖిల, తప్పాపాలనత్యర్థ్యతన్॥ 314
ఉ॥ బాలరసాలసాలనవ, పల్లవకోమల సుందరాంగియా
నాలలనాశిరోమణియు, నంతగుణోజ్జ్వలుఁడైన చావభూ
పాలుఁడుచంద్రయాఖ్యునకుఁ బావనిమైతగనుద్భవిల్లనా
బాలనుబెండ్లిఁజేసికొనెఁ బల్వురుమెచ్చఁగ జగ్గరాజొగిన్॥ 315
క॥ పరమసుశీలవిభాసిని। వరవర్ణినియైనయువిద వైభవపటిమం
బరుదారఁగనచ్చమయను। నిరుపమనామంబుగాంచి నెగడెన్ బుడమిన్॥ 316
సీ॥ ఆజగ్గభూపాల, కాత్మజుఁడఖిలమా, భూమిపాలించెన, బ్బురముగాను
సత్కీర్తిఁజెన్నొంది, సంతోషములరారఁ, జక్కఁగాజనులను, సౌఖ్యపెట్టెఁ
దద్రాజునకుఁబుట్టె, ధర్మకార్యపరుండు, పరమార్థబుద్ధియుభాసిలంగ
దుష్టులనందఱఁదూలించివిశ్రాంతి, శిష్టులఁబోషించె, స్థిరవిభూతి
బాల్యప్రాయమునుండి, భవ్యమహాబుద్ధినిఁ, గలిమాయలెల్లను, గడకుఁద్రోచి
తే॥ భూసురావళిఁబూజించి, భూరివిమల। సుగుణగణనీయుఁడైమించు, సుందరుండు
వంశపావనుఁడైయొప్పె, వాసిరెడ్డి। వెంకటాద్రీంద్రమన్యహాం, వీరుఁడనఁగ ॥317
క॥ తొల్లిటియుగములఁగేశవుఁ। డుల్లాసముతోడఁబృథివి, నొప్పినయటులే
నల్లలితుండీతండును, గల్లులేకుండజగతిఁ గావఁగఁబుట్టెన్॥ 318

గీ॥ కలియుగంబునశ్రీహరి, కరుణచేత। నవతరించెను ధరయందు నవనిపతిగఁ
దల్లిదండ్రులజన్మంబు,ధన్యతగను।నటులఁబ్రబలెనుసత్కీర్తి, యతిశయిల్ల॥ 319

వ॥ ఇత్తెఱంగున,నానరపతిసింహబాలాగ్రేసరుండు,హలకులిశాది రేఖావిశేషంబు
లు యుక్తస్థానంబులందు వెలుంగ 1174 వ ఫసలీ 1765 క్రీస్తుశకమునకు,
సరియగు సర్వజిన్నామ సం॥ వైశాఖబహుళైకాదశీందువాసరంబున ననూ
రాధానక్షత్రయుక్త శుభలగ్న మందావిర్భవించె॥ 320

సీ॥ నిండుచందురుఁబోలు, నెమ్మోముఁగలవాఁడు,కమలంబులనుబోలుకనులవాఁడు
మధ్యాహ్నరవిఁబోలు,మహిత తేజమువాఁడు,మాధుర్యమునుజిమ్ముమాటవాఁడు
శ్రీకారమునుబోలు చెవులజంటగలాఁడు, కుండలంబులకాంతిగుల్కువాఁడు
మొల్లమొగ్గలఁబోలు, మొనదంతములవాఁడు,మవ్వంపుఁజిఱునవ్వుమలయువాఁడు
తే॥ కన్గొనినయంతఁగన్నుల, కఱవుఁదీర్చు
మేనిజిగిసొంపుఁగలవాఁడు, మానధనుఁడు,
కీర్తిధనులనుగాపాడఁ, గెరలువాఁడు
పుట్టెనా వేంకటాద్రియన్, పుడమిఱేఁడు॥ 321

వ॥ ఇట్లుండ, నారాజవర్యునితండ్రి, జగ్గభూపాలుండు, పరలోకప్రాప్తుండగుటం
జేసి, యాయనపినతండ్రి రామన్న, భూపరిపాలకుండై యుండఁ గొంతకాలంబు
నకు, నారాజశేఖరుండు, ధిక్కరించి, నిజరాజ్యస్వాగతుండై, దివ్యవైభవం
బున, వెల్గొందుచు, ననుపమపరాక్రమక్రమయుతుండై, రామావతారంబు
మాడ్కి నెగడుచుండె. అమ్మహాభూపాలుఁడు, బాలప్రాయమందె, మహా
జ్ఞానసంపన్నుండై, యొక్కనాఁడు, నిజసేవకుండగు వేంకటదాసుంజీరి
యిట్లనియె॥ 322

## వేంకటాద్రివిభుని కళ్యాణమహోత్సవము

సీ॥ సేవకా, నీవును, శీలతతోఁబోయి, మాపినతండ్రికి, మనసునాటఁ
దెల్పుమటంచును, దీనబాంధవుఁడైన మాదొరనన్నంపె, మనుజవర్య;
పరిణయార్థంబుకై, భావంబువశమయ్యెఁ, జందర్లపాటిలోఁ జావ వెంక
యాఖ్యునిసుతయును, నతిసుందరాంగియు, వెంకమాంబికయను,విమలముఖిని
తే॥ పెండ్లిఁగైకొనఁగోరెసం, ప్రీతితోడఁ।గాన వేవేగఁ గళ్యాణ, కార్యమిపుడు
సఫలమౌనట్టుచేయుమా, సరసముగను। దడవుసేయంగఁగూడదు,ధరణినాథ॥

వ॥ అనియిట్లు చెప్పిపంపనాసేవకుండు, యథోక్తంబు నారామభూవిభునకు,
విన్నవించునప్పుడు॥ 324

చ॥ అనవుడు రామభూమిపతి, యల్లననిట్లనె, సేవకోత్తమా!
ఘనుఁడగు వేంకటాద్రివిభు, కాంతనుదీర్చెదనంచుఁ బల్కి యా
యనుపమవాంఛయాయనకు, నై జనియించెనో యన్యులెవ్వరే
ని, నిటుధరాధినాథునకు, నేర్పునఁదెల్పిరో తెల్పుమాయన ?॥ 325
తే॥ భూవిభూత్తమ! మఱరాజ,పురుషమాళి।యొక్కచిత్తరువుంగాంచె,నొప్పుగాను
గమ్మకులమందుఁగల బాలి,కలసమూహ।మందుఁగలనై ఖగుల చేతనలరుచుండ॥
ఉ॥ ఆపటమందు బాలికల, నందఱఁజక్కఁగఁజూచి భూవరుం
డాపెను బెండ్లిఁజేసికొన, నాత్మఁదలంచియె నన్నుఁబంపె నే
నాపయివార్తమీకిపుడు, నచ్చుగఁదెల్పఁగ, రాచబాలుఁడున్
మీపటుబుద్ధియోజనల, మేలుగఁగార్యము సేయుఁడీయెడన్ ॥ 327
వ॥ అంతటనారామభూపాలుండానందించి, యేతత్సంగతిని సభాస్థానంబుననుండు
నార్యులకుఁదెల్పి, సుముహూర్తంబుఁ బెద్దలచే నిర్ధారితంబు సేయించి
చందర్లపాటిపట్టణాధీశ్వరుండగు చావవేంకయామాత్యునకు, నొకవిప్రునిచే,
శుభలేఖనంప, వారానందించి, తద్విజునకుఁ బ్రశస్తబహుమానంబొసంగ
నాబ్రాహ్మణుండు, శుభవార్తమరలివచ్చి తనవిభునకుఁదెలిపి, సత్కృతుండై
చన, నుభయస్థలంబులఁ బరిణయప్రయత్నంబులు జరుగుచుండె నట్టియెడ॥
సీ॥ రచ్చలుక్రంతలు, రాజమార్గంబులు, పరిశుభ్రపఱుపంగఁ, బరిజనంబు
సున్నంబుజేగురుల్, సొంపుగాఁదీర్పించె, శృంగారమేపారఁ, జెలువుమీఱ
సకలగేహంబులు, సౌధంబులువెలుంగ, రంగవల్లులుదిద్ది, రంగుపూలయుఁ
బగడాలకొణిగెలు, బాగుగాఁగట్టించి, పందిళ్లువేయించి, పటిమహెచ్చ
తే॥ సకలసామంతరాజులు, సంతసమున।బంధుమిత్రాదులకునెల్ల, భవ్యముగను
బంపశుభలేఖలత్తఱిఁ, బ్రౌఢులెల్ల।బందుగులువచ్చిరతిబంధు, భావమొప్ప॥
చ॥ పటుతరమైన చింతపలి, పట్టణమందునఁ బెండ్లికార్యమున్
ఘటకవతంసులెల్లరును, గౌరవకాంతను జేయనత్తఱిన్
దిటవుగ నింద్రవైభవపుఁ దేకువమించెనొ యన్నయట్లుగా
భటులు నుతింపఁ బెండ్లి బహు, భద్ర సమృద్ధపదార్థమైతగన్ ॥ 330
వ॥ ఆసమయంబున, సకలజనబుధశ్రేష్ఠులానందించి, రనంతరంబున, సకలసామంత
ప్రముఖులకు, సముచితసత్కారంబులొసంగ వారువారు, వారివారి, నివాసం
బులకరుదెంచిరి. పదఁపడి, పినతండ్రియగు రామభూపాలుని ధిక్కరించి రా
జ్యంబు, స్వాయత్తంబుఁజేసికొని భూపరిపాలనంబుసల్పుచు వధూవరులిరు

వురు దాంపత్యసుఖంబుల మెలంగుచుండఁ గతిపయదినసంబులకు॥ 331

గీ॥ వేంకటాద్రీంద్ర వర వీర,విభునకపుడు। పుత్రసంతతి లేకున్కి, భూరినిరతిఁ
బరిణయంబును మరలదాఁ, బటిమమీఱఁ జేసికొనఁ నెంచెఁ బెద్దలు,సెప్పినట్లు.

గీ॥ పార్వతమ్మయనందగు, ప్రవిమలాంగి। నీరుకొండనువంశజ, నిర్మలోక్తిఁ
బరమపతిరతధర్మసం, భావ్యబుద్ధి। బెండ్లిఁజేసికొనెన్ వీర వెంకటాద్రి॥ 333

వ॥ అంతట నారాజోత్తమునకు, సతీలలామద్వయమందును, బురుషసంతతికలు
గక, ప్రథమకళత్రమందు, రాజలక్ష్మియను నొకకన్యారత్నంబు జన్మింప, న
మ్మహాసుందరిని, శాఖమూరువంశపావనుండును, సువర్ణగాత్రుండును, దీన
జనరక్షకుండును, కొచ్చెర్ల నగరవాసుండును, దక్షిమాధిపతియునగు వేంకయా
హ్వాయునకిచ్చి, సకలజనానందకరంబుగాఁ బరిణయంబుఁ జేసిరప్పుడు॥ 334

సీ॥ సంతానహీనత, సారసాక్షుండప్డు, నిజవంశజులలోన, నేర్పుమీఱ
బోధగల్గినజగ,న్నాథబాబును రామ, నాథబాబును ధరా,నాయకుండు
పుత్రవాత్సల్యంబు, పొంపిరివోవంగ, సకలబుధోత్తముల్, సంతసింప
దత్తతాధర్మంబు, దాటకఁగైకొనెఁ, గర్మఫలంబిదె, కాయటంచు

తే॥ బాలచంద్రునిఁ బోలియా,బాలురిర్వు
రెంతొ యభివృద్ధిగాంచుచు, నెల్లజనులు
చూచి సంతోషపడుచుండ, సుందరాంగ
సౌష్ఠవంబునఁజెలఁగిరి, సౌఖ్యగరిమ॥ 335

సీ॥ ఎవ్వానిశౌర్యంబు, సించుకవిన్నంత, శత్రువర్గము లెల్ల, జంకుగొనునొ,
యెవ్వాఁడు మత్తదం,తీంద్రంబుపైదూఁకి, యంకుశంబునమదంబడఁచె సరగఁ
నెవ్వాఁడు కృష్ణలో, నేజంకు లేకుండ, గజమెక్కి వేవేగఁ గదలిపోయె
నెవ్వాఁడు తమ్మున, కిచ్చుభాగంబుపై, జనకునాజ్ఞనుమీఱె, జగతివడక

తే॥గీ॥ నిట్టిశ్లాఘ్యచరిత్రుండు, హితగుణుండు। లేఁడు లేఁడనుకీర్తిచే, వాఁడిమెఱసి
వంశపావనుఁడైనట్టి వాశిరెడ్డి వరజగన్నాథబాబుతాఁ, బ్రబలెజగతి॥ 336

గీ॥ చావవారింటఁబుట్టిన, చంచలాక్షి। రంగమాంబను దద్రాజు, రమ్యముగను
బరిణయంబునఁ గైకొనె, భవ్యరుచిని, నాటిబంధుగులెల్లరు, సంతసింప॥ 337

శా॥ భూలోకోత్తముఁ డార్తరక్షకుఁడు సం,భూత ప్రభాధాముఁడుర్
వ్యాలుండామెకు సంతులేనికతనన్, శీఘ్రంబె తత్సన్మతిన్
వాలాయంబుగఁ బెండ్లిచేసికొనె దీ,వ్యత్సద్గుణన్ ధర్మస
చ్ఛీలన్ ప్రాతదయానిధిన్ విమలవా, క్సిద్ధాత్మయానచ్చమన్ ॥ 338

వ॥ ఆభూపాలునకు నిభార్యలిరువురియందును, సంతులేకయె, కొన్నిదినంబులు
గడచె, పిదపఁ గొంతకాలంబునకా రాజు,మరణించె. తద్రాజాజ్ఞానుసారంబు
గా, నాయన ప్రథమభార్యయగు రంగమాంబ,వంశవృద్ధిచేయందలంచి. 339

ఉ॥ శ్రీపతి సత్కృపన్ మనకుఁ, జేకుఱకుండెను సంతువంశమా
వేపడిపోవుఁగావునఁ బవిత్రుని నొక్కని దత్తుఁగైకొనన్
జేపడు మేలటంచుబుధ, సింహులబుద్ధిని దివ్యమూర్తి, ల
క్ష్మీపతినామధేయునిన, మేయపరాక్రముదత్తుఁగైకొనెన్॥ 340

సీ॥ అమ్మహితాత్మకుం, డతిసుందరాంగుండు। పుత్రంబుగలవాఁడు, సమరసుండు
బుధపాలకహితుండు, భుజదర్పధుర్యుండు, చంద్రనిభాస్యుండు, జలదవర్ణుఁ
డార్తరక్షణకళా, వ్యాపారశీలుండు। భూపరిపాలనభూరిబలుఁడు
వేంకటలక్ష్మ్యంబ, వినుతగుణకదంబ, వరచిరుమామిళ్లవారియింట

తే॥ సూరభూపాలునకుఁగల్గ, సొంపుమీఱఁ। బరిణయంబందెనామెను,భవ్యరుచిని
మదిఁగలకోర్కెలెల్లను, బ్రిదులుచుండ। స్వీయులెల్లరుసంతుష్టిఁ జెందుచుండ॥

వ॥ ఆరాజేంద్రుండుసంతానహీనుండైనకతంబున, గొంతకాలంబువగచి, పరలో
కగతుండయ్యె. అంతటనారాజుభార్యయగు, వేంకటలక్ష్మమ్మ నిజభర్తను
మతిని, స్వవంశసంభూతుండును, సుగుణనిధియును, సుందరశరీరుండును, దు
మ్మపూడిపురాధీశ్వరుండగు వెంకయాఖ్యుని తృతీయపుత్రుండునునగు వేంక
టలక్ష్మీనరసింహనాయని దత్తుఁగైకొనెనయ్యెడ॥ 342

గీ॥ పరమపావనమూర్తియా,భవ్యయశుఁడు। నిరుపమోజ్జ్వలతేజుండు,నీతిపరుఁడు
శౌర్యసాహసగరిమచేఁ,జాలువాఁడు। చదువులందునజ్ఞానంబు,పొదలువాఁడు॥

చ॥ అనఘుఁడుశూరవర్యుఁడు మ,హాబలశాలి మనోజ్ఞమూర్తియున్
వినుతయశఃప్రకాశుఁడుప, విత్రకులుండును ధర్మబుద్ధియున్
ఘనవిభవాకరుండుబుధ, కైరవచంద్రుఁడు రాజవర్యుఁడున్
వనధిగభీరుఁడున్ విమల, వాగ్విసరుండు వెలుఁగుమిన్నయై॥ 344

చ॥ హరిపదభక్తముఖ్యతముఁ,డానందనాథుఁడుదానధర్మత
త్పరమతియై, ప్రశస్తముగు, దైవికకృత్యములందుశ్రద్ధతోఁ
దిరుగుచుగౌరవంబుఁగని, తేకువదివ్యమనోజ్ఞవృత్తివి
స్ఫురితవిభూషణుండయియ, పూర్వమహామతిసన్నుతింగనెన్॥ 345

ఉ॥ ఈనరపాలశేఖరుఁడ, హీనమహాగుణమానశాలి తే
జోనిధి, సర్వలోకనుత, సుందరభావుఁడుప్రాణపంచకం



శ్రీ రాజా వాసిరెడ్డి వేంకట లక్ష్మీనరసింహానాయుడు
మాన్నెసుల్తాను బహద్దరుగారు.

జేనిఁద్యజించిమానమున, శేనిస్వయమ్ముగనిల్పఁగాఁదలం
పూనెడివాఁడుబుద్ధిబల, మొప్పెడువాఁడుస్వతంత్రుఁడన్నిటన్॥ 346

ఉ॥ ఏఁబదివేలయాస్తిజన, యిత్రిదివ్యాజ్యమునన్ బడంగస
త్తాబలమున్నయీనృపుఁడ, తంద్రుఁడుతద్ధనమున్ గ్రహింప,గా
రాబునజడ్జికోర్టునకు, రాఁగనటన్ సభమించుజడ్జిగా
రోబలశాలి? నిల్చితగ, వొప్పఁగఁగైఖితునోలినిమ్మనన్॥ 347

వ॥ అప్పుడారాజేంద్రుండాజడ్జిగారితో నోయయ్యా; చాలకాలమునుండి మాకు
సత్సభాస్థలులలోఁ దాజీములు నెలయుచుండె, ఇపుడేలపొసఁగవు, మానభంగ
మునహింపరానిదికదాయన నాన్యాయాధిపతియు" రూలొప్ప " దని సెలవీ
యనభిమానధురీణుండగు నీనరపాలుండీవృత్తాంతంబు హైకోర్టునకుఁ దెలిపి
కొనవచ్చుటిజడ్జీలాలోచించి సముచితాసనమిచ్చుటయతగునని క్రిందివారికిం దె
లుపనాకోర్టువారు సగౌరవంబుగా నీరాజునుమీరువచ్చి మీమర్యాదన్
గ్రహించి వ్యవహారవిధినిదెల్పుకొనవచ్చునని న మొదటమన్నింపనిక తనమా
కువ్యాజ్యముతోఁబని లేదని విరమించుకొని మానరక్షణార్తై పాటుపడెను!
ఇట్టిరాజరత్నంబు చిరుమామిళ్ళ శ్రీరామరాజేంద్రునిపుత్రికయగు లక్ష్మీనరస
మాంబను వరియించిన యనంతరంబున॥ 348

చ॥ పరిణయమాడెనావిమల, పల్లవపాణిని హేమగాత్రినిం
బరమదయాహృదంతరను, శార్వికచంద్రసఖాస్యమండలన్
నరసుతదివ్యశీలనుస, నాతనధర్మపథప్రచారిణిన్
గురుతరవంశవర్ధనినిఁ, గోరిక లీరికలెత్తనయ్యెడన్ 349

మ॥ తనవారింబెఱవారినొక్కమతితో, దాక్షిణ్యదీప్తిన్ విలో
కనముం జేయుచుదానధర్మపథసం, గంబన్న నెంతోముదం
బునుగైకొంచుధనప్రధానమనిశం, బున్ జేసిబాలౌఘవి
ద్యనువృద్ధింగనఁ జేయుసాధ్విపతిమా, ర్గానక్తయాకొమ్మయున్॥ 350

వ॥ ఈరాజపత్ని యనపత్యురాలగుటచే స్వపత్యజ్ఞనొప్పునవంశవృద్ధిచేయఁదలంచి॥

చ॥ నరసయపుత్రునిన్ గుణస, నాథునిశీలుని వేంకటాద్రినిన్
గరిమనుదత్తుఁజేసికొనె, ఁగాఁగలమేళ్లకువీల్పొసంగఁగా
గఱువలుచెప్పినట్టియన, ఘుంబగుమార్గముఁగాంచుబుద్ధితో
సిరియునుసంపదల్ గలుగ, ఁజిత్తముసంతసమొందునట్లుగాన్॥ 352

వ॥ అమ్మాన్నణవకుండు. చంద్రాననుండును, గాంచనగాత్రుండును,

సుశీలుండును, సారసాక్షుండును, సింహశాబకతుల్యుండునునై, కొంతకా
లంబువిభవాతిశయంబులవిలసిల్లి పరమపదంబుంగాంచె, ననంతరంబున, నీనర
పాలునిముత్తాతతమ్ముఁడు రామనాథబాబుయొక్క, వంశక్రమంబువివరించెద॥

## రామనాథబాబువంశానుక్రమణిక

ఉ॥ రాజకులైకవర్ధనుఁడు, రాజ్యరమానుగతప్రభావుఁడుఁ
భూజనవర్ణనీయుఁడతి, పుణ్యకృతిప్రచురుండు యోగ్యుఁడై
నాజనపాలశేఖరుఁడు, దంచితసద్యశుఁడవ్వాఁడన్నిటన్
శ్రీజయశాలిసర్వసమ, శేముషిగల్గిననాఁడు వర్ధిలెన్॥ 354

చ॥ పరిణయమాడెభూవరుఁడు, పద్మవిరోధిసమానవక్త్రిలన్
నిరుపమలక్షణాంగులను, నిర్మలచిత్తపయోజలన్ మహా
వరగుజనానుకూలలను, వారిజనేత్రలఁ గంబుకంఠులన్
బరమపతివ్రతామణుల, భవ్యసుశీలలనిద్దఱన్ వెసన్॥ 355

సీ॥ ఆరాజునకుఁబుట్టి, రతిధర్మతత్పరు, లిరువురుపుత్రకు, లింపుమీఱ
దశరథనాయండు, ధరణీవరోత్తముం, డాయనసోదరుం, డమలయశుఁడు
సుగుణౌఘనిధియును, సురుచిరదేహుండు, సాహసవంతుండు, చతురుండు
వరసదాశివనాయ, ఁడరయభూవిభులలో సత్కీర్తికిరనయి, సంచరించు
తే॥ నట్టియిరువురుచెల్మితో, నవనియందు। శుద్ధశివపూజనల్పుచు, శ్రద్ధనుంచి
యుత్తరరక్షకబిరుదంబు, నధిగమించి। యొప్పుగానుండిరొప్పుల, కుప్పలగుచు॥

వ॥ అందుజ్యేష్ఠుండగు దాశరథిప్రసాదనాయఁడు, బంగారమ్మ, లక్ష్మీదేవమ్మయ
ను నిరువురు కన్యకారత్నంబులఁబెండ్లియాడి, సుఖంబుగనుండఁ, బ్రథమభా
ర్య, యనపత్యురాలయ్యె, ద్వితీయభార్య, సర్వశుభలక్షణ లక్షితుండగు రా
మనాథబాబనునొక్క సుపుత్రుంగనె, ననంతరంబ॥ 357

సీ॥ భూపాలవర్యుండు, పురజనార్యులతోడ, భేదమేలేకసం, బ్రీతిఁదిరుగు
నార్తరక్షణమందు, నతికుతూహలమందుఁ, గారుణ్యబుద్ధిచే, గరిమమీఱియు
నిట్లుండ నాతని, హెచ్చునర్తనలకు, నెల్లవారుల్లాన, మొనయుచుండ
సద్వ్యార్లగడ్డవంశంబునఁబుట్టిన శ్రీమల్లికార్జునభరామిపాలు
తే॥ పుత్రికయు నోర్పునందున భూతధాత్రి
సకలకల్యాణగుణగణ చారువదన
రాజ్యలక్ష్మ్యంబయను నామె రహివెలుంగఁ
బెండ్లియాడెను జనులెల్లఁ, బ్రీతిఁగాంచ॥ 358

ఉ॥ అమ్మహనీయశేఖరున కంచితధీరుఁడు సుందరాంగుఁడున్
సమ్మతవర్తనుండు హితసంఘ మహోత్తరరంజనుండు, నా
సామ్మనిదానధర్మగుణ, శోభ వెలింగెడువాఁడు దివ్యచి
త్తమ్ముగలాఁడు పుట్టె నతి, దర్పమనోహరబాహువీర్యుఁడై॥ 359
గీ॥ వాశిరెడ్డిమహావంశవర్ధనుండు। వేంకటాద్రీంద్ర మన్యహాం, వీరుఁడనఁగ
దివ్యతరలక్షణుండయి, తేజరిల్లె। నొక్కయవతారపురుషుని, యోజమెఱయ॥
సీ॥ భూపాలబాలుని, భూరిపితామహు, సోదరుండైనట్టి, సుందరుండు
సత్సదాశివ సుప్రసాదనాయండన, వాసికెక్కినయట్టి వసుధవిభుఁడు
శ్రీమంతు బిరుదుచే, స్థిరవిభూతిని యార్లగడ్డవంశంబున, ఖ్యాతిపరుఁడు
శ్రీ యంకినీఁడను, శ్రేష్ఠునిపుత్రికయా, కల్యాణగుణశీలఁ, గాంచనాంగి
తే॥ జ్ఞానవరసుప్రసూనాంబఁ జారువదన। సర్వసమబుద్ధి వైరాగ్య శస్త్రపేటిఁ
బరమపతిరతయైనట్టి పడఁతిమిన్నఁ। బరిణయంబందె నారాజు భాసురముగ॥361
వ॥ అమ్మహనీయశేఖరుని, గౌరవవంశపువాఁడగు, జగ్గభూపాలునితమ్ముఁడు రా
మన్న యను భూవిభునకు, నాగన్న, వరపు పాపయ్యయను కుమారుఁడు
జన్మించెను. ఆయనకు రామానాయఁడు, రామనాథబాబను, నిద్దఱుపుట్టిరి.
అందుఁ బ్రథముండు సంతానహీనుండయ్యె. ద్వితీయుని మహారాజశేఖరుండైన
వేంకటాద్రినాయఁడు, ద్వితీయపుత్రునిఁగా దత్తుఁజేసికొనియె. ఆరామనాథ
బాబుతాత రామన్నసహజుండు నాయఁడమ్మ, వంశక్రమంబువివరించెద॥362
సీ॥ ఆనాయఁడమ్మకునమలగుణాఢ్యుండు, చంద్రమౌళివిభుండు, జననమందె
నారాజునకుఁబుట్టి, రార్యసమ్మతబుద్ధు, లిరువురుపుత్రకులింపుమీఱ
ఘనపద్మనాభిరామన శేఖరుండన, వరసుగుణంబుచే, వాసికెక్క
నాయనసోదరుండబ్జనేత్రుఁడుజగన్నాథబాబను, ధరానాథమౌళి
తే॥ వీరశ్రాద్ధానలోజ్జ్వలవిభవుఁడైన। పరమపావనమూర్తియౌ, భద్రయశుని
దత్తుఁగైకొనిరయ్యెడధర్మవిధిని। వేంకటాద్రీంద్రమన్యహాం, వీరుఁడపుడు॥ 363
తే॥ ఆజగన్నాథబాబునకగ్రజుండు।
శ్రీయుతుండునుసదయుండు, స్థిరగుణుండు
పద్మనాభాభిరామన, భవ్యయశుఁడు
కాంచెగులపావనుండగు, ఘనునిసుతుని॥ 364
ఉ॥ ఆనరనాథశేఖరుఁడు, దంచితకీర్తియువిక్రమాఢ్యుఁడున్
మానితధర్మశీలుఁడును, మంచితవర్తనగల్గువాఁడుధా

శ్రీనుతసత్కృతిక్రముఁడు, దివ్యమనోంబుజుఁ డుత్తముండు శ్రీ
మానవనాథపాళిఁదగు, మన్ననఁగాంచెనునాయఁడమ్మయున్॥ 365

సీ॥ ఆరాజునకుఁబుట్టి,రతిధర్మశీలురు, పుత్త్రకులిద్వురు|భూరియశులు
వరపద్మనాహ్వయు, వసుధాధినాథుండు, కాంచనతేజుండు, ఘనతరుండు
సుగుణాలవాలుండు, సురుచిరాకారుండు, చంద్రాననుండును శాంతమూర్తి
నిరతాన్నదాతయు, నియతవ్రతుండును, గానవిద్యాలబ్ధకీర్తియుండు

తే॥ అట్టిమహనీయునకుఁదమ్ముఁ, డనఁగఁబరఁగు
చంద్రమౌళ్యాహ్వయుఁడగు. జలదవర్ణుఁ
డనుపమోజ్జ్వలతేజుండు, ఘనభుజుండు
శ్రితసమూహావనోత్సాహ, చేష్టవెలసె॥ 366

వ॥ అందుజ్యేష్ఠుండగు పద్మనాభిరామభూపాలునకు నాయఁడమ్మయనుభూవరుం
డుద్భవిల్లె ,పిమ్మట 367

సీ॥ ఆరాజశేఖరుం, డతిశాంతమూర్తియుఁ, జంద్రనిభాస్యుండు సరసవచనుఁ
డాశ్రితరక్షకుం, డార్తార్తిభంజకుం డౌదార్యశాలికీ, ర్త్యంచితుండు
యార్లగడ్డాన్వయఖ్యాతుఁడౌ వేంకట, రామలింగనయను, రాజమణికి
నుదయించినట్టిశ్రీ, యుతరాజ్యలక్ష్మ్యంబ, యనురాజముఖిని, బెండ్లాడినవల

తే॥ నాయనయునామెయునునాత్మ, నైక్యమొంది
యసమసాయకసమరసా, ఖ్యాబ్ధిమునిఁగి
వత్సరంబులనిముసాల, వలెనుగడపఁ
జొచ్చిరీదంపతుల జోకఁజూడమనఁగ॥ 368

ఉ॥ వారికిఁబుట్టిరిద్వురు ప్ర, భంజనసూనుపదాబ్జ భక్తులున్
శూరవతంసులున్ విమల, సుందరరూపులుగాఁగవార్ష్ణులున్
ధీరజనోపయోగపటు, దివ్యతరోత్తమ కృత్యకల్పనా
ధారులుసత్కుమారులున, ధర్మమనోబలశాలులొప్పఁగన్ 369

సీ॥ అందుజ్యేష్ఠుండగు, నతిసుందరాంగుండు, వరసుగుణుండును, వసుధవిభుఁడు
వేంకటాద్రీంద్రుఁడౌ, వీరవరేణ్యుండు, బుధనుతశీలుండు, పుణ్యబుద్ధి
యాతనిసోదరుం, డయగుణోపేతుండు, శూరుండుధీరుండు శుభ్రకీర్తి
యలరామనాథబా, బనుపద్మనేత్రుండు, చంద్రనిభాస్యుండు శాంతమూర్తి

తే॥ యనఁగనిరువురుపుట్టిరి,హర్షమొనఁగ|నిరుపమానందసంభార,నియతితోడ
వైభవోన్నతిచేమించి,వాశిరెడ్డి'వంశపావనులనఁగనువన్నెఁగాంచి॥ 370

ఉ॥ వారలతాతతమ్ముఁడును, వంశసుశీలుఁడుచంద్రమౌళిభూ
దారుఁడుసంతులేకునికి, ధర్మపరుండునుసుందరాంగుఁడుఁ
భూరిదయానుయాత్ముఁడతి,పుణ్యుఁడువేంకయనామధేయుఁడ
పారఁగఁగన్నయట్టిగుణ, హారినిఁబాపయ,దత్తుఁగైకొనెన్॥ 371

సీ॥ దేవరకోటకు, దివ్యవైభవశాలి, భూపాలవర్యుండు, బుధహితుండు
సతతవిక్రమకళా, సంభ్రమోల్లాసుండు, కీర్తికాంతామనఃపూర్తికరుఁడు
యార్లగడ్డాఖ్యాన్వయాప్రతిముండును మల్లికార్జునుఁడను, మనుజవిభుని
మూఁడవపుత్రిక,మోదపూర్ణహృదబ్జత్రిపురసుందరియనుదివ్యకన్య
తే॥ నిరుపమైశ్వర్యలక్షణ,నియతితోడఁ। గోరిపెండ్లాడెనాయన,కూర్మిమీఱ
నఖిలమర్త్యులుసంతసంబందుచుండఁ। బ్రబిమలానందమలరార,భవ్యరుచిని 372

## చింతలపాటియొంటుప్రభువగు చంద్రమౌళిభూపాలుని వంశానుక్రమణిక.

సీ॥ శ్రీచంద్రమౌళిధాత్రీశసతయోగ్యుండు,భక్తిసంయుక్తుండు,భవ్యయశుఁడు
నిరతిచేశంకరునింబూజసేయుచు, నకలంకమగుబుద్ధి, నందియుండి
చింతలపాడను,సీమకునాథుఁడై, సరసతతోఁజాఁల సత్యవిధిఁ
బరిపాలనముఁజేసి,భాసిల్లియున్నట్టి, యారాజునకుఁగల్గె నవనివిభుఁడు।
తే॥ చిన్నరాఘవనాయండు,స్థిరయశుండు। సాధురక్షణపరుఁడు విశాలకీర్తి
వంశపావనుఁడనఁగను,వాసికెక్కె। ప్రబలెభువియందునారాజు,పటిమమెఱయ

ఉ॥ ఆనరపాలశేఖరున, కంచితమూర్తులు పుత్రులిర్వురున్
దానగుణప్రవర్తకులు ధైర్యనిధుల్జనియించిరొప్పగా
శ్రీనయశాలి సత్యవిధి,శీలుఁడు జ్యేష్ఠుఁడు రాజమౌళియున్
వానిసహోదరుండు నృప,వర్యుఁడు లక్ష్మీపతిప్రసాదుఁడున్॥ 373

వ॥ అందు ద్వితీయుఁడగు లక్ష్మీపతిప్రసాదనాయనికి సంతతిలేకపోయె. జ్యేష్ఠుం
డగు రాజమౌళిభూపాలునకుఁ జంద్రమౌళినాయఁడు వీరయాభిఖ్యుండును
నిరువురుకుమారులుపుట్టిరి. అందు వీరయ్యకుఁ, బుత్రసంతతిలేదయ్యె. జ్యే
ష్ఠుండగు చంద్రమౌళిభూపాలునకు రాజమౌళి, లక్ష్మీపతి,రాఘవయ్య
చంద్రమౌళి, వెంకయ్య యను నైదుగురుకుమారులుపుట్టిరి. అందుఁ బ్రథమ
ద్వితీయులకు సంతులేదయ్యె, నయ్యెడ. 374

తే॥ చంద్రమౌళ్యాహ్వయుండగు, జగతివిభుఁడు
సత్యసంధుండు నిజభుజ, జయయుతుండు

నియతశివభక్తుఁడాప్తుండు, నిర్మలుండు
వంశపావనుఁడనఁ నెప్పె, వసుధయందు॥ 375

ఉ॥ ఆనరపాలశేఖరుఁడు దంచితవర్తనుఁడుత్తమాశయుం
డానన గీర్తిఁగాంచిన మహోత్తరబుద్ధి విశారదుండు స
న్మానవమాళి యయ్యెడల, మానుగఁగాంచె మతిప్రసిద్ధునిన్
దానగుణాయతాత్ముని యథార్థపరున్ సుతునబ్బయాఖ్యునిన్॥ 376

సీ॥ ఆరాజవర్యుండు, హరసపర్యాత్ముండు, కాంచెనుబుత్రుని, గరిమగలుగు
వానిముక్త్యేశ్వరవర సుప్రసాదనా,యండనఁబరఁగిన, యవనివిభునిఁ
గాంచనగాత్రుండు, ఘనతరధైర్యుండు, కరుణానిధానుఁడు, కమ్రబుద్ధి
స్ఫుటపరాక్రమశాలి, నిటలాక్షుభక్తుండు పాపభీతిగలట్టి పరమగుణుఁడు
తే॥ సాటియేలేని జయమెల్ల గోటమీఁటి। యేలికలలోనవిఖ్యాతి, ననసియతఁడు
కారుకారీతనికిసాటియేరుఁగూడ। బళీబళీయనసిరాజు, పరఁగధరను। 377

తే॥ అట్టిమహనీయగుణశాలి, యవనివిభుఁడు।ప్రకటితోద్దండభుజబల, ప్రాభవుండు
పరిణయంబాదెనారాజు, పటిమమీఱ।బరమసౌభాగ్యవతియగు, భవ్యమతిని॥

సీ॥ ఎవ్వానిశౌర్యంబు, నించుకంతవినంగ, వైరిహృత్పుటములు, బ్రద్దలయ్యె
నెవ్వానిచాతుర్య, మేపారిహూణాన, త్సభలందుగౌరవ, స్థానమయ్యె
నెవ్వానిభీకరా, కృతిఁగనుంగొనిసని, వ్వైరపాటునేవీర, వితతిగాంచె
నెవ్వానిశక్తి, పోయినరాజ్యమునుసార్వభౌముసత్కృపవెండి, పడయునయ్యె
తే॥ నిట్టిమేధావిభువిలోన, నెచటఁగనమ।టంచుఁబెద్దలుపొగడంగ, నవనివిభుఁడు
భూప్రజాపాలనముఁ జేసెఁబొందుమెఱయ। ధర్మగుణనతిపూర్ణచంద్రసమకీర్తి॥

శా॥ ఆరాజేంద్రుఁడుశూరధర్మమున ద, ర్పాంధారివీరావళిన్
ఘోరాస్త్రంబులనొవ్వఁజేసికడిమిన్, గ్రుద్ధాత్ముఁడై కల్పగం
భీరోగ్రాకృతిఁదాల్చియెల్లపుడును, ద్యోలప్రతాపానల
స్ఫారుండై పృథుకీర్తిఁగాంచె నసమ, వ్యాపారమేపారఁగన్॥ 380

మ॥ వరముక్త్యేశ్వరపట్టణంబునధను, ర్వ్యాపారసంభారులై
యిరవొందన్ గిరిజేశు పెండ్లికుతుకాహీనాత్ముఁ జేయించుచున్
సురలన్ సంతసపెట్టుచున్ సుకృతులన్, సంపారసేవించుచున్
గళకంఠున్ మదిసంస్మరించుచుధరా, కాంతుండువర్ధిల్లెడున్॥ 381

వ॥ ఇట్లుండఁగఁ గతిపయదివసంబులకు॥ 382

క॥ అమ్మాదినీశ్వరునకును। సమ్మతగుణులైనసుతులు, జన్మించిరి చి
త్తమ్ములఁ శంకరుఁ దలఁచుచుఁ। గమ్మకులాధ్యక్షులనెడిఁగరిమంగనుచున్॥ 383

సీ॥ ఆజ్యేష్ఠపుత్రకుండు దరుణవిగ్రహశోభి, సత్యవంతుండు యశఃప్రియుండు
వరగురూమామహేశ్వరప్రసాదుండన, రాజిల్లుచున్నట్టి, రాజవరుఁడు
శాఖమూరన్వయ, సంభూతురాలైన వెఙ్కమాంబికయను, విపులనేత్రఁ
బరమపతివ్రతా, వరగుణోపేతను, గాంచనగాత్రినిఁ గమలముఖిని

తే॥ సకల శోభావిశేషముల్, సందడింప
నిఖిల భూసురవర్యులు, నెమ్మిఁగొలువ
స్వీయబంధువులెల్లరు, వేడ్కఁజూపఁ
బరిణయంబాడె నారాజు, ప్రాభవమున॥ 384

ఉ॥ ఆనరపాలసోదరుఁడు, హైమకళాకలితాంగశోభి, స
న్మానవనాథసంచయ స,మంచితసద్గుణభూషణుండు జ
న్మానవనె వెంకటాద్రివర, నాయఁడనంగను గాంచె మువ్వురన్
భూనుతసద్వివేకులను, బుణ్యపరాత్ములఁ బుత్రులన్ వెసన్॥ 385

వ॥ అందు జ్యేష్ఠుండు చంద్రమౌళినాయండు, తత్సహజుండు సదాశివప్రసాదనాయండు, అందుఁ జంద్రమౌళిమహారాజు, నుమామహేశ్వర ప్రసాదనాయండు దత్తుఁ గైకొనియె. ఆయనతమ్ముండు నిరుపమభుజదర్ప విజృంభితుండై పరమపదంబునొందె. అంతట నాయనతండ్రి, మరల శాఖమూర్వంశ సంభూతురాలైన యొకకన్యకామణిని వివాహంబుఁజేసికొన, నమ్మత్తకాశినియందు సుప్రసిద్ధుండగు నొకపుత్రుండుగలిగె. ఆయనపెద్దతండ్రి యుమామహేశ్వర ప్రసాదనాయని దత్తపుత్రుండగు చంద్రమౌళిభూపాలుఁడు, సద్యస్కాల ప్రభువరుండై యుండె నదెట్లనిన॥ 386

మ॥ నరలోకేశ్వరుఁడర్థికల్పకమప, ణ్ణానాథునిన్ నిచ్చలున్।
బరమామోదముతోడఁగొల్చుచుమహా, ప్రఖ్యాతి వెల్గొందుచున్
వరవిద్వత్కవినుత్యపద్యలహరీవ్యాహార, బద్ధాత్ముఁడై
గరిమన్ సర్వసుపర్వభక్తుఁడయిచక్కంజేసె రాజ్యంబిలన్॥ 387

కం॥ దేవరకోటకధీశుఁడు
పావనుఁడతిపుణ్యమూర్తి ఘవ్యయశుండున్

భూవినుతగుణగణాంబుధి
క్ష్మావిభుఁడతిచతురబుద్ధి, సత్త్వుండొప్పున్॥ 388

తే॥ యార్లగడ్డాన్వవాయుండు, క్ష్మాధినేత
మల్లికార్జుననాయఁడన్, మానధనుని
వరసుపుత్రికయైనట్టి, వనజనేత్ర
మంజుతరగాత్రిభాగ్యర, మానమేత ॥ 389

తే॥ పరమపావనగుణఖని, భాసురాంగి
జతురతరవాణి దుర్గాంబఁ, జంద్రముఖిని
వాసిరెడ్డ్యన్వయుండగు, వసుధవిభుఁడు
పెండ్లియాడెనుసురుచిర, విభవమునను॥ 390

సీ॥ ఆరాజవర్యుండు, దారభావము చేత, భూపరిపాలనంబునుబొనర్చి
భూరికృపోన్నతి, భూలోకులందఱ, కభిరాముఁడై చాల, న్యాయబుద్ధిఁ
బాటించిప్రజలను, బరితోష మొందించి, సత్యమేజయమని సరసముగను
దుర్భరశక్తిని, దుష్టులశిక్షించి శిష్టులరక్షించు, శ్రేయమలర

తే॥ బుధులపాలిటిమందార, భరాజమనఁగ
దానదాక్షిణ్యవర్తన, స్థవిరుఁడనఁగ
నార్తజనరక్షణంబున, హరియనంగ
వర్తిలుచునుండెనాధరా, వల్లభుండు॥ 391

వ॥ ఇట్లుండనా రాజవర్యునిభార్యామణి దుర్గాంబస్వర్గస్థురాలై నకతంబున॥ 392

ఉ॥ బాలరసాలసాలనవ,పల్లవకోమలదివ్యమూర్తియుఁ
బాలశశాంకఫాలయును, బద్మదళేక్షణస్వచ్ఛవాణియుఁ
శ్రీలలితాతిశుద్ధగుణ, శ్రీకరపాణిసరోజరేఖయుఁ
మేలుగణించువర్తనల, మించినకన్యక రాజ్యలక్ష్మియుఁ॥ 893

తే॥ గీ॥ శాఖమూర్వంశవిభుఁడగు, చంద్రసముఁడు।
ఘనుఁడు వేంకటకృష్ణయ, కనువుగాను
జననమందినకన్యకఁజారువదనఁ
బరిణయంబాడెనారాజు, పటిమమెఱయ॥ 894

వ॥ ఆరాజోత్తమునితాతయగుభవానీముక్తీశ్వరప్రసాదనాయనింతమ్ములు, చంద్ర



శ్రీ రాజా వాశిరెడ్డి శీతారామయ్య బహద్దరుగారు.

మౌళి, సదాశివప్రసాదనాయండు, ననునిరువురుసద్గుణరత్నాకరులై, సంతాన
హీనులైరి. వారలతాతచంద్రమౌళిభూపాలుని సోదరుఁడు వెంకయాఖ్యున
కు, రామలింగన్న, నాగభూషణము, రాఘవయ్య, లక్ష్మీపతియను నల్గురు
పుత్రులుపుట్టిరందు॥ 395

సీ॥ రాజాగ్రగణ్యుండు, రామలింగాఖ్యుకుఁ డిరువురుపుత్రుల, నింపుమీఱఁ
గాంచెనుబటువర్ప, ఘనశౌర్యశాలుల, సుగుణాలవాలుర, సుందరులను
వెంకయాహ్వయుఁడన, వీరాతివీరుండు, ప్రవిమలాకారుండు, ప్రాజ్ఞబుద్ధి
సంతానహీనత, శాంతచిత్తుండయి, వైరాగ్యకలితుఁడై వాసికెక్క
నారాజుసోదరుం, డమలప్రచారుండు, రాజమౌళిప్రశస్త, రాజమౌళి

తే॥ నిరుపమానందశీలుఁడై, నియతిఁ బ్రోడ
శ్రీమహత్త్వంబుచేమించి, స్థిరవిభూతి
సత్త్వగుణనిధియననొప్పె, సర్వవిధుల
విబుధపూజలవిలసిల్లె, వేడ్కమెఱయ॥ 396

సీ॥ రాజేంద్రుఁడుద్దండ, రాజవర్యుండైన, యార్లగడ్డాన్వయ, క్ష్మాధినేత
యంకినీఁడనుమహా, వ్యాపారశూరుండు, నిరతాన్నదాతయుఁ, బరమభోగి
పటుపరాక్రమముచేఁ, బరఁగునాతనిగర్భ, సంభూతురాలైన, చంద్రముఖిని
వెంకమాభిఖ్యను, విమలపల్లవపాణిఁ, జారుపంకజనేత్ర, సరసవచన

తే॥ సకలనారీశిరోమణి, సాధుబుద్ధిఁ
బెండ్లియాడెనుబాంధవప్రీతిమెఱయ,
వంశభూషణుఁడైనట్టి, వాసిరెడ్డి
రాజమౌళ్యాహ్వయుండగు, రాజవరుఁడు॥ 397

శా॥ ఆభూపాలుఁడుసంతులేనికతనన్, హర్షంబుతోఁబిమ్మటన్
శోభాకారతదత్తుఁగాఁగొనెమహా, శుద్ధాంతరంగంబుతో
శ్రీభాసిల్లఁగ రాజమౌళిసుతుఁడున్, శ్రీదోపమానుండునన్
దాభద్రాత్ముఁడునై వెలుంగఁదగుసీ, తారామనామాంకితున్॥ 398

గీ॥ ఆనరేంద్రుఁడు విమలసహాయుఁడగుచు। సర్వజననుతకీర్తిచేఁజాలమించి
సాధుజనరక్షణమ్మున,శ్రద్ధఁదాల్చి।యనుపమానుండితండన్న,యటులనొప్పె॥

సీ॥ ఆనీరజాక్షుండు, భూనాథచంద్రుండు, శౌర్యవిక్రమకళా, సంభ్రమమునందు
యార్లగడ్డాన్వయ, ఖ్యాతచారిత్రుఁడౌ, దుర్గావరప్రసా, దునకుఁ జేర్మి
సంభూతయైనట్టి, సారసాక్షియునగు, లాంజేశ్వరాంబయం, హాదిగాత్రి
లక్ష్మీకళామహా, లక్షణశాలిని, కన్యక యాపెను, గాంతుఁడయ్య

తే॥ గౌరవంబునఁ బెండ్లాడె, ధారుణీంద్రు। లెల్లరీవైభవముఁ గాంచి, యుల్లములను
హద్దులేనట్టిసంతోష, మందుచుండ। నిత్యవంశాభివృద్ధులుఁ, గడుమెఱుఁగు॥

ఉ॥ ఆనరపాలమౌళికిమ, హాగుణవంతులు పుత్రులార్వుర
జ్ఞానులు లసద్బలులు, యాచకచాతకవారివాహులున్
దానగుణప్రవర్ధనులు, ధర్మకృతిప్రవణస్వభావులున్
ధీనిధులుద్భవించిరతి, దివ్యవచఃప్రసర ప్రవర్తమల్॥ 401

వ॥ వారికి వేంకటగురునాథప్రసాద రావనియు, వేంకటసత్యనారాయణరావనియుఁ,
పార్థసారథి వరప్రసాదనియు, వేంకటకృష్ణారావనియుఁ, జంద్రమౌళిప్రసా
దనియు, లీలాచంద్రశేఖర ప్రసాదనియు, నామధేయంబులు. ఆరాజబాలుర
ముత్తాతయగు రామలింగయ్యగారి ద్వితీయతృతీయసోదరులు, సంతానహీను
లైరి. చతుర్థసోదరుండగు లక్ష్మీపతినాయనికి, నిరువురు పుత్రులుగల్గిరందు॥

గీ॥ జ్యేష్ఠుఁడగుధారుణీపతి, హేమరూపుఁ। డాశ్రితావనకుశలుం, డనంతబుద్ధి
పౌర్వికాచారవిశ్వాసి, భద్రయశుఁడు। రామలింగాహ్వయుండను, భీమబలుఁడు॥

వ॥ ఆసుగుణమణికి, సాంబశివప్రసాదు, వేంకటాద్రి, లక్ష్మీపతియను, మువ్వురు
కుమారులు, వృద్ధికాములు, శుభలక్షణమణులుకల్గిరి. 404

ఉ॥ ఆనరపాలశేఖరుల, యయ్యకుసోదరుఁడైనవాఁడు స
మ్మానముగాంచఁగాఁదగిన, మన్ననఁగల్గినవాఁడు దివ్యమౌ
జ్ఞానముఁగల్గువాఁడుపిల, సద్వదనప్రభఁ గ్రాలువాఁడు వి
ద్యానిరతుండువర్తిలెడుఁ, దద్దయువేంకట, నారసింహుఁడున్॥ 405

మ॥ అవతారప్రతిభావినోదసుగుణా, ధ్యక్షావనామోదన్యా
య్యవిధిప్రాభవభోగ వానరచమూ, వ్యాసంగసంభూతశా
త్రవహింసాపరభాగ పత్త్రవిసహాప్రగ్రంథ సంశ్లాఘ్యత
త్త్వవిభూత్యంచిత సద్గుణోత్తమపరం, ధామామహాశ్రీధరా॥ 406

క॥ కలుషారణ్యదవానల! బలవద్రిపుసంఘమథన, పాటవదక్షా
జలజాప్తకులసముద్భవ! జలజాక్షా రామచంద్ర, చంద్రసఖాస్యా॥ 407

## గద్యము.

ఇది శ్రీసీతారామచంద్ర కరుణాకటాక్ష వీక్షావిశేషసంప్రాప్తకవిత్వవైభవ, శ్రీ
మదఖండ సచ్చిదానంద స్వరూపరాజయోగానందానుభవ, పవిత్ర వల్లుట్ల
గోత్ర వాసిరెడ్డి వంశసంభవ, వెంకమాంబా సూరయనామధేయ
తృతీయ తనూభవ, బుధజనవిధేయ, సమ్యక్కృతాతిథేయ,
సత్సహవాస, వెంకటసుబ్బదాస ప్రణీతంబయిన వాసి
రెడ్డివంశ చరిత్రమ్మునందుఁ ద్వితీయాశ్వాసము
సంపూర్ణము.

శ్రీ సీతారామార్పణమస్తు.





శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# వాసిరెడ్డివంశచరిత్రము

## తృతీయాశ్వాసము.



రామారఘువంశవారిధిశశీ, సీతామనోనాయకా
పారావారగభీరధర్మవిభవ, ప్రఖ్యాతశౌర్యోదయా
కారుణ్యాంచితమానసాగుణఖనీ, కల్యాణసంధాయకా
ధీరోదారచరిత్రపాత్రశరణార్థి, ప్రాతసంరక్షకా॥ 1

వ॥ అః యిట్లుగంధవహసూనుండు స్వామికింజెలిపి నట్లవ్వలికథను వివరించెద॥2

మహాతేజస్కుండగు చినపద్మనాభిరామనచారిత్రము

ఉ॥ వాసిగవాసిరెడ్డివర, వంశమునందుదయించిధీరుడై
భూసతికిఁమహాముదము, పొందుగఁగూర్చియనేకరాట్సహా
వాసముఁగాంచితత్కృతను, వర్ణబహూకృతులందిధీరవి
ద్యాసభకెక్కుకీర్తిఁగని, నట్టిప్రశస్తుల సంస్మరించెదన్॥ 3

సీ॥ బాల్యవయస్సులోఁ, బటుతరంబైనట్టి, పంచాస్యములఁబట్టి, పటిమమెఱయ
నాటలనాడుచు, నబ్జాయతాక్షుండు, వానరంబులమాడ్కి, వానిఁద్రిప్పుఁ
బంజరంబులనుండు, వ్యాఘ్రంబులనులాగి, పిల్లికూనలమాడ్కి, బెదరుపెట్టు
నెదిరించుపులులనెం, తేబల్మిమెడఁబట్టి, గిరగిరఁద్రిప్పివే, ధరణిఁగొట్టు

తే॥ నహహా ! యీతనిసాహసం, బధికబాహు
దర్పమస్ఖలితోత్క్షిప్త, ధ్రాపసక్తి

యానృపాలోద్దృష్టమని పెద్దలనుకొనంగఁ
గాంచఁదగుకీర్తిఁగాంచెను, గాన్మవరుండు॥ 4

తే॥ మత్తదంతావళంబుల, మదమడంగఁ
గేలఁదండంబులనుబట్టి, గిర్రగిరఁ
ద్రిప్పిత్రోయంగనయ్యవి, తెలివిదప్పి
ఘీంకృతులులేకపశుభువిఁ, గిట్టినట్లు,॥ 5

తే॥ మదతురంగంబునెక్కి స, మ్మదముతోడఁ
జప్పుచప్పునఁ బాదలను, శైవలినుల
దాఁటఁగాఁ జేయదృష్టలు, ద్దండుఁడనుచు
గంతఁడితండనిరి మెచ్చు, గాగణించి॥ 6

వ॥ ఇట్లుకొంతతడవుచనఁ జన॥ 7

తే॥ బాహుబలజాతహాంకృతి, పటిమమెఱయ
సంగరోత్సాహిస్థైయుండె, గాన్మవరుండు
వీనిసాహసవిస్ఫూర్తి, విక్రమంబు
సర్వజనులకు నాశ్చర్య, జనకమయ్యె॥ 8

సీ॥ ఆరాజరత్నంబు, ధారుణీంద్రులమించి, కీర్తిప్రతాపవి, స్ఫూర్తిఁదాల్ప
నాతనిజయపతా, కాంబరజాతమహా వాతంబురిపుదీప, జాతినార్ప
నాతనికీర్తిచం, ద్రాతపధావళ్య, మరిముఖాబ్జాతసాం, దరిహరింప
నాతఁడశ్వారూఢుఁడై తద్గతులఁజూప, ఖురధాటిధరణి తు, త్తురముగాఁగ

తే॥ సరసకీర్తిరతిరాజ, సదృశమూర్తి
వైభవోన్నతిఁజెన్నొంది, వసుధయందుఁ
బ్రస్తుతింగనెనాచిన, పద్మనాభ
విభుఁడువివిధప్రసిద్ధుల, విఖ్యాతిఁగి॥ 9

తే॥ శ్రీదసమసంపదభివృద్ధి, చేవెలింగి
సకలనృపవర్యులనునైజ, శక్తిచేత
నడఁకువంగాంచఁజేయుచుఁ, గడుఁగృపమెయిఁ
గీరితినిజాలముఖ్యుఁడై మీాఱియుండె॥ 10

తే॥గీ॥ భూసురులు మున్నుగాఁ గల్గు, పుణ్యులకును
నన్నదానంబుచేయుచు, ననవరతము

సుకృతకార్యప్రసక్తిచే, సురుచిరముగఁ
గీర్తిగాంచును భూపతి, కృత్యగరిమ॥ 11

సీ॥ ఎవ్వాఁడు సతతంబు, నిలసత్యవాక్కుల, నలహరిశ్చంద్రుని, నతిశయించె
నేరాజువైభవ గౌరవంబునసింద్ర ముఖ్యులనందఱ, మూదలించె
నేపుణ్యమూర్తితా, నేపారుధర్మప్రవర్తనధర్మజు, వాసిఁదెగడె
నేమహాధీరుండు, హెచ్చు పౌరుషశక్తి, నర్జునాదులపోల్కి, నధిగమించె

తే॥గీ॥ సకలగుణగణనీయుఁడై, సాంద్రగతినిఁ। గలియుగంబున నారాజు, ఘనతఁజెంది
వంశపావనుఁడోయన వన్నెకెక్కె।ధరణిఁజినపద్మనాభుఁడన్ ధరణివిభుఁడు॥

తే॥గీ॥ వజ్రవైడూర్యములు రాజవల్లభుండు
తనదుశౌర్యానన్నార్జించి ధర్మవిధుల
వాని వినియోగమొనరించి, ప్రాజ్ఞబుద్ధి
యనెడి విఖ్యాతిఁగాంచె నీ,యవనియందు॥ 13

1060 వ ఫసలి. 1573 శాలి. శ. 1651 క్రీ. శ.

(సార్వభౌముండగు తానీషా, చినపద్మనాభిరామన్న మొదలగు సామంత రాజుల హైదరాబాదునకురమ్మని యుత్తరువుచేయుట)

సీ॥ హిందూమహాసీమ నింద్రవైభవశాలి, యవనీశ్వరులలోన, నధికతముఁడు
సార్వభౌముండైన, సరసుండుతానీష యను మహారాజశ్రీ,తాంశుఁడవుడు
హైదరాబాదున, కంచితోల్లాసత సామంతరాజుల, నరసముగను
రావింపఁగఁదలంచి, రాజవర్యులకెల్ల, యెత్తిలాల్పేఁయించె, నింపుమెఱయ

తే॥గీ॥ నట్టియవనాధిపునిసభ, కనుపుమీఱ
సకలసామ్రాజ్యవైభవ, సరణివెలయ
ధరావిభులుపోయిరచటికి, భావశుద్ధి
గోలకొండకునత్యంత కుతుకములను॥ 14

వ॥ ఆమొడ,యవనదేశాధీశ్వరుండగు తానీషా,స్వర్గసమానంబగు హాయిదరాబాదునుఁ,గైసేయించి, సామంతులరాక నెఱింగి, తనధీసచివుండగునక్కన్నను, రాపించి, నీవీవచ్చియున్న సమస్తరాజులకు,నుచితస్థానంబుల నేర్పఱచి,కరితురంగాదులకు, నురవగువాసస్థలంబులనేర్పఱిపించి, లోపంబులు లేకుండునటులఁ బనులఁజేయింపుమన,నట్లె యామంత్రిసత్తముండుసమకూర్ప,వచ్చినయారాజులందఱు నియమితస్థలంబుల, నివసించియుండిరయ్యెడ॥ 15

క॥ మఱునాఁడు రాజులందఱు నిరుపమసంతోషమలర నిక్కపుభక్తిన్
బురుహూతుఁ డనఁగఁ బరఁగెడి। వరయవనప్రభునిఁ జూడఁ బనివినిరంతన్॥ 16

సీ॥ సామంతరాజులు, సంతోషభరితులై కరితురంగంబుల ఘనత నెక్కి
వీరులౌ భటులెల్ల విక్రాంతిఁ దెల్పెడి కేకలు బొబ్బలు ఢాక వేయ
నాయుధంబులతోడ, నవనీపతులు సొంపు వెలయంగ నడువంగ వేడ్కఁ దనరి
చూచువారలకెల్లఁ జోద్యంబు జనియించె, నా రాజభటుల నిర్హ్వానములకు
తే॥ గీ॥ సైన్యగమనసముద్ధూతచటులగజముఖరానభోంతరములఁ గప్పి ప్రొద్దు కాను
పించనట్టుల వ్యాపించె, వీధులెల్ల, శబ్దమయమయ్యె ధూళి, యశాంతమయ్యె 17

వ॥ మఱియు నొక్కదివసంబున సకలరాజాగ్రేసరులసన్నిధానంబున, నఖండతే
జఃపుంజకుంజంబును, సకలధరాపాలవిజ్ఞాపితకార్యవివేకచాతుర్యధుర్యుండును
మహోత్కటభటవితానపటువచనశ్రవణజాతశూరతానిధానంబు మసంక్రందన
వైభవభ్రాజమానుండునగు తానీషా, సకలమణిగణనికర నిరుపమకాంతికరంబి
తవిస్తృతప్రదేశంబగు సభారంగంబున, నుండు నాసమయంబున 18

తే॥ గీ॥ అప్పుడా రాజులందఱు, నద్భుతముగ
భువనపాలకవిభుఁ జూచి, పొందుగాను
గౌరవంబంది ప్రభువుచే, ఘనత మీఱ
నున్నతాసనముల నెక్కి యుండు వేళ॥ 19

ఉ॥ ఆచినపద్మనాభుఁడు సమంచితకీర్తి చెలంగ త్రేనికై
దాచినరత్నసంఘములఁ దానతివేగ మెయొక్క హారమున్
భరాచరులందఱప్పుడు ప్రభరాతముదంబును గాంచుచుండఁగాఁ
జూచెడివారికింపుగను, జోద్యముగా సమకూర్చి యీయఁగన్॥ 20

సీ॥ ఆదివ్యమణిమయం, బైనహారముఁ గాంచి, యెల్లవారును ముదం, బెనసిరపుడు
సామంతరాజసం, చయము మేలు గణించి, యుభయత్రయభిమాన, మొప్పఁ బలుకఁ
దాజీము లిచ్చి సాంద్రతరగౌరవముచే, నున్నతాసనముల, నొసఁగి మఱియు
మన్నసుల్తానంచు, మఱియుఁ బహాదరంచుఁ, బలుబిరుదంబులఁ, బరఁగ నొసఁగ
తే॥ గీ॥ నమితసంతోషమందుచు, నవనివిభుఁడు
రాజసభయందు రంజిల్లె, రాచశేవి
వాసిరెడ్డ్యన్వయుండగు, వసుధవిభుఁడు
రాజసన్మానజనితహ, ర్షభరఘనుఁడు॥ 21

క॥ సభరాజులందఱప్పుడు। నభిమానముతోడఁ బల్కి, రవనీపతితో

సభలోఁ ఖదరువిహీనతఁ। బ్రభుఁడామాదృశులయాన, భంగ మొనర్చున్॥ 22
క॥ తగునాయవనాధీశ్వర। మిగులన్నీయాజ్ఞచేత, మేమిటు రాఁగా
నగుబాటుసంధిలంగను। దగుగౌరవమొసఁగితీవు, ధరణీశునకున్॥ 23
వ॥ అప్పుడాపాదుషా, యారాజోత్తములతోఁ, నేమనియాజ్ఞాపించిరనిన॥ 24
సీ॥ పృథివీపతులుమీరు, పెంపారఁగాదివ్య తరశక్తి మెఱయంగ, గరిమతోడ
మాయాజ్ఞఁగైకొని, మన్ననచేతను, మాసభకేతెంచ, మంచిగాను
దర్జపదర్జాలు, తగవిచారించుచు, మర్యాదచేసితి, మంజుభణితి
నిత్తఱిమీరిట్లు హేతుశూన్యంబుగా సంకోచమందుట, సరసమగునె
తే॥ గీ॥ యనుచునతినీతిభాషలనాదరించి
సకలరాజులువినఁగను,సమరసమునఁ
బల్కె నమ్లేచ్ఛవిభుఁడతి,పటిమమెఱయ
విన్నవారికిమదిఁదుష్టి వెలయునటుల॥ 25
గీ॥ మాదుఘోటకచయములో, మదమృగేంద్ర
నిభహయంబొకండున్నది,నేర్పుమెఱయఁ
దత్తురంగంబునెక్కిన, ధరణివిభుని
బలపరాక్రమసారంబుపాటిసేతు॥ 26
వ॥ అనియీప్రకారంబుగ, నానాదేశాధీశ్వరులును సామన్తరాజులను వినుచుం
డ యవనదేశాధీశ్వరుండిట్లనియె. ఈఘోటంబు చిరకాలమునుండి, భూరాజను
లలో నెరికినారోహణానుకూలంబుగాక యుండెఁగాన నిత్తఱినీరాజోత్తముల
లోఁ, దురంగగతులలోనన్నింటిననుసరించి,యారోహణంబొనర్చువారెవ్వరో
యారాజకంఠీరవునిపరాక్రమంబుశ్లాఘ్యంబు ,వానియభీష్టంబునిర్వర్తనీయం
బని సెలవిచ్చినప్పుడు 27
సీ॥ ఆరాజునానతి, నవనీశ్వరులువిన, మనమునందునఁజింత, మలఁగుచుండె
నలపాకనాటిరె,డ్లలమి వెలమవారి, లోమహావీరులౌ, ధీమహితులు
వ్యాపారులొకకొంద ఱేపారుధీరులౌ, మోటాటిసరదేశ,ముఖులుమఱియుఁ
గమ్మవారందఱు, ఁగౌతూహలముతోడ, రాజాజ్ఞఁగయికొని రమ్యముగను
తే॥ బుడమిరాజులుపిని మనో,జడతఁబూని। ముందువెనుకలుదోఁపక,మూకవృత్తి
నేమియాడిననేరాన్నో, యేమొయనుచుఁ।గదలకుండిరిభీతిల్లి,కలవరమున॥ 28
శా॥ ఆయశ్వంబుగభీరహేషలఁ బృథు,వ్యాలోలవాలప్రభా
ఛాయాదంతురితాంతరాంతరతనూచ్ఛండ స్ఫురద్వైఖరిన్

డాయఁజేరిన నెల్లవారలకుఁ గ్రన్ననన్నాసికా సీత్కృతిన్
"హా" యన్పించుచునుండె దానిపటుతా, వ్యాపారమేపాటిదో॥ 29

ఉ॥ కొందఱుగుఱ్ఱమున్ గనియె, గుండెలఁదాపిరిగాలమింకఁ బైఁ
గొందఱు చూచిచూచి యడుగుల్ దడఁబాటునకొప్పగించిరే
కొందఱో, మేనఁజేతినిడి, గుఱ్ఱముగఱ్ఱునఁ దీవరింపఁ దా
ముందుకుఁ గ్రిందుమీఁదగుచు నట్టిటుదారిరిదానియార్భటిన్॥ 30

మ॥ సభవారందఱుఁ జూచుచుండఁగ మహా,సంతోషమేపారఁగాఁ
ప్రభువర్యుండును వాసిరెడ్డికులపా,రావారచంద్రుండు దా
నిభయంబెంచక గోటమీఁటి నటులే, నేర్పొప్పఁగా నెక్కెనే
శుభముల్ ధీరునకేపొసంగుఁజుమియం,చున్ దెల్పుపోల్పొప్పఁగాన్॥ 31

సీ॥ వాసిరెడ్డికులుండు, వసుధేశ్వరులలోన, సైంధవంబును నెక్కెఁ, జక్కఁగాను
జూచువారలకెల్లఁ, జోద్యంబుగానది ప్లుతవల్గితంబుల, భూమిమీఁద
నల్పుచు జనులెల్ల, సంబరపడుచుండ, నంబరతలమందె, యరిగినట్లు
గమనధాటినిఁబూని, ఘోటకాంతుశిక్షచే, నదులను హ్రదములఁ బొదలదాటి
తే॥ గుప్పుగుప్పున దుముకుచు, గుర్తుదెలియ
నడక చేసివి చేఁజూపు బెడఁగుచేత
నకులశిక్షితతురగస, న్నాహమెల్లఁ
దెలియఁజేయుచునుండెఁజు, క్కలకునంటి॥ 32

తే॥ ఘోరబలుఁడైనయారాజ, కుంజరుండు। దర్పరోషప్రలిప్తమా, దానిఁబట్టి
కళ్లెపుమెలంకువనుశిక్షఁ, గఱపుతెలివి। విధులదాఁటనిపద్ధతి, విడుచుచుండె॥

తే॥ పొగరుననుగుఱ్ఱమెక్కెంత, యెగిరిపడిన
శాస్త్రమెఱిఁగినవాఁడౌట, ఘోవకుండు
జడియక పడంకుఁగనకయి, చ్ఛాప్రవృత్తిఁ
జేతిచిలుకనుద్రిప్పిన, చెయిదినడపె॥ 34

చ॥ తురగమునెక్కి రాజుపరి, తుష్టిగణించుచు నెల్లవారికిన్
బురపృథువీథులందరుగ, మోదముతోడఁ బతివ్రతాంగనల్
పరిమళపుష్పసంచయమ,పారముగాఁ బయిఁజల్లిరివిభుం
డరితురగాతిదర్పహరి, హార్తయటంచుఁ బ్రశంసచేయుచున్॥ 35

తే॥ కళ్లెమునుపీడి యాతండు గడియలోన
యోజనత్రయమునకు నెం, తోచులుకగ

నడపుచుండెను గుఱ్ఱంబుఁ దడఁబడక యె
యిచ్చమెయి గుఱ్ఱమలయని, మచ్చుమెఱయ॥ 36
తే॥ భూచరులె కాక ఖేచర,పుంజమందుఁ। గొందఱీధోరణింజూచి, తందరపడి
మనదుకూటంబులోనిదీ, మత్తహయము। చెదరిభువిఁజేరి ఱేనికిఁజిక్కెననిరి॥
తే॥ ఆమహాశ్వంబు నెక్కిన, యవనివిభుఁడు।పట్టువిడువక గమనంపుఁ,బటిమమెఱయఁ
జిటికవేసెడియంతలోఁ, జిత్రముగను। దేశదేశంబులనుజుట్టి, తిరిగివచ్చె॥ 38
ఉ॥ ఆలలితాంగశోభిహయ, మట్టులుబిట్టలయంగఁ జెమ్మటల్
లాలయుఁగంపమున్ బటు వి, లాసవిహీనతదానిఁగ్రమ్మఁగా
జాలియెడందఁగల్గిసర, సత్వముచిప్పిల నెల్లవారలున్
మేలుబళీయనందిగిని, మేషములోశ్రమవాయునట్లుగాన్॥ 39
క॥ ఓదార్చియాహయంబును। సేదయుఁగంపంబుఁదొలఁగఁ జేయుచుఁదానున్
మోదంబునొందిదానిన్, మేదినినిలువంగనవుడు మెప్పుగమలిపెన్॥ 40
వ॥ అట్టిసమయంబున నారాజసభయందు యవనదేశాధీశ్వరుండైన తానీష, వి
చారగ్రస్తుండై, సముచితోక్తులనిట్లనియె, ఓసభాస్తారులారా, చిరకాలంబు
నుండి నాహయంబుమదోన్మత్తంబగుట, నెట్టివారికి నారోహణానుకూలం
బైయుండె. నేఁడీరాజపుంగవుండు, దీనినధిరోహించి, తనశక్తిచేఁదృణీకరించె,
నేసిటఁబొచ్చెంబుఁగాంచితినన, వారుసంతోషాయత్తచిత్తులై వినోదవాక్య
లముచ్చటించుకొనుచుండిరయ్యెడ॥ 41
సీ॥ పటుదర్పధాటిచేఁబరఁగునాభూనేత, ఘోటకరాజంబుఁ,గూర్మినెక్కి
భూజనుల్ పొగడంగఁ,బూర్ణప్రతాపుఁడై, దానిమచ్చికఁ జేయఁదగినశక్తి
స్వవశంబునొనరించి,వాలువీలుగఁద్రిప్పి,యేతెంచెనత్తఱియేపుమీఱ
వచ్చిపట్టణబహి,ర్ద్వారంబుదరియవ,నాధిపుదర్శనమభిలషించి
తే॥ సైంధవంబునుదిగిదాని,సాధనమును
దోఁకకుంగట్టితాముందు,జోకనడువ
నశ్వమారాజ వెంటని,ట్టటుదొలఁగక
తగినసీటుననడకను,దరలుచుండె॥ 42
వ॥ ఆసమయంబునందుఁదానీషయాచినపద్మనాభిరామభూపాలుని వెంటఁ జేసైగ
చేవచ్చుచున్న హయరత్నముంజూచి,యనంతరంబ॥ 43
మ॥ పరమానందముతోడనట్టియెడభూ,పాలుండుసంతోషని
ర్భరచిత్తుండయికమ్మఁతేనిఁగనిసాం,ద్రప్రజ్ఞకున్ మెచ్చియు

ర్వరలోనిట్టిహాయప్రచోదకుఁడు చెప్పన్ లేనెలేఁడంచుడ
గ్గఱఁబీరంబునుడిగ్గివచ్చెసకల,క్ష్మానాథులగ్గింపఁగన్ 44

తే॥ వచ్చియాతనిఁగౌఁగిటఁ,బట్టిచేర్చి
నింపుప్రేమబయల్పడ,నేర్పుమెఱయ
రాచసింగమనీశౌర్యరమఁగనంగ
సంతసించితినీకోర్కి, సఫలమౌను॥ 45

తే॥ అనుచుఁదానీపసంతోష,మచ్చుపడఁగఁ
గమ్మదొరహస్తముంబూని,గౌరవమున
నున్నతాసనమిచ్చియెం,తోమృదూక్తి
నాజ్ఞయిడెఁగూరుచుండుమా,యనుచునపుడు॥ 46

వ॥ పాదుష, కమ్మదొరకుఁబహువిధంబుల మర్యాదలుసేయఁదక్కిన రాజులందఱు లజ్జితమనస్కులై యుండిరప్పుడు॥ 47

కం॥ వెలవెలపోవుముఖంబుల। విలసత్కీర్తినిఁదూలంగివిహ్వలమతులై।
యలరాజగౌరవంబును। నిలిచినభూవిభులుచూచి నెగడిరిలజ్జన్॥ 48

వ॥ అట్లుండుసమయంబున॥ 49

సీ॥ సామంతరాజులు, సభనుజూచుచునుండఁ, దురకతేఁడాకమ్మదొరనుగాంచి
కౌతూహలముచేతఁ,గనికరంబలరార, మృదుమధురోక్తుల, మించిపలికె
నీశక్తిసాహస, నిరుపమప్రజ్ఞల,నేనెఱుంగఁగనైతి, నింతవఱకు
నామనస్సంతోష,మేమియుఁజెడకుండ, నెఱవేర్చితివిపూన్కి, నిక్కముగను

తే॥ బళిరనీవంటిరాజులు, వసుధయందుఁ। గలరనంగనువిననైతిఁగాంచనైతిఁ
గోరునీకోర్కితీర్చెద,గూర్మితోడ। ననుచుఁదానీపసెలవీయ,నవనివిభుఁడు॥ 50

ఉ॥ దేవరవారిసత్కరుణ, దీనునియందునఁజిల్కుకంటెనా
కేవిధమైనకోర్కులును, నియ్యెడలేనటులయ్యెనయ్య స
ద్భావముతోడనన్నుఁ బరి, పాటిగనెంచక సుస్థిరంబుగా
నావరమీయదేయనుచు, నాకొకసీమనొసంగుమాప్రభూ॥ 51

వ॥ అనియీప్రకారంబునఁ గమ్మదొరవిన్నవింపఁ దద్వచనకౌశలంబునకు సంతుష్టహృదయుండై, యవనప్రభుసత్తముండు నందిగామ, కమ్మంమెట్టు, వినుకొండ, కొండవీడు మొదలగు పంచశతగ్రామంబులకు సర్దేశముఖి హుకుమును, సుఫీదుర్ఘుండాదిక మషాత్తీ,గోజునకుమూఁడుఖూనీలుమన్నెసుల్తాన్ బహదరుమొదలగు బిరుదులతో రజతపత్రంబుపై నేతదధికారంబులమ్మెచ్చలి

పితో, తహరీరు ఫరమాయించి కంఠసర్ తురాయి, కరితురగాద్యనేక బహు
మానంబుల సర్ఫరాజ్ సేయించి తక్కినసామంతరాజులకు వలయు పనులు
నెఱవేర్చితగుసత్కారంబులొసంగి, సెలవీయ వారివారి నివాసంబుల
కేగి రయ్యెడ॥ 52

ఉ॥ అప్పుడుకమ్మఱేఁడు ముద, మందివసుంధరనేలనెంచి తా
నొప్పుగ బ్రాహ్మణోత్తముల, కోపికగల్గినవట్టుసత్కృతుల్
చప్పునఁజేసిషడ్రసప్ర, శస్తతరంబగుభోజనంబులన్
మెప్పొదయింపఁబెట్టెఁదన, మేదినియీతులనందఱుండఁగన్॥ 53

వ॥ ఈప్రకారంబున నాకమ్మదొర యెల్లప్రాణులకు నానందంబుజనింప మృష్టా
న్నంబులిడి, నిజశక్తిస్ఫురణంబుతో వెడలివచ్చుసమయంబున 54

చ॥ నరపతిప్రోలికేగుతఱి, నచ్చినపేరిమివారకామినుల్
సరసతరంపునాట్యములఁ, జక్కనిగీతుల సప్రమోదలై
పరఁగిరి భూసురాంగనలు, భవ్యతరంబయి యొప్పుదీవనల్
గరిమనొసంగిరెల్లరు న,ఖండ శుభోక్తులఁ బల్కి రంతటన్॥ 55

సీ॥ కల్కితురాయిని, గౌస్తుభమణియును, నవరత్నహారముల్ భవ్యకముగను
మ్లేచ్ఛభూపాలుండు, మెచ్చియిచ్చినయట్టి, భూషణంబులతోడఁబొంకముగను
మండితాకారుఁడై, మానవనాథుండు, గజరాజుపైనెక్కి, ఘనతమీఱ
తెల్లజెండాయును, దిరమైనదివటీలు, శృంగారమేపారఁ, జెలఁగుచుండ

తే॥ సంగతోత్సాహములవడ, సమరసముగ
స్వచ్ఛసత్కీర్తిచేమించి, సత్త్వశక్తి
పటిమఁజెన్నొంద నురుశోభ, ప్రబలుచుండ
సకలసామంతరాజులు, సంతసింప॥ 56

తే॥ రాజుపురిఁజేరునవ్వేళఁ బ్రాజ్ఞులెల్ల। రాజభక్తిని బ్రేమభ,రంపువిధిని
దేవతానాథుఁ గన్గొని, దేవగణము। ముదముగాంచినయట్లుగా।ముదముఁగనిరి

వ॥ ఆయెడ సమస్తయోధపరివృతుండై, యాచిన పద్మనాభిరామభూపాలుండు,
తనయసమానబలంబులు గొల్వ, మాగంటిపట్టణంబునకు సకలసంభ్రమంబుల
తోఁ బ్రవేశించెనయ్యెడ॥ 58

తే॥ పంచశతగ్రామములకును, బటిమమెఱయ
నములుదారులనియమించె, నవనివిభుఁడు
పొందుఁబాటును జేయించి, భూరిసత్క

సంగరోత్సాహులై యుండ సాంద్రశక్తి॥ 59

తే॥ ఆధరాపతిశాత్రవ భూధవులను। దగినరీతినిఁజూడను,ద్ధతినివీడి
వారునిష్కపటాత్ములై, పార్థివునకు। నెచ్చెలులరీతినుండిరి, నిండుభక్తి॥ 60

కం॥ ఈరీతిగమానవపతి। పెరుఁబ్రతిష్ఠయువహించి, పెంపమరంగా
శ్రీరంగేశునికృపచే। నారాయన నుండనొకటియాత్మకుఁదోఁచెః 61

వ॥ ఆయూహాయెట్టిదనినఁ బురాతనసంస్థాన నగరంబు నిజరాజ్యంబునకొక భాగంబుననుండుకతంబునఁ గృష్ణాతీరము పుణ్యక్షేత్రంబుగావునఁ దత్తీరంబున నొకనవీనపట్టణంబు నిర్మింపంజేయు టుచితంబనితలంచి శాస్త్రోక్తమార్గంబునఁజింతపల్లెయనుపేర నగరంబుఁగట్టించి, యందొకదివ్యసౌధంబు, నిర్మింపంజేసి, దానికిందగుప్రాకారాదికంబులఁగల్పింపంజేసి, నిజమంత్రిపురోహితాదులకువలయు దివ్యభవనములుగట్టించి, కార్తాంతికోక్తముహూర్తంబున సుప్రవేశంబుఁగావించి, కతిపయదివసంబులు భూపరిపాలనంబుసలిపి, పెక్కుపుణ్యకార్యంబులాచరించి పరమపదంబందె. ఆయనదత్తపుత్రుండు బుచ్చిరాఘువయ్యకొలఁదికాలంబురాజ్యంబేలి పుత్రహీనుండై మరణించె. ఆయనతండ్రితమ్ముఁడు వీరయాఖ్యునికుమారుఁడు సూరయాభిఖ్యుండు, ప్రబలపరాక్రమస్ఫురణంబున క్షోణీపరిపాలనంబుసేయునట్టియెడ॥ 62

సీ॥ ఆసూరయాఖ్యున, కనుపముల్ పుట్టిరి, రామలక్ష్మణులన, రాజవర్యు
లందునగ్రజన జ్యేష్ఠుఁ డమితసత్వాఢ్యుండు, సురుచిరగాత్రుండు, సరసబుద్ధి
యాతనిసోదరుం, డబ్జబింబముఖుండు, వర్ణనీయగుణుండు, బలయుతుండు
చినరామలింగన్న, యనుపేరుగలవాఁడు, సత్యసంధుండతి, శాంతమూర్తి

తే॥ వారలిరువురుసఖ్యంబు, వాటిలంగ
ధరణినేలుచునుండిరి, ధర్మగుణము
పెచ్చుపెరుఁగంగసత్కీర్తి, హెచ్చుచుండ
ననుపమానందమానసు,లై చెలఁగుచు॥ 63

వ॥ ఇట్లుండ నొక్కదివసంబున, సభాస్థానంబునందు నారాజపురందరుండు, కొలువుదీరియుండు సమయంబున, వెలమవంశసంభవాతుండైన,పాన్గంటి శేషయ్య, నరసభూపాలునిధిక్కరించి, సంభాషింపనారాజు సముచితగతినాతనిమందలించి, నీవుమాసంస్థానస్థితికర్హుండవుకావు వెడలుమని, సెలవీయనావెలమదొర, నిజస్థానంబునకరిగి పిదపఁబాతూరిపట్టణాధీశ్వరుండగు మలారిజుసూరభూపాలుని సంస్థానంబుంజొచ్చి, వాసిరెడ్డివారిసంస్థానంబునఁ దనకుఁజరిగిన

యవమానంబును, మున్ను 1124 ఫసలి, జయ॥ సం॥ నందిపాటివం॥, పెద
నూరన్న వాళి॥ చంద్రమౌళినాయనికి × 8000 పూరివరహాలకిచ్చిన గ్రామ
ముల విషయమై యానూరయామాత్యునితాత పెదనూరన్న, ఆయనకుమా
రుఁడు పెదగామానాయఁడు, అనువారికి, వాసిరెడ్డివారికి జరుగుచున్న కల 64
హమును బ్రచురించి తెలియంజెప్పునప్పుడు॥

సీ॥ ఆనూరభరాధారుఁ,డతికోపవంతుఁడై,పటుసాహసంబునఁ,బల్కెనపుడు
శేషభరానాయకా!చింతింపవలవదు కమ్మదొరను నేను,గదనమందు
మద్బాణపాళిచేమహిఁగూలఁజేయుచు,దీర్ఘమౌక్రోధంబుదీర్చికొందుఁ
బెక్కేండ్లనుండిమా,వినుకొండసీమలో,నందిపాటినివంతునందియుండి

తే॥ యపహారణబుద్ధివిడఁడయ్యె,నవనివిభుఁడు
ప్రబలినన్నవమానంబుఁబడయఁజేసె
కట్టియాతనిగర్వంబునట్టెయణఁచి
నీమకోరికనెఱవేర్తు,నిక్కవముగ॥ 65

తే॥ అనుచుఁగనులెఱ్ఱచేసియి,ట్లనియెసతని
కోయిమీతాతమాయూళ్ల,నొగిహరించి
వీడకేమునునిర్బంధపెట్టెనట్టి
పగనునాబాణవహ్నిచేఁ,దగసడంతు॥ 66

వ॥ అనియీప్రకారంబున, నాశేషయామాత్యునోదార్చి, వెలమదొర, కమ్మభూపా
లునకు భటరత్నంబుచే నెట్లుదెలియఁజేసెననిన, వినుకొండసీమలోని, నంది
పాటివంతును, మాకువదలివేయుఁడు, లేనియెడ నేఁటికిఁ, బన్డ్రెండవ దివ
సంబున, నీతో మేదరసాల దుర్గసమీపంబున, దురంబునల్పి మాజనపదంబుల
మావశంబుఁ జేసికొనఁదలంచియున్న వాఁడను. మీరు మీయభీష్టప్రకారం
బున, వర్తిల్లుఁడు. అని తెలుప, నావార్త నరసభూపాలుండువిని, స్వసోదరుం 67
డగు చినరామలింగన్నతోఁ, దెలిపినయనంతరంబ॥

తే॥ సభ్యులెల్లరువినునట్లు, శౌర్యఫణితి। రాజులిట్లనిపల్కిరర్భకుఁడువెలమ
దూరయోజనలేకపెక్కె,దుడుకుఁదనము। తెలియనిట్లంపెవార్త,సందియములేక

సీ॥ అనిపల్కిభూవరు, లతికోపవంతులై, ప్రబలదర్పంబుచేఁ, బటిమమెఱయ
వెలమదుర్వృత్తికి, బిట్టాగ్రహంపడి, సంతాపమందుచు, సాహసమున
నెదిరించియాతని, నెంచకయవలీలఁ, ద్రుంచివైతుమటంచు, రూఢిచెలఁగఁ
దలఁచివారయ్యెడభూ ధరఁగల్గుకమ్మ విభులకుజాబులు, వేడ్కమీఱ

తే॥ వ్రాయ సెలవిచ్చిరయ్యెడ, "రాజులార
మాకు వెలమలకునగు స,మీకమిపుడు
రండి యభిమానవంతులై రాచపూన్కిఁ
దెలుపుఁడీ"యనునర్థంబు తేఁటపడఁగ॥ 69

సీ॥ దేవరకోటను, దివ్యకీర్తివహించి, శ్రీమంతుబిరుదుచేఁ, జెలఁగుచుండు
కోదండరామన్న, ఘోరబలాఢ్యుండు, వ్యాపారరతుఁడతి, ప్రాభవుండు
భీకరాకారుండు, వితతప్రకాశుండు, సరససాంగత్యత, త్వరుఁడుఘనుఁడు
నాల్గువేలకుమించు, నానాబలాఢ్యుల, శతఘోటకంబుల, సారగతుల
తే॥ మదగజంబులఁగైకొని, మహివిభుండు। చింతపల్లెకువిచ్చేసి, స్థిరవిభూతి
సంగరోల్లాసమలరంగ, సాహసమునఁ। బ్రబలసన్నాహసంరంభ,పటిమమెఱయ॥

వ॥ మఱియుఁద త్సన్నగరంబులంగల కమ్మవారందఱు, నరసరాజప్రేషితలేఖలం జూచికొని, యాగ్రహోదగ్రులై, యభిమానావేశంబున, నీతేనికిసాయపడ నిశ్చయించికొని, స్వస్థానంబులవెడలి, చింతపల్లెకుంబోవ, నాథరావరుండు, స్వసోదరుంబిలిచి, వీరికివలయు వసతులు మొదలగువాని నేర్పఱుపవలయుననిన, నట్లయాతండు, సేయించెననంతరంబ॥ 71

సీ॥ ఇరువదివేలకు, హెచ్చిరివీరులు, పటుదర్పశాలులు, ప్రకటబలులు
మహిభృత్సమూహంబులు, మత్తనాగంబులు, శతసంఖ్యమించెను. సైంధవములు
శతపంచకాధిక, సంఖ్యమించెనుజూడ, నాహవార్థంబుగా, నతిశయించి
యోధానుయోధుల, త్యుత్సాహశీలురై, కాల్ద్రివ్వుచుండిరి, కదనమునకుఁ
తే॥ జటులసాహసధైర్యంబు, జగతివెలయ
యుద్ధవిభ్రమమొల్లెడ, నొప్పుచుండ
వారివారికినగ్ర్యమా, నైఖరులను
నిలిచిరయ్యెడనని సేయఁ, జలముమెఱయ॥ 72

వ॥ ఇత్తఱిమ్రాజునూర భూపాలుండుసమకూర్చినజన్యసైన్యప్రకారం బెట్టిదనిన 73

సీ॥ స్వకులసంభూతులు, సంగరోత్సాహులు, పదునైదునూరులై, పరఁగువారు
పదునాఱువేల నిర్భయభటాదులు స్వామి, భక్తిగల్గినవారు, బాహుబలులు
గొప్పకొండలఁబోలు, కుంజరేంద్రంబులు, రెండుశతాలును, దండహరులు
నాల్గు సహస్రముల్, నానాదిశలఁగ్రమ్మఁ, జాలుపదాతిసంచయముగలిగి

తే॥ వెడలిపోయెను దురముకై, వెలమఱేఁడు
సకలసామంతరాజులు, ప్రకటితముగ
జయవిధానంబుఁ దెలుపుచు, సరసనిలువ
నాప్తవర్గంబు "జయ"దేవ, యనుచునుండ॥ 74

క॥ మేదరసాలకు డగ్గఱె। యాదొరసైన్యములుపోవ, ననిసేయుటకై
మోదంబలరఁగ డేరా। లాదినమున వేయఁబనిచె, ననుచరతతులన్॥ 75

సీ॥ శిబిరాలువేయించె, శీఘ్రంబయారాజు, సకలసైన్యములకు, స్వామిముదవఁ
జావళ్లువేయించె, సకలమాకరితురం, గావళిస్వేచ్ఛగా, గవిఁజూప
నంగళ్లువెట్టించె, ననువుగాదర్బారు, ఖర్చులకెల్ల వీల్గలుగునటుల
శూరులనియమించె నేరుపుచేరాత్రి, వేళ శాత్రవులేగఁజాలకుండ

తే॥ నరరె యీరాజుఁబోలిన, యన్యరాజు। లెందుఁగల్గరు పద్ధతు, లేరుపఱచు
శక్తిలోనఁజనులెల్లఁ, జాటుచుండ నత్యనుపమక్రమోద్దండుఁడై చెలంగె॥ 76

వ॥ ఇట్లుండనచ్చటనరసావనీంద్రునకు, వెలమదొరచతుర్విధసైన్యంబుతో, యు
ద్ధంబునకై, మేదరసాలదుర్గసమీపంబునకువచ్చినిలిచెనన్న, వీరావేశంబంకు
రించి, శూరులయినయాశ్వికులఁజీరంబంచి యిట్లనియె॥ 77

తే॥ ఆశ్వికోత్తములారమీ,రందఱిపుడు
శాత్రవులుప్రోలుచొరకుండ,శక్తికొలఁది
మీపరాక్రమమునుజూపి, మెలఁగుఁడయ్య
మోసమగుఁజుఁడీప్రాల్మాలముందుమనకు॥ 78

ఉ॥ శాత్రవుసేనలయ్యెడలఁ, జక్కఁగవచ్చినవార్తబంధుతా
పాతుగ్రిలుగ్రామవాసులకుఁ, బంచినపేరిమిఁదెల్పవారలీ
గోత్రబుణంబుతీఱెనని, ఘోరభయంబతితాపమొందుచున్
గాత్రములందుఁజెమ్మటలు, కంపముగల్గఁగజంకిరత్తఱిన్॥ 79

వ॥ ఇట్లుండుసమయంబున నయ్యాశ్వారోహకులు, తత్పట్టణజనులందఱు భీతిల్లుస
మయంబునఁదాము నిర్భీకులౌనటుల నోదార్చియిట్లనిరి॥ 80

ఉ॥ తాపముమానిమీరిపుడు, ధైర్యముఁబొందినిరాకులాత్ములై
యాపురమందువర్తిలుఁడు, హేలగనిప్పుడెనిండుశక్తిమా
భూపరిపాలకుండుహరి, పోల్కివిరోధులఁద్రుంచివైచివే
మీపరితాపభారమును, మెచ్చఁగఁబాపునుపీరసింహుఁడై॥ 81

వ॥ అనియిట్లు వారివారిభయంబులఁ బోకార్చి తౌరంగికులు, దృఢతరభుజదర్పం
బునఁ బగవారి కేరికిం జొరనశక్యంబుగ, నగరంబు గాపాడుచుండు నవసరంబున 82

ఆనరసభూపాలుఁడు. వెలమదొరసంధివిషయమై
శివరామలింగభూపాలునితో యోజించుట.

తే॥ ఆనరసరాజు యోజించె, నాత్మయందు। నాజియాజియసంగ నే,హర్షమగునె
సంధికుదిరిననిటునటు,చాలశుభము। కోరరేసంధి నెందఱో,క్షోణిపతులు॥ 83

చ కలుగవెపెక్కుయుద్ధములు,కల్గవెసంధులుకల్గరేనృపుల్
కలుగవెధర్మసంహితలు,కల్గవెశాంతులుకల్గరేరిపుల్
కలుగవెసూక్ష్మధర్మములు,కల్గవెటీకలుకల్గరేప్రియుల్
కలుగవెదిగ్జయప్రభలు,కల్గవెకల్మలుకల్గరేబుధుల్ 84

ఉ॥ ఉండవెతంత్రభేదగతు,లుండవెతత్త్వములుండరేగుణుల్
చండతరాజికాలమున,సాధ్యమసాధ్యముబారఁజూచి వే
దండహయాదికంబునువృ,థాపరిమార్పకశూరవైరిమా
ర్తాండులఖండనంగొనక,తాలిమిసంధియకోరఁజెల్లదే॥ 85

ఉ॥ భారతసారవేదులగు, పండితమండనులెల్ల సంధిసం
చారము, తద్గుణంబులు ప్రశస్తములేయనుచుందురందఱీ
ధోరణిగుర్తెఱుంగరు పృథుప్రతిభానుగతార్థమన్యులన్
జేరదుగాదె భారతపుఁ, జేవయె భావమునందునచ్చెడిన్॥ 86

వ॥ అని యిట్లు కమ్మదొరమనంబున యోజించి, తనసహోదరుం బిలిచి "ఇ
త్తఱి మనతోఁ బోరుసేయంగోరి యరుదెంచిన పరరాజుతో సంధిఁగోరుటుచి
తంబు, మున్నెందఱో ధరాపురందరులు సంధికియ్యకొనక, యపజయంబు నొం
దరె; కావున నీవీయెడ నారాజవర్యునికడకే తెంచి,యనిమిత్తంబుగ మాతోఁ
గయ్యంబేలఁ జేయఁదలంచితివనియు, సమీపరాష్ట్రేశ్వరులమైయుంటిమిక దా
యనియుఁ బృచ్ఛసేసిరమ్మని యాజ్ఞాపించెనంత. 87

గీ॥ రామలింగాహ్వయుండప్డు రాజుపల్కు। నట్టి పల్కులువినితాను, హర్షమెసఁగ
వెడలె నరితోడసంధికి, వీలొకలంది। సామవాక్యంబులను శౌర్య,సరణిదెలుప

రామలింగభూనాథుఁడు భ్రాత్రాజ్ఞచే సంధికి వెడలుట.

చ॥ తగుపరివారముంగొనివృథాకలహంబునుమాన్పనాతఁడే
గఁగఁగని వైరిపక్షమునఁ, గ్రాలెడి బంట్లటులేగివారి జే

నిఁగనిధరావరుండరుగు, నీటును దెల్పఁగ వారిరాజుచ
క్కఁగ నెదురేగెఁగ న్మదార, గారికి నాత్మను గొంకక త్తఱిన్॥ 89

గీ॥ అటులు మల్లరాజు సూరయా, హ్వయుఁడు వేగ। వంశపావనుఁ డైనట్టి, వాసిరెడ్డి
రామలింగన్న కెదురేగఁ, బ్రాజ్ఞబుద్ధి। వచ్చి యర్చుండి రలమిన, భాస్థలమున॥

తే॥ అతులమర్యాదతోడన, య్యవనివిభులు। రాచపొలఁకువ చేతను, రమ్యఫణితి
మాటలాడుచునుండఁగ, న్మదార వెలమదొరను బ్రశ్నింపఁదొడఁగ నీధొరణిగను

ఉ॥ మాకును మీకు నుందగిన, మన్ననతోడను మంచి మైత్రితో
నేకలహంబు లేక సుఖ, యుంచుచు నుంటిమి గాదె యీయెడన్
బ్రాకటగౌరవోన్నతుల, బాగుగ వీడుచు మీరు మాపయిన్
భీకర బాహుదర్పమున, బ్రేల్మిడిఁ బోరఁగ గౌరవంబొకో॥ 92

వ॥ అనవిని యావెలమతేఁడిట్లనియె. మీతాత వీరభూపాలుని మూఁడవయన్న చంద్రమౌళి, మాతాత పెదసూరన్నృపాలునితావున, వినుకొండసీమలో, నాల్గవ హిస్సానందిపాటివంతును ౧౮౦౦ పూరివరహాలకు, అదవగానుంచి సదరువరహాలు తీఱినతరువాత మరల మాకునిచ్చెడి యొడంబడిక నేర్పఱచుకొని స్వాగతంబుచేసి మరల మేమెన్నిసారులడిగినను, మాగ్రామముల మాకీకుంటయే కాక, మత్కులసంభూతుండగు మాన్గంటి శేషయ్యను, మీరుసభలో నవమానించినవార్తవిన్నది మొదలు, నేనుమనస్సంతాప మగ్నుండనై యుంటినన. నాకమ్మదొరయిట్లనియె. నందిపాటివంతు జనపదంబులు, పెదసూరన్నగారితావున, మాతాత చంద్రమౌళిగారు ౧౮౦౦౦ పూరివరహాలకుఁగొన్నక్రయముదాఖలాలున్నవి. ఇంతియకాక శేషయ్య మాసభయందు, జరిపిన నిరాకరణప్రసంగంబులకు, నతని నవమానితుంజేసినమాటనిజము. యిట్టి దుర్బోధలు మీరువిని యుద్ధంబుచేయంబూను టుచితంబుగాదనవిని, యావెలమదొర యిట్లనియె. సమరసన్నాహంబున, నేముమాపట్టణంబునుండి వెడలివచ్చి, యీయెడమీతో సంధిపడుట సమంజసంబుగాదు. ఇతరరాజోత్తములువిని, పరిహాసింతురు. కావున దురంబుచేయుటుచితంబెకాని, వేఱొండుపని యనుచితంబన, నాకమ్మదొర, తోఁకఁదొక్కిన భుజంగంబుపగిదిఁ జట్టున ధిక్కరించి, యిట్లనియె. 93

చ॥ అనియనజంకినేనిటుల, నాడను భూవర ! సంధిసూక్తులన్
మనమున వేఱుగాఁదలఁచి, మానపరీతపరాక్రమక్రమ

ధ్వనివెలయంగమీరిటులు, పల్కుటన్యాయ్యముగాదు ధర్మవ
ర్తనమునుగాదుజెంఘ్లువిన, రాదుయశంబుగ్రహింపుఁడీస్థితుల్॥ 94

ఉ॥ భూజనులందఱుం బ్రథన, భూస్థలియందునశించునంతలో
రాజులకేమిలాభమని, రాజకులోద్భవసంధిగోరినే
నాజిప్రసక్తిసీడిపిన, యాంచితబుద్ధినివచ్చియుంటిగాఁ
నీజవసత్వముల్ తొలఁగి, నేనిటురానని యాత్మనెంచుమీ॥ 95

తే॥ పనియొకండున్న లేకున్నఁ, బ్రకృతిసమితి
కపకృతియొనర్పఁగూడద, టండ్రుబుధులు
తద్విధిఁదలంచి నీసన్నిధానమునకు
నేగుదెంచితివేఱుగా, నెంచవలదు॥ 96

తే॥ రాజరత్నమ, తొల్లింటి, రాజవరులు
జన్యములఁజంపినట్టియు, సంఖ్యజనులఁ
దలఁచుకొన్నంతగుండెబ్రద్దలగుఁగాదె
మంచిదాయట్టిదారితా, మెంచఁదగరె॥ 97

వ॥ ఇట్లుకొంత తడవువచింపఁ బురోదర్శియగు నవ్వెలమఱేఁ డిట్లనియె॥ 98

చ॥ వెలమకొలంబునంబొడమి, వీరపరంపరలోఁ బ్రసిద్ధికిన్
నెలవయికీర్తిఁగాంచితగు, నేర్పునయుద్ధముసేయవచ్చిని
లలితవచోవిలాసముల, లాతిగసంధికినంతసింపరా
జులుపరిహాసముంజలుపఁ జూడరెపీడరె వీరమార్గముల్॥ 99

చ॥ అయిననుమీరలీయెడస, మంచితసంధినిఁగోరివచ్చియా
నియతినినాకుఁ జెల్పితిరినేర్పుదలిర్పఁగ సమ్మతింతుని
ర్భయముగమీకుభుక్తమగు, గ్రామములన్నియు మాకొసంగని
శ్చయముగమీరుచెప్పినటు, సంధికొడంబడకుందునేన్నృపా॥ 100

చ॥ అనఁగనెకమ్మభూమిపతి, యాతనితోఁడుతఁబల్కెసూక్తులన్
వినయముతోడసంధికిటు, వేగమెవచ్చితినంచునీయెడన్
ఘనతరయుక్తినీవిటుల, గ్రామములిమ్మననేనువిన్ననా
మనమునశంకలేదనిన, మానుగనొప్పెదనన్నవింతయా॥ 101

గీ॥ ఇట్లుసేయుటవిధియంచు, నేనురాఁగ। నధముఁడనటంచునను నెంచి, యాత్మలోన
యుక్తిమెయిమాటలాడఁగా, నొప్పునొకొ।నీతివేత్తలునవ్వరా, నృపవరేణ్య॥102

కం॥ ప్రకటతరకమ్మకులమున। నకలంకముగాజనించి, యలరెడునేనే
చకితుండనై తినంచును। దికమకపడఁదగునెశూర, తేజముచెడదే॥ 103

సీ॥ చిరకాలముననుండి, స్థిరవిభూతినిమాకు, స్వాధీనమైయుండు, స్వార్జితంపు
జనపదంబులుమీరు, సతతంబువిడనాడి, కాంక్షింపఁదగునయ్య,కలహావడుచు
నిర్హేతుకంబుగా, నిరుపమోక్తులతోడ, నిర్భయంబుగఁగోర, నేర్పుమెఱయ
గోష్పాదమంతైనఁ, గోరుభూతలమును, నీయమేమిప్పుడుఁ, దోయజాక్ష

తే॥ పటుతరంబైనమద్బాణ,పావకార్చి। వలనదురముననినుఁగూల్చి,వసుధయందుఁ
బ్రవిమలోజ్జ్వలకీర్తి చేఁ,బ్రభవహించి। గెలువుఁగాంచెదననిపల్కె-క్షితివరుండు॥

వ॥ ఇట్లుపలుకనావెలమతేఁడిట్లనియె॥ 105

తే॥ కమ్మవారింటఁబుట్టిన,ఘనుఁడవీవు। మీఁదునిర్భయవాక్కుల, మేలెఱుఁగుదు
మాటలాడినఫలమేమి,మనుజవర్య।కదనమునమనశౌర్యంబు, కానఁబడును॥106

తే॥ వట్టిమాటలుపలుకంగ,ఫలితమేమి। పటుతరంబైనశౌర్యసం,పత్తి దెలియఁ
బోరిజయమునుగైకొన్న ,ధారుణీంద్రు। లెల్లరుగ్రహింత్రుమనవారమెల్లనపుడు॥

వ॥ అనియీప్రకారంబుగా నావెలమభూపాలుండు పల్కిన సోపాలంభ వాక్యము
లకు, నాకమ్మదొర, జంకకయిట్లనియె. మనకుసంధి కుదురదు, యుద్ధమున
ల్పుటనిక్కంబని, చెప్పి,నిజావాసంబునకు వచ్చినరసభూపాలునితో నావెలమ
తేఁడు సెప్పినమాటలు విన్నవింపనయ్యనఘుండు కోపోద్రేకంబున యుద్ధస
న్నాహంబు సమకూర్పనియమించె ననంతరంబ 108

శా॥ భూమీపాలకసత్తముండు వికట, భ్రూఫాలభాగస్థుఁడై
సేమంబొప్పఁగయోధులంబిలిచి మీ,నేర్పొప్పఁగానేఁటిసం
గ్రామంబందునగెల్పుఁగాంచుఁడిభవ, ద్రాజోత్తముండెంతొని
స్సీమంబౌప్రమదంబుఁగాంచునటువా, సిన్ వన్నెతేఁడొందఁగన్ 109

తే॥ అటులుపల్కినపిమ్మట, ననుజుఁగూర్చి
పలికెనారాజసింహంబు, పటిమమెఱయ
శత్రుసంహారణార్థమై, శ్రమకునోర్చి
యుద్ధసన్నద్ధుఁడవుకమ్మ, బద్ధదీక్ష 110

వ॥ అయ్యెడఁగమ్మదొరలు, తమచతుర్విధబలంబులతోనెట్టులు వెడలిరనిన 111

శా॥ భేరీభాంకరణాదులయ్యెడలను, ద్వేలార్భటిన్ మ్రోయఁగాఁ
ఘోరన్ దద్విభు సేనమత్తగజముల్, ఘాల్పొప్పుఘట్టంబులున్

ధీరోద్దండులు రాజులున్ గొలువఁగాఁ, దేజంబు దిగ్వ్యాపిగా
సారోదారతఁబోయి రప్పుడనికిన్, శౌర్యప్రభావాఢ్యులై 112

ఉ॥ ఆయెడ రాజు సైన్యమున, మంచితవీరపరాక్రమంబునన్
బాయని దీర్ఘకోపమునఁ, బట్టుదలన్ గడుఁబూనియున్ మదిన్
శ్రేయముఁ గోరి యుద్ధమునఁ, జెచ్చెఱ శాత్రవముఖ్యులందఱన్
సాయకవృష్టిచే నడఁచి, చక్కడఁగింతుమటంచుఁ బల్కుచున్ 113

చ॥ పటుతరభీకరాకృతులఁ, బాటిలి కర్ణకఠోరవాక్తతుల్
చటులతమోగుణప్రసృతి, చంచలభావముతోడఁ బల్కుచున్
జటుకున శత్రుసేన పెలుచన్ భయమందఁగ ఘోషపెట్టుచున్
దిటవుగ నిల్చిరయ్యెడలఁ దేజముఁ బొంపిరివోవ నెల్లరున్॥ 114

తే॥ ఇరుఁగెలంకుల సైన్యంబు, లేపుమీఱ
నిలిచిరయ్యెడ సంద్రముల్, నిలిచెననఁగ
రణవిధానవశంవద, ద్రఢిమ మెఱయ
నిరుపమోత్సాహనియతిచే, నెగడి వెలిఁగి॥ 115

• వేమభూపాలుని సైన్యవివరణము •

వ॥ మ్రలాజునూరభూపాలుని సేనానాయకులు రామచంద్రరావు, రామారావు, వెంకటనరసింహారావు, నీలాద్రిరావు, గుండారావు, పాన్గంటి శేషయ్య, వెంకట్రాయఁడు, బలేరాయఁడు, తిరుపతిరాయఁడు, నారాయణరావు, సీతారామయ్య, నరసింహారావు, నారయ్య, వెంకటకృష్ణయ్య, శ్రీకృష్ణనాయఁడు, మొదలగు వెలమదొరలును, గోవిందయ్య, అమీర్ ఖాను, సయ్యద్ ఖాను, లాలుఖాను, జంగుబహాదరు, రామసింగు, మొహతేసింగు, జఫరుసింగు, లక్ష్మణసింగు, రాజారాము, కృష్ణానాయకుఁడు, వెంకటచలము, గోపాలరెడ్డి, మొదలుగాఁగల యనేకులైన, స్వకులపరకులసంభూతులగు భుజబలశాలులును సేనానాయకులును, పెక్కులు కాల్బలంబులును, ననేకవిధహస్త్యశ్వాదిజంతుసంతానంబులునుఁ గలిగి, రణాంగణంబు విరాజిల్లుచుండెననంతరంబ॥ 116

నరసభూపాలుని సేనానాయకుల వివరణము.

వ॥ నరసభూపాలుని సహజుండగు చినరామలింగన్న, దేవరకోటభరాదారుండు, కోదండరామన్న, పెదచంద్రమౌళి, వెంకటపతి, నాగాహ్వయుండు, తిమ్మనీఁడు, నారసింహుఁడు, లింగన్న, చినపాపన్న, సంజీవరాయఁడు, వీరన్న, అ

క్కన్న, శివన్న, తిరుపతన్న, మాదన్న, మూలమనీఁడు, పెదక్కన్న, రఘు నాయకులు, మాదినీఁడు, చిననారసింహుఁడు, సింగమనీఁడు, పద్మనాభుఁడు కొండమనీఁడు, తిరుమలప్ప, మల్లినీఁడు, వీరన్న, సుబ్బన్న, వెంకట్రామన్న, రామన్న, నాయఁడమ్మ, జంగుబహాదరు, కాశింఖాను, వజీరుఖాను, కుతుబు ఖాను, రాజాసింగు, కృష్ణసింగు, నారాయణ, వీరు శౌర్య ధైర్యగాంభీర్య నిధులై కయ్యంబునకుఁ గాలుద్రవ్వుచు, నశేకగజహయ సముదాయ సంకులంబులగు సేనాంగంబులు వెలుఁగొండ, వారుభయులు 1157 ఫసలీకి సరియగు ప్రభవసంవత్సరమున యుద్ధంబుసేయసమకట్టిరదెట్లనిన॥ 117

ఇరువంకలరాజులు పౌరుషోక్తులఁబోనని సేయఁ దారసిల్లుట.

తే॥ నరసభూపాలుఁడయ్యెడ, సరసఫణితి। వెలమఱేనికినిట్లనె, వేడ్కమీఱ
రాజపుంగవమామీప, రాక్రమంబు। తేటఁపడునేఁటియుద్ధానఁ దెల్లముగను॥

తే॥ వెలమవంశానఁబుట్టిన,వీరవరుఁడ। వీవుయుద్ధంబులోపలఁ జేవమెఱయ
నిలిచితేనిభవద్వాంఛ,లెలమిఁదీర్తు। జాఱిపోకుముమగపాడి,సమయునట్లు॥ 119

వ॥ అప్పుడు వెలమదొర కమ్మభూపాలునితోనిట్లనియె। 120

చ॥ వినునృపవర్య;సంగరవి, వేకవిశారదులైనయట్టిభూ
జనులిటుకాలచక్రగతి, సంగతమానసులయ్యునీవలెన్
గొనకొని,యాత్మసంస్తుతుల,కున్ముదమందిరెయేలయీవిక
త్థనములుబంటుపంతములె, ధారుణినాథతలంచిచూడఁగన్॥ 121

చ॥ కదనములోననాయెదుట, గట్టిగనిల్చిననీపరాక్రమం
బెదగణియించుదర్పమును, నించుకచూచిలసద్గదాహతిన్
బదఁపడివీరవారపరివర్తనసంజని, తాజిఘోషకా
స్పదమగుగాత్రమున్ దెలిపి, వహ్వారెయంచునుతింపఁజేసెదన్॥ 122

మ॥ వినలేదానిగమాగమోక్తవిధులన్, విద్వత్కులాస్యంబులన్
ఘనమౌసత్యమదెచ్చటంగలదొచ,క్కన్ నిల్చునచ్చోటన
జ్జనసేవ్యుండుజగద్విభుండు జయమశ్రాంతంబుఁగల్పించుయో
జనచేయన్వలెధర్మసూక్ష్మవిధమెం,చన్ సర్వసంవేద్యమే॥ 123

తే॥ కానినీవిప్డుధీరత,గలిగినిల్వు। మియ్యెడనెనాదుభుజశక్తి, యేర్పడంగ
శ్రీహరికటాక్షముననిన్నుఁజిక్కువెట్టిత్రుంతుమారాడమాటయుఁదోఁచకుండ॥

ఉ॥ నాదగుబాణపఙ్క్తికల, నన్నినునీదగుసైన్యమున్ మహా
నాదమునిన్నుముట్టగణ, నన్గొనకేవిదళించి మిత్రస
మ్మోదముహెచ్చఁబంపెదను, మూర్ఖవతంసమ ; కాలుపీటికిన్
వాదములేలకార్యఫల, వైఖరితేలఁగనాజియుండఁగన్॥ 125

మ॥ అనియిబ్భంగి సఖండరోషగతులై, యాయిర్వురుర్వీపతుల్
జనితాహంకృతిహుంకృతుల్ వెలయస్వో, చ్ఛన్ దారుణాలాపముల్
పెనఁగంబల్కుచునుగ్వ్యూహకల్పనలదృ, క్లృప్తిన్ బొసంగించుచున్
గనలుప్పొంగఁగఁబోరఁజొచ్చిరసురల్, కాంక్షించివీక్షింపఁగన్॥ 126

సీ॥ ఇరువంకలమెలంగు, ధరణీవరోత్తముల్. రథరాజములనెక్కి, ప్రధనమునకు
సన్నద్ధులైవచ్చి, రున్నతోత్సాహసం, భ్రమజాతమోదసం, పదపెలంగ
నుద్దండవిక్రమ, యోగసమాయాత, శక్తిప్రభల్ మహా, శ్చర్యములుగ
దృఢతరబాణసం, దీప్తినల్దిక్కుల, వ్యాపించికనభీతి, యడరఁజేయ
తే॥ వారిపైవీరు వీరిపైవారుకినిసి । పటుశరంబులగుమిపర, స్పరజిగీష
వేసికొనుచుండిరౌద్రసం, త్రాసపడక । వీరరసముట్టిపడినట్టి, విధముదోఁప॥ 127

వ॥ వాసిరెడ్డివంశపావనుండగు నరసభూపాలునకు మల్రాజు సూరభూజానికి
జరిగిన ప్రవిదారణవిశేషంబునువివరించెద॥ 128

ప్రథమయుద్ధము.

చ॥ పటుతరభీషణాకృతులఁ, బ్రజ్వలదుద్ధతభావసూక్తులన్
స్ఫుటవిశిఖాప్రపతన, పూర్ణశరీరవికారరీతులన్
గటువచనోపజృంభితవి,కస్వరశౌర్యరమాప్రసక్తులన్
దిటవుగనిల్చిపోరిరని, ధీరులువీరులువీరలేయనన్॥ 129

తే॥ నరసవిభుఁడునుసూరయ, ధరణిపతియుఁ
దారసిల్లిరినిరుపమో, ద్దండగరిమ
మదగజంబులుపోరాడు, మాడ్కిఁదనరి
బాణముల్ వేయఁదొడఁగిరి, ప్రౌఢిమెఱయ॥ 130

తే॥ వాసిరెడ్డ్యన్వవాయుండ, వక్రగతిని
సూరయాధిపునేయంగ, సోలియతఁడు
కఠినతరమైనబాణముల్, కడఁకవేయ
నడుమఁదునుమాడెనవియెల్ల, నరసవిభుఁడు 131

చ॥ సునిశితబాణపాతముల, శూరతనా వెలమన్ గలంపనా
యనయుఁ గఠోరబాణముల, నయ్యవనీశుని ఫాలమందునన్
ఘనముగ నాటనేయ నధి, కంబుగ బాధయుఁ గల్గ నుగ్రుఁడై
కనుఁగవ నెఱ్ఱచేసి తన, కార్ముకమున్ వెసఁ బూనె నయ్యెడన్ 132

తే॥ విశిఖవృష్టిని గురిపింప, వివిధగతుల
వెలమభూపాలుఁ డల్గి ని, ర్భీకుఁ డగుచుఁ
బరుషవాక్కులు పల్కుచుఁ, బ్రబలధాటిఁ
గమ్మభూపాలుపై వేసె, నమ్ములదర 133

ఉ॥ ఆయెడఁ గమ్మభూవిభుఁడు, నాగ్రహమందుచు బాణపుంజముల్
పాయని దీర్ఘకోపమునఁ, బట్టుదలన్ రథఘోటకంబులన్
వేయఁగ డస్సి యయ్యవిభు, వింబడఁగా వెనువెంటనే వెసన్
శ్రీయుతుఁడౌ నృపుండు కలఁ, చెన్ శరపంక్తిని సూతు నొప్పుగన్ 134

చ॥ పటుతరమైన బాణములు, స్పర్థమెయిన్ రిపుఫాలభాగమున్
దటుకున వ్రక్కలౌనటులు, తార్కొని వేయఁగ సూరయాధిరా
ణ్ణిటలము నాటి రక్తము ఘు, ణిల్ వెలయించుచు జారరుట్టుచే
జటుల పరాక్రమంబు రిపు, సంహతిఁ జేయఁగ వేసి బాణముల్॥ 135

ఉ॥ మోహముఁ జెందఁజేసి కడు, మూర్ఛతతోడుత సూతునిన్ వెసన్
సాహసమొప్పఁగాఁ బటిమ, సాయకసంఘము నాటనేయన
య్యాహవమందుఁ గమ్మదొర, యన్న విపద్దశఁ గాంచి వేగమే
బాహుపరాక్రమంబెసఁగ, ఁబంతపువాక్కులఁ దారసిల్లుచున్॥ 136

రామలింగభూవరుండు సూరయభూపాలునితో యుద్ధముసేయుట

వ॥ చినరామలింగన్న వెలమదొరను దార్కొని యిట్లనియె॥ 137

ఉ॥ ఓరిమురాత్మ నాయెదుట, నొప్పుగ భీతివహింపకీయెడన్
బోరసహించి నిల్వ భుజ, భూరిపరాక్రమధాటితోడ నా
కోరిక దీఱనేనిపుడు, ఘోరశరంబుల వైరశుద్ధి నే
ర్పారఁగ దైవసత్కృపమ, హాబలులచ్చెరువందఁ జేసెదన్॥ 138

మ॥ అనుచున్ దుర్భరబాణసంఘముల న, త్యంతోగ్రకోపంబునన్
ఘనతన్ భూపతిఁ గమ్మనేయఁగను దా, గర్జించుచున్ ద్రుంచుచున్
జోనుపన్ నారసముల్ మహాప్రబలతన్, సూరాహ్వయున్ వేగన
య్యనఘాగ్రేసరుఁడైన కమ్మదొర బా, ణాళిన్ వడిన్ నాటఁగన్॥ 139

తే॥ వెలమదొరయల్లియ త్తఱి, వివిధగతుల
శాత్రవునిపైఁబ్రయోగించె, సాయకములఁ
గమ్మదొరకీఘగాకయ, కన్నదనమందుఁ
గఠినవాక్కులుపల్కుచుఁ, గ్రమ్మివేగ॥ 140
తే॥ వాడిగలబాణములవేయఁ, బార్థివుండు వానినన్నిటిఁజక్కాడి,వాలెత్తింగి
కవచభేదనమొనరించు,కౌతుకమున। వెలమదొరకొన్నిబాణముల్ విసరివైచె॥ 141
వ॥ ఇట్లువీరిరువురుఁబోరాడుచుండ నొక్కప్రక్కను గోదండరామభూపాలుండు,
బలేరాయనిఁదార్కొని, దురంబెటులఁజేయుచుండెననిన॥ 142
సీ॥ కోదండరాముండు, ఘోరతరంబుగా, రహినెదుర్కొనిబలే రాయనిఘన
కోదండమునుబూని, గుణనినాదంబును, వెలయింపఁజేయుచు, విన్నుముట్ట
రాజోత్తమానీవు, రమ్యతరంబుగాఁగదనంబులోపలఁ గదలకుండ
నిలిచిపోరాడుము, నేర్పుగానాతోడ బలదర్పశౌర్యముల్ ప్రజ్వరిల్ల
తే॥ ననుచుగోలలువేయంగ, నాగ్రహమున
వెలమభూపాలుఁడల్లితా వివిధగతుల
సునిశితాస్త్రంబులవ్యోడ సుస్థిరముగ
నేయనాకమ్మదొరయల్లి, హేలమెఱయ॥ 143
చ॥ పటపటఁబండ్లుగీటుచును, వారకకమ్మనృపాలుఁడవ్యోడన్
గుటిలునిగుండియల్ వగుల, ఘోరతరంబుగ నార్చిబాణముల్
చటులపరాక్రమంబెసఁగఁ, జట్టుననావిభునేయఁగోలలన్
దటుకునఁద్రుంచియావెలమ, తద్విభునొవ్వఁగనేయబాణముల్॥ 144
మ॥ అపుడాకమ్మనృపాలుఁడాగ్రహముచే, నాతేనివక్షస్థలిన్
విపరీతంబిదికూడదంచనఁగను, వ్వైన్ దీవ్రమహాబాణముల్
రిపువల్లాడఁగవెండితద్విభుఁడు మే, ల్దిఱంగనారాచముల్
విపులంబైనపరాక్రమంబెసఁగను, క్ష్మానాథుపైవేయుచున్॥ 145

గుండారావు నరసభూపాలునితో యుద్ధము సేయుట.

వ॥ ఇట్లుండ వేఱొక్కచోట గుండారావు నరసభూపాలునిఁ దార్కొని ఘోర
యుద్ధంబుసేయుఁదొడంగె నదియెట్లనిన॥ 146
తే॥ గజముగజమునుబోరాడు, కరణివార। లిర్వురును యుద్ధమందుననేకగతుల
నొండొరులగెల్వఁగాక్షించు,నూహతోడ। మెలఁగసాఁగిరిశూరతా,విలసనమున

శా॥ ఏరా రాజకులోద్భవా యిపుడు నే, నేపారఁగాఁబోరిలో
ఘోరాకారత మద్భుజాబలముచే, ఘోషింపఁగానిన్నిటన్
ధారాపాతవిషాగ్ని కీలయుతసం, ధానప్రభేషావళిన్
బారావారగభీరధీరతను నే, బాటించి ద్రుంతున్ వడిన్॥ 148

వ॥ అని యిట్లు వెలమదొరయనఁ గమ్మభూపాలుండు తోఁకద్రొక్కిన నాగంబు మాడ్కిఁ గోపానలజ్వాల మానసుండై యిట్లనియె. ఓరాజోత్తమా! ప్రల్లదంబులచే నేమిప్రయోజనము. నేఁడీయుద్ధవాటికను జంకునందక నాతోఁ బోరంజాలితివేని నీమగంటిమి గన్పట్టునని కమ్మదొర వెలమదొరతనుపై బాణపాతంబొనర్ప వెలమదొర త్రుంచివైచి శత్రుతనుత్రాణంబు పగులంగొట్టనతిక్రుద్ధుండై కమ్మభూపాలుండగు నాగుండు రాయండు నొచ్చునటుల, మరల బాణవృష్టిఁ గురిపింపనప్పుడా వెలమదొర వికలచిత్తుండై మఱియును.

చ॥ వెలమవిభూత్తముండతి వి, వేచనతోఁడుతఁ గమ్మభూవిభున్
విలసితభూరిదర్పమున, విస్ఫురితోన్నతనారసంబులన్
గలుషముదూలునట్లుగను, గ్రమ్మితటాలున నొవ్వఁ జేయఁగా
నలఘుతరాంబకంబులను, నానరపాలుఁడు ద్రుంచివైచుచున్॥ 150

తే॥ శాతబాణపరంపర, చేత వెలమ। జేనినిటలంబు నాటఁగాఁ బూనిపొడువ
నపుడు వెలమయుఁ గమ్మభూ, మిపుని నొవ్వఁ। జేయ బాణాలవిడిచె జే, జేలు మెచ్చ॥

మ॥ అటులన్ వేసినబాణసంతతులచే, నాకమ్మభూమీంద్రుఁడున్
బటునోషంబున శాత్రవాసుహరణప్ర, జ్ఞాసమజ్ఞాఢ్యుఁడై
పెటుకుంగేకలువెట్టుచున్ బ్రధనని, ర్భీతిన్ విడంబించియు
త్కటదర్పాంచితువైరినుక్కడఁచెదం, ద్రన్ గంద్రగోళంబుగాన్॥ 152

చ॥ వెలమధరావరుండుపరి, వేదనఁగాంచియురోషమూర్తియై
చలదనలప్రభాపటలి, చాద్పుననిట్టటుఁదూఁగితూఁగిని
స్థులతరసాయకంబులను, దుక్కునుదూగఁబెరేఁగఁ గమ్మభూ
లలనపతిన్ దడాబిడిఁగ, లంచెదలంచితలంచిసుక్కఁగన్॥ 153

వ॥ ఇట్లుండరవియస్తంగతుండగుటయు, నయ్యిరుగెలంకులవారు నేఁడింతటయుద్ధవిరమణంబు సేయుదమని నిశ్చయించుకొని స్వస్వస్థానంబులకరిగి సుఖభోజనాదులం బరితృప్తులై, రెండవదినంబుప్రొద్దుట యుద్ధంబు సేయ రణాంగణంబుఁజొచ్చిరనంతరంబ॥ 154

## రెండవరోజుయుద్ధము.

తే॥ గీ॥ ఇరుగెలంకులసైన్యంబు, లేపుమీఱ
వ్యూహములఁబన్నిరయ్యుద్ధ, భూమియందు
యోధులందఱునిర్భీతి, నొప్పుచుండి
రథపతులకెంతయుత్సాహమతిశయింప॥ 155

తే॥ రెండుసైన్యములనుండును,ద్దండులయిన। రాజులిర్వురుభూరిపరాక్రమముల
వారియపజయమునువీరు,వీరువారి। యపజయంబునుగోరుచు,నడరిరనిని॥ 156

రామలింగభూపాలుఁడు బలేరాయనిఁ బరిమార్చుట

తే॥ రామలింగన్నయును బలే,రాపుఁగూడి। బాణముల్ వేసికొనరి దు,ర్భరమగుచు
నొకనికొక్కరు తగ్గని, యోజనమున,సకలపరికరము లుతమ,చక్కనుండ॥ 157

మ॥ అదిగో బాణముదాచికొమ్మనుచు న,త్యంతోగ్రరోషంబునన్
హృదయాంతర్గత కోపవహ్నిమిగులన్ హెచ్చంగ నుద్యద్గతిన్
విదితాకారతశత్రునింగదిసి ని,ర్భీతిన్ బలేరాయఁడున్
మదినొవ్వన్ జినరామలింగవిభునిన్ మన్నించ కేవేయఁగన్॥ 158

మ॥ పరిహాసంబులు సేయుచున్ నృపుఁడు ర్వప్రోజ్వలచ్ఛక్తిచే
హరునిన్ జిత్తమునందలంచుచు మహో, హర్షాత్ముఁడై చివ్వునన్
గరుణాహీనతఁగమ్మ భూవిభుఁడు శం,కన్ వీడి బాణాళిఁదా
నిరవృందన్ దగనేయఁ దద్విశిఖముల్, హేలాగతింద్రుంచుచున్॥ 159

మ॥ బలవద్వర్గమహత్తరుండగుచు నా,ప్రక్కన్ బలేరాయఁడున్
గలఁతంజెందక రామభూవిభుని జంకంజేసి బాణావళిన్
లలితాకారరథాశ్వముల్ దునుమ బల్,లాభంబుగా నెంచి య
య్యలఘుత్మాపతిరామలింగ విభుఁడ,త్యంతంబు కోపంబునన్॥ 160

సీ॥ ఖడ్గంబుచేఁబూని, ఘనరథంబునుడిగ్గి, రిపురథసూతుని, నపుడనరికి
స్యందనహయములఁ, జక్కఁగాఁదునుమ బ,లేరాయఁడత్యంత,లీలమెఱయ
నరదంబు డిగ్గవా, రిరువురుపెనఁగొని, ఘోరయుద్ధంబును, భూరిశక్తిఁ
బదతాడనంబులఁ బాటించిచేయుచు, వలఁగొనివారల, వక్రగతిని

తే॥ దిరుగుచుండిరి శౌర్యంబు, తేటపడఁగ। నొకరికొక్కరు తగ్గని, యుగ్రశక్తిఁ
గదిసిశరములనడుపంగఁ, గఠినగతినిఁ। గ్రమ్మిరక్తంబు మేనులఁగారుచుండె॥ 161

వ॥ ఇట్లిరువురు, మహారౌద్రమూర్తులై, యన్యోన్యజయాభిలాషంబున దుడుకు
మాటలాడుకొనుచు, ఖడ్గప్రయోగంబులను జేసికొనుచుఁదద్దయుసింహనాదం

బుల నొనర్చుచు బలేరాయండు వలఁగొనిరాఁగ నదిసరకుసేయక రామలిం
గావనీంద్రుండు మెలంకువ మెయిందిరిగిన నీర్ష్యచే మరల బలేరాయండు ఖ
డ్గంబుచేకొని, కమ్మదొరతలయేరదరనేయఁ గోపోద్రేకమానసుండై తత్ప్రహా
రణంబులక్షింపక శిరస్త్రాణంబువగులంగొట్టనప్పుడా వెలమదొరనిజాయుధంబుఁ
గైకొని యాకమ్మదొరనేయ, నాతండు తెలివిఁ దప్పిభూమిపైఁ బడియప్పుడు
కొంతతడవుజరిపి, యోరాజోత్తమా నీవిట్లనాపై కేగు, దెంచితివేని నిన్ను
వధియించితీరెదనని కమ్మదొరపల్కె ననంతరంబ 162

తే॥ వెలమరాయని రామభూ, విభుఁడుపట్టి
దిమ్మదిరుగంగఁగొట్టఁగా, దిక్కులదరె
శూరులాశ్చర్యపడిరిమ, హారులెల్లఁ
దిక్కుదిగిపోయినిల్చిరి, యక్కజపడి॥ 163

తే॥ వెలమరాయండుకమ్మభూ, విభునికాండ
తతులఁదెగిపడేఁజెట్టువి, ధానఁబుడమి
నపుడునూరావనీశ్వరుం, డానృపాలు
మోముఁదిలకించికడునుగ్ర, మూర్తియగుచు 164

వ॥ తత్సమయంబున వెలమభూపాలప్రధానుండు, జరిగినసంగతికి వగచుచు, నె
ట్టకేలకు ధైర్యంబవలంబించి, కోదండరామన్నను దార్కొసియిట్లనియె. 165

మ॥ నినునేవీడకపోరిలోఁగదిసిని, ర్నిద్రస్థితిన్ద్రుంచిచ
య్యనశత్రుక్షయదీక్షపూర్తియగుచా, యర్ణస్యందనంబెక్కుచ
క్కనిశక్తిన్గనఁజేతునన్ననపుడు, గ్రక్రోధుఁడై కమ్మతోఁ
డనిలోబెబ్బులిఁబోలివర్తిలెజయ, వ్యాపారమేపారఁగన్ 166

వ॥ అప్పుడా వెలమదొర తనబంధువుంజంపిన కార్పణ్యంబున నేమేమోవలుక, సం
దర్భానుసారంబుగఁ, గోదండరామభూపాలుండెదుర్కొని, యసమశూరతా
సూచకవాక్యంబులఁబలుకుచు నమ్ములనడువ్వాని, నలంతిపఱచి, కొండవీటి
సీమాధిపతియారాజోత్తముండదరునటుల బాణప్రయోగంబుసేయనయ్యెడ॥

ఉ॥ దేవరకోటభూవిభుఁడు, దీప్తిఁజెలంగెడిబాణవృష్టిచే
నావిభునిన్ వెసన్ బొడివి, యాగ్రహమందుచుశక్తి తేలఁగా
భావుకబుద్ధిఁగైకొనియ, భంగురశౌర్యసమంచితాత్ముఁడై
యావెలమప్రభుండలకు నంటఁగఁగొట్టినబిట్టురొజుచున్॥ 168

తే॥ తోఁకఁ ద్రొక్కిన నాగంబు, త్రోవ దెలియ।
శౌర్యమెంతయుఁ గనుపట్టు, చాయచేత
వెలమభూపతి వచియించె, వీరలక్ష
ణంబుతో యుక్తి కలనమా, నవపతికిని॥ 169

ఉ॥ తేజము గల్గు రాజు నని, తెల్వి యొకింతయు లేక పౌరుషో
త్తేజకమైన వాక్యములఁ, దేటపడంగ వచించినంతని
న్నాజినిఁ గూలఁ ద్రోయక సుఖాత్మునిఁ గాఁ బొనరింప నోరిమా
మాజవసత్త్వముల్ దెలియ, మా యురెసి కెటు శక్యమయ్యెడిన్॥ 170

మ॥ అనుచున్ ఘోరశరాగ్నికీలలను బా, హాశక్తిచేఁ జేర్పఁగా
ఘనుఁడా దేవరకోటభూవిభుఁడు ధీ, క్కారప్రభన్ వేగమే
యనఘుం డప్పతి సేయుమార్గణములా, హా నాటఁగాఁ గోపియై
యనువందన్ విశిఖంబులన్ వెలమపై వ్యాపింపఁగాఁ జొన్పినన్॥ 171

తే॥ ఇటులు బాణంబులను వార, లెలమి మీఱి। వీరిపై వారు వారిపై వీరుఁ బఱప
శక్తిఁ గలవారు వానిని, నరకుఁ గొనక। శక్తిహీనులు బలమఱి, చలముఁ గొనిరి॥ 172

చ॥ ఫటపటఁ బండ్లు గీటుచును, బ్రాభవ మొప్పఁగఁ గోపదృష్టిచేఁ
జటులపరాక్రమం బెనఁగఁ, జయ్యన సూరయరాజసింహుఁడున్
దటుకున జాపముం దునిమి, తాఁ గ్రొని యేసె శరంబు లయ్యెడన్
బటురథవాజిరాజి తడఁబాటుగ నంగనుఁ గమ్మభూవిభున్ ॥ 173

ఉ॥ ఆనలినాయతాక్షుఁ డధి, కాగ్రహమందుచు నారసంబులా
మానవనాథు వక్షమున, మట్టుగ సేయఁగ వైరి యిట్లనెన్
శ్రీనిధు లెల్ల మెచ్చునటు, శీఘ్రము కమ్మనృపాలుఁడున్ వినన్
దీనవతంస, చూడుమిఁకె, దిగ్గున వర్మముఁ ద్రుంచివైచెదన్॥ 174

చ॥ సునిశితబాణముల్ సొనిపి, సోలఁగ వర్మము నాటనేయఁగా
ననుపమఘోరబాణహతి, నానరనాథునికంకటంబు వే
ఘనముగ వ్రక్కలై తనువు, క్రమ్మెడి రక్తముచే వెలుంగఁగా
మనమునఁ గోపముం గొనుచు, మానుగ సూరయనాథుఁ డిట్లనెన్॥ 175

మ॥ నినుసేఁ ద్రుంచెద నేఁడు నా యెదుట ని, ర్నిద్రప్రభాసాహసం
బనువందన్ నిజశక్తివిస్ఫురణశ్రే, యంబెంచుచున్ నిల్వుమా
యనుచుం జాపముఁ ద్రుంచి కమ్మవిభున, త్యంతోగ్రబాణంబులన్
ఘనవక్షస్స్థలి నాటనేయఁగను ర, క్తస్రావ మప్డెచ్చఁగాన్॥ 176

శా॥ బాలార్కోజ్జ్వలతేజుఁడ త్తఱి రణ, ప్రావీణ్యదివ్యస్మృతిన్
వాలాయంబుగనొండుచాపమును బల్ వాంఛన్ నృపుండందుచున్
భూలోకంబులుఘూర్ణిలంగఁబటిమన్ భూరిప్రభేష్వావళిన్
జాలన్ వింతగనేర్చికూర్చి పఱపెన్, సంగ్రామరంగంబునన్॥ 177
శా॥ సూతుంజంపి శరద్వయప్రతిభచే, స్రుక్కించిగుఱ్ఱంబులన్
భూతశ్రేణికలంగిపారునటులన్, భూరిప్రభావంబుచే
నాతండుగ్రతనార్చుచున్ వెలమకా, యాసంబుసంధిల్లఁగా
వాతోద్దండగతిన్ బెనంగఁదొడఁగెన్, స్వచ్ఛందచార్యుద్ధతిన్॥ 178
గీ॥ కమ్మభూపాలుఁడప్పుడు, గ్రంపుశక్తి
వైరిసైన్యమ్ముఁజీకాకు, పఱచుచుండె
గజముతామరతూండ్లకై, నిజబలంబు
నెల్లసరసునఁగనఁజేయు, నేపువెలయ 179
వ॥ అప్పుడా వెలమభూపాలునిసైన్యంబు దేవరకోటరాజసింహంబుచే శరపరం
పరఁదుత్తురుముసేయంబడఁ గొందఱు పంచత్వంబునొందియు, మఱికొందఱు
వికలాంగులయ్యు, వేఱొకకొందఱు చంచలచిత్తులయ్యు ననేక విధంబులఁ జె
ల్లచెదరై భయాక్రాంతింగుందు సమయంబున॥ 180

గుండారాయనిచేతఁ గోదండరామన్న తేరిగుఱ్ఱంబులును సారథియుంజచ్చుట.

సీ॥ భూనాథవర్యుండు, భూరిబలాఢ్యుండు, గుండరాయండను, గుణనుతుండు
తమసేనపాటును, ధరణీవిభుండగు, కోదండరాముని, కుటిలవృత్తిఁ
గాంచియునారాజు, ఘనరోషమున లేచి, కమ్మభూమీశ్వరు ఘనతఁదాకి
రాజోద్భవానీవు, రహిమీఱఁగావచ్చి, భీతిగాంచకయుద్ధ, వీధినిల్వ
తే॥ నీదుజవసత్త్వముల పుష్టి, నిక్కముగను। నాదుబాణాగ్నిచేతఁ బెంపేదఁజేసి
పట్టిచూచెద నిన్నొక్కపట్టటంచు। శితశరంబులవేసిగా,సిఁగనఁజేసి॥ 181
క॥ అట్టిట్టుకదలనీయక। నెట్టనరిపువిక్రమంబు, నేలంగలియన్
బట్టునరపతికోలం। గొట్టెన్ మౌర్వీగుణంబు కుంఠముగాఁగన్॥ 182
ఉ॥ రాజునటంచు నీవిపుడు, గాజసమేర్పడఁ బోరిలోపలన్
నీజవసత్త్వదర్పమున, నెమ్మినిభూవిభుసూతువాజులన్
శ్రీజయమందఁగోరి శరచేష్టవధించితివిప్రుచూడుమా
నాజయశాలి బాహువుల, నచ్చినవీరపథప్రభావమున్ 183
వ॥ అన్నియాప్రకారంబున నరసభూపాలుఁడు గుండారాయనిందార్కొని కఱుత

రోషోక్తులం బల్కుచు నఖండయుద్ధంబు సేయు నెడ నాకోదండరామన్న వేఱొండు రథం బెక్కి దంతావళంబుపైఁ బంచాస్యంబు దుముకురీతి నావెలమదొరల మొనం గదిసి పోరుచుండె, నిచ్చట నరసభూపాలుండు, దారుణతరనారాచంబులఁ గుండారాయని శరవృష్టి శాంతంబొనటు సేయ నాయనయు లెక్కింపక వీనిఁ గ్రక్కునఁ దునుమాడి, ఘోరతరాంబకంబుల నాకమ్మ విభుని నువ్వఁ జేయనప్పుడు 184

మ॥ బలధాటిన్ గదు నాగ్రహంపడుచు దీ, వ్యద్బాణకీల్యుద్ధతిన్
జలముం బూని యరీంద్రవైభవము ధ్వ, స్తంబెట్లు కానుండెనో
గలయం దద్విధి నెంచి శౌర్యరమచేఁ, గ్రాలంగ నావైరిబి
ట్టులికెన్ పండియుఁ దెప్పిరిల్లి యరివ, ర్గోచ్ఛేదమున్ జేయఁగన్ 185

శా॥ ఘోరాకారవిజృంభణంబున నుది, క్కుల్ బిట్టుఘూర్ణిల్లఁగాఁ
బోరావారగభీరుఁడై శరచయ, వ్యాపారదీక్షన్ బ్రభుం
డా రాజన్యుని నిస్పృహుం బొనరుపన్, యత్నించి బాణచ్ఛటా
ధారాపాతము రక్తముంగనఁగని, దాక్షిణ్యుఁడై వేయఁగన్। 186

సీ॥ అరుణాంబరముఁ బోలి, యాగుండరాయండు, రక్తసిక్తాంగుఁడై, క్రాలుచుండఁ
బటురోషవహ్నిసం, పత్తిచే నాతండు, ప్రళయరుద్రునిఁ బోలి, ప్రాభవమున
నల్దిక్కు లదరంగ, నానావిధంబుల, నార్చుచు రాజు, భూ,ర్యాగ్రహమున
గుణమునుసారించి, ఘోరతరంబుగా, బాణపరంపరల్ పఱపనపుడు

తే॥ కమ్మదొరనొవ్వఁగాంచి తా, గ్రమ్మి వేగ
నిజబలోద్ధతవృత్తిచే నిరుపమముగ
నసమసాహసములవడ, నధిపులరయఁ
గొదమసింగంబులం బోలి, కదలి రపుడు॥ 187

సీ॥ ప్రళయాంతకులభంగిఁ, బటిమచే నిరువురుఁ, బరుషోక్తులాడుచుఁ, బ్రబలగతిని
సునిశితాస్త్రంబుల, స్రుక్కంగ నేయుచు, బంటుతనంబులు, స్పష్టపడఁగ
హేలగాఁ బోరాడి, రిలజనుల్ గొనియాడ, విజయేచ్ఛమనముల, విఱ్ఱవీఁగ
విక్రమోపక్రమ, విధులఁ దామరయుచు, నంబకంబులచేత, ననని విభులు

తే॥ కవచములఁ జించుకొంచును, క్రగతిఁ బెనఁగి
యసదృశసమీకచర్యామయాత్ములగుచుఁ
జూడ మిట్టిధరేంద్రులఁ, జూడమనఁగఁ
బోరుచుండిరి గిరులతోఁ, బోల్పఁబడుచు॥ 188

వ॥ అప్పుడాగుండారాయండు నరసభూపాలుండును గిరిఁగిరియుం గరిఁగరియుం బో
రువిధంబున నుక్కుతీరునఁ, బోరాడుచుండిరత్తఱి నరసభూదారుండుకడంగి
యమోఘబాణంబులంగైకొని రణాంగణంబున సర్వత్రతానయై రథికులను;
హాస్తిపకులను, నాశ్వికులను దునిమి గంధసింధురక్రీడనంబున వాడంబారు
నుద్యానంబులచందంబున నున్నచోట్లంగాల్బలంబులఁ గాలు, చేయి, తల,
డొక్కయని యేర్పాటులేక చీకాకుపడఁ బడఁగొట్టించి, గజవాజిచయంబుల
నున్నవానినున్నయట్ల, గతప్రాణంబులంబొనర్చి, యాతపత్రంబుల విసాశపా
త్రంబులఁ జేసి, చామరాద్యనేక రాజచిహ్నప్రకాండంబుల, భ్రష్టభాండంబులం
బొనర్చి,లులాయసంచారప్రభ్రష్టంబగు కమలాకరంబుమాడ్కి, వెలమతేనిసై
న్యంబు వేయుదారింబట్ట, గుండారాయండు, సమయజ్ఞుండై శత్రుతతికియ్యవె
యదనసి తెల్వికల్మిసునిశితాస్త్రంబుల నరసభూపాలుని నొవ్వసేయుచుఁదన
సైన్యంబు నెట్లొచక్కపఱచుకొనుచు నుండుసమయంబున॥ 189

ఆ॥ కొండపీఁటిసీమ, నుండుభూనాథుండు। సూరయాహ్వాయుండు, సుస్థిరమతి
గుండరాయుకిడకు,ఁ గూర్మితోఁ నతెంచి। పలికె వేగనపుడు, ప్రాభవమున॥ 190

చ॥ వెలమలకీయదేయదను, వెక్కసముల్ పచరింపవైరి చా
పలతలఁద్రుంచివైవఁదమ, పాలిపురాకృతముఁ గణింప ని
ష్కలుషకులోదయంబుఁగని, చాలఁబ్రశస్తివహింపలేకని
చ్చెలులకుఁగీడొనర్చుకృషిఁ, జేయుటమేలెటులొనుజూడుమా॥ 191

మ॥ అసియిబ్భంగివచించు వాక్సరణిచే, నాగుండరాయండుతా
వినియుప్పొంగుచువారికిట్లనియె ని, ర్భీతిఁ మదిఁ గొంకకే
ఘనరాజోద్భవసేఁడుయుద్ధమునసా, కంగమ్మ వంశస్థులఁ
దునుమాడఁ దొరకొంటివారియనుఁగుల్, దుఃఖాబ్ధినోలాడఁగఁ॥ 192

మ॥ అనుచుఁ గుండయభూవరుండతులసం, హారాంతకుండోయనఁ
ఘననారాచపరంపరల్ పఱపితాఁ; గార్పణ్యావృత్తిఁ నృపుఁ
గినుకఁ నొవ్వఁగనేయుచుఁ నిజభుజా, ఖేలస్థితిఁ సూతునిఁ
ఘనతంగాంచఁగ వేసియార్చెఁబెలుచఁ, గాఢాగ్రహావ్యగ్రుఁడై॥ 193

తే॥ బాణవర్షంబుఁగురిపించె, భవ్యగరిమ। శత్రుసంఘంబుతద్బాణ, చయమువలన
ధైర్యమునువీడిదీనత, త్వంబుఁగాంచ। నతులసాహసమడరంగ, నవనివిభుఁడు॥

సీ॥ కాలాంతకునిఁబోలి, ఘనగుండరాయండు, శాత్రవులందఱు, జడియునటుల
మార్గణంబులచేత, దుర్గర్వరిపులను, నిరుపమయుక్తిచే, నేర్పుమీఱ

ప్రసక్కంగసేయుచు, సుస్థిరబుద్ధితో, సైన్యంబులన్నింటిఁ, జక్కఁబఱచి
చటులపరాక్రమ, శస్త్రతేజంబుతో, నానరసాధిపు,నాహవమున

తే॥ నొవ్వఁజేయుచునయ్యెడఁ, జివ్వపెరుఁగ నందఱకునన్నిరూపులై యాగ్రహమున
నీక్షింపఁజూడరాకుండ, హెచ్చుబలిమిఁ గదిసిపోరాడుచుండెను,గ్రద్దఱిమను॥ 195

ఉ॥ ఆసమిదనారసాధిపతి యాగ్రహమందుచుఁ బల్కెఁ జేనితోఁ
శాయనిమూర్ఖనృపతీనీటు, బాణచయంబులఁ జొన్పుచున్ మహా
న్యాయవిహీనతన్ దురము, నాశమటంచునువిజ్ఞవీఁగుని
శాయమునయుద్ధవాటికను, గార్ముకవృష్టిఁ గూల్తుఁ జూడుమా॥ 196

మ॥ అనియిట్లుగ్రఘోరవాక్యములన, త్యంతోగ్రతన్ బల్కి తా
ననిలో రౌద్రము ఖప్రధానులదరన్, హాహార్భటిన్ బందలై
ఘనదుర్వర్యంబులుచిడిగొలుగుఘువన్, గాఢిన్యభావంబునన్
వనజాతాప్తునకున్ సుస్పృచుండెదురముల్, నైరుల్ వెసన్ దూలఁగాన్ 197

కోదండరామన్న వేఁకొకమొనను, పాస్గంటి శేషయ్యకొడుకులు రంగయ్య
వెంకట్రామయ్యలనుజంపుట.

మ॥ అచటన్ దేవరకోట భూవిభుఁడు బాహాటోపమొప్పారఁగాఁ
బ్రమరంబైన నిజాయుధంబులను వీరశ్రేష్ఠులౌ శత్రులన్
రచనావైఖరి నాజనుక్కడఁచుచున్. బ్రజ్ఞాఢ్యుఁడీతండనన్
నిచయంబుల్ నిచయంబులెంచఁగను వ,న్నెంగాంచి వర్తిల్లఁగాన్॥ 198

సీ॥ పాస్గంటిశేషయ్య, ప్రథమతనూజుండు రంగయాహ్వయుఁడను, రాజమౌళి
యతులశౌర్యోన్నతుం,డతిశక్తిమంతుండు,తద్రాజుఁదార్కొని ధైర్యమెసఁగఁ
గఠినాస్త్రములుచాలఁ గఠినతఁబఱపంగఁ, గోదండరామన్న, ఘోరగతిని
బాణపరంపరల్ బాగుగాఁజొన్పంగ, వెలమభూపాలుండు, వేగవాని

తే॥ సరకుసేయకరిపుని, పైసాహసమున
మార్గణచయంబునాటింప, మనుజనేత
యల్గికోలలువేయంగ, నవనివిభుఁడు
వానిమధ్యనెతునుమాడె, వ్యర్థముగను 199

తే॥ బాణమొక్కటినాటించి, ఫాలమందుఁ
గమ్మభూవరనిలువుము, కదలకుండ

నిపుణునిఁ ద్రుంతుశరముచేఁ, గృపదొలంగి
యనఁగఁ దద్విభుఁడయ్యెడ, నాగ్రహించి 200

క॥ సరసపుఁ ద్రోవన్ వీడితి
విరసపథంబందు దిగితి, వెఱ్ఱివి సుమియీ
యరిమండలికన్ మొనసీ
శిరమున్ ఖండింతు నెకని, శితశరధారన్ 201

మ॥ అనుచున్ దేవరకోటభూమిపతియ, త్యంతోగ్రభావంబుచే
ననువందన్ రిపుసంతతిం గదిసిపీ, రాలాపముల్ సేయుచున్
ఘనబాణంబులరువ్వుచున్ దివిజసం, ఘమ్ముల్ వెఱంగందవె
ల్మనృపాలున్ బడవైచె శౌర్యరమస, మ్యగ్దీప్తి పాటింపఁగన్ 202

వ॥ ఆవెలమదొర తీవ్రతరశరచయంబుల నాకమ్మభూపాలుని నొవ్వనేయ నప్పుడు॥

తే॥ కమ్మభూపాలుఁ డల్గి తాఁ, గ్రమ్మకొనుచు
వెలమనృపుమీఁద విశిఖముల్, వివిధగతులఁ
బఱపనా రాజు తద్బాణ, పాతములను
సరకుసేయక తునుమాడెఁ, జాపమపుడు 204

సీ॥ కోదండరామన్న, కోలాహలముతోడ, వేఱొండుచాపంబు, వేడ్కఁ బూని
కఠినాంబకంబుల, ఖండించె నాతని, ధనువును వైశంబ, ధరణిఁ బడఁగ
రిక్తహస్తముచేత, రేఁగి యార్చుచు భూరి, చంద్రహాసంబు హ, స్తమునఁ బూని
భూజనులందఱు, బ్బురముఁ గాంచఁగ నిన్ను, ఖండించి వైచెద, ఖడ్గమునను

తే॥ అనుచుఁ బటిమను దార్కొని, యధికరోష
మతిశయిల్లంగ బాణాల, నవనివిభుని
వక్షమందున నాటంగ, వసుధవిభుఁడు
పలికె నయ్యెడ రోషంబు, వాటిలంగ 205

వ॥ ఓమనుజాధమా నీజనకుండగు పాన్గంటి శేషయ్యవలన నీకదనంబు వాటిల్లె, నేఁడీయుద్ధవాటికను మద్బాణపరంపరలచే నిన్నుం దునుమాడి, వైరశుద్ధిం బూనర్చెదనన నారంగయాహ్వయుండిట్లనియె. రాజాధమా! నీవీయెడ జంకక నాయెదుట నిలిచితివేని మత్ఖడ్గంబుచే నినుఁదునుమాడి నీబంధురాజగు నరసభూపాలుండు మజ్జనకుని సభాస్థానంబున జరిగించిన యవమానంబువలనఁ గలిగిన పరితాపంబును బోకార్చెద,నన నప్పుడాకమ్మభూపాలుండు, తోఁకద్రొక్కిన

పాముచందంబునఁ గోపోద్దీపితమానసుండై యిట్లనియె. ఓయీ ప్రల్లదంబు
మాటలచేనేమిఫలంబు, నేఁడీకదనంబున మద్బాణపరంపరలచే నిన్ను సమవర్తి
పదంబునకు నతిథిగాఁబంపెదనని శాతశరప్రయోగంబుల శరీరంబురక్తసిక్తం
బుగావింప, నాతఁడదిసరకుసేయకగజపోతంబు పైదుముకుకంఠీరంబుకైవడిఁ
దార్కొని, వెలితివడక ప్రళయోగ్రుని విధంబున, మహాయుద్ధంబుసల్పుచు,
నొక్కబాణంబుచేనారంగయాహ్వయుని శిరంబుఁదునుమాడె నయ్యెడ 206

సీ॥ భువినీఁదఁబోరలెడి, పురుషసింహునిఁగాంచి, వేంకటరామభూ, విభుఁడువేగఁ
బరితాపమునుజెంది, పాటించిసహజుని, మరణంబుఁగాంచియ,మ్మనుజవిభుఁడు
భూపతినెదిరించి, భూనభోంతరములు నద్రువంగనార్చుచు, నతిశయిల్లి
పటుకోపదృష్టిచే, బాణావళివహించి, భూపాలుపైనేయ, భళాతలేశు

తే॥ డాగ్రహంబందినిజదర్ప, మావహిల్లఁ
జొరుఘోక్తులువల్కుచుఁ, బ్రౌఢగతిని
బాణవృష్టినిగురిపింపఁ, బ్రజ్ఞమెఱయ
వెలమఱేఁడునునల్గితావీఁకఁదాఁకి 207

మ॥ అపుడావేంకటరామయాహ్వయుఁడుప్ర, త్యాలీఢపాదస్థుఁడై
విపరీతంబుగఁగమ్మభూవిభునిపై, వేసెన్ వడిన్ బాణముల్
నృపుఁడస్ఖలితదగ్రజుంగుఱిఁచిబిట్టేసెన్ శరంబుల్ మహా
నిపుణత్వంబునఁగేలనందుకొనిబల్, నేర్పొప్పనిర్భీతిగాన్ 208

వ॥ అపుడావెలమదొరయిట్లనియె 209

శా॥ భూపాలాగ్రజనాదుసోదరునిసం, భూతాతికోపంబునన్
మీపోరంబాలియించినట్టిపగబ, ల్మిందీర్తునిక్కంబుగా
నాపుణ్యంబుననీనమీాకమిపుడ, న్నావన్నెగాసంధిలెన్
నీపెంపున్ దొలఁగింపఁజేసెదనుసే, నేపూనియుద్ధంబునన్ 210

వ॥ అనియివ్విధంబునఁబరుష వాక్కులు పరస్పరంబు గాఁబలికికొనుచుఁ గోలలతి
వేగంబునవేయందొడంగి రయ్యెడఁగుక్కుటంబుల రీతిరోజుచుఁ, బోరునెడ,ఁ
జూపరులగుండెలవియవెలమభూధారుండు కర్ణాంతంబుగా నొక్కశరంబుఁదీసి
వేయ, నప్పుడక్కమ్మదొర, యలసతంగాంచి కొలఁదికాలంబునకు, జాగరూ
కుండై, యొక్కకఠోరనారసంబుచేనెదిరిశిరముందెగవ్రేయనప్పుడు॥ 211
నీలాద్రిరావునరసభూపాలుని స్యందనాశ్వంబులఁ ద్రుంచివిరథుఁ జేయుట

ఉ॥ ఆయెడ నారసాధిపతి, యాగ్రహమందుచు వెల్మరాజుపైఁ
బాయనిదీర్ఘకోపమున, బాణము లేయుచు స్రుక్కఁజేయఁగాఁ
గాయముడస్సి ధీరతను, గార్ముకముం గొని కమ్మరాజుపై
నేయఁగ శాత్రశక్తిమెయి, హెచ్చితనంతటఁ దాక భూవరుల్ 212

వ॥ అంతట నాకమ్మభూవిభుండు వెలమరాజు పైఁబ్రయోగించు బాణంబుల కగ్గలం బందిమఱియును 213

సీ॥ బాణత్రయంబును, బాటించి భూవిభు, చాపంబుఁ దునుమాడి, జగతివిభుఁడు
నుత్తమాశ్వంబుల, నొకకోలఖండించి, సారథిబరిమార్చి, సాహసమున
వేయుబాణంబుల, వేగమెతాకంగ, విరథుఁడై క్షితిపతి, విభ్రమంబు
నొందంగ నయ్యెడ, నొప్పుగా సైన్యంబు, విర్విణ్ణమై పార, నేలజేని

తే॥ సహజుఁడౌ రామలింగన్న, సాహసమున
భటులకందఱికయ్యెడఁ, బటిమమెఱయ
శౌర్యమలవడఁ జేయుచు, ధైర్యమెసఁగ
రిపునిఁ దాఁ జూచి వేడ్కమై, రేఁగి యార్చి 214

24 రామలింగభూపాలుండు నీలాద్రిరావుతో యుద్ధము సేయుట

వ॥ అపుడా రామలింగాహ్వయుండతి కోపావేశంబున నీలాద్రిరావు నెదుర్కొని యనేక దుర్భరబాణంబులు ప్రయోగించిన లెక్కసేయక, వాసినినకుమందు నిమి, ఘోరతరశరంబులఁ గమ్మ భూవిభు నొప్పించుచు, ననేక భటశిరశ్ఛేదంబు సేయుచు నేరికిం దలయెత్తి చూడరాకుండ నుద్దండుండై నరసభూపాలుని సైన్యం బుచిందరవందర యగునటులు సేయు నవసరంబున 215

గీ॥ రామలింగభూపాలుండు, రౌద్రమెసఁగఁ
గదిసి నీలాద్రిరాజును, గఠినగతిని
గాండములచేతఁ బగులంగఁ, గంకటంబు
నేసి యార్చుచు నట్లనె, హెచ్చుశక్తి 216

మ॥ మును గర్వంబును జెందిరాజవరులున్, మోసమ్మునం జావరా
వినురాజోత్తమ; నేఁడు నీదుమదము, న్వేగూలఁగాఁ జేసెదన్
ఘనబాణంబులనుక్కడం చెదనుని, క్కంబోకు మాసిల్వుమా
యనుచుం గోలల నాటనేసె నృపుఁడ, త్యంతంబు ఘోరాకృతిన్ 217

చ॥ అనవుడు నాతఁడిట్లనియె, నావిభుతోడను మేలమాడుచున్
ఘనకులమందుఁ బుట్టికడుఁ, గార్ముకవిద్యల నభ్యసించినా

ననిమదిలోఁదలంపకుము, హంకృతిఁగోలలనీదుగర్వముఁ
గొనకొనియుద్ధవాంఛను, గూల్చెదఁజేల్చెదనిన్నుధరావరా 218

తే॥ కమ్మభూపాలుఁడామెడఁ, గఠినమైన
కార్ముకోద్భూతశరములఁగదిసి వెలమ
స్యందనాశ్వంబులను ద్రుంప, సంగరమున,
విరథుఁడై నిల్వఁగరుణించి, వేగఁబల్కె॥ 219

వ॥ నీవీయెడ రథవిహీనుండవై యుండు కతంబునఁ,గరుణించితి. నీవుమరల స్యందనారూఢుండవై, రాఁదగుననియె. ననంతరంబ. 220

రామలింగ భూపాలుఁడు నారయ్య నారసింహయ్యయను యోధులఁజంపుట.

తే॥ విరథుఁడై వెల్మభూపతి, వేగనప్పుడు। పోవనయ్యెడ నారయ్య, భువివణంకఁ
బాఁకె నాకమ్మవిభునిను, ద్దామగతిని। నారసింహునిఁదోడుగాఁ, జేరఁదీసి॥221

తే॥ రాజ, యీయెడ సంగరరంగమందుఁ। గోపముప్పొంగ బాణాలఁ, గురియఁజేసి
నిక్కుచుంటివి నీనిక్కుద్రుక్కఁజేసి। శూరుఁడీతండనెడిపెద్ద,పేరుగాంతు॥ 222

వ॥ అని యిబ్బంగిఁ బరుషవాక్కులువల్కుచు, వాఁడిగల నారాచంబుల నృపపుంగవుపైఁ, బ్రయోగించుచుండ, నవిలక్షింపక, రాజోత్తముండు ప్రళయాంతకునిభంగి, ఘోరయుద్ధంబుసల్పుచు, వెలమభటులు పఱపుబాణంబులఁ, దృణీకరించి, విషలిప్త ముఖశిలీముఖంబుల, వారిరువురిశిరంబులు డొల్లనేయనప్పుడు. 223

"ఉభయసేనానాయకుల ద్వంద్వయుద్ధము"

సీ॥ ప్రళయార్కసన్నిభుల్, పటుదర్పసాహసు, లతిధైర్యవంతులు, వితతయశులు
వీరనయక్కన, నారసాహ్వయుఁడును, మూలమనీఁడును, ముఖ్యతముఁడు
సంజీవరాయండు సరససింగమనీఁడు శివనామధేయుండు, స్థిరబలుండు
పద్మనాభుఁడు భరారి,పౌరుషవర్యుండు, కృష్ణసింగును రమ్య,కీర్తిశాలి
తే॥ యాదిగాఁగలయోధులు హర్షమెసఁగ। దీక్ష్ణతరనైక శరసమా,దృతకరాబ్జు
లగుచు శూరవరోత్తుంగ, సుగుణనినద।జననకారణులైనిల్చి,రనియొనర్ప॥224

వ॥ అప్పుడు వెలమదొరవైపు వారలవివరించెద॥ 225

సీ॥ వెలమభూపాలుని, వీరసాహసవరుల్, తిరుపతిరాయండు, ధీరవరుఁడు
వేంకటనరసయ్య, వీరాగ్రగణ్యుండు, గోవిందరావున, ఘోరబలుఁడు

శ్రీ కృష్ణరాయండు, చినరామరాయండు, మాధవరావను మనుజవిభుండు మోతిసింగనునట్టి, మూర్ఖతాకరుండును బాబహులంబునం బటిమమెఱయం

తే॥ ప్రథితరాజేంద్రయోధవి, క్రాంతికాంతి। సంతతిద్యోతకాంబక,చయవిజయద
రిపుహృదంభోజభేదక, కృపణబాణ। పాణులై నిల్చిరయ్యని,రాణవెలుంగ॥226

తే॥ ఇరుంగెలంకుల వారలు, నేపుమీఱ। బెబ్బులులరీతిం దార్కొ-ని, భీకరముగ
నెల్లవారల కాశ్చర్య,మినుమడింపం। బోరసాంగిరి భువియెల్లఘోరుమనంగ॥ 227

తే॥ శౌరవీరలువారలు, నతిశయించి। పోరనాఘోరబాణ ప్ర,భూతవృష్టి
చేత నాయోధనావని, చెలంగెనపుడు। జడిదడాబిడీంబడు దివసంబురీతి॥ 228

వ॥ ఇట్లప్పుడు నారసింహుండు, తిరుపతిరాయండు, రమణప్ప, నారాయణరావు లింగయాహ్వాయుండు, వేంకటనరసయ్య, సంజీవరాయండు, సీతారామయ్య, వీరపనీండు, నరసింహరావు, మూలపునీండు, చినరామారావు, తిమ్మనీండు, వెంకటకృష్ణయ్య, జంగుబహదరు, సయ్యదుఖాను, ఖాసింఖాను, లాలుఖాను, రాజాసింగు, జఫర్ సింగు, కృష్ణసింగు, రాజారాం, మొదలగు యోధులు దుర్భరపరాక్రమాతిశయంబున, ద్వంద్వయుద్ధంబు సల్పుచుం గుఠారంబులం బొదువుచుం, బరశువుల నరుకుచుం గుంతంబులమొత్తుచుం, జంద్రహాసంబుల శిరఃఖండనంబొనర్చుచు, నతిభయంకరముగ యుద్ధంబు, బహువిధకృత్యంబుల నాచరింపుచున్న సమయంబున॥ 229

శా॥ ఆదిత్యుండపరాద్రి కేగ, దినకాం,తాస్యాబ్జమత్యంతశో
కాదభ్రంబయితూం గసంజకళసాయందీప్తిచేరాంగని
ద్యాదత్తుల్ మఱివారిశిష్యులును సంధ్యాగొల్వనే తేరంగాం
గాదిష్టాజికి ముఖ్యకాలమనియి,క్కల్ సేరి రాభూపతుల్॥ 230

గీ॥ ఇట్టులవ్వారలిక్కల, కేగిపిదప। రేయింగడపియనంతర,రీతిందలంచి
తగినవిధులనుగావించి, తరలిరపుడు। మరుసటిదినంబునను యుద్ధ,సరణినెఱప॥

మూండవనాంటియుద్ధము.

తిరుపతిరాయండు చంద్రమౌళి నవమానించుట.

తే॥ చంద్రమౌళ్యాహ్వాయుండను, జగతివిభుండు
కదిసి తిరుపతిరాయునిం గదనమందు
సునిశితాస్త్రంబులనుగొట్టి, సోలునట్లుం
జేయ నావెల్మకోపించి, చేవమెఱయ॥ 232

తే॥ సరకుసేయక తద్బాణ,సంఘములను
మధ్యమునుమాడి విశిఖముల్, మనుజవిభుని
నాటఁసేయంగఁ దూలితా నీటుఁవెలయ
నిండుక్రోధాగ్ని చేతను, నివ్వటిల్లె॥ 233

తే॥ కమ్మభూపాలుఁ డాయెడఁ, గాండములను
గంకటంబును బగులంగ, ఘనతసేయ
వెలమదొరయల్గి పటుబాణ, వృష్టినింప
సహహా యాకమ్మదొర కాగ్ర,హమ్ముగ్రమ్మి॥ 234

ఉ॥ ఆయెడఁ గమ్మభూమిపతి, యాగ్రహమందుచు నారసంబులన్
బాయని దీర్ఘకోపమును, బాటిలవక్షము నాటసేయఁగాఁ
గాయమునందు రక్తమతి, కాంతిఁజెలంగ స్రవింపఁ దద్విభుం
డాయరుణప్రభన్ సుమన,మంచితకింశుకకాంతిఁ గైకొనెన్॥ 235

తే॥ ఇట్టులాకమ్మభూపాలుఁ, డెంతొ డస్సి
యును మహోద్ధతి వెలమపై, నురుశరములఁ
జొనిపె వెల్మవిభుండును, స్రుక్కమఱియు
వీనిపైఁ గమ్మదొరపట్టె,విసరె శరము॥ 236

వ॥ అప్పుడా వెలమభూదారుండు జాగరూకుండై దర్పాతిశయంబున నాకమ్మదొరతో నిట్లనియె. కదలక నీవిట్లు నిలిచితివేని నిమేషంబున నిన్నుఁద్రుంచి వైతునని యాకమ్మతేని చాపంబుఁద్రుంచి విజృంభించి సైంధవంబుల, విశిఖవేదనలపాలుచేసి ధిక్కృతిని మార్గాంతరంబునకుఁ బోవనప్పుడు॥ 237

తే॥ వెలమ భూపాలుఁడాయెడ, వివిధగతులఁ
గమ్మయోధులనందఱుఁ, గాండములను
దారుమారుగఁ జెండాడఁదగిన గతిని
గలకలంబందుచుండిరి, కమ్మదొరలు॥ 238

వ॥ ఇట్లుండుసమయంబున మల్లినీఁడు వెలమల ధిక్కారంబును దమవారి దైన్యంబునుజూచి, రోషావేశంబుఁ గదురనప్పుడు॥ 239

మల్లినీఁడు తిరుపతిరాయనిం దార్కొనిచంపుట.

సీ॥ మల్లినీఁడనుమహా, మానవనాథుండు, చిననారసింహుండు, శీఘ్రగతిని
దిరుపతిరాయని, ధిక్కరించుచువేగఁ, దార్కొనిపల్కిరి, తడయకపుడు

రాజాధమానీవు, రవ్వసేయకమాఁదు, యోధులనందఱ, నుక్కుమిగిలి
తునుమాడుచుంటివి, ధూర్తప్రవృత్తిచే, గోష్ఠేయకంబుల, కలిమినిన్ను
తే॥ శమనపురికంపెదముసుమీ, శౌర్యమెసఁగ
ననుచుఁదార్కొనిపోరాడి, రలఘుగతిని
వెలమదొరయును గమ్మభూ, విభులుమించి
పౌరుషోక్తులు పలుకుచుఁ, పటిమమెఱయ॥ 240

చ॥ వెలమయుఁ గమ్మభూవిభుఁడు, విశ్వముమెచ్చ ననేకభంగులన్
గలసిభుజాబలంబున న,ఖండపుటాజియొనర్పనందులో
బలనుతివెల్మభూవిభుఁడు, పట్టెననంతపదంబునంతలో
వెలమనృపాలుబంధుగు వివేకమెలర్ప శరించెఁ గమ్మతోన్॥ 241

పాన్గంటి శేషయ్య,మల్లినీఁడు,వీరన్న,కొండమనీఁడు అనువారిందునుమట

సీ॥ పాన్గంటి శేషభూ, పాలుండు శూరుండు, కోపించి ధీరత ఘోరగతిని
మల్లినీఁడనునుహా, మనుజవరేణ్యుని, నెదిరించెనయ్యెడ, హెచ్చుబలిమిఁ
బోరాడఁదొడఁగిరి, భూరినాగమ్మలఁ గదనస్థలముఖ్య, ప్రదముగాఁగ
నరసభూపాలివల్ల, నెఱినాతఁడందిన, యవమానముఁదలంచి, యాగ్రహించి
తే॥ కదిసిపెనఁగొనిరిరువురు, ఖడ్గతతుల
మొత్తుకొంచును జయబుద్ధిమూలమునను
శిరముఖండించివైచెఁ దు, త్తురుముగాఁగ
మల్లినీఁడునునయ్యెడ, మనసుదీఱ॥ 242

ఉ॥ ఆయెడఁబద్మనాభుఁడతు, లాగ్రహమందుచు వెల్మసేనిపై
సాయకవృష్టిపెల్లవియ, సంగరమందునభంగురోద్ధతిన్
బాయనికిన్కచేబళియ, నంగురిపింపఁగ నాతఁడయ్యెడన్
గాయమునొవ్వ నేసెశర, కాండముచేతనఖండశూరతన్॥ 243

వ॥ బాణత్రయంబున వెలమసేనికవచంబుప్రిదులనేయ నాభరాపాలుండు వెనుదీయ
కతనశక్తింజూపి పద్మనాభుఁబద్మనాభుసేవకంపనయ్యెడఁ గొండమనీఁడుజరిగిన
స్థితికివగచి వెలమందార్కొనియాగ్రహోదగ్రుండై దురంబుసేయసమకట్టునెడ
నమయవైలక్షణ్యంబున, వెలమభూపాలుఫాలంబురక్తాలంబంబుకాఁగ, వె
లమయుఁగమ్మదొరనెమ్మదిచెదుర నమ్ములఁగ్రుమ్ముచు నేరికేరునుండగ్గకతుద
కుఁ గొండమనీనిదండధర్మపోలికింబనుపనప్పుడు చంద్రవరాల్యాహ్వయుండు
కాంచి, క్రోధంబతి,శయిల్లనప్పుడు॥ 244

• చంద్రమౌళ్యాహ్వయుఁడు పాగ్గంటి శేషయ్యం దునుమాడుట •

తే॥ చంద్రమౌళ్యాఖ్యవర్ధిల్లు, జగతివిభుఁడు। శేషయాహ్వయు నెదిరించి, శీఘ్రగతిని
నంబకంబుల నాటింప, నాతఁడల్గి। పల్కెఁ దద్విభుతో మత్తఁ బ్రజ్ఞ మెఱయ॥ 245

ఉ॥ భూవరనీవు నామొదటఁ, బోరుననిల్వఁగజాలలేవటం
చావసుధాధిపుల్ వినఁగ, నాడితినీవటుపోయిశీఘ్రమే
భావభయస్థితింగనక, బాహుబలాఢ్యునినారసాధిపుర్
నీవటివేగఁబంపఁగను, నేర్పుగనాతనితోడఁబోరియుం॥ 246

క॥ తేఁకువతోడనభాస్థలి। నాకవమానంబుసలిపె, నరసాధిపుఁడుం
నాకస్థులెల్లమెచ్చఁగ। నాకాండముచేతఁద్రుంప, నాతచ్చిరముం॥ 247

మ॥ అనియుబ్బంగిఁగఠోరవాక్యములచే, నాశేషభద్రాహ్వయుం
ఘనరోషంబునశాస్త్రవాస్యములకుం, నల్లందనంబొప్పఁగా
ననసీత ...లొశెల్లవారతో, నయ్యారెయొయ్యారపుం
గనుతీపల్కు లుపేనివల్లఁగలదా, కాసంతమేలారయం॥ 248

తే॥ నేఁకునాతోడయుద్ధంబునేర్పుమీఱ। జయముసంధిల్లఁజేయుమీ, శక్తిమించు
బూడుభూపాలుఁడయ్యెడ, మెచ్చఁగాని। పొల్లుమాటలఫలమేమిభూపవర్య 249

ఉ॥ అంతటశేషయాహ్వయుఁడ, నంతశరావళినేర్పుమీఱఁగాఁ
బంతపుమాటలాడుచున్న, పాలునిపైఁగదలించివేయఁగాఁ
గంతువిరోధిభక్తుఁడగు, గౌరవపాత్రుఁడుచంద్రమౌళితా
నంతటశత్రుకాండనిచ, యంబులయుక్తినిద్రుంచివైచుచుం 250

చ॥ కుటిలుఁడనీముగుండొలతి, ఘోరతరంబుగఁబ్రక్కలించినం
గటపముభూతపంక్తికిన, ఖండముగాబలులిత్తునంచువే
చటులపరాక్రమంబుననిని, శాతశరంబులనేసిచాపముం
దటుకునఁద్రుంచివైవఁగనుఁ, దత్తరపాటునఁగంపమొందుచుం 251

చ॥ వెలమనృపాలశేఖరుఁడు, వెంటనెవేఱొకచాపమందితా
బలవదరిప్రకాండముల, బాదఁగవెంటనెవైరిముఖ్యుఁడుం
బలమునుధైర్యముంవిపుల, బాహుపరాక్రముంవహించిది
క్తలబలవచ్ఛటల్ కదన, ధర్మవిదుండనితన్నుమెచ్చఁగం 252

సీ॥ కఠినాస్త్రములనేసి, కంకటమ్మునుజించి, విశిఖత్రయమ్మునువీఁకనేయ
... శీఘ్రమ్ముయవిఁతుంచి, బాణత్రయమ్మును, బఱపిసరగ

వర్మంబుఁదునుమాడి, వసుధాధిపుఁడు వేగ, నుర్వంగఁ జేసియెన్నో విధాల
సారథి స్రుక్కించి, సాహసోదారుఁడై యిరువంక యోధుల, సరకుఁగొనక

తే॥ నందఱికినన్ని రూపులై, యతిశయిల్లి
వికలమానట్లు సైన్యమ్ము, వెంటఁదాఁకి
కాండవృష్టిని గురిపింపఁ, గఠినగతిని
యోధులందఱు భీతిల్లి బాధపడిరి॥ 253

కం॥ వెలవెలవాఱు మొగంబులఁ। గలఁతం జెందియును మనను కక్కుఱితివడన్
లలిఁగమ్మవారు నిల్వఁగ। సలలితముగఁ జంద్రమౌళి, సరగంబలికెన్॥ 254

తే॥ భయపడంగఁగతంబేమి, పరువు చెడఁగ। నవ్వరాఱోడి వారలే, యివ్వసుధను
జాలుఁజాలును మీశౌర్య, సత్త్వసరణి। నేఁడెయీతని ద్రుంచిమీ, గోడుదీర్తు॥

మ॥ అనుచుం గమ్మనృపాలశేఖరుఁడు శా,హాటోపమే పారఁగాఁ
ననిలోఁ బల్కుచు వెల్మభూవిభుని తా,నల్లంత బాణంబులన్
దనువుం దాటఁగ నాటుచున్ విజయసం,దర్భంబుఁ జాటించుచున్
ఘనతన్ శత్రులగర్వమూడ్చుచును శంకన్ వీడి పోరాడఁగన్॥ 256

వ॥ అప్పుడాశేషయాహ్వయుండా కమ్మదొరబలంబున కచ్చెరువందుచు, భీతిల్లక, పృథుల బలఖ్యాతంబులగు నిశాతబాణపాతంబులఁ, దద్భూపాలుని నొవ్వ నేయ నాతండు మహాక్రుద్ధుండై యుగ్రబాణంబుల మరలఁబఱప నవిత్రద్రిపుశిరంబుఁ డొల్లనేయ నప్పుడు 257

చంద్రమౌళినృపాలుండు నమీర్ఖాను సయ్యదుఖాన్ అనువారలఁదునుమాడుట.

తే॥ వెన్నుఁదగిలియు యోధులు, వివిధగతులఁ
జంద్రమౌళ్యాహ్వయునితోడ, జగతివణఁక
మీఱుఖానుండు మొదలగు, వారుగదిసి
కాండముల్ వేయఁదొడఁగిరి, కఠినగతిని॥ 258

సీ॥ కమ్మభూపాలుండు, కఠినాంబకంబుల, మీఱుఖానుఁడు బాధ, మించిచెంద
నాగ్రహంబందుచు, నతిఘోరబాణముల్, సయ్యదుఖానుపై, సాహసమునఁ
జొనుపంగనవియెల్లఁ, దునుమాడి మ్లేచ్ఛులు, పటిమచేఁగోలలఁ, బఱపివేగ
భూవిభు నొప్పింప, భూనభోంతరములు, నద్రువంగ నార్చుచు, నతిశయిల్లి

తే॥ నేత్రముల నెఱ్ఱసేయుచు, నెనరులేక
యేమిభయపడక యెమీఱ, లిందునాడు

సన్నిధినినిల్వఁజూపెద, శక్తియెల్ల
శౌర్యరమయుఁ గీర్తిఁగాంచినసరణిదోఁప 259

క॥ ఆయెడభూవరుఁడనవిని। సాయనిరోషమునమ్లేచ్ఛ, భటులాయుద్ధ
శ్రీయెల్లఁదామిగోరుచు। సాయకములఁగేలఁగొంచు, సాఁగిరిపోరన్ 260

తే॥ పగుదెంచుచునయ్యెడ, బాగుగాను
సాహసాతిశయుంబుల, జాడమెఱయఁ
బలికిరారాజచంద్రుఁతోఁ, బటిమమెఱయ
నిలుపుమాప్రతుంతుమంచుఁబూన్కిమెయినంత 261

మ॥ అనుచున్వారలుతోడుగావిభునక, త్యంతంబుకౌతూహలం
బనువందన్ గదసేచ్ఛచేరిపులతోనల్లంతఁబోరాడన
య్యానఘుల్ మించిరియుద్ధవాటినగనూ, నానందచిత్తాళితో
ననుమానంబినుమాతయుంగనకయ, త్యంతోగ్రశౌర్యంబునన్ 262

సీ॥ అపుడునయ్యామఖానుఁ, డత్యుగ్రరోషంబు, గదురంగసేయనా, కమ్మవిభుని
నవిలెక్కసేయక, యవనీశుఁడయ్యెడ, నయ్యదుఖానుపై, సాహసమున
బాణపంచకమును, బాటించిచొనుపంగ, మీరుఖానుఁడునొవ్వ, మించినాల్గు
విశిఖంబులేయుచు, వీరాగ్రగణ్యుండు, బలిమిన్మైనిరువురఁ, బ్రథనమందు

తే॥ నస్త్రములుపంగసీయక, యధిగమించి
పొదువుచుండంగవారలు, భువివణంక
నెంతొయార్చుచు భూవిభుం, డేపుదప్పఁ
బఱపిరయ్యెడఁగోలలఁ, బటిమమెఱయ॥ 263

వ॥ అప్పుడా మీరుఖానుండు, కమ్మదొరదగ్గఱనుండు, వజీరుఖానుని సాయకం
బుల గతప్రాయుంజేయనయ్యెడ మ్లేచ్ఛుఁడు, కోపోద్రేకయుక్తుండై, కఱకు
బాణంబుల నాతసివర్మంబుఁ బగులంగొట్టి, చాపంబుఖండించి, పైకురికి, వజీ
రుఖానునతిదర్పంబున వాడిగలకోలలేసి, తచ్ఛిరంబు ధారుణీపతితంబొనర్ప
నప్పుడాతనిసోదరుండు లాలుఖానుండతికోపంబునందనయన్నఁజంపిన మగంటి
మిఁ బయికురికి, మాయన్నందునుమాడ్చిన మానవాధమా! నేఁడు మద్బాణ
పరంపరల నీశిరంబు ఖండించెదనని యమ్ములంబఱప, వానిని లెక్కింపక
ఝాంకరించి, యాలాలుఖానునిసేయఁ దత్కాండాహతులఁ జీకాకుపడి సే
దందేఱి యాకర్ణాంతంబు మార్గణంబులాగివేయ వజీరుఖానుండు, పరలోక
గతుండయ్యె॥ 264

తే॥ కమ్మభూపాలుఁడయ్యెడఁ, గఠినవిశిఖ
వృష్టిఁగురిపించిరిపులను, వీఁకఁదాఁకి
ఘోరసాహసములవడఁ, గుటిలగతిని
భయముఁజెందఁగ రిపుముఖ్యుఁ, బట్టికొట్టె॥ 265

తే॥ యోధులెల్లరుచూచుచు, నుండనప్డు
చంద్రమౌళిమహారాజు, సాంద్రకోప
దీపితుండయిశాత్రవ, దిగ్గజముల
సింహబలుఁడయి ఖండింపఁజేసెనాహా॥ 266

వ॥ అంతట నామ్లేచ్ఛుం డత్యుగ్రకోపంబుఁజెంది॥ 267

తే॥ అపుడు సయ్యదుఖానుఁడు, త్యాగ్రహమున
నుగ్రుఁడై కమ్మవిభుశౌర్య, ముడుగఁజేయ
నాతఁడీతని లావెల్ల, నడఁగఁజేయ
మగలనాతండు జేనిసా,మ్మసిలఁజేసె॥ 268

వ॥ ఇట్లు రాజువివశుండై ఖేదంబందుచున్న సమయంబున॥ 269

తే॥ ఆస్థితింజూచి రామలింగాహ్వయుండు। చంద్రమౌళి మహారాజు, సంతసింపఁ
గొన్ని సదుపాయములఁజెప్పి,కుతుక మొదవ। శత్రుపైకంపనాతండు,జంకకేగె॥

చ॥ పటపటఁబండ్లు గీటుచును, బాటిలమ్లేచ్ఛులు నారసంబులన్
నిటలము నాఁటనేయనవి, నేర్పునఁద్రుంచుచు రాజువేగమే
చటులపరాక్రమక్రమ ప్రశస్తిని గోలలఁజించివర్మముల్
కుటిలుల యుత్తమాంగములు, కూలఁగనేసెనునారసంబులన్ 271

రాజు బహదరుఖాన్, ఖాన్బహదరు, మొదలగు యోధులఁదునుమాడుట.

క॥ అంతట వేఱొకమొనలో। వింతగ నావెల్మవిభుఁడు, వేడుకచేన
య్యంతకులనఁగను ధీరతఁ। బంతంబులమెలఁగుచున్న,బహుసైనికులన్॥ 272

సీ॥ ప్రళయాంతకునిభంగిఁ, బటిమచే నాసూర, భూపాలుఁడయ్యెడ,భూరిబలుల
బహదరుఖానుని, బాహుబలాఢ్యుని, ఖాసీముఖానను, ఖడ్గహస్తు
రామన్నయనువాని, భీమసత్త్వాఢ్యుని, నాయఁడమ్మసమాఖ్యు,శ్రీయుతాత్మ
వేంకటరామన్న, వీరవరేణ్యుని రఘునాయకుండను, రమ్యకీర్తి

తే॥ గణనకెక్కిన యోధులఁగదిసినృపుఁడు।గ్రీష్మకాలానఁగార్చిచ్చు, కెరలియడవి
భస్మసాత్కృతమొనరించు, పగిది,వారి నుగ్గునూఁచమ్ముగాఁగొట్టె,నోళ్లనణఁచి

తే॥ నరసభూపతియోధులబ్బురముగదుర। సూరభూవిభుఁదార్కొని, పోరిలోన
దుర్భరోన్నతపటిమచే, నిర్భయముగఁ। బోరఁదొడఁగిరివారల,యాగ్ర్యరెయనఁగ
తే॥ అందఱుకునన్నిరూపులై,యతిశయిల్లి। తేటిచూడంగరానికతీవ్రవిశిఖ
వృష్టిగురిపించినొప్పింప,వీకఁదాఁకి। వెల్మరాజునుబాదిపెర,. వీరభటులు॥ 275
తే॥ కమ్మవిభులప్పుడత్యుగ్ర,గరిమమెఱయ। వారిజేనికిసాయంబుఁ,జేరఁజేసి
వెల్మవిభుకాయమనపాయ,విధితొంగ।వివిధవిధులను జేసిరి,బవరమపుడు 276
వ॥ ఇత్తెఱంగుననానరసభూపతియోధులు వెల్మజేనిందార్కొని బాధింపనాతండు రౌద్రమూర్తియైశాస్త్రవప్రయుక్తబాణంబులఁ దప్పించుకొనుచు బాణత్రయంబుచే బహాదరుఖానుని, మార్గణద్వయంబుచేరామన్నను, శరసప్తకంబుచే, నాయఁడమ్మను నొక్కనారాచంబున నారాయణసింగును, మఱికొన్నింటిచేఁదక్కొరులను, గళవళపడనేయుచు, మహాభయప్రదంబుగఁబోరు సల్పునవసరంబున నరసభూపాలునిసైన్యంబుదైన్యంబునొంది,నేఁటికదనంబున మనమీరాజుచే మృతింగనుటనిశ్చయంబని నిర్విణ్ణులెయుండుసమయంబున॥

రామలింగభూపాలుఁడుసూరభూదారునెదిరించినొప్పించుట.

తే॥ నరసభూపాలుతమ్ముండుసరగరామ।లింగనాముండుతమసేన,కుంగలట్టి
దైన్యముంగాంచివేవేగ, దర్పమడర।సాయకములఁబ్రయోగించె, శత్రులడల
తే॥ శూరులయినట్టివారలు, సొంపుమీఱఁ। దమసమానులతోఁబోరఁ,దనరుగరిమ
యసమకరూప్రవేశంబె,యశముసీదు।సాధనవిహీనుతోఁబోర,నరసమగునె॥279
ఉ॥ శూరుఁడవేనినామొదుట,సుస్థిరశీలవిశాలదీక్షతోఁ
బోరినినిల్చియుద్ధమును, భూరిబలోద్ధతినాచరింపుమా
శూరనృపాలయంచు గడు,సుందనమొప్పఁగఁదార్కొనెఁ వెసన్
ఘోరతరేభసంఘమును, గుంజరవైరిగ్రహించుచాడ్పునన్॥ 280
చ॥ సునిశితమార్గణంబులను, సూరనృపాలునినాఁటనేయఁగా
ఘనమతినాతఁడుగ్రతరకాండముతేయఁగవానిఁద్రుంచుచున్
మనుజవరేణ్యుఁడయ్యెడలమాఱటతీవ్రశరాళిఁబెల్చనన్
బనుపఁగవెల్మభూవిభుని, ఫాలముప్రీలఁగఁజేసెనవ్వియున్ 281
వ॥ అప్పుడయ్యిరువైపులవారును, దరుగనిక్రోధంబున దురంబుసల్పుచుఁ బరస్పరసాధనభంజనాదు లొనర్చుకొనుచు వర్తిల్లుసమయంబున॥ 282
సీ॥ బాణత్రయంబునఁ, బాటించివెలమను, గమ్మభూపాలుండు, ఘనతనేయ
వెలమభూపతిచాల, వీరాగ్రహంబున, మార్గణంబులచేత మనుజవిభుని

చాపంబుఁదునుమాడ, సరగనాతండును, వేఱొండుచాపంబు, వీఁకనంది
కఠినబాణంబుల, ఘనతమీఱఁగవెల్మ తేనిగుఱ్ఱంబులఁ, బూనిచంప

తే॥ నప్పుడావెల్మభూపతి, యవనివిభుని
యోధముఖ్యునిఁద్రుంచియా, యోధనమునఁ
గాల్బలంబులఁజెండాడఁ, గావిభుండు
త్రోఁచియుండోఁచకున్నట్టి, త్రోవఁబట్టె॥ 283

కం॥ ఇటులుండియునారాజులు । చటులునఁబనిముట్లువేఱ, సరగంగొనుచున్
స్ఫుటబాహుబలములలరన్ । నటియించిరితొంటిశూర, నాయకులక్రియన్॥ 284

వ॥ అప్పుడాభూవరులుసేయు ఘోరయుద్ధంబు నయ్యిరుమొనలవారుచూచి, త
మతమ మనంబుల జయసిద్ధి నిశ్చయంబని యెంచుచుండిరయ్యెడ॥ 285

గీ॥ కమ్మదొరలును వెలమభూ, కాంతులపుడు। దురమునసల్పిరిజగతిశం, దరగనంగ
నెల్లజేఁడులు వెలుఁగుచేఁ, దల్లడిల్ల। వెనుకటిసురాసురులపోరు, విధముదెలియ॥

చ॥ జలధులురెండుసేకమగు, చాడ్పునఁగొండలురెండుసేకమై
చెలఁగెడిరీతివారుకడుఁ, జేవదలిర్పఁగనొక్కచోటనే
మెలఁగుచునొండొరుల్పెనఁగి, మించుజయమ్మునుగాంచఁగోరిచు
క్కలతెరువంటుఘోషపెరుఁ, గన్గుఱిఁజేసిరివైరశుద్ధికిన్ 287

తే॥ రామలింగనవిభుఁడును, రౌద్రమెసఁగ
సూరయాహ్వయుపైఁజొన్పె, సుస్థిరముగఁ
బటుతరశరంబులనుశూర, భావమునను
నొచ్చియాతండుకోపించె హెచ్చుగాను 288

మ॥ పటుశక్తిన్సిటలంబునాఁటనృపునిన్, శాటించిభూపాలుడున్
జటులంబౌవిశిఖంబులేయనతఁడున్, జండాంశునింబోలియా
కుటిలున్మర్మముభేదిలంగనపుడా, క్రోశించియత్యుద్ధతిన్
భటులున్భీతిలబాణకాండములచేఁ, బర్వొప్పవేయన్వెసన్ 289

తే॥ సరకుసేయకయావెల్మ, సాహసమున
నుగ్రకోపంబుపెనఁగొన, నుగ్రురీతి
సునిశితాంబకములసేయ, శూరుఁడపుడు
మర్త్యుఁడునుమూడెనాకమ్మమహివిభుండు 290

వ॥ అప్పుడా కమ్మదొర యావెల్మభూపాలునిఁ గఠినశరంబులచే నొవ్వనేయ, నా
తండతిక్రుద్ధుండై దండతాడితభుజంగంబుపగిది, మెఱయుచు నప్పుడు॥ 291

చ॥ అతికఠినాంబకంబులన, హుంకృతి బిట్టువహించి శత్రు రా
ట్తతి భయమంద, వెల్మదొర, ధర్మమధర్మమునాత్మ నెంచుచున్
గుతుకముతోడఁ గమ్మదొరకూల్పఁప్రయత్నము చేసె వస్తువా
హతతబలంబు నార్పెసక, లావనిపాలురుమేలు మేలనన్॥ 292

ఉ॥ ఆయెడ వెల్మభూవిభుఁడు, దంచితఘోరశరావళీగతిన్
గాయమునొవ్వఁ గమ్మదొరగాఢతరంబుగఁ జొన్పె నప్పుడే
పాయసి దీర్ఘకోపమున, బాహుబలోన్నతితోడ భూపతిన్
సాయకవృష్టిచే ధృతియు, సాహసమూడఁగ నేసి యార్చుచున్॥ 293

ఉ॥ ఆలములోని సైన్యము స,మంచితధైర్యమువీడు నట్లుగాఁ
గోలలుచొన్పి, తారిపుని, ఘోరతరంబుగ నొవ్వనేయుచున్
ఫాలమునాటనొక్కపటు, బాణము నేయఁగ, భూతలమ్ముపై
వ్రాలుచు మూర్ఛనొందె బహు,వాంఛలు వడ్డిక౯ బాఱుచుండినన్॥ 294

మ॥ అపుడా యుద్ధమహీతలంబరరె క్రో,ధావేశ రాజోత్తమ
స్వపరవ్యాపకవాంఛితౌఘవిజయ, స్వాతంత్ర్య సంకల్ప ని
స్త్రప్రవృత్తాంత శరానుఘాతభయద, ద్రాఘిష్ఠ యోధార్భటీ
విపులంబై విలసిల్లె నచ్చటిమహా,వీరుల్ ప్రశంసింపఁగన్॥ 295

వ॥ అప్పుడు కాల్బలంబులు మొదలగునవి చాలదుర్బలంబులుగాఁగ నానరసభూ
పాలుండు భూనభోంగణంబులు భేదిల్లునట్లార్చుచుఁ దన సేనను సమకూర్చు
కొను సమయంబున॥ 296

క॥ పటుభేరీభాంకృతులును। బటుహానినాదములు శంఖబహురావంబుల్
స్ఫుటకాహళనాదంబులు। చటులములై పర్వెనోలి, జగములునిండన్॥ 297

మ॥ పటురోషోద్ధతినప్పు డవ్వెలమ భూ, పాలాది సైన్యంబులున్
జటులోదగ్రతనార్పుచున్ రిపులని,చ్చల్ దీఱఁ జెండాడుచున్
నిటలంబుల్ వగులంగ బాణములనె,న్నేఁ జొన్పుచున్ ధాటిమైఁ
గుటిలాస్త్రంబులఁ గమ్మభూపతులు బల్,ఘోరంబుగా నేయుచున్॥ 298

వ॥ అంతట నయ్యుభయబలంబులుం దలఁపడి, ముష్టివిఘట్టనంబుల, బిట్టవిసిపడు
వారును, గులిశకఠినశరధారాపాతంబుల నురంబులు వగులువారును, జాను
ఘాతంబుల రోజువారును, బాదతాడనంబుల మరణించువారును, గరవా

లంబులఁ ద్రెళ్లువారును, జరణంబులువట్టి విసరివైచినం జదియువారును, ము
సలంబుల నిముసంబున సమయువారును, భల్లంబుల లూనదోర్బలులగు
వారును, నై, భూషణమణిసమూహంబు లిలాతలసికతావికీర్ణంబులగుటయు
భిన్నమస్తకంబులపై గృధ్రాదికంబులు సంచరించుచుండ నపూర్వంబగు మ
హాఘోరసంగ్రామంబు జరిగెనప్పుడు॥ 299

గీ॥ ఏనుగులేనుగులఁ బోరెడు, నెలమిగిరులు
గిరులఁ బోరాడుకైవడి, హరులుహరులు
జగడమాడుక్రియవారు, సంభ్రమమున
నసమభుజదర్పములచేత, నసిఁ బెనఁగిరి॥ 300

ఉ॥ అంతటరామలింగవిభుఁ,డంచితశౌర్యసమంచితాత్ములన్
బంతములాడుచున్ రిపులు, పాఱఁగబాణములేయవెల్మభూ
కాంతుఁడు తీవ్రకోపమున, గాఢతరంబుగఁజొన్పికోలలన్
గంతువిరోధిభక్తుఁడగు, కమ్మనృపాలునినొవ్వనేయఁగన్॥ 301

సీ॥ రాజాధమానిన్ను, రాజవర్యులఁజూడఁ, గదనంబులోపలఁ, గదలకుండ
మద్బాణవహ్నిచే, మహితనాగంబుల, నశ్వంబులనుద్రుంతు, నసమశక్తి
శరహీనుఁజేసెదఁ, జలముమైననుచును, నారాజువినఁబల్కె, నభయమతిని
గనలికార్ముకవృష్టి, ననువొప్పఁగురిపించి, పెక్కుశరంబుల, భీతిగొలిపి

తే॥ కొన్నిబాణాలనాయుధ, కూటములను
గొన్నిబాణాలమఱికొన్ని, పన్నుగడలఁ
గొన్నిబాణాలఁ బ్రాణాలఁ గూలఁజేసె
నిట్టియనిసాఁగలేదు మున్నెన్నఁడనఁగ॥ 302

తే॥ వికలమగుబుద్ధిపొదలెడి, విభుఁడువేగ సాహసంపడకాతండు, సాంద్రగతులఁ
దనరుసేనలఁబురికొల్పి, ధైర్యమెసఁగ రిపులపైకేగెనావెల్మ, ఱేఁడుఱేఁగి॥ 303

వ॥ అప్పుడాకమ్మదొరలు విజృంభించి, యసమసమరసముత్సాహులైనెడ, నా
వెలమభూపాలుని సైన్యంబుదైన్యంబంది, భీతివడనప్పుడావెల్మభూపాలుండు,
వారికిఁదగుధైర్యస్థైర్యంబులొసంగి, యనికైపురికొల్పునవసరంబున॥ 304

మ॥ అపుడాదేవరకోటభూవిభుఁడుహా, హాకారభీకారియై
నిపుణత్వంబునవెల్మయోధులనువ, హ్నింబోలితాఁదాఁకియున్
విపరీతంబుగఁగోలలం జొనుపుచున్, వేవేగ నయ్యండలన్
ద్రపవీడన్ శరధాటిఁగూల్పరిపుచ, ర్యల్ కార్యపర్యాప్తమై॥ 305

సీ॥ లక్ష్మణసింగను, లావణ్యధీరుండు, కృష్ణనాయకుఁడను, పృథుబలుండు
కమ్మభూపతిమీఁదఁ, గదిసి వేవేగమె, నారసంబులు వేసి, పోరినడుమ
భూపాలనిన్నిష్ఠభూరియుద్ధములోనఁ, దునుమాడెదముచూడు, దోర్బలమున
ననుచుఁగార్ముకములనారాజుపైనేయఁ, దద్బాణహతులను, ధరణివిభుఁడు
తే॥ కలఁగికఠినంపుశరములఁ, గ్రమముమెఱయఁ
బఱపితద్యోధులనుద్రుంపఁ, బటిమమెఱయ
జంగుబహాదరుతార్కొని, సాహసమున
నొవ్వనేయుచుఁబెల్లార్చెఁ, జివ్వబలిమి॥ 306
తే॥ రాజ, నీవిటుబాహుద, ర్పము వెలుంగ
రాజరత్నమ్ములనుగెల్చి, రహిచెలంగఁ
జూపుచున్నావుచోద్యాతి, చోద్యములను
లావుమెయినష్టిచేయుచు, న్నావుకొంత॥ 307
తే॥ అనుచునీరీతినాతండు, కినుకకలిమి వెలయఁబల్కుచుశాత్రవ,వీరునొవ్వ
నేయుచున్ మాయికాకృతి హెచ్చనపుడు కమ్మదొరకంజమిత్రుని,కరణిమెఱసి॥
తే॥ కనలియానేతయాతనిఁ, గఠినబాణ
ములను దూలంగనేసితా, మొనసినృపతి
యార్చిచెండాడెనయ్యెడ, నవనివిభుఁడు
ప్రళయకాలోగ్రుఁడోయని, భ్రాంతిమొదవ॥ 309
క॥ చాపముగైకొనిప్రౌఢిమఁ జూపరులాశ్చర్యమంద, సుస్థిరమతిచే
భూపతిరిపుసైన్యముపైఁ దూపులఁగీల్కొలిపెరాజ, ధూర్వహశక్తిన్ 310
మ॥ నిమిషార్థంబున వైరులంగదియుచున్ నిస్సీమబాణాళిభూ
రమణుండేసిన బాణసంఘములు దు,ర్వారంబుగానాటదు
ర్గమభావంబున దిగ్భ్రమంబుగలుగన్, గానంగరాకుండఁగ్రొ
మ్మెమహాధ్వాంతము దుర్విభేదగతితో. మిత్రత్వవిచ్ఛేదియై॥ 311
క॥ ఘనతంగూలెడిసైన్యా ర్తనినాదముతోని యా,శరంబులచేనిం
డినఁబట్టకవడిఁబగిలెడు ఘనబ్రహ్మాండంబురవము, ఘనతందనరన్ 312
సీ॥ సునిశితబాణముల్, సొరదిగానాటంగఁ గాల్సేతులాడక కందువారు
పరుషకాండంబులఁబరిపీడితాంగులై, భూమిపైనూరక,పొరలువారు
క్రూరార్థచంద్రప్ర,హారధికృతులౌచు, మునుకొనిదుఃఖాబ్ధి, మునుఁగువారు
నరసాయకంబుల, వర్షముల్గురియంగ ,వక్షముల్బద్ధలైపడెడివార

తే॥ లలనిమూర్ఛిల్లియొక్కింత, తెలియువారు తెలిసిస్త్రైదుప్రులంగొని,నిలుచువారు
నిలిచిపోరికిఁదలఁపడి,నిగుడువారు నిగిడిజమునిల్లుసేరంగ, మొగియువారు॥313

చ॥ చలమునబాణముల్ దొడిగి, జన్యతలంబునమర్త్యకోటినిన్
గెలిచెదమంచుఁబోరఁగను, నేరకకమ్మకులాధినాథుచే
ములుకులవారివారలయి, మోక్షముపుచ్చినచూరగాఁగనా
వెలమకులీనులందఱును, వీరవరేణ్యులు నీల్గిరయ్యెడన్॥ 314

వ॥ అప్పుడా కమ్మభూపాలుని బాణంబులఁదలలు తెగియు, మెడలు తునిఁగియు, హస్తంబులువిరిగియు, నురంబులు బ్రద్దలయ్యు, నుదరంబులు నదరియు, మర్మంబులునొచ్చియుఁ, జాపాదిసాధనంబులు నురుమయియు, ఛత్రంబులు గూలియు, నింకననేకవిధంబుల ననేకభంగమ్ములుగాంచియు, వెలమల పొలఁకు వలతికలకలంబులై యుండెనప్పుడు॥ 315

చ॥ ఇదెనృపవల్లభుంగెలిచి, యెక్కడికిన్ జనవచ్చునింకన
ల్లదెరిపుసంఘమావితతులన్ గనిరొప్పగవారలొక్క.వా
రదెయదెవచ్చిరంచుమఱి యప్పుడుముందటనున్న వారువే
చిదుమఁగఁ జొచ్చిరంచునర, సింహుఁడుసైన్యముభీతినొందఁగన్ 316

వ॥ అప్పుడిభ్భంగి నిరుకెలంకులవార మోఘదుర్భరతాభీల చండతరోద్దండ పరాక్రమక్రమంబతిశయిల్ల, నాహవంబునఁ బోరాడి సుభటసముదయాది కంబుమడియు నత్తఱి, ఁగమ్మ(?) పాలుని సేనాంగంబుల ధైర్యస్థైర్య వీరావేశంబులు హెచ్చుచుండెనయ్యెడ. వెలమదొరబలంబంతయుఁ బ్రాణాంతంబై యుండ, హతశేషులంతరంగంబులదైన్యంబు నొందుచు దీనవదనచ్ఛాయానుమేయులై యుండుసమయంబునవెలమరేండ్లు పిరుతివియకవిక్రమ నూచకవాద్యంబుల, మ్రోయించుచు, మనము వెలమకొలంబుననుద్భవిల్లితిమేని, దురుద్ధరరాజతేజంబుమించ, నెల్లవిపక్షులనెదిరించి, జయంబుఁగాంతుము. జగత్త్రియ విఖ్యాతింబడయుదుము” అని వెలమదొరసైనికులంబురికొల్ప నాహవంబెట్లుసల్పుచుండిరనిన॥ 317

సీ॥ వెల్మతేండ్లందఱు, వీరాగ్రగణ్యులై, యనిమొనఁదార్కొని, రధిగమించి
కమ్మభూపాలురఁ, గదిసియార్పుచువేగ,ఁ బటునారసంబులఁ, బఱపవారు
గడ్డిపోఁచలరీతి, ఖండించిరప్పుడు, తద్బాణచయముల, ధరణివిభులు
విషకీలిసంవృత, విశిఖమ్ములాతత, విక్రమారులవేయ, వీఁకఁదాఁకి

తే॥గీ॥ శేఁగిదుఁర్చుచు వేవేగ, రిత్తపోకఁ, బోకకోలలఁజొన్పుచుఁ బూర్ణశక్తి
నుండునయ్యెడఁ, గమ్మవారు,రుక్కుమిగిలి ఘోరనారసములనంది, కుటిలవృత్తి

సీ॥ మరువులుసించుచు, మర్మమ్ములూడ్చుచు, నోలిఁగైదువఁబుచ్చి, కేలుదోయి॥
విదళించికండలు, వేవేగఁజెక్కుచు, రక్తపూరముచాల, రౌద్రమెసఁగఁ
దొరుగంగఁజేయుచు, దోర్బలోన్నతితోడఁ, బ్రాణవాయువులను, భంగపఱచి
వెడలంగఁజేయుచు, వెల్మభూపాలురు, కమ్మభూనాథులఁ, గఠినగతిని

తే॥ బయికిఁదార్కొని ఘోరత, బాణవితతిఁ
జొన్పివ్రేయఁగందంగఁజోద్యగతులఁ
గొదమసింగంబులనుబోలి, ముదముహెచ్చ
ఘనతఁజాటించిపోరంగఁ, గదనమునను॥ 319

చ॥ ఘనరభసంబునన్ నిగుడు, కైదువులందును మాడిమీఱితాఁ
కినయలవెల్మభూపతులఁ, గేళికఁదాఁకుచుఁ గమ్మభూవిభుల్
పనివడిఁగోలలన్ మరలి, భంగపడంగను జొన్పనేగ్రక
మ్మినవనిటవెల్మనాయకుల, మేనులరక్తముగారె ఘోరమై॥ 320

తే॥ ఇట్టులయ్యారెయిరువంక, గట్టివారు పోరుఘోరంపుగతులన, ప్పుడొకకొంత
వెలమలందున వెలితిప్ర, వేశమందెఁ గమ్మగండంద్రుమొదలూని, క్రమ్ముకొనఁగ॥

క॥ వెలవెలపోయెడుముఖములఁ గలకంగాంచుచునఖండ, కదనమునందున్
గులపౌరుషమ్ముఁబీడక వెలమలుతద్రిపులతోడ, నిడిఁబడిరనిలోన్॥ 322

చ॥ కరుణదలిర్పనయ్యెడను, గాంచనతేజుఁడు పద్మబాంధవుం
డురుతరదీప్తిచేఁదొలఁగి, యొప్పఁగనేగెను బశ్చిమాబ్ధికిన్
నరవరులయ్యెడన్ శ్రమగ,నంబడ దొల్లిటిరీతియుద్ధమున్
భరమునుమానిచేరిరియ,భంగురమౌ శిబిరాంగణంబులన్॥ 323

వ॥ ఆనాఁటిరాత్రి నిచ్చటఁగమ్మదొరలాదిగాఁగలవారలందఱు విజృంభించి, యతి కుతూహలంబున, భోజనభాజనాదులందీర్చుకొని నిద్రించిరయ్యెడ, వెలమ భూపాలుండంతరంగంబునఁ దనసైన్యము విపక్షులచేమృతినొందుటయు, హత శేషులు ధైర్యహీనులగుటయుఁ, జూచి యేమియుందోఁపక తనయోధుల రావించి, యేతత్సంగతులఁ బ్రస్తావింప నయ్యెడఁ జిన రామారాయఁడిట్లనియె; రాజోత్తమా, భీతివహించుటుచితంబుకాదు, మనము రేపటిదురంబున, ససమసా హసంబునఁ బ్రత్యర్థులం దునుమాడి జయలక్ష్మింగాంచవలయుంగాని, యుపా యాంతరము పొసంగదనన య్యెడ నరసింహరాయండిట్లనియె. భూవరోత్తమా!

మన, సేన వైరివీరప్రయుక్తశరపరంపరానిహతంబై పోయె. మిగిలినవారేని చేవ
జిగిఁగల్గువారుగాకయుండిరిగాన నీనిశయందుఁ గొంతశ్రమంబుఁ దీర్చుకొని
రేపటమఱికొంత సైన్యంబు సమకూర్చుకొని యుద్ధోద్యుక్తులమగుట యుచితం
బనఁ రాజశ్రేష్ఠుండు, తత్కాలోచితవాక్యంబుల కంగీకరించి యిట్లనియె
రేపటిరోజున నే యుద్ధంబు సేయ మనకు జయంబు రాదు, కానఁగాననంబులకు
నిత్తఱిసేచని, కొండొకకాలంబు శ్రమాపనోదనంబునకుంబుచ్చి, పదఁపడి
తగు సేనం గొనివచ్చితిమేని జయంబు వాటిల్లునని చెప్పెనయ్యెడ॥ 324

## వెలమభూపాలుండు తన సైన్యముతోఁ బలాయితుండగుట.

ఉ॥ ఆయెడఁజారులంబిలిచి, యాపృథివీపతియిట్లు పల్కె మీ
రీయెడ మాఱువేషముల నిప్పుడు తాల్చి వనాంతరాళికిం
బోయి శ్రమంబుఁదీర్చుకొని, పొందుగఁ గ్రమ్మరవచ్చి వైరముం
బాయక వైరులం గదిసి, భవ్యతరంబుగఁ బోరమేలగున్ 325

తే॥ ఇట్టులాచారులెల్లర, కెఱుక, పఱప। తేనియానతిసుభటవ, రేణ్యులెల్లఁ
గొంతకాలంబు శ్రమదీర్చు, కొనఁదలంచి। ఘోరతరకాననావళిఁ జేరిరపుడు॥ 326

సీ॥ గాఢాంధకారసం, క్రాంతమాకాంతార, మధ్యమందునబలామందమైన
శరభశార్దూలకే,సరిభల్లుకాదులు, వాలువీ లెఱుఁగని వానరములు
నానావిధంబులౌ, కాననాంతరచారి ఘోరకృత్యవిహారి, భయారిమృగము
లట్టిమాయటవియం, దతిజాగరూకులై, కతిపయక్రోశముల్, కదలిపోయి

తే గీ॥ నాఁటిరాతిరినిద్రహీ, నంబుగాఁగ
రాజు మొదలగు వారలు, తేజమెడలి
యొక్కకమలాకరంబున, నుదయవేళ
నిల్చిరచ్చటభుజియింపనిందుబుద్ధి। 327

వ॥ అక్కమలాకరతీరంబున భోజనాదికృత్యంబుల నెఱవేర్చికొని, విపక్షులరుగుదెం
తురనుభయంబున వెడలిపోవుచుండ, యాదవవంశసంభూతుండగు వెంకట
రాముండనునొక్క జాబాలుండు, తద్గహనమార్గంబున నెదుర్కొన వెలమ
దొరయాతనిఁ జేరందీసి యివ్వనంబున నెచ్చట, విపులగ్రామగహ్వరంబు కలద
నియడుగ, నతండిట్లని విన్నవించె. రాజోత్తమా! యిచ్చటికి మూఁడామడల
దూరంబున విశాలవలయావృతంబయి బీరవల్లిపాయ యనునామంబుగల
గ్రామంబుగలదు" అననప్పుడానృపవరుండు సంతసించి, యోగోపనాయకా!
మేమీతెరువుననరిగితిమని యేరికిం జెప్పనొప్పదని, యాజ్ఞాపించి వారాగిరిరాజ

దరీద్వారంబుఁ జేరియుండ నమ్మరు నాఁటియుదయంబున నిచ్చటికమ్మదొరలు యథాపూర్వంబుగ, సమరక్షితి కేఁగి ప్రతిపక్షులు లేకుండుటచేఁ గాందిశీకుల యిరని వారిపొలంకువలఁ దెలియుటకై యోజించుచుండిరి. 328

కమ్మవారు వెలమవారుపోయినత్రోవల నారయంబోవుట.

సీ॥ గహనాంతరంబుల, కడడాగువారల, జాడకై వెదలిరి, జగతివిభులు
వివిధాటవులయందుఁ, బెద్దశైలములందుఁ, గమలాకరములందుఁ, గలయ వెదకి
యచ్చోటఁగానక, యెచ్చోటనిల్వక, తెలివిచే వెదకిరి, తెరువులెల్ల
శత్రుమండలినెల్ల, చాయలంగనలేక, మనసులువిసివి పొమ్మసిలితుదకు
తే॥ డస్సిపోయిపిపాసచే, నుస్సురనుచు। నొక్కసరసునఁ దోయమ్ము, లుద్దవిడిగఁ
గ్రోలితత్తిరభరాజాత, కూటశాఖి। పటుతరచ్ఛాయఁ జేరజా, బాలుఁ డేగి॥ 329

క॥ సరసునశీతలజలములు। సరగన్ గోపకుఁడు క్రోలఁ, జక్కఁగఁ రాఁగా
నరపతియాతనిఁ బొడఁగని। తెఱఁగొప్పఁగఁ బిలిచియడిగెఁ, దెల్వికొలందిన్॥ 330

గొల్లవాఁడు వెలమదొరలుపోయినజాడను గమ్మతేండ్లకుం దెలుపుట.

క॥ ఓయీ యెవ్వఁడవీవు। జేయెడ నీయునికి తెల్పు, మిప్పుడయన, నా
శ్రీయుతునకు నేగొల్లఁడ। నాయునికి యెగొల్లపల్లె, నాథాయిచటన్॥ 331

వ॥ అనిన విని యాక్షితిపతి, నీవీగహనాంతరవర్తివై యొక్కఁడ వెసంచరించుకతం
బేమన, నతండిట్లనియె॥ 332

మ॥ అనఘా; రాజలలామ, నేనిచట ఘోరారణ్యభూమిన్ మహా
ధనమేమాకని చెప్పఁ గొఱ్ఱియలమ, ధ్యాహ్నంబునం గాయుచున్
ఘనమౌడప్పికలంపఁ దోయములపైఁ గాంక్షల్ పిసాళించి నేఁ
జనితిన్ బెంగొలకుం గనుంగొనుచు మీచాయన్ రయంబొంటిమై॥ 333

వ॥ అనునాతనితో నారాజు జాబాలకా! నీవీవనమార్గంబున నెవ్వరేనియుంబో
వంజూచితివేని సంశయింపక తెలుపుమన నించుక కొంకుచు నేనెవ్వరిం జూడలే
దన రాజశేఖరుండు కోపారుణనేత్రుండయి నీవు నిజమ్ముఁ దెల్పవేని మనంజా
లవనికేల నమ్ములంగొనన స్వభావభీరుండగు నాభీరుండు ధైర్యంబు వదలి నేఁటి
యుదయమందు వెలమదొరలు స్వసేనాసంయుతులై యీదారిన పోవుచున
న్నుఁ గాంచి యోయీ; మాయాగమనరహస్యము నెవ్వరితోను వెలిఁబుచ్చకు
మని పశ్చిమమార్గంబునకుం జనిరి. దయయుంచుమని విన్నవింపనప్పుడు॥ 334

గీ॥ కమ్మతేఁడప్పు తనదుసై, న్యమ్ముతోడ వెలమతేండ్లను గనుఁగొను, తలఁపుచేత
గహనమధ్యమ్మునం దెల్లగట్టిపట్టు పట్టి వెదకెను, వెలమల, పసదొలంగ॥ 335

వ॥ ఇట్లుచని తద్వనసంచరణ, ఘోరమృగ ప్రకరమ్ముం దమపరాక్రమమ్ములఁ బ
రిహసించుచు, నిర్భయులై, కొంతవడిందెలియక తిరిగితిరిగి, తుదకుబీరవల్లి
పాయయనెడిగ్రామంబు దరిఁజేర వైరివీరులుతద్గిరి గహ్వరాంతరంబున నున్న
జాడఁలంగని, యచ్చటికింజని రనంతరంబున॥ 336

గీ॥ రిపులుదాఁకినగిరికేగి, రేఁగియార్చి గోత్రగుహయందువర్తిల్లు కుటిలులనుచుఁ
జండతరసాధనమ్ములఁ, జౌకళించు వైరియుగ్మంబుఁగాంచి రవ్వసుధవిభులు॥

గీ॥ ఎన్నొకష్టాలసహియించి, యున్నచోటు
గాంచివెలమలనిర్వురఁగమ్మదొరలు
తోఁచుగతిమాటలాడంగఁ, జూచువేళ
సూర్యుఁడస్తంగతుండాచు, శోభఁదక్క॥ 338

గీ॥ తెల్లవాఱినపిమ్మట, నల్లకమ్మ దొరలురణసాధనమ్ముల, తోడనచటి
వెల్మదొరలకుగుండెలోబల్మిసెదర భేరిమ్రోయించిరయ్యారె,దారి గాచి॥ 339

తే॥ వెలమభూపాలుఁడయ్యెడ, వివిధగతుల
నిజబలంబులశౌర్యంబు సిల్చునట్లు
పరుషవాక్యంబులందందుఁ, బల్కికొనుచు
సూరయాహ్వయుఁడిట్లనె, సుస్థిరముగ॥ 340

సీ॥ భువిమీఁదమీరలు, జనసత్త్వములతోడ నిల్వఁబోరెప్పుడు నిక్కముగను
గఫవాతపిత్తముల్, గ్రమ్మిచచ్చుటకంటెఁ, బౌరుషంబేర్పడఁ బ్రబలగతిని
సంగరోత్సాహులై, సాహసాధారులై, యుద్ధవాటికలోన,నుక్కుమిగిలి
వైరులఁజక్కాడి, వసుధాతలంబున, జయముగాంచుటయొండె, జగతియందు

తే॥ క్షాత్రవులచేతఁజచ్చి ని,శ్చలనపాక నాకభోగంబునందుట, యమరనొండె
యర్హమని పెద్దలువచింప,నాలకించి యున్నవారలుగదెమీరు, యోధులార॥

మ॥ అనయిబ్భంగిఁ బదాతిసైన్యముల క,త్యంతోగ్రరోషాప్తి బి
ట్టనువందన్ బురికొల్పెనయ్యెడఁ సై,న్యవ్రాతముల్ నీతిమై
ఘనతంబోరఁగఁబంపుచున్ విభుఁడుదీక్షాదక్షురూక్షోద్ధతిన్
మునుతద్గ్రావగుహాంతరాళమునకున్ మూర్ఛించిరాకుండఁగాన్॥ 342

వ॥ ఇరువురు వెల్మయోధుల నారాయణరావు నరసింహారావనెడివారల, సింహ
పరాక్రముల, నాగుహాద్వారంబున నేరికింజొరనీకుండఁగాఁగాఁపాడుట కుంచి
తిమి, మీరీక్షణంబున నచ్చటికింబోయి, జాగ్రత్తగానుండవలయునని చారుల

సంప వారాతుణంబునవచ్చి రాజుసెలవిచ్చినమాటల విన్నవింప, మిక్కిలి
343
జాగరూకులైరప్పుడు॥
సీ॥ కోదమసింగములన, ఘోరతరంబుగాఁ,గోటమీసంబుల కొనలుదిద్ది
నయనంబులందున, నలకీలలుద్దండ, తీవ్రరోచిస్ఫూర్తిఁ దిరుగుచుండఁ
గేలఁబెఱ గదలంది, ఘీంకారరవములఁ, గుప్పించిదుముకుచుఁ, గోడెకాండ్రు
చటులపరాక్రమ,చ్ఛాయాసముద్రులై, గహ్వరద్వారాన గడుభయముగ
తే॥ నిలిచివైరులరానీక, పలుతెఱఁగుల మత్తగజములసింహంబు, మచ్చుమాఁపు
కరణిఁగమ్మలగదలచేఁ,గఠినగతిని బాదువుచుండిరి వెలమలు, భూరిగతుల 344
ఉ॥ ఆయెడఁగమ్మభరాధిపతు, లాగ్రహమందుచుహుంకరించుచున్
వాయుసుతుండు మున్ దనుజ, వల్లభులన్ విదళించునట్లుగాఁ
బాయనిదీర్ఘకోపమునఁ, బంతము హెచ్చఁగఁబోరు వెల్మభూ 345
నాయకులందఱున్ శరగణంబులఁజెండఁగఁజొచ్చిరార్చుచున్ ॥
మ॥ ఇదిగోఁజూడుము నాగదాహతులచే, నేపారఁగామిమ్మునే
మదదంతావళపాళి సంహమటులన్, మర్దించిమూర్ధంబులన్
విదళింతున్ బహుజన్మపాపఫలముల్, పృథ్విన్ బడన్ మీరు స 346
త్యదయావాసములై ప్రశస్తగతుల, త్యంతంబుఁగాంక్షింపఁగన్॥ 347
వ॥ అనిమఱియును॥
క॥ మృతులనుజేసెదమంచున్। ధృతిచేనాకమ్మదొరలు, తెలియంబలుకన్ 348
మతినతుకుఁగల్గువెల్మలు। వితతస్థైర్యంబుతోఁప, విడివడిరనికై॥
తే॥ రిత్తమాటలవల్లను, మెత్తఁదనము కనఁబడుటయొక్కటేకాని, కమ్మవారి
గండుమీఱినశౌర్యంబు, కానఁబడునె పోరిలోమమ్ముగెల్వఁడీ, వీరులలర॥
వ॥ అని యీప్రకారంబుగ వెలమదొరలుం గమ్మతేండ్లుంగర్ణకఠోరవాక్యంబులు,
వల్కుచు, నేరికింజూడరాకుండునటులు, నిరాఘాటనిశాతసాయక ప్రయో
గమ్ముల, వారిమొన వీరిమొన, శీర్షభంగాది భయంకర క్రియలనాచరించు
చు, ననివార్యశౌర్య సాహసధుర్యులై, యుద్ధమాచరించుచుండు సమయం 350
బున॥

కంతేరుపురవాసియగు వీరయామాత్యుండు, గుహాద్వార
మందుండు వెల్మల దురంబునఁ జక్కాడుట

తే॥ వాసిరెడ్డికులుండగు, వసుధవిభుఁడు।వీరయామాత్యుఁడగు మహావీరవరుఁడు
పటిమచెన్నొందఁదారొక్కని, ప్రబలగతిని।వెల్మవారలతోఁబోరె,వివిధగతుల॥

సీ॥ ప్రళయకాలానల, ప్రథమిాజిపటిమను బ్రస్ఫురచ్ఛక్తిసం, పన్నుఁడగుచుఁ
గాలసర్పమురీతిఁ, గలకుందనంబున, గదకేలఁగైకొని కమ్మఱేఁడు
వైరశుద్ధింగూర్ప, వాంఛచేనవ్వీరుఁడతి సాహసంబుచే, నతిశయిల్లి
తారొక్కనిరయ్యెడ,ఁధాటివీరపసీఁడు, నరహరిరావను, ధరణివిభుఁడు

తే॥ భీకరాకృతినిర్వూరా, భీలగతుల
వల్గనోపక్రమవిశుద్ధవైఖరులను
ఘోరసమరంబులోపలఁ, గోదమసింగ
ములతెలంగునఁబోరిరి, చలముమిగుల॥ 352

వ॥ అట్టి సమయంబుననియ్యిరువురు ద్యుమణిమండలతేజోజాలంబురీతిమెఱయు
చుఁ,జిత్రగతిం బ్రబలశర ప్రసరణమహా లాఘవంబునఁ, దమలావును, నైపు
ణ్యంబును, దర్పంబును, జూచువారికింగడు వెఱఁగుఁబుట్టింప నంత కంతకుఁ
బరస్పరజయాకాంక్ష హెచ్చ నేనలననేకవిధంబులఁజేకాకు వఱచుచుఁ, బోరు
న ననుపమానులైవెలమలుఁగమ్మలు వారివీరితురంగాది కంబులనిహతంబులం
జేసికొనుచునుండునట్టి యెడ॥ 353

చ॥ వెలమలుకమ్మలుంగలసి, విశ్వనుతాతిబలప్రసక్తిచే
బలములుస్పష్టమైవికల, భావముతేలఁగఁబోరుసల్పుచుఁ
వెలమలశక్తికమ్మదొర, ప్రేటులపాటుననేటఁద్రోయఁగా
వెలమలఱేఁడునైజశర, విస్తృతధీవిభవంబుపెంపునన్॥ 354

ఉ॥ కమ్మదొరంగడంగితట, కాపడఁగోలలఁదూలఁబుచ్చుచున్
గ్రమ్మినవైరభారమున, గ్రక్కుననాన్నృపుసైన్యమెల్లభం
గమ్ముఁగనన్బదింబదిగఁ, గాండములొక్కవడిన్ గడిందితే
జమ్మునఁగ్రుమ్ముచుండెసర, సప్రకరంబుబళీబళీయనన్॥ 355

వ॥ అప్పుడయ్యిరువురుఁదొరతొరఁదమ దొరతనంబులు కనఁబడనదేపనిగఁ గదనం
బునసల్పి కుక్కుటమ్ములరీతిరోజుచు, రొప్పుచు, నొండొరులపట్టువిడక,యుం
డనందుఁగమ్మభూపాలుండు, వలపలించిచుట్టుకొనినది సరకుసేయక వెలమ

భరావిభుఁడుడాపలించి, తిరిగినంబెరిఁగిన యీారసంబుననుల్లసితుండయి, యా తండక్కమ్మకులోత్తముసేయ నితంతుకళవళంపడి మరలంచెప్పిరిలి,యగ్గలంబగు నలుకచేసా వెలమయురంబుపలక్షించి ఘోరగదంబ్రయోగింప, నాతం డురంబురలి శిరంబుబ్రద్దలయి కులిశక్షతంబగు క్షితిభృద్వరంబుమాడ్కి, భూమింబడి యా వెలమనృపాలుండు మృతింజెందెనప్పుడు॥ 356

నారాయణరావు విజృంభించి దురంబునఁగమ్మవారినుగ్గాడుట

మ॥ వరనారాయణనామధేయుఁడుమహా, వ్యాఘ్రుపుమ్మచందంబునన్
గురువీరోద్ధతశక్తిఁచేఁబెనఁగొనన్ ఘోరారాటవుల్ వహ్నిచే
వరుసంగాలినభంగిఁగమ్మనృపరా,డ్వక్షంబులీతండుచె
చ్చెరదూకించెషిబాణపుంజములచే శీఘ్రిఁబనస్టింగనన్॥ 357

క॥ అల్లూరి వంశసంభవుఁ। డుల్లమునందుగ్రకోప, మొప్పారంగాఁ
బెల్లుగశాత్రవుఁ దార్కొని। భల్లముఁగొనిసింగరప్ప, పటిమన్ సిల్వన్॥ 358

గీ॥ చండరుచి సాయకమ్ములజగతివిభుఁడు। ఖండనమ్మున వెఱఁగందఁ, బ్రబలగతిని దాఁకనేయంగఁ గమ్మభూ,దారుఁడవియు లెక్కసేయకనుక్కుమైఁ, బిక్కటిల్లి

చ॥ గురుతరభీకరాకృతిని, ఘోరతరంబుగ నారసంబులే
మరమరలేకతద్రిపుని, నంటఁగనేయనతండువెండిని
స్ఫురతరబాణపంచకము, సుస్థిరతన్ రిపువక్షమందునన్
నిరుపమధాటిచేఁజొనుప, నెట్టనదత్తరమంది యత్తఱిన్ 360

వ॥ అప్పుడా వెలమభూవిభుండు మూర్ఛందేఱి యిట్లనియె॥ 361

గీ॥ కమ్మనృపవర్య! చూడుమీా,క్షణమునందుఁ
గదిసినిన్నుఁద్రుంచివైచెదఁ గాండసమితి
ననుచుసునిశితశరముల, నతఁడువేయ
సరకుసేయక యాబాణ,సంఘములను॥ 362

గీ॥ మధ్యఁదునుమాడి సింగర,మనుజవిభుఁడు
వెలమభూపాల! నిన్ను నే,వీఁకఁదాఁకి
బాణములనువ్వనేయుచుఁ, బటిమమెఱయ
యుద్ధవాటికఁజంపెద, నుక్కుమిగిలి॥ 363

మ॥ అనియాతండు మహాభయంకర శర,వ్యాపార పారీణతన్
ఘనమావక్షము నాఁటనేయఁగ నసృ,క్కాంతుల్ మెయింద్రిమ్మఁగా

ననువొప్పన్ మరలన్ స్వశక్తినెటులో, యల్లంతఁ జెల్లింపఁగా
వనజాతాక్షుఁడునొచ్చి ప్రమాన్వడుచు గ,వ్యంబోలెనీచెర్గతిన్॥ 364

ఉ॥ చండతరంబుగన్ విశిఖ, సంఘములన్ గడుఁదీవ్రఘాటిచే
భండనమందు వెల్మపటు,భావముపీడఁగ నేయనయ్యెడన్
మెండుగఁదాఁకికూలె భువి,మీఁదనుసింగరనీఁడు వేగను
ద్దంగతఁబోరితూలిపటు, దర్పవిహీనతడిందికుందుచున్॥ 365

వ॥ అప్పుడు తిరుమలప్ప, మాదన్న, రఘునాయకుండు, రాజాసింగు, కృష్ణసింగు, ఖుతుబుఖాను, మొదలుగాఁ,గల మహాబలశాలులొక్క పెట్టనాసరకంఠీరవుం దార్కొని, దుర్భరపరాక్రమక్రమంబున, నారసంబులంబఱప నాతండదిలెక్కింపక, త్రుంచివైచుచు, నందఱకన్నిరూపులై బాణమ్ములేయ, లోనికింజొరనీయక, బెబ్బులిమాడ్కి ధిక్కరించుచు, నలుదిక్కులంగదిసి, బాణవృష్టిం గురిపింప, నవ్వీరులతిరౌద్రావేశంబునఁ బటునారాచంబులనొప్పింపఁ దత్ప్రహరణంబుల, నాతనిమేనంతయుఁ దూట్లుపడి, రక్తసిక్తాంగుండై, వారల నందఱంబరిమార్చి, వెల్మభూవిభుండు, ప్రళయరుద్రుమాడ్కి విజృంభించి, పోరుచుండఁగమ్మభూపాలునిసైన్యంబంతయు భీతిల్లి, తమమనంబులనేఁడీతనిచే మనకందఱకు మరణంబుధ్రువంబని యెంచుకొనుచుండునవసరంబున, నాగయాహ్వయుండు, విపక్షుని విజృంభణంబును, దమసేనాదైన్యంబునుగాంచి యావెల్మనుదార్కొని సంకులయుద్ధంబు సల్పఁదొడంగెనయ్యెడ॥ 366

### నాగభూదారుండు నారాయణరావునుజంపుట.

సీ॥ రాఘవపురసీమ, రాజవరేణ్యుఁడౌ, నాగభూదారుండు, నాగబలుఁడు
భూపాలుఁడైనట్టి, భూరినారాయణ, రావునుదార్కొని. రౌద్రమొనఁగఁ
బంచాస్యయుగ్మంబు, బహువిధంబులఁబోరు, తీరుననయ్యిర్వు, రారయనఁగ
వరశరయుద్ధంబు,వాంఛామితంబుగా, వలపలడాపల, వక్రగతుల

తే॥ నడుగులిడుచునువారతు, లాగ్రహమున
శరములనునూఱిజళిపించి, చతురతమెయిఁ
బోరనయ్యెడనిరువురు, భరారిశరము
లబ్ధిపాలయ్యెవారలు, వ్యసనపడఁగ॥ 367

మ॥ వరనాగాహ్వయభూవిభుండు పటిమన్, వక్రించి బాణావళీ
స్ఫురణన్ నైజకరంబునన్ నిలిపి మెప్పున్ గాంచు నావేళనా

నరవర్యుండగు వెల్మభూవిభునిపై, నాటంగనేయఁగా వెస
దురమందే యతఁడార్చి నారసములఁ దూలించితీండ్రింపఁగా॥ 368

గీ॥ బాణవృష్టినిగురిపింపఁ, బ్రబలగతిని। నరకుసేయక వెల్మను, సాంద్రవిశిఖ
నారసంబులుచొనుపంగ, ధారుణిపతి। పటుతరంబగుకోలలు,పఱపనపుడు॥ 369

తే॥ కళవళంపడి శ్రీహరి,కరుణచేతఁ
దేటియాకమ్మవిభుఁడు, సందీప్తిమెఱయఁ
బలికెనయ్యెడఁగాలుని,భంగి శత్రు
హృదయపుటమెంతొ దిగులుచే, హెచ్చునట్లు॥ 370

ఆ॥ నీదుకీర్తివార్ధి, నిక్కమ్ముగాఁజేర్చి। బాణపుంజములను, బఱపియిపుడె
జమునిమందిరమ్ము, నరగఁజేర్చెదనిన్ను। నీదువారి, గోడునెక్కొనంగ॥ 371

వ॥ ఇట్లుపల్కుచు నాకమ్మభూపాలుండు, వెలమతేనిం బోరంజంపి మహావీరుం
డైయుండ, నావెలమతేనిసేన, కొంతకొంతచింతిల్లుచుఁ, గర్తవ్యంబులేక, భీ
తిమెయి వెనుకటిగుహాయందు నెల్లరుఁజూచుచుండఁగనే, ప్రవేశించిన యనం
తరంబ॥ 372

నరసభూపాలునిసేన గుహఁజొచ్చి నెలమల నుగ్గాడుట.

తే॥ కమ్మవిభుసేనలెల్లను, గదిసిగుహను
జటులసాహసవిక్రాంతి జగతిమెఱయ
రిపులఁదార్కొనిరయ్యెడ, రేగియార్చి
పరుషవాక్కులుపలుకుచుఁ బ్రబలగతిని॥ 373

వ॥ అచ్చట పలయావృతగ్రావాంతరంబునఁగ్రోశాతతస్థలంబున నిరువైపులవారుం
దార్కొని, చిత్రాతివిచిత్రంబుగ, ననేకవిధంబులగు ప్రహరణవిధంబులచే,
గదిమిగదిమి, చిదిమిచిదిమి, యొండొరులు సమరంబు జరుపుసమయంబున॥ 374

గీ॥ ఈప్రబంధంబురచియించు, హితవతంసు। తాతతండ్రియునప్తసం, తానకృతియు
ధీరుఁడునుసుబ్బయాభిఖ్యమీఱువాఁడు। వరసుశీలుండుచేబ్రోలుపురనివాసి॥ 375

గీ॥ సకలసునిశితశరసార, సాధకుండు। భుజపరాక్రమవిభవుండు, భోగశాలి
ప్రబలమైనధనుర్విద్యఁబరఁగువాఁడు। కృత్యవిదుఁడైన గోపాల రెడ్డిఁగదిసి॥ 376

క॥ పోరగదొడఁగెమహత్తర। వీరులు, వీరుఁడనవీఁడెవిశ్వంభరనా
వారిధితరంగరావ। స్ఫారారావంబుకదన, వసుధగ వెలయఁగ॥ 377

ఉ॥ ఆతఁడునీతఁడుంగదిసి, యాగ్రహవిగ్రహముల్వెలుంగవా
గాతతశౌర్యసూచకమహోత్తరచేష్టలఁబుట్టి తేలఁగా
నీతిఁదొలంగకుండనవ, నీపతిధర్మముపీడకుండనం
గాతముగోఁతఁజేరఁ గడఁకంగదనమ్ముఁబొనర్చిరుద్ధతిన్॥ 378

గీ॥ నీటుమీఱంగముల్కుల, పోటుచేతఁ గమ్మవారరెడ్డినయ్యెడఁ, గదనమందుఁ
గ్రిందుమీఁదగునటుచేసె రెడ్డిమరలఁ గమ్మభూవిభునిట్టట్టు, క్రమ్మిక్రమ్మి॥ 379

వ॥ ఇట్లిరువురు పరస్పరజిగీషావిషమ మనీషం బేర్చి, కార్చిచ్చులవలెఁ గలయం
బ్రసరించి, ప్రసరించి, పోరుచుండుసమయంబున॥ 380

చ॥ వెనుకకు నేగుచున్ బ్రబలిన, వేగమచేయుచు ముందుచిందులన్
ఘనతగఁబెట్టుచున్ బ్రబల, కంకటభేదముకల్గునట్లుగా
ననుపమకాండకాండముల, నంతకునంతకు రువ్విరువ్వియా
వనజదళాక్షుఁడయ్యెడన, వక్రతఁదూలఁగ రెడ్డినేయఁగన్॥ 381

మ॥ పటుదర్పంబున రెడ్డి కోపయుతుఁడై, పాటించియుద్ధక్రియన్
స్ఫుటనేత్రంబులనగ్ని తేజమొదవన్, శుంభత్ప్రతాపంబు మి
క్కుటమైగోషముఁగూర్పసర్పముక్రియన్ గోడాంధఁజేయంగఁదాఁ
గటుబుద్ధిన్ శరమేసెఁగమ్మవిభుపైఁ, గాంక్షోఘమీఁడేరఁగన్॥ 382

క॥ అపుడాశరహతితప్పఁగ। నిపుణత్వముతోడనృపుఁడు, నిల్వంగావే
కపటాత్మశరమువగులఁగ। విపులతఁదనశరముఁదునిమె, విపరీతముగాన్॥ 383

ఉ॥ ఆయెడఁగమ్మభూమిపతి, యాగ్రహమందుచుధిక్కరించుచున్
బాయనిదీర్ఘకోపమునఁ, బాటిలికోలలనేయ వానిచే
నాయిలరెడ్డికూలఁగని, రయ్యెడ వెల్మలుకమ్మనాయనిన్
గాయముదూలునట్లు శిత, కాండపరంపరఁజొన్పనత్తఱిన్॥ 384

గీ॥ శరమువిడనాడిచాపహస్తవెలింగి
కాండములఁబూనియాతండు, కఠినగతుల
నందఱునునన్నిరూపులై, యవనివిభుఁడు
బాణవర్షంబుఁగురిపించెఁ, బటిమమెఱయ॥ 385

వ॥ ఇత్తెఱంగునం జేయఁగాఁ జేయిగాలాడక, చూడ్కిపఱప రాకుండునట్లుగాగుం
పులు గూడితత్సైన్యంబును సింహనాదంబులను రణభేరీవిరావంబులను వెలుం
గ. నాకమ్మభూపాలుని పైఁగవియునప్పుడు॥ 386

గీ॥ బాణచయమును బఱపిత, ద్బాణహతుల
వైరులందఱఁ దునుమాడె, వహ్ని,వనముఁ
గాల్చువిధమునన య్యెడఁ, గమ్మవిభుఁడు
సనుపమోత్సాహసాహస, ఘనత మెఱసి॥ 387

గీ॥ తలలు మొలలును బదములు,దంతములును
గరములురములుమఱియెల్ల, కాయకళలు
మొదటికే చెడిభువిఁబడ, నదిమిగదిసి
చిదిమిచెండాడెనప్పుడా,క్షితివరుండు॥ 388

వ॥ ఇట్లు ఘోరభంగిఁగంఠీరవంబు మాడ్కి మెఱసి, సైన్యంబులఁ జీకాకుపఱచుచు బదతలాఘాతసంజాతరేణు వ్రాతంబు, గగనపర్యంత పర్యాప్తంబొనర్చుచుఁ 389
బెనఁగుసమయంబున॥

చంద్రమౌళి భూపాలుండు వేఱొక మొనందారొంటని
వెలమలతో యుద్ధముసల్పుట.

చ॥ ఒక మొనఁజంద్రమౌళినృపుఁ, డుగ్రతశీఘ్రమ్ముగ వచ్చి వైరులం
బకరిపుభంగియుద్ధమున, వహ్నివరేయుజ్జ్వలబాణకీలచే
నొకసిమునంబులోన నెహా, రోంహరయంచును గూలునట్లుగా
సకలవిపక్షకక్ష, కులిశక్షతపక్షగిరిందలంపఁగాఁ॥ 390

సీ॥ సయ్యదుఖానను, సాహసపుర్యుండు, పటురోషభరితుఁడై, ప్రబలగతిని
దమసైన్యములపాటు, తగవొప్పఁదిలకించి, యూరాజుఁదారొంటని,యాతఁడపుడు
పలునారసంబులఁ, బాటించివేయంగ, వానిలెక్కింపక, పూనికమెయి
సుశితాంబకముల,సుక్కంగనాటింప,నామ్లేచ్ఛుఁడపుడుగా,ఢాగ్రహుఁడయి
తే॥ తనువుఖండించిబాణాల, ధరణివిభుని మర్మములఁజించిపరుషంపు,మాటలాడి
దండధరుభంగి వేఱుకో, దండమూని తునిమెమ్లేచ్ఛునికోలలెం, దుఁగనకుండ

వ॥ ఇత్తెఱంగునఁబోరు ఘోరారంభంబై యుభయపక్షంబులవారిని జీకాకుపఱుప, భూనాయకుఁడు మొదలగు వెలమ దొరలు వేఱొక మొనందారొంటని, కమ్మదొరలందేఱిచూడరాకుండఁ గఠినాస్త్రంబులశిరంబులు డొల్లనేయుచు, భుజంబులంఖండించుచునూరువులం బెరుమాపుచుఁ బ్రళయకాలరుద్రులం బోలి సేనానాయకులు విషమశర ప్రహారంబుల వైరులం జెండాడు సమయంబునఁ జిరుమామిళ్ల వేంకటపతి భూదారుండుమ్మిక్కిలి విపక్షుల విజృంభణంబుగాంచిన 392
యనంతరంబున॥

చిరుమామిళ్ల వేంకటపతిగుండారాయనిందాఁకొనుట

చ॥ గురుతరబాణసంఘముల, ఘోరతరంబుగగుండరాయనిన్
సరగుననొవ్వఁజేయనవి, చప్పననాతఁడుద్రుంచివైచుచున్
బురహరులీలనా వెలమ, పుంగవుఁడాజినిగమ్మభూవిభుల్
వరశిఖిశిఖౌఘ పాతముల వక్షమునాటఁగఁజేయనాతఁడున్॥ 393

ఉ॥ పాయనిదీర్ఘకోపమున భానుసమానతఁగాంచియావిభుం
డా యెడఁగోపమగ్నుఁడయి, యార్చుచునానృపుఁజూచిపల్కెనీ
శ్రీయునుబాహుదర్పముఁ గృశింపఁగఁజేసెదఁజూడుమిత్తరిన్
గాయముఁబాయఁగావిశిఖకాండము రువ్వెదనంచుఁ బల్కుచున్॥ 394

చ॥ పటుతరబాణపంక్తుల విపద్దశముంపఁగ వెల్మభూపతిన్
బటుతరశౌర్యశక్తికళవారిజలోచనుఁడల్గికొంకకే
స్ఫుటతరమైన బాణములఁ, బూర్ణబలంబునఁద్రుంచిచాపమున్
నిటలము నాటఁగాండముల, నేర్పుగ వ్రేయఁగరక్తధాటిచే॥ 395

క॥ కుసుమితకింశుకవృక్ష, ప్రసరణకున్ స్థానమాచు. బాణావళులన్
వెసమర్మములఁజించుచుఁ బసగలవెలమపతి తీవ్రభావముగాంచెన్॥ 396

మ॥ అపుడా కమ్మనృపాలశేఖరుఁడు తానత్యంతకోపంబునన్
విపరీతంబుగ బాణసంఘములచే వేవేగనావైరులన్
ద్రపపీడంగ ననేకకష్టవితతుల్ రాజిల్లఁగానేయుచున్
రిపునిన్ భీతిలఁజేసెనయ్యెడల నిర్భీతిన్ రణోత్సాహియై॥ 397

వ॥ అప్పుడయ్యిర్వురు, నసదృశంబగు బాహుపరాక్రమ క్రమంబునంబోరుచుండు నెడ, నాకమ్మవెలమఱేండ్లనుపలక్షించి,వియచ్చరసముచ్చయంబులు, తమలో నిట్లని వితర్కించిరి. 398

క॥ అరివంచనమందీయిరు,పురికంటె మహోగ్రబలులు భూమింగనరా
రరరే వీరిపరాక్రమ, మురుతరమని పెక్కువిధుల, నొప్పఁబలుకుచున్॥ 399

వ॥ ఉండుసమయంబున, భూమియు, భూమిభృత్సముదాయంబును, నదరిప్రతి ధ్వానంబులీన, శూరశిఖావతంసులు, ధైర్యస్ఖలితులుకాఁగ, గగనచారులు నివ్వెఱపాటునొంద, నీయోధులు బాణప్రయోగంబులన్ జేసికొనుచునుండు॥

తే॥గీ॥ కమ్మభూపాలుఁడయ్యెడఁ, గఠినబాణ
సముదయంబులఁబఱపితా, సంగరమున
గుండరాయనినొప్పింప, ఘోరబలుఁడు

ఖరతరాంబకములఁ గమ్మదొరను నేయ॥ 401
వ॥ అప్పుడయ్యిర్వురుఁ బ్రళయకాలరుద్రులంబోలి, పెనఁగుచుఁ బౌరుషోక్తులా
డుచు, నేరికిందేఱిచూడరాకుండ బాణంబులఁ బ్రయోగించుచు, నొకరికొ
లల నొకరుఖండించుకొనుచుఁ, బోరాడుచున్న సమయంబున,॥ 402
తే॥గీ॥ పటుతరంబగుతూపులఁ, బఱపియపుడె
వెలమభూపతిచాపంబు, వీఁకఁద్రుంచి
కఠినమగుకాండములనేసి, కంకటంబు
నుగ్గునూఁచంబుగాఁ జేసెఁ, బగ్గెమెఱయ॥ 403
చ॥ తొలకరివానచందమునఁ, దూకొని బాణములేసి యార్చుచున్
నలకడనొందఁజేసి వడినారసముల్ పయిఁగుప్పి శాత్రవున్
బలమునుబీరమున్ దొలఁగఁబాదుచు మేనునఁనంటఁ గ్రుచ్చనా
వెలమకులోత్తముండతుల, విక్రమమున్ విడిపాటెనయ్యెడన్॥ 404
వ॥ అప్పుడా సూరభూపాలుండు, వైరిసైన్యవిజృంభణంబును, స్వసైన్యదైన్యం
బున్ జూచి, వికలమనస్కుండై, యెట్టకేలకు ధైర్యంబవలంబించి, రామలింగ
భూవిభునిఁ దార్కొని యని సేయ సమకట్టుసమయంబున॥ 405

❦ సూరభూపాలుండు రామలింగవిభునిచే మృతుండగుట. ❦

సీ॥ ధరణికంపమునొందెఁ, దరణికాంతులుడింపెఁ, గాకగృధ్రంబులు,కదిసియార్చె
ధారాధరంబులు, తల్లడంపడఁజొచ్చెఁ, దారకావళిభూమిజాఱఁజొచ్చె,
సేనాంగతురగముల్, చిక్కులకిక్కయ్యె, యోధవారంబెల్ల, నుస్సురనియెఁ
దాత్కాలికవిశేష, ధర్మముల్ వడివంగె, నపశకునంబులే, యపుడుదోఁచె
తే॥గీ॥ నంతనావెల్మహతధరా,కాంతులకును
బౌరుషోక్తులధైర్యంబు, ప్రబలునటుల
గములఁగూర్చుచుఁ దార్కొనెఁ, గమ్మదొరను
బ్రజ్ఞయత్యంత శౌర్యసంభ్రమమెసంగ॥ 406
మ॥ పటుకాండంబులఁజొన్పుచున్ బ్రబలదర్పంబొప్పధీరాత్ముఁడై
జటులానంతపరాక్రమస్ఫురణనాచండాంశునింబోలుచున్
నిటలంబుందగనాటరక్తమునువ, న్నైన్ జాలవెల్గొందనా
కుటిలాత్ముండగుసూరభూవిభునిఁదా, ఘోరంబుగాఁజెండుచున్॥ 407
మ॥ ఇదెమద్బాణపరంపరార్భటులచే, నేపారనిర్ద్రుంచుచున్
విదితోల్లాసమిగుర్ప రాజ్యమును నే, నిర్భీతిచేనేలుచున్

మదనాగంబులరీతినిద్ధరణిదు, ర్మార్గంబునంబోవుదు
ర్మదులన్ జక్కఁగనుక్కడంచిబుధరా, జ్ఞాన్యత్వముంగాంచెదన్॥ 408

మ॥ అనియుబ్బంగివచించిబాణములఁదా, నత్యంతచండాకృతిన్
ఘనతన్ శాత్రవునొవ్వనేయనతఁడున్, గాండంబులంబట్టియ
వ్వనజాతాక్షుని స్రుక్కఁజేయనృపుఁడ, వ్వైరాంధునింజూచిక్ర
న్ననన్ ద్రుంచెదభూతసంఘములకే, న్నగరానిమోదంబుగాన్॥ 409

వ॥ అని యిట్లువెలమ భూపాలుండుకర్ణక ఠోరవాక్యంబులఁ బల్కుచుననన్య సా
ధారణంబగు కోపకీలన్ వెలుఁగుచు, నాకమ్మ భూపాలుని, బాణాలచేనొ
వ్వఁజేయుసమయంబున॥ 410

తే॥ జగతినిటువంటివారినె, చ్చటనెఱుంగ
మారయేమిపరాక్రమ,మహాహాశక్తి
బాపురేసింగములొశర, భములొయనెడి
యూహజనియింపఁజేసిరి,యోధవరులు॥ 411

శా॥ జ్యాఘోషంబులు మిన్నుముట్టవిలసజ్జన్యక్రియాచాతురీ
శ్లాఘాయుక్తులఁగమ్మవెల్మదొరలు, చ్చైశ్శక్తిసంభశ్చల
న్మేఘోద్దండశితాంబప్రకరవ, ర్షిన్జాలఁగాబేర్చిమ
ర్మాఘాతమ్ములఁజేయుచుండిరి, ఘనాహంకారహుంకారులై॥ 412

కం॥ పాణులబాణాలంగొని।ప్రాణాలందీయునట్టి, పథకముచేతన్
రాణించిరివారిరువురు।ఘ్రాణేంద్రియమందుఁగోప, కాంతివెలుంగన్॥ 413

వ॥ ఇత్తెఱంగున, నవాజ్ఞానసగోచరంబగురీతినాయోధనవసుధాతలంబు, వర్ణనా
తీతంబై, రసవిదులచేననేకవిధంబుల నెఱుంగఁబడుచుండ, సాంద్రతరసైన్య
సమ్మర్దజపరాగపటలియంధకారంబునుదయింపఁజేయుచుండ, నుభయసైనిక
లునివ్వెఱఁగందిచూచుచు, నాశ్చర్యంబుగా, రామభూపాలుని జయంబుఁ
కోరుచుండిరయ్యెడ॥ 414

ఉ॥ పూనియదల్చివైచెనతి, భూరిజవంబుననుగ్రపావకా
నూనశిఖావళింజెనయు,నుగ్రతరంబగు బాణపంక్తి సం
ధానమొనర్చిపోరునెడఁ, దద్దయుఁబేర్చియుదగ్రదీప్తిచే
మానవనాధునిన్ బ్రబల,మార్గణముల్ వెసఁగూర్చవేయఁగన్ 415

చ॥ పటుతరతీవ్రకోపమున, భాస్కరతేజుఁడుదగ్రరోషుఁడై
చటులతరోరుకాండముల, సాహసమొప్పఁగఁగమ్మభూమి భృ

న్నిటులమునాటనేయ నవ,నీపతినీల్గినరీతిఁజూడ్కుచుఁ
బటిమదొలంగి భూతలము,పైఁబడె నాశ్రితులెంతొకుందఁగాఁ ॥ 416

వ॥ అంతటఁగొంతకాలంబునకు,మూర్ఛందేఱి, కాలసర్పంబురీతినగ్నిజ్వాలాభీలంబులగు, నిట్టూర్పులనిగిడించుచు, మహోద్ధతుండై, రామలింగవిభుండు, ఘోరాంబకంబులఁ, బఱపి వెలమదొరనెన్నఁజేయునప్పుడు॥ 417

మ॥ వినుమా,రాజకులాధమా; నినువెసన్, వేధించియుద్ధమ్ములో
ఘననారాచ పరంపరార్భటులచేఁ,గాంతొమితింద్రుంచినే
ననువొందన్ భువిఁగీర్తిచేఁ బ్రబలి దివ్యంబైన శౌర్యంబుచే
ననుజుల్ మిత్రులు సంతసించునటు మోదాంభోధినైయుండెదన్॥ 418

గీ॥ అనుచునావెల్మభూపాలుఁ, డాగ్రహమున
ననుపమోజ్జ్వలకాండంబు, లవనివిభుని
వక్షమునవాటనేయంగ, వసుధవిభుఁడు
మఱలబాణాలనేసిసా, మ్మసిలఁజేసి॥ 419

సీ॥ బాణత్రయంబునఁ, బ్రాభవంబలరార ముఖ్యాయుధమ్ముల, మురువునడఁచి
మఱిరెండుబాణాల, మర్మముల్ భేదించి గుఱ్ఱంబులనుబాణ, కోటిఁగూల్చి
పొరపాటులేకత, త్తఱపాటులేకచి త్తములోనమిగులసా, హ్యమ్మునిలిపి
రాఁబోవునట్టికా, ర్యమెఱింగిశాత్రవ కంఠపాశమ్ముల, గతులుదెలిసి

తే॥ వెనుకటినృపాలకులయుద్ధ, విభవమడర
వెనుకముందునుయోచించు, పీలుఁగాంచి
తగుజయస్తంభమునునాటు, తలఁపుచేత
విఱ్ఱవీఁగుచునుండెనా, వీరవరుఁడు॥ 420

వ॥ ఇట్లుకమ్మభూపాలుం, డఖండవిక్రాంతిధుర్యుండై వెలమఱేని ప్రాణంబులఁ గల్లోలపఱచి, మహాశూరశిఖామణియై,యుండ, మృతుండైన వెల్మదొరను గాంచి, ఖేచరులెల్లరు "యతోధర్మస్తతోజయః" అనురీతింబట్టియీతండధర్మవర్తనుండగుటచే, మృతింగనె, నపజయంబునుగల్గె, ననుచుండనవ్వార్త నొకయశ్వారోహకునిచే, హతశేషులైన వెలమదొరలు పాతూరుపట్టణంబుననుండు రాజస్త్రీలకెఱింగింపుమని పంపనప్పుడాతండట్లు సేసియంతఃపురస్త్రీలకువైరులజయంబును, దమకుఁగల్గినపరాజయంబును నెఱింగింపఁబట్టపుదేవి, తనప్రాణనాథుని మరణంబువిన్నతోడనే, కొందలంపడి కొంతకాలంబునకుం దెప్పిఱి

లి,యుద్ధవాటికకునంతఃపుర స్త్రీలతోఁడమ పరిజనంబులతో నుచితయానంబు
లలో, వెడలిరానయ్యెడ॥ 421

ఉ॥ ఆయెడ యుద్ధవాటికకు, నయ్యవతీమణులెల్లరుఁ వెసన్
బాయనిదుఃఖబాష్పములు, పర్వఁగనేడ్చుచు మాటిమాటికిన్
బోయలనందలంబులను, బొల్పుగనిల్పుమటంచు స్వీయులౌ
నాయకులుండు తావులను, నంతగతిన్ దురపిల్లుచుండఁగాన్॥ 422

క॥ నీలాద్రిరావుమొదలగు। ధీలలితులుచేరి యచటఁదేఁకువమెఱయన్
జాలింబడిదుఃఖించెడి। యాలలనలబుజ్జగించి, రయ్యెవిధులన్॥ 423

వ॥ అట్టియెడఁ బట్టంపుదేవి మొదలగు రాచనెలంతలు ప్రపంచమ్ముమునింగినరీతి,
బిట్టెలుంగున రోదనముచేయుచుండి రెట్టులన॥ 424

గీ॥ వైరివర్గంబుచేఁగూలి, వసుధయందుఁ,
బొరలుచున్నట్టి మొండెముల్, పెరిమఁగాంచి
యయ్యయో యయ్యయో జగమ్మడఁగెమాకు
నింకగతియేమియనియేడ్చి, రెంతొచింత॥ 425

గీ॥ రాజకాంతలయ్యు రాకేందుముఖులయ్యు। మేరచాలఁగల్గు, మెలఁతలయ్యు
భర్తృమరణదుఃఖ, భారంబుచేవారు। స్మృతిఁదొలంగిరెల్ల గతులచేత॥ 426

గీ॥ కట్టుకొన్నవలువ కాసంతతొలఁగినఁ। దొడిగికొన్నరవిక, ముడులువిడిన
వెలగలట్టినగలు, విడివడిపోయిన। నేమియెఱుఁగరీ మహామహిళలు॥ 427

గీ॥ ఔర భర్తలపైప్రేమ, మధికమగుట। నొక్కయామడదూరాన, నున్ననన్యుఁ
బొడఁగనని యీవియోగినీ, పుంజమెల్ల। వేనవేల్పూరుషులఁగాంచవెఱవవైరి

క॥ సతులకుఁ బతులే శుభసం। స్థితికిన్మూలంబు భర్తృ, చింతనయేస
ద్గతికినిమూలము గౌరవ। వితతియు భర్తృగతభక్తి వెలయున్ నెలనై॥ 429

వ॥ అప్పుడవ్వనితాజనవ్రాతంబు, చేతంబులు, వ్యసనగ్రస్తంబులై, యాక్రందన
ధ్వని సంక్రాంతంబులుగాఁగఁ, బిన్నపెద్దలు, బాలవృద్ధులు, సజ్జనదుర్జనులను
మాటలేక, సర్వజనంబులు వ్యసనవారిధిందగుల్కొని, లోకమ్మె యాక్రోశిం
చు చందమ్మున, విలపించుచుండునయ్యెడ॥ 430

గీ॥ అమ్మ "దేవేరి" కమ్మవా, రతిశయించి
మనమహాయోధులంగెల్చి, మనుజవిభుల
స్వర్గమునకంపిరాజును, బరముగాంచఁ
జేసిరన, నామె మిగులఁ గృశింపనేడ్చె॥ 431

వ॥ ఇట్లెల్లరాజాంగనలెల్లరు మహాభయంకరంబగు ప్రవిదారణధారుణింగాంచి విల పించుచుండిరి. ఆకదనస్థలంబు ఖండితశరీరుల యొక్కయు, నికృత్తహస్తుల యొక్కయు,మర్దితమూర్ధులయొక్కయుఁ,జలద్గ్రీవులయొక్కయు, స్ఖలన్నేత్రుల యొక్కయు, మేదోమస్తిష్క రుధిరధారానిరాఘాటంబై, గృధ్రాదిపలలాశన పక్షిసంకులంబై, మహాధీరుల చిత్తంబులకును నుత్తలంపాటుఁగొలుపఁజాలి యుండెనంతట॥ 432

తే॥ పుట్టినప్పటినుండి యెప్పుడునుభోగ, శాలులై కష్టవార్తలేలీలవినక
రాజ్యసుఖములఁగాంచెడిరాజవరులు, కాలవశమున భూస్థలిఁగలసిరకట॥ 433

ఉ॥ ఆయెడసూరభూమిపతి, యాహవమందునసిల్గిభూమిపైఁ
బాయనిరక్తపూరములు, బాగుగమేనునఁగ్రమ్మికారఁగాఁ
గాయముధూళిలోమునిఁగి, కంజదళాక్షుఁడు దీర్ఘనిద్రచే
సాయకసంచయంబులును, జక్కఁగమేనుననాటియుండఁగాఁ 434

సీ॥ భూనాథుఁగనుఁగొంచు, భూరిదుఃఖముఁబొడఁ, బొరలుచునురమును,జఱచు కొనుచు। నిజపతికడకేగి, నిరుపమంబైనట్టియాకళేబరముపై,నట్టెవాలి వ్యసనాంబుధిమునింగి, పలుమాఱునేడ్చుచు, వివశత్వమందెనవ్వీరపత్ని హాప్రాణనాథ యీ,యవనీపతులచేతఁ, జావంగనయ్యెనా,సామినీవు॥

తే॥ బళిరకాలంబుచేసెడి, పనులఁజూడ వింతవింతగనుండు,దే,వాంతకులను గడ్డిబొమ్మలఁజేయు నే, దొడ్డతనము సాఁగిరానీదు కార్యప్ర,సక్తియెడల॥ 435

గీ॥ కమ్మదొరలకు నీవతి,కఠినమైన కష్టములఁగల్గఁజేసిన,కతననీకు
నిట్టిదురవస్థసంధిల్లె,నేమియన్న నేమిలాభంబు నేఁడుప్రా,ణేశ చెడితి॥ 436

వ॥ అని యుత్తేజంగునఁబ్రత్యేకంబుగ, నిత్య దుఃఖంబుచే వెలమ దొరలసతీమణు లెల్లఁగాలగతికివగచి, యుద్ధభూమియందు నడ్డదిడ్డంబుగంబడియున్న యాదొడ్డ దొరలకళేబరంబులం గాంచి, తత్తత్సంకేత విశేషమ్ములఁ దమతమ ప్రాణనా థులుగ నెఱింగి, యనేకభంగులఁ బరితపించుచుండిరయ్యెడ॥ 437

కమ్మదొరసానులు యుద్ధభూమికందలంబులతో వచ్చి మృతులయిన తమతమ పతులంజూచి విలపించుట

తే॥ నారసాధిపువైపున, మీఱువారు
భూవరులుశక్తికొలఁదిగాఁ,బోరియుద్ధ
వాటికను బెద్దనిద్దుర, పట్టియుండ
వారిభార్యలుదర్శింప, వచ్చిరపుడు॥ 438

తే॥ వచ్చికమ్మనెలంతలు, పెచ్చుపెరుఁగు
దుఃఖభారమ్ముచేఁదమ, దొరలమేల్క-
ళేబరంబులఁజూచిగాల్సేతులాడ
కట్టెకుయ్యోయమ్మొ(బోయని, బిట్టువగచి॥ 439

వ॥ అనేక విధంబులఁ బతిభక్తివిశేషమ్ముచే, నానెలంతమిన్నలు చింతిల్లుచు, విలపించుచున్న సమయంబున, భూవిభులిట్లనిరి. 440

సీ॥ వినరమ్మ కమ్మభూ, వనితలారా మీరు, వగచిననేమిలాభమ్ముగలదు
జన్మించినట్టియే, తమ్మనాధుఁడేసన్వ,ర్గద్వారలబ్ధిచేగండఁడగును
మీమనోనాయకుల్, స్వామిభక్తివహించి యుద్ధానఁబోరాడి,యుక్కు-దక్క-
దైవానుకూల్యంబు, తప్పుటచేతవి. రస్వర్గమందిరి, భ్రాంతివదలి

తే॥ ప్రాణనాయకులౌటమీ, వ్యసనమునకుఁ
బారముండదుగానియే, వారికేనిఁ
జెందరానిసుఖమ్ములె, చెందినారు
వారికై చింతయేలదే, వేరులార॥ 441

తే॥ వేదములు శాస్త్రములు పూర్వ,విధులుగూడ
వీరులకు స్వర్గఫలము ప,విత్రమనుచుఁ
జెప్పియుండవె బుధులెల్లఁ జెప్పకుండ్రె
కాన శాంతింపుఁడీకమ్మ, చానలార॥ 442

వ॥ అని యిట్లు కమ్మభూపాలకులు మృతభర్తృకలకుఁ, దద్భర్తృకళేబరంబులఁ జూపుచు, వారిపరితాపంబు, తత్తదుత్తమోక్తులఁ బోఁగొట్టుచు, సొంత నెలవులకుంబోవ నియమించిరయ్యెడ॥ 443

క॥ ఇరువైపువారలయ్యెడ। నిరువైపులయుద్ధమందు, నీల్గిన ప్రజకుఁ
బరగున దహనాదిక్రియఁ। జరుపుటకై చేసిరవుడు, సద్యత్నంబుల్ ॥ 444

తే॥ యుద్ధమునఁ బెద్దనిద్దుర, నొందినట్టి। శౌర్యనిధులకు దహనాది, కార్యములను
శాస్త్రవిధిఁజేసిరతిశుద్ధ,సత్త్వులగుచు। మృతులకందఱకతినిత్య,గతులుగలుగ॥

వ॥ ఇట్లు యుద్ధనిహతులగు సర్వజనులకు, యథావిధిగ, నగ్నిసంస్కారముం జేయించి, గోభూదానాది మహాదానంబులాచరించి, దిక్కు-లేని యోధులకుఁ గూడఁ, బితృక్రియలాచరింపఁజేసి, యనాధప్రేతసంస్కారంబులొనరించుచు, నుండునట్టియెడ॥ 446

సీ॥ ఆయెడ దొరసాను,లందఱు పతిభక్తి, హెచ్చుగాఁగల్గిన, హేతువునను

జాలవందురుచుని,చ్చలు దివ్యజలములొ, కొలఁకులకేగి మి,క్కుటపునియతి
స్నానముల్ దానముల్,చక్కఁగాఁబచరించి, తమసంతతికివృద్ధి, తలఁచితలఁచి
దేవతాసేవ్యుఁడౌ, దేవదేవునిఁగొల్చి, తమశిబిరంబుల, దరికిఁజేరి
తే॥ మఱచిపోయెదమన్నను, మఱవురాని
భర్తృపురణంబులకుఁ జింత, పడుచునుండి
యెట్టులోరేయిఁగడపిరి, పట్టుఁదొలఁగు
వృక్షశాఖలవిధమున వివశలగుచు॥ 447

## వెలమనెలంతలు మొదలగువారు, పాతూరుపట్టణంబుఁ జేరుట.

సీ॥ వెలమవారందఱు, వలయుకర్మము లెల్ల నెఱవేర్చుకొని బహు, నియతితోడ
హతశేషులైనట్టి, యన్యులతోఁగూడి, పట్టంపుదేవితో వచ్చుచుండి
రామెయుసంతాప, మందుచుఁ బరిజనుల్ సేవింపనెల్లరు చెంతరాఁగఁ
బాతూరుపట్టణ, పథమందువచ్చుచు, నిహవాంఛలనువీడి, యెట్లొమెలఁగె
తే॥ సౌధములఁజంద్రశాలలఁ,జారుగిరులఁ
జేటిచూడక మఱియొక్క, దారిఁగనక
ప్రాణనాధవియోగసం, భవమహాధి
వార్ధిమునిఁగిరి వెలమభూపతులసతులు॥ 448

వ॥ ఇవ్విధంబున వెలమదొరసానులు, పతివియోగజనిత మహాదుఃఖంబున,మునింగి
యేమియుందోఁపక యవస్థపడునెడఁ, గొందఱు విద్వచ్ఛేఖరులు కొన్నిధర్మం
బులంబోధించుచుంట, వారు మనోనియమంబుఁజెంది, తత్త్వజ్ఞానసంపన్నలై
యావెలమదొరయగు సూరభూపాలుని ప్రియపుత్రుండగు నరసారావునకుఁ
బట్టంబుఁగట్ట నాయన రాజ్యంబేలుచునుండె ననంతరంబు॥ 449

## కమ్మదొరలు చింతపల్లెంబ్రవేశించుట

ఉ॥ ఇచ్చటఁగమ్మభూమిపతు, లింపుగసజ్జయమందిచెచ్చెరన్
వచ్చుచుఁజింతపల్లెకును, వాలుగసైన్యముతోడనప్పుడే
చొచ్చిరిసౌధరాజపరి, శుద్ధతలాంతరసీమలందుబల్
మెచ్చుగనంగనామణులు, మేలిమియారతులిచ్చుచుండఁగన్॥ 450

గీ॥ వారవనితలుసంగీత, వాద్యములను
జోపుదారులుపౌరుష, సూచకములఁ
బెద్దలందఱుజయవచో, విభవములను

మేలుసూచింపవచ్చిరి, మేడలకును॥ 451

ఉ॥ శూరులుయుద్ధపద్ధతిని, సాక్కియుఁబోలియుబాణపంక్తులన్
మేరకుమించుబాధపడి, మిక్కిలిపౌరుషముండుటన్ మహా
వీరవతంసులై రిపుల, వేగనదల్చికృతార్థులౌచు వే
చేరిరిగేహసీమలకు, జేడెలుసంతసమందికాంచఁగాన్॥ 452

వ॥ ఇట్లాయోధనబాధావిశేషంబులఁ జిక్కుపడియున్నవారలు స్వశరీరపోషణంబు, చికిత్సావిధానంబుల సమకూర్చుకొని, యిష్టశిష్టజనంబులనాదరించుచు, వారిచేనాదరింపఁబడుచు, నభీష్టదేవతారాధనలసలుపుచు, దమతమభూముల నేలుచు, దీనులఁగరుణించుచు, యుద్ధమృతులైనవారి పుత్రులకును, హతశేషులై జయంబుసేకూరఁ జేసినవారలకును, దగుసత్కారంబులొనర్చి, వృత్తులనొసంగి, పరితృప్తులనొనర్చి, సౌఖ్యానందులై యుండిరయ్యెడ 453

మాలిని॥ పరమవిమలమూర్తీ, భవ్యచారిత్రవర్తీ
సకలనిగమవంద్యా, సాంద్రవిద్యాభినంద్యా
నిరుపమగుణశాలీ, నిర్మలానందశైలీ
సురుచిరముఖచంద్రా, సువ్రతారామచంద్రా 454

స్రగ్విణి॥ రామచంద్రాజగ, ద్రక్షకారాక్షసో
ద్దామతేజోంబుధిస్థానకుంభోద్భవా
శ్రీమహాత్మాయశశ్శ్రీనివాసాపరం
ధామసుత్రామనుత్యాననుంబ్రోవుమా 455

ఇది శ్రీసీతారామచంద్ర కరుణాకటాక్ష వీక్షావిశేషసంప్రాప్తకవిత్వవైభవ, శ్రీ
మదఖండ సచ్చిదానంద స్వరూపరాజయోగానందానుభవ, పవిత్ర వల్లుట్ల
గోత్ర వాసిరెడ్డి వంశసంభవ, వెంకమాంబా సూరయనామధేయ
తృతీయ తనూభవ, బుధజనవిధేయ, సమ్యక్కృతాతిథేయ,
సత్సహవాస, వెంకటసుబ్బదాస ప్రణీతంబయిన వాసి
రెడ్డివంశచరిత్రమ్మునందుఁ దృతీయాశ్వాసము
సంపూర్ణము.

శ్రీ సీతారామార్పణమస్తు.





శ్రీ రాజా వాశిరెడ్డి వెంకటాద్రినాయుడు మన్నెసుల్తాన్ బహాదరుగారు.



శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# వాసిరెడ్డివంశచరిత్రము

## చతుర్థాశ్వాసము.

### వేంకటాద్రిప్రభుచరిత్రము.



రఘురామచంద్ర, సుర, శేఖరసన్నుతశౌర్యసాంద్ర, దు
ర్వారవిపక్షబాహుబల, భంజకదోర్బలసార, యర్థిమం
దార, యఘౌఘనాశకప, దద్వయ, దీనశరణ్య, మాన్యసం
చార, మహాత్మదేవర, ప్ర, శస్తవిధిన్ వినుమాకథాస్థితిన్॥ 1

వ॥ అని తొల్లిటియట్ల గంధవహసూనుండామోద బంధురుండై, స్వామికి యవ్వలికథవినుపించునట్లు నానొడువువిధంబెట్టిదనిన॥ 2

క॥ సభలోవిబుధౌఘంబులు। శుభగతిఁ బ్రాచీనకథల, సురుచిరగరిమన్
బ్రభువర;వినుమని తెలుపఁగ। విభ వేంద్రుఁడుతేఁడువినియె, వేత్తృత హెచ్చన్॥ 3

చ॥ ప్రభువరుఁడాశ్రితావళికిఁ, బ్రాపగువాఁడుదయాంబురాశియై
త్రిభువనవల్లభుండనఁగ, ధీవిభవంబున యోగ్యబుద్ధిచే
నభయమొసంగుచున్ బుధజ, నాళికిమేలుపొసంగఁజేయుచున్
బ్రభ వెలుఁగంగలోకములు, పట్టనికీర్తినిఁగాంచెనన్నిటన్॥ 4

గీ॥ రాజ్యపరిపాలనంబతి, రమ్యముగను సర్వసంశ్లాఘ్యముగఁ జేసి, సర్వవిధుల
సత్యమేనిత్యమనుచును, స్వాంతమందుఁ దలఁచివిలసిల్లెరాజను, త్రాముఁడహహ

ఉ॥ భూవిభుఁడయ్యెడన్ సకల, భూమిపకోటికిసంతసమ్ముగాఁ
జేవనుహెచ్చిసద్విధుల, చేఁతలమించిప్రసిద్ధిఁగాంచఁగాఁ
గోవిదబాంధవావళులు, గొప్పగఁదన్నుఁదలంచుచుండఁగా
భావమెలర్పమంచిపని, పాటులొనర్చెజగమ్ముమెచ్చఁగాన్॥ 6

సీ॥ వాసిరెడ్డిమహాన్వ, వాయసింహంబౌక, నాఁడుసభందీర్చి, పోడిమెఱయ
మణిరత్నకీలిత,మకుటంబుధరియించి, భుజకీర్తులనువుగాఁ,బొందుపఱచి
కోఱమీసంబును, గొమరొప్పసరిచేసి,గొప్పగుఱ్ఱమునెక్కి,యొప్పుగాను
గండరగండఁడై, గరిమతోబసవశం,కరుఁడన్నబిరుదంబు,నెఱివహించి

తే॥ మన్నెసుల్తానుబిరుదంబు,మఱియుఁదాల్చిఁ
చోపుదార్లెల్ల బిరుదముల్,సొరిదిఁజదువ
గజతురంగంబులును సేన,కదిసివెలయ
నాకవిభుధిక్కరించెనయ్య,వసివిభుఁడు॥ 7

సీ॥ ఎనిమిదిదుర్గమ్ము, లేరాజుసాధించి,తోరణమ్ములుగట్టెధారుణిపయి
రిపులమంత్రాంగముల్, నిపుణతనేరాజు, రిత్తవ్వొవఁగఁజేసె రేఁగియేర్చి
తడయకశాసన,స్థంభంబులేరాజు,స్థాపించెభువినిండ, నేపుమీఱ
మృష్టాన్నదానంబు, మెప్పుగానేరాజు, ద్విజులకుఁబెట్టించె,దీప్తిమెఱయ

తే॥ నగ్రహారశతంబున,నుగ్రహించి బ్రాహ్మణులకిచ్చెనేరాజు,బ్రహ్మభక్తి
నట్టియాక్షితినాయకు,ననుకరించు రాజులనలేరులేరుగా, రూజఁగాంచ॥ 8

సీ॥ ఘనతులాభారంబు,మునుకొనియేరాజు, ముమ్మాఱుదూగఁసమ్మోదమలర
గోగర్భమునుజొచ్చి, కూర్మిచేనేరాజు,విప్రులకర్పించె, వేడ్కమీఱఁ
గనకమయూరంబు,ఘటియించియేరాజు, వాహనంబనియెక్కెవాంఛదీఱ
శంకరాలయములు, శతమేకమేరాజు, కట్టించియర్పించె, గౌరిపతిని

తే॥ మణిమయంబైనమకుటంబు, మండలేంద్రుఁ
డవనిధరియించియేరాజు, మివిలెనతఁడు
వేంకటాద్రీంద్రుఁడేగాక, వేడ్కమీఱఁ
గలియుగంబునఁగలరనఁ, గల్లకల్ల॥ 9

సీ॥ ఏరాజుధరామిపై, నింపుగాబహుపట్టణంబులఁగట్టించెఁ డంబుమెఱయ
నేరాజుగోవుల,ధారాళముగనిచ్చి, ద్విజులచేఁగాంచెసత్కీర్తిఁబుడమి

నేరాజుజన్న మ్మొలెన్ని యోచేయించి, యజ్ఞేశ్వరప్రీతి, నందుకొనియె
నేరాజువరదాన, ధారచేదారిద్ర్య, రేణువుల్ తొలఁగుదా, రినిగణించె
తే॥ నట్టిడగణితసుగుణాగ, ణాబ్ధివిక్ర
మక్రమధనుండుసంప్రదమాఘనుండు
శైలసమధీరుఁడుద్దండశాసనుండు
వేంకటాద్రివిభుండుసం, విద్వరుండు॥ 10
వ॥ ఇట్లుండ నమ్మహారాజశేఖరుని రాష్ట్రమందు నొక్కవిపినతలంబున సంచరించు నడవిచెంచులు స్త్రీపురుషాదులననేకులబాధ పెట్టుచువారల యొక్క భూషణాదితస్కరణంబొనర్చుచు, నబలలవలవని పనులఁ దూలించుచునుండఁ ద దుదంతంబు, చారచక్షుష్కుండై, విని యేకాంతంబున, నివారణోపాయం బాలోచించుచు, నాలోచింపకున్న రాష్ట్రేతరపరిపాలకులవలన నపఖ్యాతియు సంఘటిల్లునని యెంచి, యుండుసమయంబున॥ 11
శా॥ భూపాలుండిటుతన్ని కారమునకుఁ, బొల్పొప్పువీలెంచనే
కోపంబుఁ మదిలోననిల్పుకోనకే, గోలందొలంగింపనే
పాపంబుఁ గనఁబోనియోధవరునాహ్వానించియాపాపులఁ
వేపాపంబుననుండిత్రిప్పుటకునై, వీలొప్పఁదానిట్లనుఁ॥ 12
సీ॥ మనరాష్ట్రమందున, మర్యాదవిడనాడి, విపినాంతరంబున, వివిధగతుల
దుర్వృత్తిచేతఁదుం, దుడుకొప్పఁగానుండి, కుటిలప్రవర్తన, చటులులగుచు
మర్త్యులందఱఁబట్టి, మానుషమ్ముచెడంగ, భూషణాదులఁగొని, భూరిశక్తిఁ
బరితాపమొందించి, పాంథులనెల్లర, భీతిల్లఁజేయుచుఁబేర్మిఁదక్కి
తే॥ మనదుమేదరసాలను, మనికిఁజేసి స్వేచ్ఛమైసంచరించుచుఁ, దుచ్ఛమతులు
తలఁచికొన్నంత గుండెలు, తల్లడిల్లఁ జెంచుదొరలుండిరచ్చటుఁ, జేరినీవు॥ 13

❋ రాజాజ్ఞచే భుజంగరావు చెంచులంజింతపల్లెకుం దోడ్కొనివచ్చుట ❋

వ॥ వారిందగురీతి నీసామవాక్యంబులచేతన, యెటులేనిఁ దోడ్కొనిరమ్మని నప్పుడా భుజంగరావను పంచముండతి బలవిభవాతిశయంబున, నాతేని సేనాధిపతియై, యుండెంగాన, తేనియాజ్ఞ శిరసావహించి వనికిం జేరెనయ్యెడ॥ 14
ఉ॥ కాంచె భుజంగరావుపథి, క్రకరాతికఠోరదుష్క్రియా
భ్యంచిత కాననాంతరవి, హారిసురారిసమానదంభప
ద్యాంచల సంచరత్కుమతి, యాపనసాధనహస్తనిస్తులా
వంచనకుంచితాటవిక, వైరుల ధీరులఁ జెంచువారలఁ॥ 15

తే॥ మానవంతుఁడు మేటి సేనానియపుడు
శాంతరసముట్టిపడ వారి, సరసఁ జేరి
యందు శ్రీరామదాసను, నధికుఁ గాంచి
మన్ననవచించె యుక్తమౌ మాటలపుడు॥ 16

వ॥ ఇట్లు మాటాడినపిమ్మటఁ జెంచులు వారివారితావులం దెలుపుకొని, సంశయింపక యుండుసమయంబున, వారిలోఁ బెద్దయగు రామదాసుం గాంచి "ఓయీ నీవీవనమధ్యంబున నీవారందఱితోఁ గూడి దుష్టకృత్యంబుల నాచరించుచు నీవారలాచరింప హర్షించుచునుండఁ జెల్లునా? భగవంతుని దయదప్పినచో మనమెంతవారము. పాపకృత్యంబులచే నధోగతిపాలగుటదప్ప వేఱేయేమున్నది" అని భుజంగరావనుచు రాజశాసనముం దెల్పనెంచి యప్పుడు॥ 17

గీ॥ అధిపులందఱిలో వేంక, టాద్రివిభుఁడు। శిష్టపోషణ మొనరించి, దుష్టశిక్ష
ణమ్ము సేయుచు దేవతా, నాథుమాడ్కి। వర్ధిలుచునుండెరిపువన, వహ్నియగుచు॥

ఉ॥ కావునమీరలీయెడల, గౌరవమారఁగఁ గొంకుతోడనే
యావిలపాటునొందక స, మంచితభక్తి చెలంగునట్లుగా
మీవివరంబుఁ దెల్పుకొని, మెప్పుగఁ బాలనసేయుమంచు స
ద్భావముతోడ భూవిభుని, భక్తినిఁ గోరఁగఁ బ్రోచుసత్కృపన్॥ 19

వ॥ ఇట్లు చెప్పినవిని యాచెంచులందఱు, పత్నీపుత్రసమేతులై బయలువెడలివచ్చుచుఁ దమమనంబుల "మనకు నేకొఱంతయుఁ గలుగకుండ శ్రీవేంకటాద్రిప్రభువరుండు పోషించునని భుజంగరాయోక్తుల నమ్ముకొని శ్రీకృష్ణభగవానుని చారిత్రంబులఁ గానమ్ముచేయుచు నాడుచుఁ బాడుచుఁ బ్రభునివాసంబునకుఁ జనునయ్యెడ॥ 20

## అడవిచెంచులు రాజుసన్నిధికివచ్చుట

గీ॥ మున్ను రాజేంద్రుకడ కేగి, మోదమలర నడవిచెంచులరాకను, ఘనత మీఱఁ
దెల్పు విభుతోడ నవ్వార్త, తేటపడఁగఁ బ్రవిమలానందభరితుఁడై, పటిమమీఱయ
గీ॥ చెంచులార మీరు చిరకాలముననుండి యడవిలోన తీసు, తాళిఁగూడి
చౌర్యవృత్తిచేత సకలపాంథులఁ బట్టి బాధపెట్టుచుంట, పాడియగునె॥ 22

క॥ ఎత్తితిరిమనుజజన్మం బెత్తెఱఁగున నొరులబాధ, యించుకయైనన్
వృత్తింగనుపట్టదొతద్వృత్తియె సర్వజనయోగ్య, మెయ్యెడనైనన్॥ 23

వ॥ అననా చెంచువారలు తమవివేకము కొలంది, నిట్టులం దెల్పి రెట్లనిన 24

క॥ ఓరాజశేఖరా! విను, నారాయణమూర్తిమమ్ము, నానావిధులన్
జోరోద్ధతులనొనర్చెను జోరకృతుల్ సృష్టియందుఁ, జోదితములెకా॥ 25

వ॥ ఇట్లుపలుకుచున్న చెంచుల యుక్తియుక్తోక్తులకు, వల్లభుండతికుతూహలి యై "శివాజ్ఞపృథివియందనేకవిధులసృష్టినేర్పఱచి పుణ్యపాపమిశ్రకర్మలఁగల్పించె, నందుమనుష్యజన్మంబు దుర్లభంబు. తొల్లికొందఱు ఋషిప్రవరులే, దుష్కృతిపరాధీనులై యుండ, మహర్షీంద్ర సందర్శనమాత్రంబునను, భగవద్భక్తిసంప్రాప్తంబై తరించిరని వింటిమిగాన, మీకీయెడఁ గావలయు జీవనోపాయంబుల సమాకూర్చెద, మీదుశ్చేష్టలు మాని మాకొల్వునందుండుఁడ"ని రాజాజ్ఞాపింపబద్ధులై వల్లెయని తద్రాజసన్నిధిఁ గొల్వుసేయ నంగీకరించి రయ్యెడ॥ 26

తే॥ ఐదువందలమందియూ, నడవిచెంచు| లెంతొభుజదర్పమేర్పడ, నెలమిమిగుల మత్తమాతంగములరీతి, మంచిత్రోవఁ గొల్వుసేయుచునుండిరి, గుణముకుదిరి॥

సీ॥ ఒకవేళనొక్కఁడ, త్యుత్సాహమేపారఁ, గరితుండముల నేలఁ జఱచికొట్టి
ఘీంకారములచేతఁ, గిక్కురుమనకుండ, గజములెల్లనుబడు, గజిబిజిగను
మఱియొక్కభటుఁడేగి, మత్తగజంబుపైఁ, గుప్పించిదుముకును, ఘోరగతిని
బంజరాంతరమందుఁ, బరఁగుశార్దూలమ్ముఁ, బట్టియాడించును, బంటొకండు

గీ॥ వారిలోబంట్లుకొందఱు, వ్యాఘ్రగణము| జూచువారికిభయముమెచ్చునువెలుంగ
మిగులవింతైనచేష్టల, మిన్నుముట్టి ప్రభునిపేరోలగంబున రాణగనిరి॥ 28

తే॥ గీ॥ ఇట్టులాచెంచులయ్యెడ, నినునియాజ్ఞఁ
దాలఁగియుచ్చుకువచ్చినధోరణులను
నగరివారలుభయపడ, నడచుచుండి
రేరువారింపలేరను, దారిఁద్రొక్కి॥ 29

చ॥ తమకెదురేగుచెంచుజన, తండములన్ దమశక్తిచేత భూ
మిమడియునట్లుత్రొక్కుచును, మిక్కిలిమాటలగోటమీఁటుచున్
శ్రమకునహించిసాధముల, జాడలకుంజనితన్మనోజ్ఞతన్
విమతులమాడ్కిఁగీడ్వఱచి వెఱ్ఱిపనుల్ పచరించుచుండఁగాన్॥

వ॥ ఇట్లుండనొక్కదివసంబున నాభూపాలశేఖరుండు వనవిహారమ్ము సేయంబోవఁ దలంచి చెంచులనాయకుండగు, జల్లాల కృష్ణానాయకునిరావించి నేఁడు మృగయార్థంబుచనందలంచితిమి కావున సేనాసమేతుండవయి నీవునురమ్మనఁద

ద్రాజునానతి, నాతండునుదన సైన్యంబుసమకూర్చుకొని రాజచంద్రుసితో
వనవిహారంబున కరిగెనప్పుడు॥ 31

## రాజు చెంచులనుగూర్చుకొని వనవిహారంబునకరుగుట

చ॥ కరులుహయంబులున్ భటని,కాయముతోడఁజనంగహెచ్చుగా
సరసులుసంతసింపరభ,సంబుగలట్టి తురంగమెక్కి యా
నరవరమాళికూర్చని వ,నమ్మునఁజక్కఁజరింపనయ్యెడన్
పెరిమనుజేరియుండెఁబలు,పెద్దలు బాపురెమేలుమేలనన్॥ 32
ఆ॥ రాజువనవిహారమోజఁబోయెడివేళఁ బౌరభామలెల్లఁ, "ప్రవిమలాత్మ
మీకుశుభములగును, మేదినీశ్వర" యంచు సేసలెల్లఁజల్లి వాసిగనిరి॥ 33
తే॥ స్వర్గనాథునిరీతిన,నార్యగతులఁ దగినపరికరములతోడ, ధాత్రివిభుఁడు
వనవిహారంబుసలుపఁబో,వంగనపుడు శకునములుమంచివైచాల, సంభవించె॥
సీ॥ పక్షమందుతేఁడు స,త్పథమందుతేఁడునాఁ బరిపూర్ణకళలతో,వచ్చుచుండఁ
చెంచులెల్లరుకార్యసంచయంబులమాని; తొల్లింటివారిదా,త్రోవఁద్రొక్కి
పర్వతాగ్రంబుల, గర్వించిలంఘించి నడబావులనుబాడుపడఁగలంచి
వృక్షాగ్రములనెక్కి, పీఁకమైదుముకుచుఁ, దమనాథులెక్కించు,తలఁపులేక
తే॥ వర్తిలుచునుండువేళభూ,వల్లభుండు
వీరదాసనునాయకుఁజేరఁబిలిచి
"వీరికీపనికూడునా యోరి?" యనఁగ
నాతఁడును జ్ఞానికాక దు,శ్చేతమునను॥ 35
గీ॥ వెఱ్ఱివెఱ్ఱిపనుల్సేయ,నీలుతోలఁగె నేమిసేయంగఁదగునంచు,నెంచితేఁడు
వీరలనువంచుమార్గంబు,వెదకుచుండెదయయొకించుకమనమందు,దాఁటిపోయి
చ॥ వనమునసంచరించునెడ వ్యాఘ్రములన్ మెడఁబట్టితెచ్చియా
ఘనవిభుసన్నిధిన్ నిలిపి, కాననభిల్లులుధిక్కరించుచున్
మునుకొని వారివారిబలమున్ ప్రభుమాళికిఁదెల్పుచుండ న
మ్మనుజవరేణ్యుఁడయ్యెడస,మంచితవృత్తివహింపవారలున్॥ 37
వ॥ అప్పుడా రాజోత్తముండు, పిపాసాపరాయత్త చిత్తుండగుటచేత, నొక్కబం
టుంబిలిచి, విమలజలపరిపూర్ణంబగు కాసారంబెచ్చటఁ గలదో కలయంబరి
కించి, యెఱింగింపుమన నాబంటును వల్లెయని చనియున్న తెఱంగెఱింగింప
భూనాథుండయ్యరణ్యంబునఁ దనపరిజనంబులం గూడుకొని, కాసారంబునకుం

జనుచుమార్గమధ్యంబునఁ ఫలపుష్పబలప్రకీర్ణంబులగు మనోజ్ఞవృక్షరాజంబు
లఁ గాంచుచు, సుమనసమంచిత మనోహరగంధబంధురతావిస్తృతలతావిత
తిందిలకించుచు, మందమారుతసంచార పూరితవివరంబులై, యవ్యక్తమధుర
ధ్వనులవెలువరించు వంశాదికాష్ఠప్రకాండంబులఁగనుంగొనుచు, జలవిహంగ
మసంచరణ రణరణత్కారరంగంబగు సరస్తరంగపటలంబుఁగాంచి, కాంచి
నంతనదప్పిఁదప్పించునట్లు గన్పట్టు మట్టుగల సలిలంబాప్యాయనంబుగం గ్రో
లి, భోగినివాసయుక్తంబగు నాసరసీదిక్తటంబున విడిసియున్న నంతట మం
త్రిసత్తము లాడువాక్యమ్ముల నెంచి స్వనివాసంబునకేతెంచి రనంతరంబు॥38

శా॥ భూనాథుండు మనమ్మునన్ గరుణమెప్పంగల్గువాఁడౌట సం
తానంబట్లుచరించు చెంచులనెటుల్, దండింపనౌనంచునే
హానిం జేయకయున్న దుర్మములుమ, ర్యాదం దిగంద్రావిభూ
తానందారి పథంబుఁద్రొక్కరెటులో, యంచున్ విచారించుచున్॥ 39

మ॥ మఱునాఁటన్ సభకేగి మావిభుఁడు సా,మంతాదులన్ గూడి భూ
సురరత్నంబులఁబిల్వనంపియనువౌ, చొప్పున్ వినంగోరి శ్రీ
వరసింహాసనమెక్కియుండిమిగులన్, వైరాగ్యభావంబునన్
గరమున్ విన్నఁదనంబుఁదోఁపఁబలికెన్, గంభ్యుజ్జ్వలంబౌసభన్॥ 40

మ॥ వినుఁడీ భూసురవర్యులార; వినుఁడీ, వేదాంతులారామతుల్
వినుఁడీ మంత్రివతంసులార; మనపృ,ధ్విన్ జెంచులీనాఁడు మొ
ల్లనవర్తించుచు దుష్టచేష్టలకునె, ల్లల్ గాఁగనున్నారు నే
వనిలోనన్నిటిగుర్తెఱింగితిభవ, ద్భావంబులన్ జేర్చితిన్॥ 41

మ॥ అని భూపాలుఁడు తత్సభన్ దెలుప నా,హాకారపర్యాప్తులై
వనజాక్షుంగనిపల్కిరాసభికులున్ భావానుకూలంబుగా
మును గ్రంథంబులఁజెప్పియుండెనుగదా, మూర్ఖుల్ ధరాపాల; న్యా
యనివాసంబగు రాజ్యమందుఁదగర, య్యాయుండనంచున్ వడిన్॥ 42

తే॥ రాజమార్తాండ చెంచుల, తేజమడఁపఁ
దగిన యోధులఁబంపయో, ధవరులేగి
వారిమడియించుటేమంచి, పసిద్ధువమ్ము
కనికరించిన దుష్క్రియల్, ఘనమెయగును॥ 43

వ॥ అని తత్తదుచిత ప్రసంగోక్తుల జేనికందఱు విన్నవించిన నావల్లభుండు తన
మనంబునఁ గొంతవడి విచారించి, యేకకాలంబునం జరుపఁదగు సాంఘిక

మరణంబునకుం, జింతించి న్యాయ్యమాచరించుట యుక్తంబకదా యని ని
ర్ణయించుకొని యప్పుడు॥ 44

సీ॥ బాహుదర్పముచేతఁ, బాటిల్లుచుండి య, త్యద్భుతింజరియించు, నొప్పుగలుగు
వీరసింగనువాని, వీరాగ్రగణ్యుని, రామసింగనువాని, రౌద్రభటుని
భద్రసింగనువానిఁ, బటుదర్పశూరుని, భుజగరావనుమహా, భూరిబలునిఁ
గోటోజి నర్సోజి, ఘోరబలుండైన, రామోజినింక మ,రాటవారి

తే॥ యోధులందఱరావించి, బోధపడఁగఁ
బల్కె నారాజు వారితోఁ బటిమమెఱయ
మీరు మీసైన్యచయమును, మెప్పుగాను
గూర్చుకొని వేగరండంచు, ఘోరగతిని॥ 45

వ॥ అని యిట్లు, నియమింప, వారు తద్రాజాజ్ఞానుసారంబుగా గుమిగూడి రాఁగ
నప్పుడారాజిట్లనియె॥ 46

♦ రాజునిజయోధులంజేరి చెంచులతో దురంబుసల్పి చక్కాడుమని నియమించుట ♦

క॥ మీమీమేలఁకువతోడనఁ క్షేమాతిశయంబుగదురఁ, గెరలుచుమీరల్
సామంతులైనచెంచులఁ నేమించుచుఁజంపవలయు, నిర్భయవృత్తిన్॥ 47

ఉ॥ సందడిఁజేయకుండఁగను, జక్కనియుక్తులమీరలిప్పుడే
యందముగానుదుష్టులగు, నందఱఁగైకొనిపోరిలోపలన్
బొందుగబాణసంఘములఁ, బొంకమడంచుచుఁగాలువీటికిన్
దొందరనంపఁగావలయు, ధూర్తులసైపఁగరాదునిచ్చలున్॥ 48

గీ॥ యోధులాతేని యానతి, నుక్కుమిగిలి వేగఁగైకొనిచెంచుల, వీఁచమణఁప
నాయుధంబులతోఁగూడ, నతిశయిల్లి తరలిరప్పుడుచెంచుల, తెరువులరయ॥ 49

సీ॥ సేనాధినాయకుల్, స్థిరధైర్యమలవడ, రాజాజ్ఞఁగైకొని, రౌద్రమెసఁగ
శ్రీరామదాసను, ధీరవరేణ్యుని, రావించిచెప్పిరి, రమ్యముగను
నేఁడుమాపైనేమి, నెనరులేకుండఁగా, సెలవొసంగెనురాజు, స్థిరముగాను
మనసైన్యములతోడ, మనమందఱముఁగూడి, బయటిభాగమ్మునఁ, బ్రౌఢగతిని

తే॥ బోరిజయమందఁగోరెను, భూవిభుండు
కానమీరలువెడలుఁడీ, కదనమునకు
ననఁగఁజెంచులనత్తఱి, నాత్మశక్తి
నాహవంబునకునుబోయి, రతిశయిల్లి॥ 50

వ॥ ఈప్రకారంబుగా నుభయబలంబులు యుద్ధవాటికకుంబోయియుండ నందు జేనియోధులు "మన మీయెడ నీభిల్లభటవర్గంబుతోఁ బెనంగిన జయంబుగ నుంగొనుట దుర్లభంబు. వీండ్రును గుటిలవర్తనులుగనుక మాయోపాయంబు ననీదుర్మార్గులఁజక్కాడుటుచితం" బనికపటపురస్కారంబుగ నని సలుపనెంచి రనంతరంబు॥ 51

మ॥ అపుడాకానన భిల్లులందఱును సేనాగ్రేసరుల్ ప్రజ్ఞచే
నిపుణత్వంబునఁజేరి దార్ఢ్యముగనా, న్నీరేజముల్ డిందఁగా
విపులప్రాభవమేర్పడన్ మిగుల నా, వేశంబు సంధిల్లదు
ష్కపటంబొప్పఁగఁజేయఁబూనిరటసం, గ్రామంబుశ్రేయోర్థులై॥ 52

సీ॥ మెలఁకువతోడను, మెప్పైనకార్యంబు, లలవడునట్లుగా నధికులపుడు
కనుసైగతోడను, గానులుబిగియించి, యిట్టట్టుకదలంగ, నీకవేగఁ
బటుతరంబైనట్టి, పదివేలసైన్యంబు, వివిధప్రయత్నముల్, వెలయఁజేసి
మొనఁదేలిరవ్వారు, మూర్ఖభావంబున, ముష్టియుద్ధమునకై కష్టగతిని

తే॥ దురముసలుపంగవారలు, తుచ్ఛగతులఁ
బాదఘట్టనములరేణుపటలి, వెడలి
భూనభోంతరములఁగ్రమ్మ, భూతవితతి
నివ్వెఱఁగుపడఁజొచ్చె నానియతిఁగలఁగి॥ 53

చ॥ విశువనిసాహసమ్మునను, వ్రేల్మిడిఁదాఁకుచు బాహుదర్పముల్
నుడివడువీరశౌర్యమున, సుస్థిరధీరత వ్యాఘ్రరాజముల్
కడువృషభేంద్రులన్ బొదువు, కైవడిఁ జెంచులఁబట్టి హిందువుల్
గడియలమీఁదఁగొట్టిరి యఖండగతిన్ జనిపోవఁ గొందఱున్॥ 54

ఉ॥ మోసమొనర్చిమమ్మునతి, మూర్ఖమనీషనుబట్టికట్టి మా
యాసలువీడఁజేసియిటు, న్యాయమువీడి కఠోరవృత్తిచే
మానరిమేమెయంచుఘన, మా! మముఁజంపఁగఁజెప్పిచేసిరన్
దాసులలోనసెక్కుఁడుఁడు, దార్కొనమీఁగతి గన్పడున్గదా॥ 55

ఉ॥ కాననమందుఁజేరికడు, గౌరవహీనతదుష్టకార్యముల్
పూనియొనర్చితెల్వినెక, బొంతకుఁద్రోసినపాపకర్ములన్
మానవపాలునాజ్ఞఁగొని, మానుగఁజంపుటపోసమానుకో
దానవజాతితుల్యులను, దప్పకచంపుటమంచిదేకదా॥ 56

వ॥ ఇట్లనుకొనుచు నుభయబలంబులవారుంగదిసి యతికఠోరంబగు యుద్ధంబుసే
యంగొంతతడవునకుఁ జెంచులలోఁగొందఱు గతబలులై కొంకఁగా నిదియయద
ననిహిందువులుగందరగోళంబుగాఁ బొంగిపొరలితమయాభటులంజూపఁ జెంచుల
లోమించు పౌరుషమ్ముఁగలవారు వీరిపైబహుప్రకారమ్ములఁదమ శక్తింజూప
వారికిని భయంబుగలిగి యెట్టెట్టొ తెప్పిఱిల్లుచు నెట్టకేలకుఁ బ్రాణప్రభంజకబా
ణప్రహారంబుల నడవి చెంచులం గొందఱంజంపి కొందఱతలల భేదింపలేక య
వ్వార్త తమప్రభువునకుం దెలియపఱచిరయ్యెడ॥ 57

తేఁడుయుద్ధస్థితులగు స్వపరభటులంజూడంబోవుట.

2

తే॥ అప్పుడా తేఁడు భటులచే, నయ్యెదంత
మంతయును సాంతముగవిని, యంతరంగ
మందొకింతవిచారమ్ము, గ్రందుకొనఁగ
వెడలెనా చెంచు వారల, కడకువేగ॥ 58

తే॥ తేఁడు వెంచేసిపిమ్మట, నెక్కులబల
మొక్కకొంతయుఁ దలబల, మొక్కకొంత
తమ్ము గెలిపించుచుండంగఁ, దాళియున్న
చెంచులంగాంచి విభ్రాంతి, జెందనపుడు॥ 59

చ॥ కనుఁగొనమిట్టిశూరులను, గన్గొనమింతటి గట్టిపుచ్చెలన్
గనుఁగొనమిట్టిదోర్బలులఁ, గన్గొనమింతటి వెట్టిపుట్టలన్
గనుఁగొన మిట్టిపామరులఁ, గన్గొనమింతటి పాఁపనాల్కలన్
గనుఁగొనమిట్టిచెంచులను, గన్గొనమింతటి మించుమంచులన్॥ 60

మ॥ అనుచున్ భూవిభుఁడంతరంగమునన, త్యాశ్చర్య పర్యాప్తుఁడై
ఘనదర్పోద్ధతి ధైర్యసాహసకళా, కాండంబునిండారఁగాఁ
దనసైన్యంబుల కాజ్ఞయిచ్చెను మహత్వాశైలి సంధిల్లఁగాఁ
బెనుఖడ్గంబులఁ జెంచులంజనుమవే, వే పొందు పొండంచొగిన్॥ 61

వ॥ ఈవృత్తాంతంబు విని చెంచులిట్లనిరి॥ 62

సీ॥ సామంతరాజులు, చక్కఁగాఁగొలువంగ, రాజాధిరాజులై, రమ్యముగను
భూపరిపాలనం, బేపుగాసల్పెడి, సత్యసంధుఁడవని, సాహసమున
హృదినమ్మిమీసేవ, కేతెంచియుండంగ, సత్యహీనుండవై, సంభ్రమమున
నేమాత్రమునుదయ, యీయెడలేకను, మ్మనునీవసంపింప, ఘనతయగునె

తే॥ ఎగ్గులేమియొనర్పితి, మిఘుమీకు। నిట్టికతినతతగునయ్యా, యింద్రసదృశ
మోసపుచ్చితివిప్పుడు, ముప్పదొలఁగి యనుభవింపుమువైభవంబవనియందు॥

మ॥ మును శ్రీరామునిరీతిమీరు ధరణిన్ మోదంబుతో నేలుచున్
మనసుల్ నమ్మఁగఁ జేసిమమ్ముఁగలసమ్మానంబుఁబోఁద్రోసిమీ
రనువొప్పారఁగఁ గ్రూరకృత్యములరా, ద్రావిష్టులై చంపుటల్
ఘనవంశోద్భవులైనమీకుఁదగునా, కమ్మాఖ్యవంశాగ్రణీ॥ 64

వ॥ ఇట్లనుచు హతులగువారిబంధుగులు పలుకుచున్న ములుకులంబోలు వాక్యం
బులకు వికలమనస్కుండై రాజేంద్రుండెడతెగని కోపంబుననిట్లనియె॥ 65

చ॥ ఘనుఁడగు రామచంద్రుఁడధికంబగు భక్తిగలట్టిభక్తులన్
దనయులమాడ్కిఁ బ్రోచుచు బ్రధానసుఖంబులనిచ్చియుండె మ
న్ననవిడిదైవదూరులయి, నైకవిధంబుల దుష్టకృత్యముల్
మునుకొనిచేయురాక్షసుల, ముప్పలముంపఁడె తప్పదీఱఁగన్॥ 66

మ॥ అనుచున్ భూపతి చెంచునాయకుల నత్యంతంబుదూషించుచున్
దనచిత్తమ్మున లేశమాత్రము దయా, దాక్షిణ్యముల్ లేక క్ర
న్ననఖడ్గంబులవీరిఁద్రుంచుఁడని సైన్యస్వాములంబిల్చిచె
ప్పెనుదప్పొప్పులఁగాంచుతేఁడు ఖలులం, బెంపన్ బ్రయత్నించునే॥ 67

సీ॥ పరశుపట్టసములు, పరిఘముల్ చేఁబూని, పాటించినఱుకంగఁ, బంతగింపఁ
గంఠముల్ తెగవయ్యె, ఘనముగానయ్యెడ, గహనాంతములునిండె, బహురవములు
శ్రీరమదాసుఁడు, శ్రీకృష్ణదాసుండు, భీమదాసుండునా, భీరవరుఁడు
వేంకటదాసను, వీరాగ్రగణ్యుండు, వీరదాసనువాఁడు, విపులగాత్రుఁ
తే॥ డరయఁబాషాణదేహులు। ఖరశిరస్కులగుటఁదెగవయ్యెవీరిశీ, ర్షాంగణములు
పరశువులకేనిఁ బరిఘసం, పత్తికేని బాపురేయని బంక్తిల్లఁ, బలుకుచుండ॥ 68

ఉ॥ ఆయెడఁ జెంచునాయకులు, నాఘనఖడ్గమురంతబాధలన్
గాయములంతటన్ మిగుల, గాయములైమరణాద్యవస్థయే
యీయెడసంభవించెనని, యెంచికృశించుచుమోసపోవుటన్
మాయలువీడితెల్పిరతి, మర్మములన్నియుశాత్రవుల్ వినన్॥ 69

ఉ॥ బాధలఁబెట్టనేలపరి, పాలనసేయకమమ్మునీయెడన్
గాధలుమానిమాశిఖల, గల్గినతాయెతులన్ సుదృగ్గతిన్
మాధవునాజ్ఞచేఁదమరు మాంచిగఁబూన్కిఁదొలంగఁదీసిమీ
రీధరమమ్ములన్ దునిమి, యిష్టముఁదీర్చుకొనంగడంగుమీ॥ 70

ఉ॥ అంతటశత్రుమండలము లాగ్రహమందుచుఁజెంచులందఱిన్
బంతపుమాటలాడుచును, బాగుగఁదామెతులెల్లఁదీసిదు
ర్దాంతతరోరుఖడ్గములఁ దచ్ఛిరముల్ త్రుటిలోనఁద్రుంచియ
య్యంతకువీటికంపిరిప్ర, యాసముసైఁచియయారెయామెడన్॥ 71

శా॥ భూపాలుండతిచింతచేమనమునన్, బాల్పారనేప్రొద్దుత
త్పాపాత్మావళిఘోరకృత్యములకై, వ్యాపించుతాపంబుచే
నేపారన్మదిఁజింతఁగాంచెనుదయా, హీనాత్మతన్ వారలన్
గోపావిష్టతఁజంపివేయవలసెన్, ఘోరంబుగానంచొగిన్॥ 72

మ॥ అని యిబ్భంగి విచారతప్తుఁడయి తాఁ, డత్యంతసంకోచమున్
మనమందుండఁగనిల్పిరిచ్చవడిపై, న్స్నానంబుతో గోష్యమా
ఘనసౌధాంతరసీమభూమికసభన్, గౌరీశుఁజింతించుచున్
దినముల్ పుచ్చుచునుండెఁదత్క్రియనుసం, దేహంబుదీపింపఁగాన్॥ 73

చెంచులు మరణించువార్తను విని చెంచెతలు యుద్ధవాటిక కుంజని విలపించుట.

వ॥ అంతట నాచెంచుల మించు బోఁడులు తను తమ ప్రాణనాథుల మరణంబులువిని, యపారపారావార తరంగ పరంపరలంబోలు బాష్పవారి ధారలబోరన నేడ్చుచు నచ్చటనుండు నెడ॥ 74

సీ॥ కానఁజెంచులసతుల్, ఘనదుఃఖమగ్నలై, పయ్యెదల్ వీడఁగఁ, బటిమఁదప్పి
యొడలెల్లగడగడ, వడకంగనేడ్చుచు నేలపైఁబొరలుచుఁ, గూలికూలి
యొండొరుల్ గుమిగూడి, యుపమింపరానట్టి, రోదనంబులఁబెద్ద, వేదనపడి
తలవెండ్రుకలు ముడిన్, దబ్బిబ్బుగాదాఁటి, చిందరవందరై, చెదరిపోవఁ
తే॥ జేతులనురమ్ములనుగ్రుమ్మి, శీర్షములను
మోఁదుకొంచు, లబోలబో, మొత్తుకొనుచు
భర్తలారా, మహాపాప, పతులమమ్ము
నడవిపాల్ చేసితిరెదైవ, యత్నమునను॥ 75

వ॥ అనియిట్లు పలువిధంబులఁ బలవరించుచు, మృతపతికళేబరంబులపైఁ బడి "తాఁడెంతపాపాత్ముండు, నేఁడింతయాపద యనిమిత్తంబుగ మాకుఁదెచ్చి పెట్టె, దేవునిబిడ్డలమై యడవియందు జడదారులవృత్తిం జరించుచు మోసమునకెడమీనివాండ్రమై, సంచరించుమనను, మహాకిరాతబుద్ధివహించి మాయావాగురాబద్ధులంజేసి, హింసింపఁదగునా" యను మొదలగు నెన్నియో విలాపవాక్యంబులఁ బొగిలిపొగిలి, పృథివింగలసిన మృత్తికకేడ్వనేమి ప్రయో

జనంబు, ఋణంబులీతె! పతిపత్నీబంధంబులాతె, ననుకొని, శవార్హకృత్యంబులనాచరించి, యచ్చటికృష్ణానదిం గర్తవ్యంబులాచరించుకొని, మనమింక నీరాజ్యంబుననుంటిమేని ప్రాణములు దక్కవని ఘోషించుచు విదేశగతులై పోయిరనంతరంబు॥ 76

చెంచులంజంపినదోషము తేనికి సంప్రాప్తమై వికలుండగుట

మ॥ తరుషండంబులసంచరించుజనులన్, దట్టించిమోసంబునన్
గరుణాదూరతఁ జంపఁదత్ప్రబలపం, క్రప్రాప్తిచేకూఱఁగా
నరనాథాగ్రణి సౌధవీధికలనా, నారూపభేదంబులన్
బురుషాకారములట్లెసంచరిలుచో, వ్వంగాంచెఁదప్పేర్పడన్॥ 77

సీ॥ ఎచ్చోటఁజూచిన, నెన్నశక్యముగాని, ఘోరరూపంబులు, కోటలోన
గగనాంతరాళంబుఁ, గ్రమ్మెడిధ్వనులచే, ఘోషముల్ సేయుచు, గుండెలవియ
సంచారములుసేయ, క్ష్మానాథుఁడును వేగ, నార్యులరావించి, యట్టిఘోర
సంగతులన్నిఁటిఁ, జక్కఁగాఁదెలుపంగ, యోజించిరయ్యెడ, యోగ్యులెల్ల
తే॥ గహనభిల్లులఁ జంపిన, కఠినపంక। మాగతంబయ్యెమనకు న,త్యధికమగుచుఁ
గానుమపతిపూజలు, ఘనముగాను। సలుపఁదద్దోషహారణమా, సరగననిరి॥

మ॥ అని యిబ్బంగి ద్విజోత్తముల్ దెలుపఁగా, నారాజు వేవేగమే
యనువొప్పన్ దగభూసురోత్తములు; ది,వ్యజ్ఞాన ధన్యాత్ములన్
ఘనసౌధాంతరసీమ నిల్పి యల శ్రీ,కంఠున్ జపింపంగ మ
న్ననవాక్రుచ్చెఁ బ్రశస్తపాతకకు భృ, న్నష్టిన్ మదింగోరుచున్॥ 79

చ॥ నరవరునాజ్ఞ భూమిసుర, నాథులు స్వామిహితార్థులౌచు వే
నిరుపమభక్తిశ్రద్ధమెయి, నిక్కముగా జపహోమకృత్యముల్
పరశివుఁగూర్చి సల్పుటకుఁ, బట్టిరిదీక్షుల నెట్టనన్ ధరా
వరకృతభూరిపాతక ని,వారణకారణచారణాత్ములై॥ 80

సీ॥ షడ్రసోపేత భో,జనముఁ బెట్టించె సా,హస్రవిప్రులకు శాం,త్యర్థియగుచుఁ
బ్రతిదినంబును,మఱిఁ, బ్రకటభూదానధర్మములుసేయుచురాజ, మండనుండు
భూసురావళికెల్ల, భూదానములుధేను, దానముల్ సౌవర్ణ,దానములును
పాపపుంజంబెల్ల, భస్మమైపోవఁగ, భవ్యబుద్ధివిశేష, పటిమఁజేసె
తే॥ నిట్లుచేసిన నాపాప, మించుకయును। దొలఁగిపోవక నెమ్మది, కలఁతవిడక
యేఁడు స్థాణువుగతిజడు, రీతినెపుడు। నుండఁదొడఁగె మహాపాపయోగమేమొ॥

వ॥ ఈప్రకారంబున బ్రాహ్మణోత్తములనేక విధంబుల భూపాలపాతకపరిహారణా
ర్థంబుగాఁ బశుపతినిఁ గూర్చి మూఁడుమాసంబులొక్కరీతిగ జపహోమతర్పణా
ది క్రియలుసలుపఁ గ్రియలేక తొల్లిటివలె నాపాపంబగపడుచుండె నమ్మహా
భూపాలుండు హంసతూలికాతల్పంబున నొక్కయెడ నిమీలితనేత్రుండై పండు
కొనియుండుసమయంబున నయ్యంబికాపతి శర్వరీసమయంబున సాక్షాత్కరిం
చి ఱేనికిట్లనియె. 82

శివుఁడు పాపహరణోపాయంబు ఱేనికిం జెప్పుట.

తే॥ అడవిచెంచులఁ జంపించి, నట్టిపాప
మోపుడమిఱేఁడ తీఱదీ, యుగ్రవిధుల
మనసుచెడఁగాంతిదొలఁగవా, జ్ఞానమబ్బె
నింక నెన్నియొ కలుగంగ, హేతువుండె॥ 83

ఉ॥ చింతిలనేల నెమ్మదిని, శ్రీహరుసత్కృపయిట్టులుండఁగా
పంతముతోడ బుద్ధిఁ దగు, పాటిగ నిల్పి చరింపఁగావలెన్
గొంతయదృష్టమిట్టిక్రియఁ, గూర్చెనుసందియమేల నెప్పుడే
నెంతటివారికేని విధి యెట్లు తొలంగఁగనౌను భూవరా॥ 84

మ॥ వినవా తొల్లిటికాలమందు నృపతుల్, విశ్వంభరారక్షణా
ర్థనిబద్ధంబగు స్వీయవిక్రమముచే, రక్షశ్చమూతుల్యవ
ర్తన వైరిప్రతతిన్ రణావనిల సద్దర్పంబునం దున్మించి చే
సినకృత్యంబునఁ గల్గుపాపమడఁగన్, జేయింపరే సద్విధుల్॥ 85

వ॥ అనిమఱియు నాఱేనికిట్లనియె. 86

క॥ సరగున నాదోషము చెడ। నిరుపమయత్నంబు లెల్ల నిశ్చలమతిచే
బరశివసేవాభావన। నిరతముసలుపంగ దోష, నిర్హరణంబౌ॥ 87

తే॥ దేవతారాజుపంకమ్ము తీఱునటుల। గురుసమావేశమునఁ గొన్ని, కొన్ని విధుల
నెఱఁగిసేయంగఁ బాపమ్ము, లెల్లఁదొలఁగి। గోపముఖ్యాతగాంచఁడే, గుణపయోధి॥

క॥ తమతమ నెలవులనుండియుఁ దమయధికారమ్ము లెల్లఁ దనరుచునుండన్
సమభావమ్ముల మెలఁగుచుఁ దమమునువిడకుండువారె, ధాత్రీరమణుల్॥ 89

తే॥ కాననోఱేఁడ సీదగు, గౌరవంబు వార్ధిఁబడమాంద్యవృత్తిచే, వఱలనేల
చింతపల్లెనభీష్టంబు, చెదరఁజేసి జాగరూకతనుండుమా, స్వాంతశుద్ధి॥ 90

మ॥ మునుశక్రుండతిభక్తినాయెడల స, మ్మోదంబుతో నిల్పినా
కనువౌనట్లు మహేశ్వరాఖ్యనిడి దే, వాగారమున్ సార్థక

త్వనిరూఢిఁ వెలయించె నాకృపకు నం,తఃప్రీతి కాంక్షింపఁగా
ఘనకృష్ణాతటినీతటంబున మహా,కల్యాణసంసిద్ధికై॥ 91

ఉ॥ ఆయెడనుండినాప్రతిభ, యచ్చటమిక్కిలిభద్రదాయియై
పాయకయుండమర్త్యులతి,భక్తిని నన్నుస్మరించుచుం మహా
మాయనువీడనాడి గరిమం జరియించుచునుండిరో నృపా
శ్రీయునుధీయుమోక్షమును, జేకుఱఁజేయుచునుందు నెప్పుడున్॥ 92

వ॥ ఇదియునుంగాక, నీజననీజనకులు సంతానహీనులై, పుత్రప్రాప్తికై నన్నారాధింప, వారలభక్తికిమెచ్చి, దర్శనమిచ్చి యభీష్టంబుఁదెల్పుమన, భవదంశఁగల కుమారుదయసేయుమని వేఁడ, నట్లెయని యంతర్ధానంబునొందితిఁ గావున, నీవు మదంశసంభూతుండవు. మహాభోగంబులనుభవింప,నర్హుండవు. బహుసుకృతకార్యంబుల సలు,పనున్నవాఁడవు. చింతపల్లెయందను రాగముపీడుము. నీపాపంబిచ్చటనున్నఁదొలఁగదు. మదనుజ్ఞానుసారముగా నాదేవళంబు చెంగట నమరావతియనుపురవరంబుఁగట్టించి, యాపట్టణంబున సుముహూర్తంబునఁ బ్రవేశించి, యేకకాలమ్మున, నేకోత్తరశతదేవతాయతనమ్ములఁగట్టించి, లింగప్రతిష్ఠనుజేయించి పిదపఁగొన్ని జన్నంబులు శ్రుతిసంపన్నులచేతఁజేయించితివేని, నీపంకంబు నిశ్శేషంబయి రాజ్యభోగంబు లనుభవింపఁగలవాఁడవని తెలిపి, యదృశ్యుండయ్యెనంతట॥ 93

తే॥ అంతనాభూమిపతిచాల, హర్షమంది వ్యోమకేశునియానతి, నొప్పగాను
మంతనమ్మునయోజించి, సంతసమున నిజసభాస్థలికేతెంచె, నియతితోడ॥ 94

తే॥ ఆర్యులందఱువినఁగన, మంచితముగ, నేఁటినిశయందుశంభుండు, నెనరుచేతఁ
బల్కెఁబ్రసరించినాతోడ, భావివిధులు తిరుగులేదిఁకఁదద్వచ, స్సరణిఁగొనఁగ॥

తే॥ చింతపల్లెనువిడనాడి, శీఘ్రగతిని కృష్ణతీరమ్మునందుండి, కీర్తి వెలయ
నొక్కనగరంబుఁగట్టించి, యుచితముగను నింద్రపట్టణనామంబునిడుచువేగ॥96

తే॥ సపరివారంబుగానీవు, సంతసమున మన్నివాసంబుదరిఁజేరిమహితభక్తి
నూటయొక్కఁడులింగముల్మేటిబుద్ధి సుప్రతిష్ఠయొనర్పంగ, సుమతి తెల్పె॥ 97

మ॥ అనియిబ్భంగిసభాస్థలిన్ దెలుపఁగా, నార్యుల్ మఱిన్ మంత్రులున్
వినిసోత్సాహమతిన్ దలంచిరపుడా, విశ్వేశ్వరుండియ్యెడన్
మనభూపాలునియందుఁబూర్ణదయని, మ్మాడ్కిన్ వచించెన్ గదా
మనరాజోత్తముభాగ్యమెన్నఁదగునా మాంధాతకున్ ధాతకున్॥ 98

వ॥ అని యేతద్రీతిం దత్సభాస్థలియందుండు సభికు లందఱుకతి సంతోషంబు సంధిల్ల, భూపాలునకట్లని విన్నవించిరి॥ 99

ఉ॥ భూవర!మీరలీమొదలఁ, బొల్పుగనీశ్వరునాజ్ఞమీరకే
భావమునందుసుస్థిరత, బాగుగనిల్పుచుఁజింతపల్లెయం
దానవజాయతాక్షునిన, మంచితవాక్కులునమ్మియుండిను
శ్రీవిలసిల్లుకృష్ణదరిఁ, జేరినసింపఁగమేలుచేకుఱున్॥ 100

తే॥ పుడమివేల్పులుసుముహూర్తపుష్టిఁదెలుప
ఱేఁడుసంతోషపడినట్లు, రీతివారి
నందఱనుదోడరండని, యానతిచ్చి
యాశ్రితులఁబ్రోచువాఁడౌట, ననవరతము॥ 101

వ॥ ఆ ఱేనియానతి నయ్యార్యులు తద్భూపాలునింతోడంజని, యాపావన ప్రదేశ ముంగాంచియానందించి యచ్చోటునదీతీర మగుటయు, నీశ్వరసన్నిధియగుట యు దేవరవారు నూతన నగరంబిచ్చటఁగట్టించుట, మంగళప్రదంబని విన్న వింప, భూపాలుండానందించి, యీశ్వరుని దర్శించి మొక్కియును॥ 102

మ॥ అనియిబ్భంగినుమాపతిన్ గొల్చి ని, త్యానందసంధాయిత
ఘనులౌవేల్పులుసంస్తవించునటులే, లక్ష్మీనాథుఁడుద్దామవ
ర్తనసంశుద్ధినిరంతరంబుఁ గొలువన్ దత్పంకమా పంకమొం
తనఁగావెల్గెడిమేటిపంకములు పాయన్ బట్టణంబొక్కఁటన్॥ 103

తే॥ తానుగట్టింపఁగానెంచు, తఱినినూరి బృందమొల్లమహాప్రీతి, నందియపుడు
స్థలవిశేషమ్ముగొప్పదీ, తావునందుఁ బట్టణముగట్టుఁడీయంచుఁ, బల్కెరపుడు॥

అమరావతీపురనిర్మాణంబునకై ఱేఁడుమంత్రికనుజ్ఞ యిచ్చుట

వ॥ అప్పుడయ్యార్య నిర్ణీతప్రదేశంబున, యథాశాస్త్రమ్ముగ సకల,సంభ్రమమ్ముల విపులవీథికా సముదయ సంభావితంబగునటులఁ బురరాజంబుఁగట్టింప మంత్రి సత్తమునకాజ్ఞ యిచ్చినపిదప నమ్మహానీయుండు, దేవనగరనిర్మాణచాతురీ ధురీణతాత్పరీకరణచంచువులగు శిల్పులరావించి, పురనిర్మాణమ్ముసేయించు చుండ నప్పుడు సకలమంత్రి విద్వద్వర కవిగాయక సముదాయంబులతో భూపాలుండు చింతపల్లెకేతెంచెనంతట॥ 105

తే॥ పట్టణముఁగట్టదట్టులై, నట్టిమేటి శిల్పకారులమఱివారి, చేతిక్రిందఁ
బనులుసల్పెడివారల, ఘనబలులను వేగసమకూర్చిరప్పుడు, నృపతియాజ్ఞ॥ 106

తే॥ అటులరప్పించివారితో, నచటఁబురము
నెట్టునిర్మింపవలయునో, యెఱుఁగఁజెప్పి
తగినసాధనములఁ గూర్చి, దైవపురము
నించియుండంగవలెనని, యంచునుడివి॥ 107

వ॥ పదంపడివారిలోఁదక్షకవరుండగు నొక్కనింబిలిచిమన్ననమెయిసముచితోక్తు లనుడివి, నీరచనయందు ననుపమానకౌశలంబు గన్పట్టవలయునని చెప్పిసబహుమానంబుగ గౌరవించి సుముహూర్తంబున శంకుస్థాపనంబు చేయించుచు నయ్యెడ॥ 108

సీ॥ శీఘ్రకాలమ్ములో, స్థిరచిత్తమునమీర, లింద్రపురముఁబోలి సాంద్రరుచుల
మెఱయుచుఁబ్రాకార సరణిఁజెన్నారుచు, హయగజశాలల, నతిశయించి
బ్రాహ్మణసాధనం, పత్తిప్రత్యేకంబ, వఱలెడిరీతియే, ర్పడఁగమించి
సేవకావళికెల్ల, స్థిరమైనగేహముల్, ప్రేష్యాంగనలకుసం, ప్రీతిగూర్చు

తే॥ వేశ్మములుచాలవిలసిల్ల, వెలయఁగల్గు
పట్టణమ్మునుగట్టుఁడీ, ప్రౌఢబుద్ధి
ననుచునియమింపవారల, త్యాయతమతిఁ
గట్టిరిసురాలయంబిదె కదయనుకొన॥ 109

తే॥ దేవపురమునవిలసిల్లు, దివ్యతరులు
పక్షిమృగసంకులంబులు, వాపికలును
మల్లికాముఖ్యసుమలతా, మాధవములు
తీర్చిరవెయివియనుదారి, తేటపడఁగ॥ 110

తే॥ పుష్కరిణిఁగట్టిరింపుగాఁ, బూర్వదిక్కు
నందునిర్మలవారియు, ననవరతము
నీశ్వరప్రీతిగానుండ, వృక్షవితతి
బంభరధ్వనిచేఁజాలఁ, బ్రమదమొసఁగ॥ 111

వ॥ అచ్చుటఁజింతపల్లెయందు భూతలనాథుండతిభక్తి దేవబ్రాహ్మణారాధనలనెల్లప్పుడు జరుపుచుండఁగలిగిన పంకంబుతొలంగక యతిమతిమాంద్యంబు నశనానిచ్ఛయుసంభాషణస్థలనంబును నేకాంతంబున విచారమగ్నతయుఁగలిగి భగవదనుగ్రహమ్మునకుఁ బాత్రుండయియుండుసమయంబున॥ 112

తే॥ మంత్రిసత్తముఁడేతెంచి, మనుజవిభుని
తోడఁదెల్పెను భవదాజ్ఞఁ, దొడరినేను
పట్టణమ్మునుగట్టించి, వచ్చినాఁడ
స్వామికెంతొ మహామాత్మహా, శక్తివెలయ॥ 113

మ॥ అనితెల్పన్ వసుధావరుండపుడు హర్షాంభోధి నోలాడుచున్
ఘనవాజ్మాధురి నాతనిన్ దనిపి శీఘ్రుంబాపురింజేర శా

త్రనియుక్తిఁ గడుఁబెద్దలేర్పఱుప భ,ద్రదంబౌ ముహూర్తంబునన్
జనుదేరన్ సమకట్టె సంభ్రమపరే, చ్ఛన్ శ్రేయముల్ గోరుచున్॥ 114

రాజు క్రొత్తపురంబునఁ బ్రవేశింప బాధుమిత్రాదులకు శుభలేఖలంపుట

తే॥ ఈఁడిటులనెంచి బాంధవ, శ్రేణికిమఱి। నిష్టసఖులకును లేఖ,లెన్నియంపి
పెద్దలందఱ రావించి, ప్రీతిఁగొలిపి। నవ్యపురమునఁ జేర స,న్నాహపడియె॥ 115

వ॥ ఈశుభవార్తా విశేషంబును సకలపౌరవరులకుం దెలుప నాఁబాలవృద్ధంబుగ
వారలందఱు, పరమానందభరితులై వేఁడుక నెదురుచూచుచుండిరంతట॥116

సీ॥ తనమంత్రిరావించి, ఘనబుద్ధినారాజు, నియమించె జాబుల, నెమ్మివ్రాయ
శాఖమూర్వంశాబ్ధి, చంద్రుఁడౌ వేంకయ, నాయఁడమ్మలకువిన్నాణమొసఁగ
ననువొప్ప క్షితిపతి, ఘన చిరుమామిళ్ళ, శివరామనాయక, శ్రేష్ఠునకును
రాచూరు సీమకు, రాజవర్యుండగు, సూర్యదేవరవంశ, సోముఁడయిన

తే॥ నారసింహాహ్వయునకును, జారుమతికిఁ। జావ వారలకును మఱి,సరసులయిన
నీరుకొండాన్వవాయుల, కేరుపడఁగ నంపుమా శుభలేఖల,ననియెనంత॥

తే॥ విప్రముఖ్యుని,శ్రీమంతు,బిరుదమొప్పు
యార్లగడ్డాన్వయునకుఁదా,నంపెఁదెలుపఁ
దివిరికొండఱకట్టులే,దెలుపనెల్ల
వారలచటికివిచ్చేయ,బయలుదేరి॥ 118

మ॥ సుముహూర్తంబునకేగుదెంచిరిబుధుల్, సుశ్రీయుతుల్ బంధుగుల్
ప్రమదంబొప్పఁగ స్నేహితుల్ గురువరుల్, రాజేంద్రులున్ దద్భటుల్
గమనీయాశ్వముఖాధిరోహణములన్, గాంభీర్యమేపారఁగా
నమరేంద్రానుపమానపత్తనసమం,బౌసీపురింజూడఁగాన్॥ 119

గీ॥ వచ్చినట్టిమహామిత్ర,నరులకెల్ల వేఱువేఱుగశాలల, నేఱుపఱప
మేలుబళిబాపురేయంచుఁ జాలముదముఁగాంచుచుం జేరిరాచోట్లగౌరవముగ॥

వ॥ ఇట్లు రాజాజ్ఞనెల్ల ముఖ్యులువచ్చి తత్తచ్ఛాలాతలంబుల విశ్రమించి రనంత
రంబ॥ 121

గీ॥ వేడుకనుజూడఁగాంక్షించి,వేలకొలఁది
నరుగుదెంచినవారలాపురము,నందు
వెలయుచిత్రవిచిత్రముల్, విసువులేక
కాంచుచుండిరి కన్నుల,కఱవుదీఱ॥ 122

మ॥ మదమాతంగతురంగసంఘములతో, మంత్రుల్ మహారాజులున్
ముదమొప్పన్ నిజబంధుమిత్రచయముల్, నూత్నాప్తులున్ విప్రులున్
మదినుప్పొంగుచువచ్చి రాజకులస, మ్మాన్యార్హధర్మక్రియా
సదయుండౌచుండగు రాజచంద్రుఁగని రా, సల్ మేలుసూచింపఁగన్ 128

చ॥ నవనగరంబుఁ జేరుటకు, నాథుఁడు శ్రీరఘురామసత్కృపా
భవబహుభోగభాగ్యచయు, బంధురుఁడై తనయాప్తవర్గము
త్సవసవిశేషదీప్తిఁగని, సంతసమందుచునుండ నిర్గమిం
చెవిపులభూమినాయకులు, సేవలొనర్చుచునుండ నయ్యెడన్ 124

ఉ॥ అయ్యమరావతీపురికి, నాపృథివీశుఁడు సంతసమ్మునన్
జయ్యనవచ్చుచుండ సర, సప్రకరంబులు బ్రహ్మవిద్గణుల్
నెయ్యముతియ్యముం గలుగు నిక్కపుబందుగులాదరాత్ములై
పయ్యెదనొయ్యఁ జార్చు వెల, భామలు వచ్చిరి సంభ్రమంబులన్॥ 125

వ॥ అదివఱకమరావతికివచ్చిన వారలందఱుఁ జింతపల్లెనుండి వచ్చుచున్న భూపాలు
నకెదురుగాఁ బోయి కలిసివచ్చు సమయం బెట్టులుండెననిన॥ 126

సీ॥ రాజబంధువులెల్ల, రమ్యతరంబులౌ వాహనంబుల నెక్కి, వరుసరాఁగ
సామంతరాజులు, సామజారూఢులై రాజవిశ్వాసంబు, రహిఁ వహింపఁ
గోవిదశ్రేష్ఠులు, జ్ఞానవిస్ఫూర్తితోఁ బాండిత్యనిధులయి, ప్రబలిచనఁగ
బట్టుమూర్తులు తద్ద, భక్తినుద్దండులై కైవారములొనర్చి, కడఁగి నడువ॥

తే॥ వేశ్యకాంతలు సంగీత, విభ్రమముల
నర్తనచమత్కృతులఁ గడు, నాణెముగను
దోడఁ జనుదెంచుచుండంగ, దొడ్డఱేఁడు
క్రొత్తపురిదారిఁ బట్టె; నెక్కొనఁగ బ్రీతి 127

క॥ నానావాద్యధ్వనులను। భూనాథుఁడు వచ్చువేళఁ, బుడమి వడంకెన్
శ్రీనాథుఁడు తనవిభవము। తో నేతెంచినవిధంబు, తోఁచుచునుండెన్॥ 128

తే॥ వచ్చిన ప్రసిద్ధులయ్యెడ, ముచ్చటపడి
దిగిరి నియమితశాలలఁ, దేఁకువమెయిఁ
బ్రవిమలానందభరితులై, భవపదాబ్జ
భావనలొనర్చుచుందమ, పరువుమెఱయ॥ 129

వ॥ అంతట నారాజోత్తముండు, వచ్చియున్న యాప్తవర్గమ్ములకుఁ దగిన భో
జనమజ్జనాది సదుపాయంబులొనర్చి యెందునావంత యేని కొఱంత లేకుండ

సమృద్ధ వస్తుసంచయంబులఁ దెప్పించి యిప్పించి మంత్రి ముఖ్యులతో "మన తో వచ్చియున్న నానాశాఖల వారిలో ననేకులు బృహత్కుటుంబ భార ధూర్వహులై యున్నవారు గాన బ్రాహ్మణముఖ్యంబుగాని కనుపట్టునెల్ల వార లకు సౌధప్రవేశంబు పురతః కర్తవ్యంబుగాన నట్లుసేయించి వారి వారి జీవధ ననివాసంబులకై వలయువాస స్థలంబులఁజూపించి సుముహూర్తంబున నివ సింపఁజేయుఁడన" నట్లుసేయించిరి యనంతరంబ॥ 130

తే॥ సకలవర్ణాశ్రమాచార, సహితులైన
వారలందఱుఁదమతమ, వాసములను
సర్వసంభ్రమసత్కళా, ఖర్వులగుచుఁ
గాపురముసేయుచుండిరి, గౌరవముగ॥ 131

తే॥ ఇట్టులుండఁగ జేఁడొక్క యెడమనంబు, నిష్కళంకత నిలసిల్ల, నిండుభక్తి
విద్వదావళితోఁడఁదా, వెడలెదాపు।నందుసీశ్వరశాసనాలరయుకొఱకు॥ 132

జేఁడాదేవళంబుననుండు శాసనంబులఁజూడఁబోవుట

ఉ॥ అచ్చటనున్న శాసనములన్నిఁటిగాంచి ధరావరుండువి
ద్వచ్చయమందుఁబొందుపఱు తత్త్వముఁదెల్పుచునుండవించుచున
త్యుచ్ఛతరంపుఁదావులకు, నొయ్యనఁబోవుచుఁగీలెఱుంగుచున్
మెచ్చులనిచ్చులన్ వెలసి, మించినమండపమొండుకన్గొనెన్॥ 133

తే॥ తొల్లిశ్రీకృష్ణరాయలు, దొడ్డగరిమఁ దులనుదూఁగినమంటప, స్థలముఁగాంచె
భూవిభుఁడునేత్రయుగ్మంబు, పోడినిలిపి। చదువఁజేసెనుదానిపై, శాసనముల॥

ఉ॥ ఆమెడధీయుతుల్ విబుధు లందఱుఁజేనికి శాసనంబులం
బాయనిశ్రద్ధతోఁజదివి, బాగుగశాసనరాజియందును
శ్రీయుతమైచెలంగుచు స్ఫు,రించెడియర్థములెల్లదెల్పిర
త్యాయతపూర్వరాజచరి, తాంశములన్నియుఁదెల్లమైతగన్॥ 135

తే॥ ఇట్లుచెప్పుచుశ్రీకృష్ణ,నృపతిమున్ను। కాంచనముతోడఁదులఁదూఁగి,గౌరవార్హు
లైనవిప్రోత్తములకుని, త్యంబుదాన। మొనరఁజేసెనుసద్వృత్తిఁ, గనకమెల్ల॥

తే॥ అనుచువచియింపనానృపుం, డాత్మనలరి
పూర్వరాజులపోలికఁ, బోవనెంచి
యలతులాభారమునుదూఁగఁ, దలఁపుఁగొంచు
హితవతంసులతోఁజెప్పె, నీప్రశంస॥ 137

### రాజు తులాభారోత్సాహి యగుట

మ॥ అనియుబ్బంగిఁదలంచి భూమిపతిమా, యామోహసంక్రాంతులై
ఘనవిజ్ఞానరహస్యముల్ గనకమో, క్షంబందఁగాలేక తి
న్ననిబుద్ధిప్రభ లేకకొందఱుజగ, న్నాథుఁ గనంబోక శా
మనపూర్వార్గముఁగాంచిరంచువినెదన్, మర్త్యోత్తముల్ వింటిరే॥ 138

వ॥ తేఁడీక్రతువు నాచరింపనెంచి, ధీసచివురావించి యిట్లనియె॥ 139

ఉ॥ జీవితమస్థిరంబనుచు, జీవులుతామెఱుఁగంగలేకస
ద్భావవిశుద్ధిఁగైకొనక, బ్రహ్మపదార్థమహత్త్వతత్త్వసం
భావనశూన్యులై, సుకృత, వాటతటీగమనంబు లేకసు
శ్రీవిడిధర్మరాజపురిఁ జేరిరి పేరునునూరుసున్నయై॥ 140

ఉ॥ కావునమీరలీయెడలఁ, గాంచనఖండములంబరంబులున్
గోవులుభూషణంబులును, గూరిమితోడుతవిప్రకోటికిన్
బావనబుద్ధిచేనొసఁగి, బాగుగనేతులఁదూఁగియీయఁగా
భావమునందలంచితిని, వారకకూర్చుఁడు వస్తుజాలముల్॥ 141

చ॥ అనవిని మంత్రిశీఘ్రగతి, హర్షములోసమకూర్చి యన్నిటిన్
ఘనమతి తేనికట్టియెడ, గట్టిగఁదెల్పఁగ నాలకించియా
జనవిభుఁడీశుతుష్టికయి, చట్టునఁదత్క్రియ సల్పఁగోరిమిం
చినధనమున్ బరోపకృతిఁ, జేయఁగఁ బోకడఁ బెట్టనెంచుచున్॥ 142

సీ॥ మండపంబొక్కండు, మణిఖచితంబుగా, గట్టించిరయ్యెడఁగాంతిమెఱయ
ముంజూర్లయందున, ముదమొప్పఁబగడాల, కోణిగెలుతగిలింపఁ కోర్కిఁదీఱ
ఁదత్కాంతిచేతను, ధరణీతలంబెల్ల, జ్యోత్స్నమయంబయి సొంపులీన
మండపస్తంభాల,మంచిరూప్యపురేకుఁదాపటంబొనరించి, తడయకపుడు
తే॥ పెద్దపందిళ్లువేయించి, పెంపువెలయ, గరుడిపచ్చలతోరణాల్ సౌరిదిఁగట్టి
నిరుపమోజ్జ్వలదీప్తుల, నిండఁజేయనలరెఁదెలిదీవియోయన,నాస్థలంబు॥ 143

గీ॥ అప్పుడమరావతీపుర,మందుఁగలుగు, వైభవముఁగాంచిభూలోకవాసులెల్ల
నొరయిదిస్వర్గమాయని,యనఁదొడఁగిరిభూమిమించినకళయందుఁబొందుపడుట

తే॥ శ్రీనివాసవికుంఠపురీవతంస, మొకటిదప్పఁబురంబులనొయ్యఁగాంచ
నెందునిట్టిదికన్పట్ట,దీజనపతిదీఁగట్టించెయని ప్రజపూనిపలికె॥ 145

చ॥ అనిబహుభంగులన్ గనిన, యట్టిప్రజల్ వినుతించుచుండఁ దీ
యనిపలుకుల్ మహాదరముహరిహృదంతరసత్ప్రవర్తనం

బనువుగనిల్వఁ జేసివసు,ధాధిపతిప్రవరుం కుసౌమ్య శాం
తనియతినుబ్బుచుండెఁ బ్రథితప్రమదాకరకృత్యదీక్ష చే॥ 146

వ॥ ఇట్లుండియాఖండలవైభవంబున మెఱయునెడ॥ 147

సీ॥ నవరత్నఖచితమై, నాణ్యమైనట్టి శ్రీ,మకుటంబుధరియించి, మనుజవిభుఁడు
భుజలసన్మార్గులౌ, భూరికేయూరముల్, రత్నహారంబులు, రాజిలంగఁ
గాంచనాంబరములు, ఘనపుగాధరియించి, విలసిల్లుచుండెన,వ్విభునిఁగదిసి
సామంతరాజులు, శ్రీమంతులైనట్టి, బందుగుల్ వలఁగొని, బలసియుండ
తే॥ వైభవోన్నతిఁ జెన్నొంది, స్వర్గవిభుని
పోలికకు నేలికగనుండి, జాలువాఱు
కనికరము మోముఁదమ్మిపైఁ, గానుపించ
వెడలె నావేంకటాద్రి యు,ర్వీధవుండు॥ 148

సీ॥ సకల భూదేవతల్, సాక్షాన్మహేశ్వర, మూర్తులైదీవనల్, ముచ్చటింప
ఘనతులాభారంబుఁ,గాంతుమీఱఁగఁదూఁగె,ముమ్మాఱుపృధివిన,మ్మోదపడఁగఁ
దత్కాంచనంబును, ధారుణీసురముఖ్యు,లకునిచ్చెఁ బాపక,ళంకమడఁగ
బట్టువాండ్రకునెల్ల, బాగుగానిప్పించె, శౌరీల మొహరీల, సంతసమున
తే॥ వచ్చియున్నట్టి జనులక,వ్వారిగాఁగ
భూరిమృష్టాన్నదానంబుఁ, బొసఁగఁజేసె
సకలభూతావళియు ధరా,స్వామియితఁడు
వృద్ధిఁగనవలెనని దేవు, వేఁడుచుండ॥ 149

### రాజమరావతీపుర సౌధాంతఃపురమునఁ బ్రవేశించుట

వ॥ అప్పుడా సుముహూర్తంబున రాజశ్రేష్ఠుం డమరావతియందు నూత్నసౌధం
బునఁ బ్రవేశింపఁదలంచిన యనంతరంబ॥ 1 0

సీ॥ గండపాళికలను, ద్దండధారల మద,స్రావంబువిలసిల్లు, సామజములు
శుభలక్షణతురంగ, శుంభద్విలాసన, ర్తనములు వీధులఁ, దనరుచుండ
నిరువదివేలసం, ఖ్యరహిక్ వెలుంగున, ద్భటనికాయముబరా,బరులుసేయ
వైచిత్ర్యపాత్రన, త్ప్రాసాదరాజిఁబొందిఁగలవలెఁ గ్రాలు, తెఱవలొప్ప
తే॥ బట్టులందందసంస్తవ, ప్రతిభఁజూప
గణికలతి మంజులోద్గీతి, కలనటింప
శ్రేయములుగోరువారువి, చ్చేసినిలువ
భూమిపట్టనివిభవంబు, పొందుపడఁగ॥ 151

సీ॥ రాజబంధువులైన, రమణీయభూపతుల్, నిజవైభవంబుల, నెమ్మిఁజూప
సామంతరాజులు, సమరసాంతరులౌచు, వామభాగంబున, వరుసఁగట్టఁ
గోవిదోత్తమపాళి, గురుతరాశీరుక్తి, పటలిఁద్రిశుద్ధిగాఁబలుకుచుండ
మిత్రవర్గంబులు, మైత్రిసాకారమైవచ్చిన గతితోడ, వచ్చుచుండఁ

తే॥ దెల్లతెల్లని జండాలు, తేజరిల్లఁ
బగటిదివిటీలు వెలుఁగుచుఁబ్రజ్వలింపఁ
జోపుదారులు వాక్ఛక్తిఁ,జూపుచుండఁ
గలియుగవికుంఠమహిమంబు, మెఱయుచుండ॥ 152

వ॥ శ్రీమన్మహారాజ రాజ రాజ వాసిరెడ్డి వెంకటాద్రినాయఁడు బహదరు మన్నెసుల్తాన మన్నెహంవీర, మన్నెరాయ, ముస్తుఫాన్నగరు వమ్మ్వర్తు జానగరు వీరశంకరబసవ వీరప్రతాప రాజమార్తాండ గండరగండ, యద్యతనభోజమహారాజ, త్రిలింగ దేశాధీశ, యమరావతీ పట్టణప్రభువరయనుచుఁ బల్క॥ 153

సీ॥ జయభేరితమ్మటల్, చాకచక్యముతోడ, మ్రోయించుచుండిరి మోదమలర
గహనాంతరాళంబు, కాహళధ్వనులచే, సాంద్రశబ్దంబయి, సడలుచుండ
నౌబతుల్ వేయింప, నానాదిగంతముల్, దిబ్బిడిపడియెట్లొ, తెప్పిటిలఁగ
సంగీతవిద్వత్ప్రశస్తగానములచే, నెల్లవారలచెవు, లుల్లసిల్ల

తే॥ వివిధశృంగారచేష్టిత, విలసనాఢ్య! సరసమణిదివ్యగోష్ఠిని, శాంతమగుచు
నూత్ననగరంబుసత్ప్రభు, రత్నకలనఁ! జెప్పశక్యమ్ముగానట్టి, చెలువుగాంచె॥

తే॥ రాజశేఖరురాణిస, ర్పనిభవేణి! వెత్తెమాంబసుభూషణ,విభవమంది
తనితోసౌధమునఁజేరు, రీతినెంచి! ప్రేష్యవర్గంబుతోడరా, వెడలెనపుడు॥ 155

క॥ ప్రవిమలసుజ్ఞానార్ద్రులు! భవకష్టవిదూరులైన, బ్రాహ్మణముఖ్యుల్
నవనవకల్పనదక్షులు! శివభక్తిసమస్తయత్న, సిద్ధులొనర్పన॥ 156

వ॥ అప్పుడునూతననిర్మితంబగు సౌధమందలియంతిపురమునందు వెలుంగునలంకారవిధంబువివరించెద॥ 157

తే॥ పెట్టియుంచినదీపాల, పెంపుచేత
వేనవేలగుపందిళ్ల, విభవమునను
జూడనేతెంచువారల, సూక్తిపటలి! .
నౌరయయ్యంతిపురమెంతొ, యందగించె॥ 158

వ॥ ఇట్లుండునత్తఱి సకలసామంతరాజసేవాభినందన నిత్యానందచిత్తపంకజుండు
ను, భగవత్పాదసరసీరుహబంభరాయమాణ హృదంతరాళుండును దీనజన
త్రాణానూనదీక్షావిచక్షణతాపేక్షావిలక్షణుండును, నగువేంకటాద్రిప్రభూత్త
ముండు సమస్తజగత్సంతుష్టి సంపాదకవస్తుని చయవిరాజితంబగు పేరోలగం
బున దేవీ సహితుండయి పట్టాభిషేకమహోత్సవ సంఘటితసంభారనిరీక్షణ
మహాట్టహాసకలితుండగుచు విద్వత్సింహాభద్రవాక్యచర్చామచర్చికానినదశ్రవ
ణకుతూహలియై యఖండ సామ్రాజ్యరమాధురంధరతాధివాసంబగుసింహా
సనంబున నధివసించియుండు సమయంబున॥ 159

తే॥ వాద్యరావంబు వార్ధిరా,వంబుమాడ్కి-
మిన్నుముట్టఁబ్రజావళి, మేలుగోర
సకలనృపపాళి "జయ, రాజ, జయ"యనంగ
సూరులెల్లరు సంతుష్టిఁ, జూపుచుండ॥ 160

శా॥ ఆరాజేంద్రునివైభవంబునకు సాం,ద్రానందమున్ గాంచుచున్
శ్రీరంజిల్లెడి భద్రపీఠపుఁగళల్, శృంగారరంగస్థితిన్
భూరిప్రాభవసూచకంబులయి యిం,పుంగూర్ప నుప్పొంగుచున్
ధీరుల్ వీరులు బందుగుల్ విబుధులెం,తే సంతసంబందుచున్॥ 161

వ॥ ఇట్టితఱి భూవరుండు నవీనసౌధారూఢుండయి సింహాసనమెక్కి కూర్చున్న
సమయంబున సకల సామంతరాజముఖ్యులు కానుకలనర్పింప, స్వీకరించి య
నంతరంబ॥ 162

మ॥ అపుడా భూవరుఁడంతరంగమున న,త్యంత ప్రమోదాఢ్యమా
నిపుణత్వంబున నెల్ల కోవిదులకున్, నేర్పొప్పవిద్యాబలం
బపుడే కన్గొని యగ్రహారముల బ్ర,హ్మప్రీతి నర్పించెఁ జో
క్కపుముక్తింగనఁగోరి విప్రులకు నె,క్కంజేయ రేధర్మముల్॥ 163

ఉ॥ శ్రీ శివనామసంస్మరణ,చేతను మిక్కిలిపూర్ణుండైన భూ
మీశుఁడు భూసురోత్తములు, హెచ్చుగమెచ్చఁగ భోజనమ్ములెం
తో శివభక్తితోనొసఁగెఁ, దోరపుఁ గోరికలెల్ల నిండఁగా
నాశలుసప్రయోజనము,లై బహుమోదమువారు కాంచఁగన్॥ 164

తే॥ బట్టువాండ్రకు మఱివార, వనితలకును
భిక్షుకులకును సకల జీ, వికులమునకుఁ

బూర్ణమాసంతసముఁగల్గఁ, బుడమిఱేఁడు
భోజనంబులనిడె, నిచ్చె, భూషణముల॥ 165
తే॥ కొందఱకు గోవులనొసంగెఁ గొందఱకును
భూములనొసంగెఁ దృప్తిసం, పూర్తికాఁగఁ
గొందఱకు నభయవరముల, నందనిచ్చె
రాజతలఁపడఁ గొఱఁతయే, రాదనంగ॥ 166
సీ॥ సామంతరాజులు, సంతోషపడఁదగ్గ, సత్కారములొసంగె, సరసబుద్ధి
రాజబంధువులెల్ల, రహినెంచునట్లుగాఁ గాంచనాంబరములఁ గట్టఁబెట్టి
యంతటనుండక, హరిహిరణ్మయ, కంకణాల్ గజరాజ, కాండములును
బెద్దతనంబును, బిట్టుగాయోచించి, యిచ్చెనుయోగ్యత హెచ్చునటుల
తే॥ కుత్తమున దీనజనులకా, మోద మొదవ
దాసదాసీజనంబుల, కాసదీఱ
మేలిబంగరుసొమ్ములఁ జాలనొసఁగె
నన్యరాజులయీవిమెం, తనెడిమాడ్కి॥ 167
తే॥ రాజశేఖరునుత్సవ, రామణీయకంబుఁగనుఁగొనవచ్చిన, ఘనతరులును
భాగవతవర్యులును దోడి,పార్థివులును తేనియానతిఁబురులఁజే, రిరియథేచ్ఛ॥
ఉ॥ అంతటరాజశేఖరుడు, దంచితభక్తియుతానురాగుఁడై
పంతముతోడ సత్యపరి, పాలనసల్పుచుశంభునిన్ సదా
స్వాంతమునందుఁగొల్చుచునుబాగుగఁబెద్దలభూసురాదులన్
సంతసపెట్టుచుండెఁగడు సత్క్రియలన్ సుఖభోజనాదులన్॥ 168
తే॥ అడవిచెంచులఁజంపఁగానబ్బినట్టి పాతకముగంగఁజేరెను, బార్వతీశు
కరుణచేనాథరానాథ, వరునకపుడు పిన్నపెద్దలుసంతుష్టిఁ బిట్టుగాంచ॥ 170

### రాజేశోత్తరశతశివాలయములలో నొక్కముహూర్తంబున లింగ ప్రతిష్ఠను జేయించిగోగర్భముంజొచ్చుట.

గీ॥ శ్రీమహారాజచిహ్నలఁ, జెలఁగుచుండు
వెంకటాద్రిప్రభుండుప, విత్రమూర్తి
యొక్కయెడనెల్లవారలు, నుబ్బుచుండ
శంభులింగంబులప్రతిష్ఠ, సలిపెనతఁడు॥ 171
ఉ॥ కాననితండు మర్త్యులను, గౌరవమారఁగ నోముచుండి స
న్మానములన్ బ్రశస్తవిధి, మానుగనిచ్చుచుదేవతాంశచే

మానవనాథుఁడయ్యెనని, మన్ననఁజెప్పుకొనంగనొప్పినా
భానుసమాన తేజుగుణ, వర్ణనగణింపఁగనెవరిశక్యమా॥ 172

తే॥ శ్రీరమానాథునంశను, శ్రీవహించి
పుట్టెనీప్రభుసత్తముం, డట్టికలిని
భూప్రజలనెంతొ పేర్మితోఁ, బ్రోచుటకును
రాజనఁగనాతఁడేయను, రక్తిఁగొలిపి॥ 173

చ॥ జనవరులెందఱో కలిగి, స్వర్గముఁగాంచిరివారలెల్లనే
ఘనతరుఁడైనరాజు క్రియ, గట్టిగవిద్యఁ బరీక్షఁజేసిబల్
నెనరున నగ్రహారముల, నేకములన్ బుధపాళికిచ్చి హె
చ్చినగురుభక్తిఁజూపిరె ప్ర, సిద్ధివహించిరె యంధ్రపండితుల్॥ 174

సీ॥ రాజీవనేత్రుండు, రమ్యతరంబుగా, జాంబూనదంబుచే, జక్కనిదగు
ధేనువుఁగావించి, తేజంబువెలయఁగా, సామంతరాజులు, సంతసింపఁ
దద్గర్భమునుజొచ్చి, ధార్మికవృత్తిచే, భూసురోత్తములకుఁ, బొందుగనిడఁ
బంచములేతెంచి, పార్థివోత్తమ! యిది, మృతగోవుమాయది, మీరుదాని

తే॥ మాకొసంగఁగ వలెనంచు, జోఁకనడుగ
వారలకుఁదానివెలయిచ్చి, బాడబులకు
హేమధేనువునొసఁగిన, యిద్ధమూర్తి
నెన్న నెవ్వరిశక్యమా, నీయుగమున॥ 175

వ॥ ఇవ్విధంబున నారాజోత్తముండు సంతతదానధారాప్రవాహంబతిశయిల్ల సకలబుధజనరంజకుండై, విద్వదుత్తములచేఁ బ్రసిద్ధేతిహాసంబులన్ గన్పట్టు పూర్వరాజచరిత్రంబులవిని యారాజచంద్రులమాడ్కిఁ దానును నడువఁద లంచి సుకృతకార్యకృతార్థుండగుచు నీషణత్రయదూరుండై షడూర్ములందు నిమి మోహామయమాయిక చక్రవిలసనసంసారసాగరంబున బుద్ధింగుఱుచ పఱచి తనవిజ్ఞాననేత్రప్రకాశంబునఁ బరంధామునిఁజేరనెంచి రాజ్యపరిపాలన పరుండయ్యెను, నురవగుతఱి నయ్యంబికామనోహరు స్మరియించుచుండె నయ్యెడ॥ 176

మ॥ ఒకనాఁడానృపపుంగవుండు మదిలో,నూహించితెల్పెన్ సభన్
సుకవుల్ కోవిదమండనుల్ వినఁగ హెచ్చుంగూర్మితో నేనుస
త్ప్రకరశ్లాఘ్యకృతిప్రయత్నమును హర్షంబొప్పఁగాఁజేయనా
యకళంకంబగునెమ్మదిన్ దలఁచితిన్,వ్యాహారసహ్యాత్మతన్॥ 177



## రాజుమయూరవాహనుండు కాదలంచుట

గీ॥ కార్తికేయుండుతొల్లిచక్కనిమనీష బర్హివాహనముచునెక్కఁబ్రబలకాంతు
ముక్తికారణమనితొంటి,మునులుచెప్ప విన్నవాఁడటనేనట్టి,విధిగ్రహింతు॥ 178

వ॥ అనియారాజపుంగవుండు మంత్రింజేరిమఱియునిట్లనియె॥ 179

ఉ॥ ఓసచివాగ్రగణ్యశుభయోగముకల్గెడిరీతిమంచియ
భ్యాసముకల్గుశిల్పినిన, భంగురబుద్ధినిజేరఁదీసియే
దోసములేనియట్టులుగఁ,దోరపునెమ్మినిఁజేయఁజేసినే
నాసమెయిన్ దదంతరము, నందుఁజోరంబడిపోవనెంచితిన్॥ 180

వ॥ కావుననట్టిమయూరవాహనమ్ము చేయింపుమని యాజ్ఞాపింప నమ్మంత్రిసత్తముండును శిల్పకారవరునిరావించి రాజాజ్ఞందెల్పి సువర్ణఖండమ్ములొసంగి, సుందరతరంబగు నెమలింజేయింప రాజువిని సంతసించి తనప్రధానబంధువుల నందఱరావించి విప్రపుంగవులంబిలిపించుకొని, త్రిక్కియాది దృకుంబరఁగు వారలంగూడఁబిలువనంపించికొని యప్పుడు॥

చ॥ ఘనతరసౌధభాగములఁ,గ్రంతలరచ్చలరాజవీథులన్
మునుకొని కాంతియుక్తముగ,మున్నెయలంకృతిసల్పితత్పురిన్ 181
మనికిగనున్నవారలకు, మానుగనీశుభవార్తఁదెల్పియ
య్యనఘుఁడునెమ్మినెక్కుటకు, నాసఁగొనెన్ మదిసర్వసమ్మతిన్॥ 182

తే॥ సకలసామంతరాజులు, సంభ్రమమున। వచ్చిరమరావతికిఁదమ, యిచ్ఛదీఱ
బంధుమిత్రాదివర్గముల్, పటిమమెఱయఁ। జేరిరయ్యెడవేవేగ స్థిరవిభూతి॥ 183

మ॥ అపుడాభూపతిసంతసంబలరన, త్యంతప్రమోదంబుతో
నిపుణత్వంబునఁబార్వతీపతికిసా, న్నిధ్యంబునన్ గేకినిన్
వపురుద్యద్రుచినిల్పఁగాబుధజన, వ్రాతంబులున్ మిత్రులున్
నృపులున్ యోగ్యులుకాంచిరానెమిలి వ, న్నెన్ సామిచెన్నెన్ దగన్॥ 184

క॥ తొల్లిటినరపతులీవిధి। నుల్లముపరిశుద్ధమగుచు, నుండఁగఘనమై
చెల్లినకార్యములన్నిటిఁ। బెల్లుగఁజేసిరెకృతార్థ, విభవములందన్॥ 185

ఉ॥ ఆసమయంబునన్ నృపతి, యద్భుతభక్తినినార్యచంద్రులన్
భూసురవర్యులంబిలిచి, పొల్పుగశంభునకేపుమీఱఁగా
వాసిగవందనార్చనలు బాగుగఁజేయుఁడటంచుఁజెప్పఁగా
నాసరసాత్ములందఱు స, మంచితపూజలుసల్పిరొప్పుగన్॥ 186

ఉ॥ ఆతఁడు ప్రశస్తభూషల ధ, రించి భటాదులతోడఁగూడి మా
రాడకప్రేక్ష్యులెల్లరు స్వ, యమ్మునయమ్మునుజూపుచుండఁ బెన్
బోడిమి సూరివారము ప్ర, పూతపుదీవనలిచ్చుచుండ నా
జాడ నెఱింగి పోఁదగు గ, జమ్మును నెక్కెఁ జటుక్కునన్ వెసన్॥ 187

గీ॥ భేరికలు భోరుమని మ్రోయఁ బృథ్వియెల్ల। నంతులేనట్టి సంతోష, మందుచుండ
వృద్ధవనితలు కౌసుమవృష్టిఁ గురియ। రాజు వేంచేసె బర్హ్వాణ, రాజమెక్కి॥ 188

సీ॥ నీలమేఘంబుల, నిగల్ నిగల్ గుమిగూడి, నెమిలిపించియమునఁ గొమరుజూప,
వరమయూరపురుచి, వసుధాతలంబెల్ల, నంతంతయైతద్ద, నాక్రమింప
నానెమ్మిచంచువు, శ్రీనివాసంబయి, మణులకాంతులమించి, మలయుచుండ
నాకేకిపైనున్న, యవనీంద్రుఁడొప్పెను, గైలాసవాసుని, కళవహించి

తే॥ యట్టియెడ బట్టువాండ్రెల్ల, నధికభక్తి। మేదినీనాథుగొనముల, మించిపొగడ,
సకలరాజవతంసులు, సంతసింప। నెడలెనయ్యెడ రాజువే, వేడ్కతోడ॥ 189

సీ॥ మందహాసముతోడ, మానవాధీశుండు, ఘనమయూరంబుపై, గరిమనుండ
ధీసచివుండును, ధీరుఁడౌ పేష్కారుఁ డిరువంకఁగొల్చుచుఁ నెలమిఁజూప
సామంతరాజులు, చతురగతులచేత, సార్వభౌమునితోడ, సరసమతుల
మదగజంబులపైని, మఱిహయంబులపైని, యారోహణముఁ జేసి, యతిశయిల్లి

తే॥ రాజవీథులఁగదలంగ రమ్యముగను। భూసురోత్తములెల్లరు భూరికృపను
దీవనలనీయ, నాతఁడు శ్రీవిమెఱయఁ। గన్నులకుఁ గ్రొత్తపండువు, గలిగెనపుడు॥

తే॥ రాజమార్గపరంపర, నోజనున్న। సకలజనులును సంతోషజలధినీఁద
మందగతులను సామంత,మహిపులెల్ల। ఆనియుత్సవముమనోజ్ఞ,రీతిఁగనిరి॥ 191

చ॥ నరపతియుత్తమోత్తముఁడు, నారకనాశనమాత్మనెంచి సుం
దరతరమైన కేకిపయిఁ, దాఁగడుఁ బేర్మిచెలంగ నెక్కి స
త్వరముగ రాజమార్గమున, వచ్చుచునుండెను దొంటిరాజులీ
వరుసగ్రహించిరే యనుచు, వారునువారుమదిన్ దలంపఁగాన్॥ 192

మ॥ అని యిబ్భంగి మనుష్యులందఱపుడ, త్యాశ్చర్యసంతుష్టితో
ఘనభూపాలుని సత్క్రియన్ గొనుచు శం,కాశూన్యులై వెంటనే
యనువొప్పన్ గమనించుచుండ నృపుఁడున్, ఖ్యాతస్వభావస్థితిన్
జనుదెంచెన్ నిజహర్మ్యరత్నమునకున్, జంచత్ప్రభాధాముఁడై॥ 193

వ॥ అప్పుడా రాజోత్తముండు తదుత్తమకృత్యానంతరంబున బ్రాహ్మణప్రముఖుల
కు జాంబూనదాంబర మహాగ్రహారంబులు సంతృప్తిగనొసంగి, వచ్చియున్న

సమస్తజనులకు, స్వనివాసంబులకుఁ బోవ సెలవొసంగె నయ్యెడ॥ 194
గీ॥ క్ష్మావరుండుమదిని, శంకరుమానాథు। నెంతొభక్తిఁగొల్చి హితులకెల్ల
మేలిగౌరవముల, మెలపునఁజేయుచు।సంతసించుచుండె, స్వాంతమందు॥ 195
తే॥ మంగళాద్రిని బాండవుల్, మహితబుద్ధి దేవళంబును గట్టించి, దీప్తిమెఱయ
మున్ను నరసింహమూర్తిని, మోదమలర, సుప్రతిష్ఠితుఁజేసిరి, సొంపుగాను॥

## మంగళాద్రిని నరసింహమూర్తికి గోపురంబులు మొదలగు కైంకర్యములు చేయించుట.

తే॥ అట్టిమహనీయమూర్తిని, నవనిజనులు
భక్తిచేతనుధ్యానింపఁబ్రబలమైన
సంకటంబులఁబోఁద్రోచి, సమరసముగ
మోక్షమబ్బంగఁజేసిన, ముఖ్యతముఁడు॥ 197
తే॥ ప్రబలియున్నట్టిశ్రీహరి, పాదసేవ। సేయుటుచితంబటంచును, స్థిరవిభూతి
మంగళాద్రినివేంచేసి, మనుజవిభుఁడు।సకలసత్క్రియలను సల్పి,సాధువృత్తి॥ 199
వ॥ ఇట్లుండు సమయంబున॥
సీ॥ భూపాలుఁడొకనిసి, భూరిసుషుప్తిని, నిజశయ్యయందుండ, నిరుపముగ
స్వప్నమందునఁదెల్పె, స్వస్వరూపముతోడఁ, బ్రసరించిశ్రీహరి, ప్రబలగతిని
మద్ద్వారమందున, మంచిగోపురమును, బ్రాకారమండపాల్, బాగుగాను
గట్టింపుమనిచెప్ప, గౌరవంబలరార, క్షితిపతిమేల్కాంచి, శీఘ్రముగను
తే॥ జూడనెవ్వరిఁగానక. చోద్యమంది
యంతరంబునయోజించె, నవనివిభుఁడు
శ్రీరమానాథుఁడేయిట్టి, సిద్ధినొసఁగెఁ
గాకయుండిననన్నుఁ బ్రోచు, ఘనుఁడెవండు॥ 200
గీ॥ ఇట్టులారాజుతనమది, నెంచుకొనుచు। దేవదేవునియెడఁదనభావముంచి
నిత్యమునుసంస్మరింపుచు, నియతితోడ।వర్తిలుచునుండె,దేవేంద్రవైభవమున॥
సీ॥ భూతలనాథుండు, భువనాధిపతికినై, మంగళాద్రినిమంచి, మహిమవెలుఁగ
గోపురంబొక్కటి, కూర్మిచేఁగట్టింప, వలెననిమిక్కిలి, వాంఛతోడ
నిజరాష్ట్రముననుండు, నిపుణులశిల్పుల, రావించెనయ్యెడ, రమ్యముగను
బ్రాసాదమునకు, సంబంధించుతూర్పున, మంజులంబైనట్టి, మండపములు
తే॥ శాస్త్రవిధిమీఱఁగట్టుమా, చతురబుద్ధి
ననుచుభూపతిసెలవీయ, హర్షమెసఁగ

శిల్పకారకులయ్యెడ, స్థిరవిభూతి
క్షితిపతియనుజ్ఞఁగైకొని, రతిముదమున॥ 202

వ॥ ఇట్లుభూవరుండు గోపురప్రాకారమంటపంబులు, కట్టింపఁదలంచి, శంకుస్థాపనాదికృత్యంబులందీర్చి గోపురంబుఁగట్టుటకుఁబనులనారంభింపఁజేసెనయ్యెడ॥

సీ॥ నిజరాష్ట్రమందున, నిపుణులౌవారల, రావించినియమించె, రాజవరుఁడు
తనభూములందున్న, దండిసాలములనుఖండించియుష్టికల్కాలఁజేసిఁ
బండ్లపైనెక్కించి, భక్తిఁదోలుకొనుచు, తోఁబంపుఁజేయుంచు,ద్రోవఁజెప్పి
నాపతాలనుమీరు, బాపురేయనుమాడ్కి, బాగుగాయోజించి, పంపవలయు

తే॥ ననుచుఁదనయనుయాయుల, కందఱకును
సెలవులనొసంగి, భూమిపశేఖరుండు
వారుతనయాజ్ఞచొప్పున, వానినెల్లఁ
జేర్చికొనిరాఁగ, సంతుష్టి, చెందెనపుడు॥ 204

చ॥ జనపతిదైవమందుఁగల, చక్కనిభక్తిని, తాలుమున్నగా
ననువగువస్తువుల్ తగిన, యట్టులుచేరఁగఁజేసిపిమ్మటన్
ఘనుఁడగువీరచారితనుఁ, గన్గొనిమీదయయన్న నాతనిన్
గనికరమొప్పఁజూచివినఁ,గాఁబలికెన్ బనులెల్లసేయఁగన్ ॥ 205

సీ॥ వర్షద్వయములోన, వసుధాధిపులుమెచ్చ, గోపురమ్మునుగట్టి,గూర్మితోడఁ
జిత్రవిచిత్రముల్ శిల్పశాస్త్రజ్ఞులు, రచియించిరయ్యెడ రమ్యముగను
ప్రాకారమంటపాల్, పటిమనుగట్టిరి చూపరులయ్యెడఁజోద్యమంద
భూస్థలంబునసిట్టిపొడవును వెడలుపు, చిత్రాంశములుగల్గి,చెలఁగుచున్న

తే॥ గోపురంబునుగానము, గోపురమున
నుండునేమొకొయనిమహా, ద్దండులపుడు
చర్చచేయుచునుండంగ,ఁజాలియున్న
గోపురాములఁగట్టిరికౌఁతలడఁచి॥ 206

ఉ॥ కట్టిరిశిల్పకారులతి, గౌరవముప్పతిలంగగోపురం
బట్టిమటింబ్రయత్నమున, నన్యములన్ రచియించిరెంతొపా
ల్పుట్టిపడంగనెల్లరు మహావిభవంబిటహెచ్చెనంచువా
గ్ధట్టతఁజూపజేనిదయ,ఁగైకొనిచిన్నెలువన్నెలుందగన్॥ 207

సీ॥ క్షితిపతిసతతంబు, చిత్తంబురంజిల్ల, శ్రీహరిఁదలఁచుచుస్థిరవిభూతి
మంగళగిరియందు, మహిమమూతిశయముల, నరసింహమూర్తికిసరసముగను

నైంకర్యములుసల్పి, ఘనవిరాగముఁజెంది, నిర్వికల్పసమాధి,నిల్చివిభుఁడు
నైజాంశఁగాంచుచు, నానెంబుగానుండు, కురరంబురీతిని, గోర్కెవదలి
తే॥ గీ॥ హరిహరాదులనామంబులంతరంగ, కర్ణికాస్థలియందునఁగదలనీక
శాంభవీదృష్టిచేతను,సాంద్రగతిని జూచుచుండును నిరతంబు,శుభ్రకళల॥ 208
సీ॥ నిజరాజ్యభోగంబు, నిక్కంబుగాదని, చిత్తంబునందుసుస్థిరతఁదలఁచి
తత్త్వవిచారంబు, తగవొప్పఁజేయుచు, శ్రీహరిఁగూర్చితా,శ్రేయమలరఁ
జూచువారలకెల్లఁజోద్యంబుగానుండు, భూనాథుఁడెప్పుఁడు,భూరిభక్తి
మునుజనకాదులు, మోహముల్ విడనాడి, మురహరధ్యానంబు, మొనసిచేసి
తే॥ గీ॥ కడకుమోక్షంబుఁజెందిన,కరణివిభుఁడు
నిజమనోజ్ఞాతపరిపాకనియమమునను
మంగళప్రదకార్యముల్, మనసుదీఱ
సల్పుచుండెమహాభక్తి,సాంద్రుఁడగుచు॥ 209
తే॥ స్వామికళ్యాణవేళల,భక్తులెల్లఁ బ్రవిమలానందచిత్తులై, బహువిధముల
శ్రీనృసింహమహాదేవుచింతనమున నపరిమితమగుమోదంబు, నందుచుంద్రు॥
వ॥ ఇవ్విధంబున, నారాజకంఠీరవుండు, పరమానందభరితుండై, మంగళాద్రిని,
నిత్యోత్సవపక్షోత్సవాదుల యథావిధిగ జరుపునట్లాజ్ఞయిచ్చి యచ్చటినుండి
సపరిజనంబుగా నమరావతిం బ్రవేశించి, యయ్యమరావతినొక్క కైలాసంబుగ
నీమంగళాద్రి నొక్క వైకుంఠంబుగానెంచుకొనుచు నందలిదైవతంబుల, సర్వ
థాతలంచుచు న్యాయ్యంబుగ ధరాపరిపాలనంబు సేయుచుండె నయ్యెడ॥ 211
సీ॥ శ్రీలక్ష్మీదనరార, స్థిరతేజమున, రాజు, జగ్గయ్యపేటను జలముపట్టి
తనతండ్రిపేరున, ఘనముగాఁగట్టించెఁ, దల్లిపేరున, మహాదానధర్మ
సదనమైనట్టి యచ్చమ్మపేటను, వేడ్కఁ, గట్టించి, నిజనామకలితకలన
మనికిరాజాపేటయును, మన్నెసుల్తానుపేటయు, నాయని, పేటయనెడి
తే॥ పట్టణమ్ములఁగట్టించెఁ, బటిమమెఱయ। సకలవర్ణాశ్రమవిధాన, సరణినెఱపి
కీర్తిచేమించె రాజ్యలక్ష్మియుతుండు। వేంకటాద్రిప్రభుండుసద్వినుతుఁడగుచు॥
ఉ॥ ఈవిధి భూవిభుండు కడు, హెచ్చుగనిచ్చలు సత్యసంధుఁడై
శ్రీవెలయంగ లోపములఁ, జెందక యెందును రాజ్యపాలనం
బావరపూర్వరాజులక్రియన్ బహుసౌఖ్యముచేకుఱంగ స
ద్భావముతోడఁజేసి తన, దత్తతనూజులకిచ్చె రాజ్యమున్॥ 213

తే॥ ఇట్లురాజ్యంబుఁ బుత్రుల,కిచ్చి యవల
దివ్యమతి "లోకనాథవం, దే"యటంచు
నెల్లవేళల భగవన్తు, నుల్లమందుఁ
దలఁచుచు విరాగబుద్ధిచే, వెలయుచుండె॥ 214

తే॥ శ్రీమహాదేవు సత్కృపఁ, జెందఁగోరి
భూవిభుఁడు స్వామిపదభక్తిచే వెలయఁగ
భక్తమానస సంచారపరతమెఱయ
నొక్కనిసినంబికేశుండు, మక్కువమెయి॥ 215

వ॥ గిరిజా సమేతుండై యిప్పుడమిఱేనికి సాక్షాత్కరింప భూపాలుండు దిగ్గున
మేల్కాంచి సాష్టాంగాదుల నాచరించి దోసిలియొగ్గి యెదుట నిల్వ భక్తాను
రాగంబున, నాపురాణదంపతు లీతనికిట్లనిరి॥ 216

♦ ఉమామహేశ్వరులు వేంకటాద్రినాయనికి దర్శనమిచ్చి తత్త్వోపదేశముఁజేయుట ♦

చ॥ నరవర! నిర్మలాత్మత, నంతఫలంబుఁగోరి నీవుదు
స్తరతరమైన భక్తిని య,థావిధి మాకు నమస్తపూజలున్
జరుపుచు రాజ్యభోగముల, స్వాంతమునందు గణింపకుంటివి
ప్పురుసున నీప్రవర్తన మ,పారముదంబొనరించె వింటివే॥ 217

చ॥ అనఘమతుల్ ప్రశస్తగుణు, లైనమహామునులెల్లమున్నుమా
ఘనతరసత్కృపామహిమఁ, గాంచఁగన త్తపముల్ పొనర్చిన
త్వనిధితఁగాంచిమోక్షపద, వల్లభులై పరభాగలబ్ధిచే
ననుపమతేజులైరియటు,లౌదువొ వేమొయెఱుంగఁగోర్కియా॥ 218

ఆ॥వె॥ కాననట్టికోర్కి, ఘనమతిఁజేకొనినన్నుఁగూర్చితపముఁగొన్న నీవు
కోరుకోర్కియేమొ, కువలయేశ్వర! చెప్పు నిష్టదాయినౌచు, నెపుడుఁబ్రోతు॥

శా॥ మాయాత్యాగమొనర్చి సత్యనియతిన్, మంజుస్వభావాత్మతన్
గాయభ్రాంతినివీడిదారసుతసం, గంబున్ మదిన్ రోసిస్వే
చ్ఛాయత్తంబగుచిత్తముం గొనుచుమో, క్షార్థిప్రధానుండవై
మాయందున్ గననెంచియుంటివనిన, మ్మన్ సందియంబుండునే॥ 220

ఉ॥ కావున నీమనోనియతిఁ,గన్గొనవచ్చితిమెచ్చితిన్ భవ
ద్భావమువృద్ధిఁగాంచునుభ, వద్గృహరాజముపుత్రపౌత్రసౌ
ఖ్యావహమౌచుధర్మనిధి,యౌచునఖండరమాధివాసమై
ఓవినయాంబుధీ! సకల, సిద్ధులునీకుఁదటస్థమౌఁజుమీ॥ 221

తే॥ కోరుమానీదుమదిలోనఁ, గుదురుకొన్న।కోర్కెననాన్నృపాలక, కుంజరుండు
పార్వతీశ! కృపావార్ధి!, సర్వఫలద! తారకంబును దెల్పుముతనియననియె॥ 222

క॥ అనవినిశంకరుఁడపుడా।త్యనుపమసత్కృపచెలంగ, నవనీపతితో
ఘనతదలిర్పఁగనిట్లనె।వినుతెల్పెదఁదత్త్వబోధ, వినయంబడఁగన్॥ 223

వ॥ అయ్యాది, మఱియు, నాదిమధ్యాంతవిహీనంబును, స్వగతభేదశూన్యంబును
స్వప్రకాశాప హసితానంత కోటిసూర్య చంద్రానలా లోకంబును, వేదశా
స్త్రపురాణేతిహాసాద్య గమ్యంబును, బహువిధవర్ణ ధర్మకర్మ గుణ
నామరూప వికారశక్తి విరహితంబును, బ్రహ్మేంద్రాది సమస్తమహా
మహోపాస్యంబును నిరంతర నిర్గుణ నిర్వికల్ప నిరంజననిరాకారనిర్వి
కార నిర్విషయాతీంద్రియా వాఙ్మనసగోచరా ప్రమేయశుద్ధబుద్ధ
ముక్త కేవలాఖండసచ్చిదానందమయంబయిన తురీయాతీతపరతత్త్వవైకుంఠ
పురంబున, నవ్యక్తమహదాదిసప్తావరణ పరివేష్టితంబును, జతుర్దశలోకకంద
రసుందరంబును, సార్వభౌమాదిహిరణ్యగర్భాంతానందగండశైలభాసురంబు
ను, రవిశశితారాగ్రహసౌదామన్యాదివివిధతేజోరత్నశర్కరిలంబును, బ్రవి
మలవైరాగ్యోపరత్యేకాంతాత్యంతముముక్షుతాధిత్య కాధ్యాత్మానందజీవనాభి
షిక్త నిర్మలనిశ్చలతాకలికాకలిత ఫలితనిష్కామకర్మోపాసనాయోగ జపత
పస్సత్యశౌచదయాశీల వ్రతదానాదినానావిధానేకోద్యానవిరాజితంబును, శా
స్త్రపుష్పోపేతనిగమాగమాంతకల్పలతావిలసితంబును, షడ్విధసమాధిసౌధ
విభ్రాజితంబును, పరమాధ్యాత్మవిద్యానందజలాభిషేకనిర్మలచిత్త వృత్త్యం
గణశమదమోపరతి తితిక్షాశ్రద్ధాసమాధానా మానిత్వాదాంభికత్వాది క
ల్యాణగుణమణిగణరంగవల్లిప్రకాశితంబును, నిరతిశయవైకుంఠ భాండా
గార శోభితంబును, ఫలకామనాభావస్వభావనియత కర్మాచరణ
చిత్తశుద్ధి సర్వకర్మపరిత్యాగ గురుభక్తివేదాంత శ్రవణమనననిధిధ్యా
సజ్ఞానాదిసోపాన సమన్వితవిజ్ఞాన రాజమార్గలలితంబును, అష్టాక్షరీ
మహామంత్రమాణిక్యతోరణాలంకృతంబును, బ్రణవనాదమంగళవాద్య రవ
పూరితంబును నగు తురీయమహాస్థానమంటపాంతరంబున సర్వోపనిషత్సార
భూతబ్రహ్మాత్మైకత్వదర్శన రూపోంకార సింహాసనాసీనుండై శుద్ధసత్త్వ
ప్రధానమాయామయదివ్యశోభన విగ్రహుండును, సర్వజ్ఞత్వసర్వాంతర్యామి
త్వసర్వస్రష్టృత్వసర్వరక్షకత్వ సర్వసంహారకత్వాద్యగణిత సమగ్ర సుగుణపరి
గ్రహుండును, సత్యజ్ఞానానందస్వరూపుఁడును, సర్వవ్యాపకుండును, దేవ

దేవుండునునగు శ్రీమన్నారాయణుండు మూర్తిమంతంబులైె చతుర్వింశతి తత్త్వంబులు నిచ్ఛాజ్ఞాన క్రియాదిశక్తులును వాణీశ్వరసురేశ్వరాదులు స్వసాన్నిధ్యంబున నిజకరుణాకటాక్షవీక్షణంబు నపేక్షించికొలువ స్వస్వరూపావలోకనంబు చేయుచున్న సమయంబునందదీయవక్షస్స్థలస్థితయుం బరాపరప్రకృతి రూపిణియు నిఖిలజగదుపాదానకారణభూతయు నఖిలలోకైకమాతయుం ద్రిభువనగేహినియు, విశ్వమోహినియు, ధీముఖియు, జ్ఞానవిజ్ఞానలోచనయు, విషయ విరక్త్యధరయు, విచారమందస్మితయు, నిర్మమతానిరహంతాహస్తయు, యోగబోధస్తనియు, సందేహమధ్యయు, సంసారచక్రనాభియు, రాగద్వేషజఘనయుం గామలోభోరుయుగళయు, సంకల్పవికల్పచరణయుం, గాలానుగతకర్మయాపనయు. వేదాంతవిద్యావ్యసనవసనోపరతికంచుకధారిణియు, రజస్సత్త్వతమోగుణగ్రంథినీవీబంధకంచుకబంధవేణీబంధ సురుచిరయు, ఫలత్యాగపూర్వవర్ణాశ్రమోచిత ధర్మానుష్ఠానేశ్వర ప్రణిధానాచార్యోపాసనేంద్రియాత్మవినిగ్రహస్థిత ప్రజ్ఞత్వాతి సాత్వికగుణభూషణాలంకారిణియు, శుద్ధవాసనావాసితయు, నిత్యానపాయినియు, దేవదేవియునగు శ్రీమహాలక్ష్మి, యతిప్రీతిపూర్వకంబుగం జతుర్విధశుశ్రూషలు గావించుచు సేవించుచుం బూజించుచు, నమస్కరించుచు, నారాధించిన ప్రసన్నుండై మెచ్చి నీకు నెయ్యది యిష్టంబిచ్చెద నడుగుమనిన సంతోషభరితచిత్తయై యమ్మత్తకాశిని, చిఱునవ్వుతో నిట్లనియె॥ 224

ఆ॥ వాసుదేవ! నాకు, భర్తవై భాసిల్లు। నిన్నుం గొల్చుకన్న, నిర్మలాత్మ
వేఱు కార్యమేమి, వివరింపంగాంగల్గు। సర్వమీవె మాకుం బ్రశస్తసేవ॥ 225

తే॥ ఐన నీకోర్కెం దీర్చెద, నడుగుమనంగ। నడ్గెదను స్వామి శ్రీనాథ!, యర్హమైన
నడుగరాని రహస్యంబు, నడుగవలసె। మర్త్యులందఱకనువైన మంత్రమగుట॥

క॥ నిఖిలాంహస్సంక్షయకర। మఖిలాభీష్టప్రదంబ, నంతావ్యయచి
త్సుఖదము జగదధిపత్యభి। ముఖకరమగు మంత్రరాజ,ముం గృపం జెపుమా॥

తే॥ అనినవిని నవ్వి లక్ష్మికి,ట్లనియె విష్ణుం
డడుగరాని రహస్యార్థ, మడిగితిగద
యది మదీయంపు నిక్షేపమగు పదార్థ
మైన నెఱింగింతు నీకు నెయ్యంబువలన॥ 228

తే॥ రమణి! విను తెల్పెదను నీకు, రమ్యముగను
నీకుం బరశివునామమే, నెమ్మిం గొలువుం

గాన నీవదిగైకొను, ఘనతమీఱ
శ్రీ సదాశివనామంబు, చింతలుడుపు॥ 229

సీ॥ పంచాక్షరీమంత్ర, పఠనచే బ్రహ్మాదు, లందఱిమహిమంబు, లధికముగను
శివనామకీర్తన ,చేతమార్కండేయ, మునిముఖ్యులెంతో గ్రై, కొనిరిమహిమ
మఱియెంద ఱెందఱోమదనారిసేవించి, శాశ్వతానందసం,స్థాయులైరి
హేలగానేనిగా,రీశునామము నెంచి,యెందఱెందఱో చెంది, రీశుపదము

తే॥ నేమిచెప్పంగవలయును,మేశుమహిమ। మెన్నశక్యమెయమరుల, కేనినింతి।
సంతతముసంతసముచిత్త,సద్మమందుఁ,జేర్చిజగదీశుసేవింపఁ,జెలఁగుమేలు॥ 230

క॥ సత్యజ్ఞానానంద।ప్రత్యగభిన్నాత్మనందు,బ్రహ్మాదిబుధుల్।
నిత్యమురమించుచుండఁగ।స్తుత్యముశివనామమహిమ,శోభిల్లెధరన్ 231

తే॥ శంకరునిఁగొల్చువారికి సకలపాప సంఘములడంగుఁగలుగుమోక్షప్రసిద్ధి
తొల్లిటిమహాత్ములెందఱో, ధూర్జటికృప।నందిశాశ్వతభోగంబులందుకొనిరి॥

తే॥ఆమహాదేవుపంచాక్షరీమహిమను పెక్కుమందినిగృతకృత్య, విధికిఁదిప్పి
బాగుసేయదుదానిసం, బంధమున్న।బంధమునువీడిసంసారి, ప్రజ్ఞ,గనఁడె॥ 223

తే॥ ఆతనికినాకుభేదమెందరయలేదు।శివపదనివాసియాసదా, శివుఁడనంగ
నద్వయబ్రహ్మమయులమే, మందువలన।నింతి!శివనామమేప్రొద్దునేభజింతు ॥

తే॥ చిత్తశుద్ధినిభజియింతు, శివపదంబు
దానిమహిమమ్ముఁదెల్పనా, తరమెయబల!
సకలపాపంబులణఁచి శా,శ్వతములైన
యోగ భోగమ్ములొసఁగు నా,భోగనియతి॥ 235

తే॥ ముజ్జగమ్ములలోపల, మోదమలర। రమణి! శ్రీశివనామంబు రమ్యముగను
స్మరణసేయక సౌఖ్యల,క్ష్మములఁగన్న। వారలే లేరు లేరు లేరేరు లేరు॥ 236

తే॥ మద్యపానంబుగురుని భా,మాసుఖంబు। బంగరుందొంగలించుట; పట్టిగల్గు
గర్భముంజెడఁగొట్టుట, పడఁతి! పెద్ద। పాతకంబులు, హతములౌ భర్గుఁదలఁప॥

తే॥ సింగముంగాంచి మెకములు, చెదరినట్లు
శ్రీశివస్వామి నామంబు, చెలఁగుచోట
దుర్భరాఘావళులు భీతి, తొందరింపఁ
జెల్లచెదరగు నిఁకనేమి, చెప్పవలయు॥ 238

చ॥ స్మరహరనామసంస్మరణ,సల్పుచు నిచ్చలుమోక్షమార్గ సం
చరణనిరూఢిఁగాంచి సర,సప్రణుతుల్గ్రహియించు భాగ్యసం

భరితుఁడు పాపవర్గముల, పాలఁబడండు గజమ్ము నెక్కి పెం
దెరువునఁబోవువాఁడు గణుతించునె కుర్కురబుక్కణంబులన్ 239

క॥ ఇలలో శంకరునామము: సులభంబై వెలుఁగుచుండ సుల్వొగఁదలఁపన్
గలనాలుకగల్గఁగనల్పులుమిన్నక నారకములఁ, బొందెదరకటా॥ 240

చ॥ సతతము శంభునామమును, సమ్మదమారఁదలంచువారికిన్
వెతలుదొలంగు వ్యాధులప్ర,వేశము రూపరుమంగళావళీ
శతముపొసంగు బ్రహ్మపద,సంచరణంబొనఁగూడుఁ జిక్కు లే
గతిఁగలుగంగ లేవు న,రకంబు ఘెడీలునఁగూలు నెప్పుడున్॥ 241

ఉ॥ ఈయిలమానవావళికి, నీశ్వరనామము భోగభాగ్యసం
ధాయకమౌచు నన్నిటికిఁదారకమౌచు నఖండవిద్యయుం
దాయతధీబలంబొసఁగి నర్థిఁబ్రశస్తపుశస్తముల్ సుదృ
గ్గేయముగానొనర్చి వెలిఁగించు స్వతఃప్రభయెల్లకాలమున్॥ 242

చ॥ కనదురుశంభునామనిధి,కంటె ఘనంబగుపాపనష్టిసా
ధనము కనంగరాదు సత,తంబు సమస్తమనోజ్ఞవృత్తిత
త్త్వనియతిఁగూర్చుపొంటుఫల,వత్క్రతుల్ గలిగించుపొంటె నెం
దును దెలియంగరాదు గుణ,ధుర్యము వేఱొకఁడెద్దియుద్ధరన్ 243

తే॥ అబల! శ్రీశివనామమం,త్రార్థమెల్ల యాశ్రితంబులనర్థులకిచ్చుచుండఁ
గాంచిసిగ్గిలుచుండును,గల్పతరువు కామధేనువుమఱియుఁ జింతామణియును॥

తే॥ తవిలి శ్రీశివనామసుధా,రసంబు
నమృతమని క్రోలుభక్తుల,కమృతమేల
నమరనమృతాంధసులచేత,నదియుమిగులఁ
గోరఁబడుచుండుఁగావునఁ గువలయాక్షి॥ 245

తే॥ ఎపుడుఁజూడనిమానవు, నెట్లొ సేరఁ। బిలువనాతండు చెంగటఁ గలయునట్లు
తన్నెఱుంగకతనపేరు, తలఁచినపుడె। కరుణఁబ్రసరించుశంభుండు, గౌరవమున॥

తే॥ "శ్రీసదాశివ, శివ, శివ, శివ"యటంచు। నిత్యనిర్మలభక్తిని, నియతితోడ
సంస్మరించినవారికి, సమరసముగ। మోక్షమఱచేతిలోనుండు మోదమలర॥

వ॥ ఓహరిప్రియా! సూర్యుండుచీకఁటిఁజీకాకుపఱచినట్లు శ్రీశివనామంబు బ్రహ్మహత్యాపాతకంబునడంచు; వాయువంబుదపటలింజెదరఁగొట్టినట్లు శ్రీశివనామంబు మద్యపానజదోషంబు నడంచు; వజ్రాయుధము పర్వతపక్షధ్వంసంబొనర్చినట్లు శ్రీశివనామము స్వర్ణతస్కరణజాతపాతకంబునడంచు; సింగమేన్గుం

గూల్చురీతి శ్రీశివనామము గురుతల్పగ సంగతదురితంబుఁ బోకార్చు; దావంబు వనవాటిం దహించురీతి శ్రీశివనామము, మాతాపితృసహోదర హత్యాజాతపాతకంబులఁ దొలంగించు; నిట్టివట్టివనియన నేల, సకలదుష్కర్మకల్పనాజల్పనజన్యమహాఘోరనారకవారవారణంబున శ్రీశివనామం బెతారకంబు, గావున శ్రీశివనామమంత్రంబును, దత్ప్రభావంబును, నుపదేశించిన నాకర్ణించి యయ్యర్ణవపుత్రిక మహానందబంధురాంతరయై, యతిభక్తిపూర్వకంబుగ, దండప్రణామం బాచరించి "మహాత్మా తన్మంత్రాధిష్ఠానదేవతా శ్రీశివతత్త్వస్వరూపం బెట్టిదో తెల్పుమనఁ గొంతతడవూరకుండి యాత్మనాలోచించి, యుపనిషద్వాక్యంబుల నీశివనామ మాహాత్మ్యంబు విస్పష్టంబుగా నుండునది యతిగూఢంబు కావున నేరికి గోచరంబుగాకుండు, దాని నేనుపదేశించెద" నని శ్రీవల్లభుండు లోకమాతకిట్లనియె॥ 248

చ॥ ఉమయును శంకరుండ తులి, తోజ్జ్వలదీప్తివిరాజమానులై
సమరసమైనస్వాంతములఁ, జక్కనివెండిమలన్ వసించుచ
య్యమరులు గొల్వ భూస్థలికి, నయ్యుభయుల్ చనుదెంచి భక్తులన్
క్రమముగఁ బ్రోవఁగాశికను, ఘట్టమునందు వసించిరయ్యెడన్॥ 249

చ॥ మునివరులాదిగాఁగలుగు, ముఖ్యులభక్తులఁ గూర్మితోడుతన్
ఘనముగ మోక్షసంపదన, ఖండసుదృగ్గతినిచ్చి ప్రోచుచున్
బెనఁకువచేతదుష్టులను, బిట్టదలించుచు నెల్లనిర్జరుల్
వినుతులు సేయ భూస్థలిని, వేడ్కచెలంగఁగ నుండిరయ్యెడన్॥ 250

వ॥ ఇవ్విధంబున నుమామహేశ్వరులు భక్తజనపాలన పరాయణులై యుండియం నుశంకరుండు శర్వాణి మొగంబుగాంచి మదీయనమస్యాసక్తుండును, బరమభాగవతోత్తముండును, వాసిరెడ్డివంశపావనుండునగు నితనికిమద్దివ్యతత్త్వం బుపదేశింపుమని యననుప్పొంగి మందస్మితముఖారవిందయై విశ్వమోహినియైన సర్వమంగళతద్దాసునింగాంచి యిట్లనియె. 251

మ॥ సుమతీ శైవము నిర్వికారము సదా, శుద్ధంబు బుద్ధంబు చిం
త్యమవాచ్యంబతులంబతీంద్రియము స, త్తామాత్రమున్ స్వప్రకా
శము నిర్ద్వంద్వము నిర్వికల్పమజమున్, సత్సంవిదానందరూ
పము మూర్తంబజరంబు కేవలపర, బ్రహ్మంబు చింతింపఁగన్॥ 252

చ॥ ఘనతవికారశూన్యుడయి, కాంచనమే బహుభూషణంబులై
ఘనతవహించురీతిగను, గాలగళుండఖిలాంతరంగుఁడై

ఘనముగఁ బంచభూతములు, గాబహుభంగులఁ బ్రజ్వరిల్లుచున్
ఘనతవహించి మించెనిజ, కాంతిసముద్భవమందె భూతముల్॥ 253

తే॥ మూఁడుగుణములవల్లను, మొనసి జగతి
సృష్టియున్ స్థితిలయమును, జేయుచుండి
యాదిమాయయు నేనైతి, నవనినాథ
యిదియెసత్యంబు నామాట, యెందునైన॥ 254

తే॥ నేను మాలిన్యహీనుఁడై, నెగడుదేవు
స్వస్థతగ్రహించి సృజియింతు, జగములెల్లఁ
గొందఱందురు మూఢులు, కువలయేశ
మాళియే సృష్టికర్తయున్, బేలమాట॥ 255

వ॥ శంభుండు వికారరహితుండు, నవ్యయుండు, నక్షరుండు, నకామావేశుండు, జితేంద్రియుండు, ననీదృశుండు, పరంధాముండుగాని, వేఱొండుగాఁడుసుమీ భక్తాగ్రగణ్యాయని తెల్పియనంతరంబ॥ 256

తే॥ మాయతోఁగూడి శంభుండు, చేయుసృష్టి
ననెడిరీతిగఁ దోఁచెను, నంతెకాని
శంకరుఁడసంగుఁ ధాఘ్యుఁడు, సలుపఁడెదియు
దారుణాత్ముఁడుగాఁడు ని,ర్దయుఁడుగాఁడు॥ 257

వ॥ అనినవిని తద్దాసుండు పార్వతీదేవికిట్లనియె॥ 258

తే॥ శివుఁడు తారకబ్రహ్మంబు, సిద్ధమగుట
సత్యమగుఁగాని యాదేవు,సర్వమయుని
సులభగతిఁగాంచఁగాఁదగ్గ, సూత్రమెద్ది
తెల్పునాకదియోయమ్మ, తేటపడఁగ॥ 259

వ॥ అనినవిని దరహసితముఖారవిందయై, పార్వతి, భక్తాగ్రేసరున కిట్లనియె॥ 260

తే॥ ప్రత్యగాత్మస్వరూపుఁడై, పరఁగుతనకు
విమలపరమాత్మరూపుఁడౌ, విషగళునకు
సమరసైక్యానుసంధాన, సరణియెద్ది
యదియయోగంబు సదుపాయ,మవనినాథ॥ 261

వ॥ ఆయోగంబభ్యాసయోగంబు, జ్ఞానయోగంబనద్వివిధంబైయొప్పునం దభ్యాస యోగంబు ప్రాణాయామంబన విలసిల్లుచున్నది ప్రాకృతంబు వైకృతంబు, కేవలకుంభకంబున నఁద్రివిధంబయ్యె నందుఁ బ్రాకృతంబు మంత్రయోగంబు,

వైకృతంబు, లయయోగంబు, కేవల కుంభకంబు హఠయోగంబు; యీ త్రివిధ ప్రాణాయామయోగులకు, యమనియమాసన ప్రాణాయామంబులు పూర్వాంగంబులు, ప్రత్యాహారధ్యానధారణాసమాధు లుత్తరాంగంబులగు నందహింసా సత్యాస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహంబులు యమంబులు, శౌచ తపస్సంతోష స్వాధ్యాయేశ్వరప్రణిధానంబులు నియమంబులు, వీరాసన స్వస్తికాసన పద్మాసన యోగాసన కూర్మాసన భద్రాసన సిద్ధాసన సింహాసనాదికంబులగు చతురుత్తరాశీత్యాసనంబుల నీమూఁడింటి నభ్యసించి యంతటఁ బ్రాణనిరోధంబు సేయందగు, నందు స్వభావనియత రేచక పూరక కుంభకక్రమంబులచేత నేకవింశతి సహస్ర షట్ఛతాధికసంఖ్య జపమంత్రానుష్ఠానంబు మంత్రయోగంబు ప్రతిదివసాభ్యస్త రేచకాది త్రివిధానిల సంయమన పూర్వకంబుగాఁ బ్రాణవృత్తియం దపానంబు, నపానవృత్తియందుఁ బ్రాణంబును లయంబుగావించు, లయయోగంబు మూలబంధోడ్యాణ బంధజాలంధర బంధపూర్వకముగా రేచకపూరకంబుల నుడిగించి ప్రాణాపానంబుల రెంటిని, రేయిం బవ లొక్క చందంబునఁ గుంభించుట హఠయోగం, బివ్విత్రివిధ ప్రాణాయామంబులు, విషయంబులవలన నింద్రియంబులు మరలించుట ప్రత్యాహారంబు సగుణనిర్గుణాత్మక వస్తుచింతనంబు ధ్యానంబు మూలాధారాది ప్రదేశంబులఁ జిత్తంబు నరికట్టుట ధారణాయోగంబు. నిర్మలచిత్తవృత్తి నిర్గుణబ్రహ్మత్వంబు సంపాదించుట సవికల్ప నిర్వికల్పాత్మక సమాయోగంబు, ఇట్లష్టాంగ యోగంబులుకల్గి యభ్యాసయోగంబు ప్రకాశించునది యపరిపక్వ చిత్తులకు యోగంబతిదుర్లభంబిది యణిమాద్యష్టైశ్వర్యంబులనొసంగుచు, నాత్మజ్ఞానంబు ప్రకటంబుగాఁజేయు. మఱియుఁ బ్రవిమలచిత్తులకు జీవబ్రహ్మైక్యజ్ఞానమార్గంబునిచ్చు నతిసులభంబైన విజ్ఞానయోగంబు రాజయోగంబనంబడు, నీరెండిటికి శ్రీసదాశివచరణకమలభక్తి కారణంబు, దానికి వైరాగ్యంబు మూలంబువినుము॥ 262

సీ॥ కంటికిఁగనఁబడు, ఘనజగత్తంతయు మిథ్యగాభావింప, మేలుసుమ్మి
యట్టియభ్యాసంబు' ననువందసల్పఁగా, నతిగురుసుఖధర్మమదిగదయ్య
తద్విధిగుహ్యంబు తగనుత్తమాధ్యంబు, సత్యమాగమసిద్ధ, సంధిమునులు
సనకాదులకుఁబట్టు, సంస్తుత్యవేద్యముఁ సతతమానందంబు, సంఘటించు॥

తే॥ నిట్టిదారాజయోగంబు, నేపుమీఱ
మోక్షమార్గంబునిదియిల, ముఖ్యముగను

నరులుశ్రద్ధను గైకొన్న, సరసవినుము
ఘనతనిర్వాణమార్గంబు, గలుగుసుమ్మి॥ 263
తే॥ ఇట్టినిర్వాణమార్గంబునిలను జనము తెలియఁగఁజాలరు తత్వవిహీనమతులు
రాజగుహ్యంబుపరమంబు,రాజవిద్య యదియుమూఁడువిధంబుల,నలరుచుండు
వ॥ అదియెట్లనినసాంఖ్యము, తారకము, అమనస్కమనమూఁడు తెఱంగులుగలవు
అందుఁదారకమువల్ల మనశ్శుద్ధికలుగును. సాంఖ్యమువలన నాత్మస్వరూప
విచారమిట్టిదియని తెలియును. అమనస్కయోగమువలన, నీవేపరబ్రహ్మమ
ను నిర్ణయముపుట్టును. కాననీవుతొలుతఁదారకయోగమభ్యసింపవలయును
ఉ॥ తారకము౯ భవాంబునిధి, తారకమంబుజ సంభవాదిబృం
దారకసన్నుతంబగువి, దారకమంచిత రాగరోష సం
హారకముం బ్రధానపరి, హారకమాత్మసుఖానుభూతివి
స్తారకమాగమాంతమువి, చారకమైతనరారు భూపతీ॥ 266
తే॥ సుమతి! తారకయోగంబు, సుస్థిరముగఁ
దెలియఁజాలక వేదాంత, ధీరులఁగని
వాదనలుసేయువారికి, వరసుమోక్ష
మబ్బదదినిశ్చయముసుమ్మి, యవనినాథ॥ 267
క॥ ధరలోనరాజయోగము। నిరతంబలవాటుసేయ, నేరకవృథగా
సరసతవేదాంతోక్తుల। నరుదుగఁ దెలియంగఁజెప్ప, నదికల్లసుమీ॥ 268
వ॥ అట్టివేదాంతులకు, నీరాజయోగమార్గంబుకానక, తిరుగువారికి బ్రహ్మానుభ
వమ్ములేదుసుమీ, భక్తాగ్రగణ్యా! యని తెలిపి మఱియును॥ 269
సీ॥ సాంద్రతమంబెల్ల, సరగునశించునా, వసుధపైఁగృతదీప, వార్తవలన
క్షుధితుఁడౌమనుజుని, క్షుత్తెల్లఁదీఱునా,కన్నులకశనంబు, గానఁబడిన
దారిద్ర్యవంతుని, దారిద్ర్యమడఁగునా, ధరద్రవ్యకీర్తన, ప్రథిమచేత
జ్వరితునిరోగసం, క్షయముగాఁబోవునా, యౌషధంబిదియను, నంతలోన
తే॥ నెన్నిదినములనుండియో, యున్నదగుచు
గాఢతనుగాంచుజాడ్యంబు, ఘనతఁదెగునె
తర్కబోధవిచిత్రత, ధరణిఁజేయఁ
గలితయోగానుభవదృష్టి, వలనఁగాక॥ 270
సీ॥ యోగానుభవమును, బాగుగాఁగలిగిన, ప్రాణేంద్రియంబుల పటిమలణఁగి
కామంబుక్రోధంబు,ఘనముగాహరియించి,యాత్మకుసౌఖ్యంబు,నమరియుండు

మోక్షాభిలాషులు, ముదమార యోగాను,భవముముఖ్యంబండ్రు,పరమమునులు।
కానఁదద్విధి కేను, గడువేడ్కఁ దెలిపెద, నదివినుమయ్యయో, యవనినాథ।
తే॥ ఏమియుభుజింపకే పస్తు,నెంచువాని కెక్కసంబుగఁదినిచాల, గ్రుక్కువాని
కనుపుగానిసిపవలని,యరయకుండ నిదురఁబోయెడువానికి, నిక్కువముగ॥ 271
వ॥ మఱియును దివారాత్రంబులు నిద్రాహీనుండయి యుండువానికి యోగా
భ్యాసంబు దుర్ఘటంబు॥ 272
తే॥ నియతిమెఱయంగ భుజియించి, నెగడువాఁడు
కడుమెలంకువ నిద్దురగలిగియుండ
యుక్తచేష్టితుఁడగునట్టి, యోగ్యునకును
రాజయోగంబు సమకూడు, రాజమౌళి॥ 273
వ॥ అట్టి యోగాభ్యాసంబు సేయువాఁడు విశాలమై జనశూన్యమై నిర్మలమై నిరుప
ద్రవమై యనుకూలించునట్టి యోగశాస్త్రోక్తముగ నిర్ణయింపఁబడిన స్థల
మందు సమభూమింజలనము లేక నిమ్నోన్నతముగా మృదువుగాఁ గ్రమ
ముగాఁ గుశాజిన వస్త్రంబులనువుగాఁబఱచి బాగుగావానిమీఁద స్థిరయత్న
పూర్వకంబుగఁ బద్మాసనాసీనుండై నిరంతరము శరీరమధ్యభాగము "అనఁగా
నడుమును గంఠమును శిరమును జక్కఁగా నిక్కిచూపులను నాసికామార్గ
మందుఁ, దగులునట్లుకూర్చి యితరదిక్కుఁగనక జ్ఞానకర్మేంద్రియంబులంబ
దింటిని మిక్కిలి కృశింపఁజేసి సిద్ధియగునటుల యోగమునభ్యసింపవలయును॥
సీ॥ నియమితబుద్ధిని, నిర్మలచిత్తంబు, ప్రాణాదివాయువుల్, భద్రపఱచి
ఘనదశేంద్రియముల, గౌరవంబడఁచుచు, మానినైయెకామాది, మదములుడిగి
తాపత్రయాదుల, ధాటినివిడనాడి, బ్రహ్మచర్యంబును, బ్రబలపఱచి
శాంతమనస్కుఁడై, సమరసభావంబు, రంజిల్లగురునిచే, రమ్యముగను॥
తే॥ దెలిసికొన్నట్టిలక్ష్యార్థ, దీప్తిమీఱ
దినముసామద్వయంబును, దృఢతవెలయ
నభ్యసింపంగవశమగు, నధిపవినుము
సులభతరమైనయోగంబు, సుమ్మియిదియు॥ 275
తే॥ మానవాధిప; యీఁనియ, మంబులెల్ల।సాంఖ్యతారకములఁబ్రశ, స్తమమనస్క
మునను దెలియునువారికి,ముఖ్యముగను।ఘనతఁదారకయోగుల,గట్టిపట్టు॥ 276
క॥ వరుసర్ణ ఖేచరియనఁభూ।చరియనమధ్యమయనంగ, షణ్ముఖియనఁగా
వరశాంభవియనఁగలవీ।ధరలోపలముద్రలైదు,తారకమునకున్॥ 277

ఉ॥ మంచిగురూపదేశమున, మానుగముద్రలగుర్తు జూడలున్
వంచనలేకలక్ష్యములు, వావిరిగాఁగనఁజాలినట్టివాఁ
డంచితతారకార్థమును, హామతిఁబొందునులాఘవంబుచే
మించినబిందునాదకళ। మేలువినన్ సువిచారవంతుఁడా॥ 278

వ॥ అదియెట్లనిన. 279

తే॥ నయనములుమూసిస్థైనను, నయమనస్క-
మాయకేస్థైనభ్రూమధ్య, మునను దృష్టిఁ
ద్రిప్పినిలిపి చిదాకాశ, దీప్తివెలయఁ
గాంచనదిఖేచరియనంగ, మించుముద్ర॥ 280

ఆ॥ కనులుగదలకుండఁ, గడునాసికాగ్రంబు।గురుకటాక్షమంది, గుఱుతుగాను
గోచరముగఁజూడ,భూచరియనుముద్రయనఁగఁబరఁగునదియు,నమలచరిత॥281

తే॥ పటిమశాస్త్రార్థములు మూసి, పరఁగనాసి
కంబు మధ్యను దృష్టిని, ఘనతఁజెదర
కుండ నిటలంబుఁజూచిన నొప్పిదముగ
మధ్యలక్ష్యమటందురు, మనుజవర్య॥ 282

తే॥ కనులు చెవులును ముక్కులు, ఘనతమూసి
త్రిప్పి భ్రూమధ్యమందుఁ గం,దేటనిలిపి
డెందమలరంగ వరనాద, బిందుచిత్క-
ళలఁగనుట షణ్ముఖీముద్ర, యలరుభూప॥ 283

ఉ॥ లోపల దృష్టియున్ నిలిపి, లోపలవెల్పల నిశ్చయంబునన్
బ్రాపుగఁ బూర్ణలక్ష్యమున, బాగుగనింద్రియచేష్టవీడి బి
ట్టేపునఁ జూడఁగా నపుడు, నింపలరంగను ముద్రయందునన్
జూపులలోనఁ జిత్రములు, సొంపుగ శాంభవికిన్ గనంబడున్॥ 284

వ॥ మండలత్రయమందలి, ముప్పదియెనిమిదికళలను దర్శించుటకు హేతువులయిన
యభ్యాసయోగములు రెండు. అనఁగాఁ బంచముద్రలను, యమనియమాద్య
ష్టాంగయోగంబులను, నిరంతరము పాటుపడుచుండిరేని నాదబిందురుచి సా
క్షాత్కారమగును. మఱియు నాదబిందుకళలను లక్షించిన మానసేంద్రియము
లువెలుపల లోపలందిరుగక నాదబిందుకళాసందర్శనమందే నిలిచియుండును.
అప్పుడు శరీర వికారములు హరించి మనస్సులయించి సచ్చిదానంద నిత్య
నిర్మల పరబ్రహ్మముగా నుండును॥ 285

ఉ॥ నాదము బిందుసత్కళల, నచ్చినయుక్తిని జూచుచుఀ సదా
వాదములేక యింద్రియపుఁ, బంక్తియుఁ జిత్తమునిట్టులట్టులుఀ
భేదిలకుండఁజేసి కడుభీతిని బట్టుకవీశ్వరుండు స
మ్మోదముతోడఁ జిత్సుఖ మమోఘముగాఁ దగు స్వప్రకాశమై॥ 286

ఉ॥ నాదముబిందువుఀ గళల, నమ్మినవైఖరిగానకున్న స
మ్మోదముతోడ నింద్రియ సమూహము చిత్తము నిట్టులట్టులుఀ
భేదిలిపారఁగానతుల, భీతినిబట్టఁగఁజాలలేక యే
వేదనఁజెందువాఁడుపర, విద్యనునెట్టులుగాంచుశిష్యుఁడా॥ 287

ఉ॥ గాలములేనిజాలరిసు, ఖంబుగఁజేఁపలఁబట్టఁజాలునా
కోలలులేనిబోయకడు, ఘోరమృగంబులఁద్రుంపఁజాలునా
యేలలిమావటీఁడుద్విర, దేంద్రములఀ దగునంకుశమ్ముచెం
గేలవెలుంగకెట్లువనిగెంటును, దంటగనున్నశిష్యుఁడా॥ 288

తే॥ ఉచ్చులాదిగసాధనా, లొప్పకున్కఁ। బక్షిజాలమ్ముచిక్కని, పగిదిదివ్య
తారకవిరాజియోగిస్వ,స్థతయునిష్ఠ। లేకయేయింద్రియజయంబుజొకఁగొనఁడు॥

క॥ నరులంజనంబుఁగైకొని। సరగునవిత్తమ్మునెఱుఁగు,చాడ్పునశిష్యా
వరతారకయోగమునఀ। బరతత్త్వమెఱుంగుటకును, బద్ధతిసుమ్మీ॥ 290

తే॥ మాంసమునుజూపిడేఁగను, మలుపురీతి
నలరుసమనాదబిందుక,ళానుభూతి
సుఖమునొందించిమరిగించి, చొక్కఁజేసి
పటిమనింద్రియమనములఁ, బట్టవచ్చు॥ 291

ఆ॥ నైగమార్థవిధులు, నాదబిందుకళాను। భవముఁదెలిపె మొదటఁబండితులకు
నట్టిరీతులెల్లగట్టిగాఁ,దెలిఁపెద। వినుమువినుము, వినుమువినుమువత్స॥ 292

వ॥ మఱియునువిహితుండగు గురువుపదేశించినషణ్ముఖిముద్రచేత, రెండుచెవులు మూసికొని వినఁగా మొదటనోంకారము (ఝిణిఝిణి) యనిమ్రోయును అంతటనాయోంకారముహెచ్చి రెండవమాఱు (ఝిణిఝిణి)యని ఘోషించును. అంతటనాప్రణవనాదమను ముక్తికాంతసొంపుమీఱబ్రహ్మాదండిని, యొకవిపంచిఁగావించి మూలాధారాదులగు నారుపుష్పములనావీణకు సరికట్లుగానుంచి ప్రాణాపానవ్యానోదాన సమానములనునైదుతంత్రులం గావించుకొని ధ్యానవీణనందుకొని దహరాకాశమనెడికమలంబున వసియించి సర్వకాలం

బావిణియను మీటుచున్నదోయనునట్లు మ్రోఁగును. మోక్షకామిని జ్ఞాన స్వరూపుఁడయిన యాత్మునియొక్క మనోహరుఁడముఁను దాళముగాధరించి గానముసేయుచు నర్తనముసేసినలాగునఁ బరిశుద్ధమగుఁ బ్రణవనాద మొప్పును అనంతరమా యోంకారమపరోక్షసాక్షాత్కారమయిన విజ్ఞానమనెడి శ్రీసదా శివమూర్తిభూవులనెడి బృందావనంబున మనోహరములగు చతుర్దశేంద్రి యములనెడి స్త్రీరూపములు, పురుషాకాంక్షచేఁ దన్నుఁగొలువ యానందింప బ్రహ్మాదండియనెడి లతయందువిలసిల్లుచున్న మూలాధారాదికములగు చక్ర ములను గోయిలగుంపు పరమానందమునుఁజెందఁ గుండలియను పేరుగల శక్తి కధీశుండయిన జీవసంజ్ఞగల సర్పరాజు తనపడగవిప్పుకొని యత్యానందకర మ్ముగ, ముఖమ్మునెత్తి, తాండవమాడఁగా నిర్మలమగు మనోవాయుస్వరూపమనెడి కరములవల్ల బ్రహ్మనాడియనియెడి పిల్లనగ్రోవిని విలాసముగా ధరియించి చెవులుసోఁగియు, గానముసేసిననుసట్లు గొప్పనాదాకృతిగను వెలయును. అంతట నాప్రణవనాదము ప్రత్యగాత్మయనెడు శ్రీసదాశివుఁడు చేసుగులగు కామక్రోధములను శత్రుసమూహములను జంపఁదలఁచి భయంబగు సమ రంబునలుపఁగడంగియుండఁగాఁ బెద్దభేరీధ్వానంబును మ్రోఁగించి సర్వాశ్చర్య ముగా వెలయును॥ 293

మ॥ అమితశ్రీనసురేంద్రులంగెలువమా, యాకాంతనాడింపఁగా
నమలాత్మండగుశ్రీసదాశివవరుం, డాత్మీయవిద్యామృదం
గమువాయించెననంగఁబెంపెసఁగనోం, కారస్వనంబంతహృ
ద్యమచింత్యంబతులంబవాచ్యమయియ, త్యంతానుమోదంబునన్॥ 294

సీ॥ ఇంద్రియాలనియెడి, యింపైనకేకుల, త్యంతమోదాభిన్న,త్యములుసలుప
ధర్మసుధార్షిక్స్న, తమనోవనమ్మున, శాంతాదిసుగుణసస్యము లిగుర్ప
నిరుపమానందభూ, నిర్ఝరంబునఁగల్గు, పరితాపమంతయుఁబ్రబ్బుకొనఁగ
భ్రూకుటిస్థలకన, భోమార్గచిత్కళల్, మెఱుఁగుఁదీఁగెలరుచుల్, మించివెలుఁగ
తే॥ ఘనచిదాకాశమధ్యసం, గతసమగ్ర
రాజయోగసమాధిధా, రాధరంబు
ప్రమదవర్షంబుగురియుచుఁబ్రణవనాద
ములలిదశమనినాదంబు,మ్రోయునఘ॥ 295

వ॥ ఇట్లు చిణీనాదంబు, చిణి చిణీనాదంబు ఘంటానాదంబు శంఖనాదంబు వీ ణానాదంబు, తాళనాదంబు, వేణునాదంబు, భేరీనాదంబు, మృదంగనా

దంబు, మేఘనాదంబనంబరఁగు దశవిధోంకారనాదంబుల శ్రీగురూపదేశ
పూర్వకంబుగ శ్రుతియుక్త్యనుభవంబులచేత, నెఱుంగవలయు మఱియును॥

తే॥ వరసునాదంబకారంబు, వసుమతీశ!
యమలబిందువుకారంబు, క్రమబుధేంద్ర
కళమకారంబుమూఁడును, గలయఁగూర్పఁ
బటిమనోంకారమగునయ్య, భవ్యచరిత॥ 296

సీ॥ వరయకారంబును, మఱియునుకారంబు, ఘనతమకారంబుఁ, గలయఁగూర్ప
నోంకారమైయొప్పి, యుగ్రతరంబుగా నిఖిలకారణమునై, నియతితోడ
ఘంటారవమునురీతిఁగనుఁదీవ్రగతితోడ, హృదయాబ్జమున, మ్రోయుచునెచ్చునిరతి
నబ్రహ్మాత్మకమలంబు, నంబ్రబలుచున్న, పదములనాదాను, నరసినెపుడు

తే॥ రుచినిఁజూడకపోయిన, నచలముగను। మనసునిలుకడఁజెందక, తనరికలంత
చేతమోక్షంబుకల్గును, సిద్ధమిదియు। నిరుపమానందవైఖరీ, గరిమలేమి॥ 298

తే॥ ప్రణవనాదంబుపూజ్యమై, ప్రబలహర్ష
మందఁజేయుచుఁజిత్తంబు, మందతవిడఁ
జేసివాదంబులనుబోవఁ, జేసిమఱియు
ద్వైతతత్త్వభ్రమలనోయి, తొలఁగఁజేయు॥ 299

తే॥ ప్రకటితోంకారరససుధా, పానరతుఁడు। నేత్రయుగ్మంబుదేవత్వ, పాత్రతగన
మనసుదైవతపురమున, మునికిగాంచి। చిత్కళాసంపదలచేత, స్థిరతనుండు॥ 300

వ॥ ఓభక్తాగ్రేసరా! ప్రణవనాదామృతపానసంతుష్టుండయిన మహనీయుండనిమి
షుండును నిర్జరుండును, మృతిలేనివాఁడును సుప్రసిద్ధశక్తిధారియు, నాత్మ
జ్ఞానసిద్ధుండును, బ్రహ్మవేత్తయు, యోగీశ్వరుండును, సాధ్యుండు, నింద్రుం
డు, వైశ్వానరుండు, సమవర్తి, భువనపతి, గంధవహుండు, కుబేరుం, డభ
వుం, డఖిలమిత్రుండు, సోముండు, బుధుండు, కవీశ్వరుండు, బృహస్పతి, వా
రినాథుండు, విరించి, హరి, యీశ్వరుండును నగు పరమపురుషుండై ప్రకా
శించుచుండు. మఱియునిఁకనంతర్బహిర్భాగముల నడుమనుండుజ్ఞానదృష్టిచేఁ
జూడంబడినదై వెలుంగుచున్న చిన్మయకళాసంపత్తి నంతయుఁ జక్కఁగా
యోజించిచెప్పెద. నీవుశాంబున దానిబహిరంకరించి యొంచిచూడుము
(అట్లు వీక్షించునప్పుడు, ముందుగఁ జిత్తాకాశము గోచరించును.)
చూపులై కన్నులవెంటఁబోవదిమనస్సేయగుంగాన నామనస్సునం దాకా
శపంచకము నవలోకింపవలయును. ఇవ్విధంబునఁ జిత్కళాదర్శనంబు సేయఁ

గా, ముందు హృదయాకాశము గోచరించును. కన్నులవెంటఁబోవునది మన స్సేయగుంగాన నామనస్సునం దాకాశపంచకము నవలోకింపనగును. ఇట్లు త నలోచనంబులకుఁ గనుచూపుమేర గోచరంబయిన హృదయాకాశమందుఁ గేవల నిరాకారంబైన పరాకాశంబును, ప్రళయకాల ప్రజ్వలజ్జ్వాలాభీల దావానలాకారంబయిన మహాకాశంబును, వివిధవిచిత్ర వితతాపరిమిత ద్యుతి భరితంబయిన తత్త్వాకాశంబు, ప్రచండ మార్తాండమండల శతకోటి ప్రభా భాసురంబయిన,సూర్యాకాశంబను పంచాకాశంబుల నవలోకింపవలయు॥301

ఆ॥ అమలచిత్త, వినుత, దాకాశపంచ కాం। తరమునందు వెలయు, పరమకళల రీతులెల్ల నీకు నీతఱి, నెఱిఁగింతు। సందియములుమాని, యుండువెపుడు॥ 302

సీ॥ ఆకాశగంగా మృ,తాబ్ధి సంక్షుబ్ధభంగావళీరుచులసా,మ్యప్రశస్తి
మల్లీమతల్లికా, మాఖ్యచందనసారి, జాతారవిందపు,ష్పప్రతిభను
శ్రీరమాగృహాల స,చ్ఛ్రీకమారందధా,రా ప్రవాహద్యుతి, దీప్రగతిని
నందినందితురంగ, నాకదంతావళే, ట్పంచాస్యఫణిరాజ, పటురుచిఁగని

తే॥ హారనీహార డిండీర, శారదాభ్ర
వజ్రఘనసారతారకా, ప్రతతికాంతి
కరణి నాకాశ పంచకాం,తరమునందు
మండితములగుఁ జిత్కళా,మండలములు॥ 303

వ॥ అనఘా! చిన్మయకళలు మనంబునంబ్రకాశించుచున్న పంచాకాశాంతరమందు రయంబున గాఢాంధకారంబునశింపఁ జేయుటయందుద్యుమణిరీతి భాసిల్లెడి విద్యుల్లతాతేజఃపుంజమువలెను, మనోహరములయిన రాత్రులయందుఁగంటి కగపడు మిణుంగురుంబురుగుల సమూహంబునంగల తేజఃప్రకరంబురీతిని భీకరంబులయిన చిమ్మచీఁకటులంగలిగించుచు నతిశయమయిన నీలకాంతులు గలిగి యుదకపూరితములయి యొప్పువారి వాహముల రుచిచయంబుల రీతిని నింద్రనీలమణులు వైదూర్యములు, ప్రవాళములు, పద్మరాగములు, ముత్యములు, గోమేధికములు, అనువానివిధంబున వజ్రములు, గరుడపచ్చలు, కెంపులు, అపరంజి, అను వీనియొక్క ప్రకాశమురీతిని గానంబడుచుండు॥304

తే॥ ద్యుమణిరుచులుట్టిపడురీతి, దుర్భరముగ
మెఱయు చిన్మయకళలతిమిశ్రమైయ
గమ్యతరముగఁగన్పట్టు, ఘనసు,హృదయ
కమలమాకాశపం క్తిన,ఖండితముగ॥ 305

వ॥ రాజోత్తమా గొప్పదయిన దహరాకాశమందు వెలుంగుచు, శమదమాది సుగుణమ్ములచే నలంకరింపంబడి విభజించుట కనువుపడకయుండు జ్ఞానమని యెడుసూర్యబింబంబు కోమలమగువిజ్ఞానమనియెడు నరుణోదయంపుఁగాంతిచే నవివేకమనియెడు నంధకారమును, మూఢజనుల హృదయములనియెడి గుహాలయందు డాఁగఁగా వికసించిన మూలాధారాదిషట్కములమీఁద నిక్కి ప్రణవాంగమగు హంసనామకహంసపక్షి యిడాపింగళా సుషుమ్నలనియెడి గంగాయమునా సరస్వతులయొక్క త్రికూటమనెడి ప్రయాగయందు సంచరింప ద్వైతవాదభ్రమచే శత్రువులగు చతుర్దశేంద్రియము లనియెడి నల్లకలువలన్నియు మేళనముకాఁగా మానసంబనియెడి చంద్రుండు బ్రహ్మానందమనియెడి సంద్రంబునమునుంగ మిగుల మనోహరములయిన వృత్తి జ్ఞానస్వరూప జ్ఞానములనియెడి చక్రవాకంబులొకటితో నొకటి కూడినవై యణఁగి పెనంగ నతివిశాలములగు బ్రహ్మాండ పిండాండంబుల వెలిఁగించుచుండును॥ 306

సీ॥ సకలకర్మములకు, సాక్షిస్వరూపుఁడై, తనవెలుంగునవెల్ల, తమముఁబాపి
చక్షురాదీంద్రియ, సంచారగరిమను, భాసిల్లుసత్యస్వ, భావుఁడగుచుఁ
జిద్విభావసుఁడును, సద్విధిభ్రూమధ్య, నుదయశైలంబున, మొదలఁదోఁచి
యంతటఁబ్రవిమల, స్వాంతనభంబున, నధిగమించిపిదప, నంతవరుస

తే॥ నెనసిపదునాలుగింద్రియాలనెడుకంజ
పుష్పచయములకానంద,పూర్తిఁజేయు
వాఁడెసర్వాధికుండయి, వ్యాపకుఁడయి,
వసుధవెల్గుచునుండును,పార్థివేంద్ర॥ 307

వ॥ అంతట జ్ఞానసూర్యోదయమునకు ముందే, బ్రహ్మసాక్షాత్కారమనెడు జ్ఞాననేత్రములు తెఱచి, భ్రాంతిజన్యమైన యజ్ఞానమోహనాంగియొక్క కూడికనుమాని నేనను భ్రాంతిని విడనాడి చిత్తలయమున నంతరంగమందలి యణవకార్మికమాయామలములను బరిశుద్ధపఱచి నిరంతరముఁ జతుర్దశేంద్రియములను బ్రకాశింపఁ జేయువాఁడెవ్వాఁడో యట్టియవిద్యా నివారకమగు తేజస్సు నేనని నేత్రాంజలులవల్ల నానందబాష్పములచే నర్ఘ్యంబులిచ్చి సర్వావస్థలుగల నేనెటు పరబ్రహ్మమగుదుననియెడు,సందేహములనెడి రాక్షసుల హరించి యంతట నానందమున స్వస్వరూపచింతనము సల్పి క్రియారహితమైన యాత్మార్చనముచేసి సంపూర్ణానందసుఖమనుభవింపవలయును॥ 308

సమాత్మారతుండవు సంస్పృష్టాంత్యంతమర్మస్థానుండవు సందర్శితానంతకళామండ
లుండవు, ప్రగళితబిందుండవునై యానందింపుదువు. మఱియుఁ బరబ్రహ్మామునం
దుఁ దనకు నభేదైక్యానుసంధానముచే జనించినసుఖమున ననుభవించుచుఁ గ్రమ
క్రమంబున నీవైన ప్రత్యగాత్మయందుఁ బరమాత్మయభేదముగఁ గూడియున్న
దను పూర్ణబోధవలనఁ గలిగిన యానందముచేతఁ దేజరిల్లి పరమాత్మకును ప్ర
త్యగాత్మకును భేదములేదనుజ్ఞానముచే నానందమగ్నుఁడై మిక్కిలి తృప్తి
నొందిన నిరభిలాషచే మహాభోగముగలవాఁడవగుదువు. అంతటమండలత్రయ
మునందు శుద్ధసత్వమందలి తేజస్సంబంధమైన దివ్యచక్షువుయొక్క చివరయందు
నిర్మలసత్త్వమందలి తామసాంశమైన కాలసంజ్ఞగల ప్రణవకుండలియనెడు
సర్పరాజును సహస్రారమందుఁ జంద్రమండలంబునుగలిగి యవస్థాత్రయమయ
ములైన త్రిపురములను వహించినవాఁడవై మోక్షస్వరూపుఁడవగుటవలన ధర్మ
కామములందిష్టములేనివాఁడవు కమ్ము॥ 310

చ॥ క్రమముగ సృష్టినుండి కృతకర్మచయాత్మకకాష్ఠపాళి వే
యమరఁగఁ గాల్చిపుచ్చును మహాస్ఫురదంచదఖండచిద్వరో
త్తమమగు కాంచనంబువిధి, ధాటిగ వెల్గును నగ్నిమండలం
బమరివిడంబితంబగున, యాత్మకహృద్గగనాంతరంబునన్॥ 311

సీ॥ ఘనకామరాగాది,కగుణసంఘమ్ములఁ, బ్రణవమంత్రంబుచేఁ బట్టిచంపి
మానసశబ్దాది, మంజుకాష్ఠాళితో, సరగున సకలవా,సనలనంగ
నాజ్యసమృద్ధిచే, నమరఁజిద్వహ్నిలో, వరుసగా వ్రేల్చి పె,న్వాంఛదీఱ
సుఖసోమరసమును, సొరిదిపానంబంతఁ, జేయుము శుద్ధాత్మ, చెదరకుండ

తే॥గీ॥ మండలత్రయమందున, నుండి వెలుఁగు
స్థలమునందుఁ గనంబడు, చంద్రధామ
చండధామానలాత్మకా ఖండధామ
మధ్యఁగలదు హిరణ్మయ, మండలంబు॥ 312

వ॥ అయ్యదెట్టులుండెననిన నిండువేసంగిని బట్టపగలింట రెండుజాములవేళ వె
లుంగు సూర్యమండలమురీతిని, స్వచ్ఛమైన శరత్కాలమందు సాంద్రతరద్యు
తిం బ్రకాశించెడు చంద్రమండలము విధమ్మునను, ప్రళయకాలాభితప్తజాం
బూనదంబు పగిదిని, జ్వలజ్జ్వాలాభీలంబగు నగ్నిమండలంబువలెను, నీలమే
ఘాంతర్భాగమునుండి బయలువెడలు విద్యుల్లతాకాంతింబోలియు, నివ్వరి
ముంటివలె నతిసూక్ష్మమై, వర్ణములేనిదై, యిట్టిదట్టిదని తలంచుటకు వీలు

లేనిదై, హిరణ్మయమండలంబొప్పుచుండును. ఆహిరణ్మయమండలం బమృత
జ్యోతియను కళచేతంజలింపక, యాజ్ఞాచక్రమందుఁ బ్రకాశించు, నట్టిచి
త్కళతత్కళాగ్రమధ్యమందు మొదటివెలుఁగు ప్రకాశించును. అప్రకాశమే
శ్రీసదాశివతత్త్వమగునని మరల నిట్లనియె॥ 313

తే॥ నూరులక్షలసూర్యులు, నూఁరులక్ష। లలరసోములు బహుకోట్లు, లతిమనోజ్ఞ
చంచలాసంఘములు నొక్క, సరసనిలిచి।నట్టిరీతిగనాకెలుం, గమరియుండు॥

తే॥ అట్టియుత్కృష్టమగు తేజ, మతిశయిల్లి।యుండుభ్రూమధ్యవీధిపై,నొయ్యనచట
దృశ్యమునుదాటిమాయను, దేటపఱచి।తాల్మిచేతనుగాంచుమా,తడయక ధవ॥

వ॥ ఇత్తెఱంగునం ద్రికూటమార్గంబునం జిత్తాకాశమందు గోచరించుచున్న యా
కాశమండలము తిమిరమండలము ధారాధరమండలము సౌదామినీమండల
ము తారామండలము తేజోమండలము రవిమండలము చంద్రమండలము వ
హ్నిమండలము హిరణ్మయమండలము నను దశవిధమండలంబులును బూ
ర్వోక్తదశవిధనామంబులును, ముందుచెప్పఁబోయెడి శివశక్తియుక్తమగు
నావరణరూపమయిన జీవతత్త్వమును మహాగగనమధ్యమందుఁ గనంబడుమే
ఘములవలె నెవ్వనియందుఁ దోఁచువాయువు మొదలగు భూతచతుష్టయం
బున, నభూతజన్యములైన ఘటపటాదుల నంటని గగనమువలె నీచెప్పంబడిన
వానినన్నింటి నెవ్వఁడంటకయుండు సూర్యుండు సకలరూపంబులం బ్రకాశింపఁ
జేయురీతి నెవ్వండు ప్రజ్ఞానస్వరూపుండై యిన్నింటిని వేర్వేఱవిభజించి యె
ఱుంగువాఁడు. ఈబిందునాదకళాతీతస్వప్రకాశనిత్యశుద్ధబుద్ధముక్తావిచ్ఛిన్నస
చ్చిదానందస్వరూ ప్రత్యగభిన్న పరమాత్మానందుఁడగు విశుద్ధసత్త్వప్రధాన
యుఁబరమవైరాగ్యబోధోపరతి స్వరూపిణియు,బిందునాదకళాత్మికయుఁ గేవల
బ్రహ్మాత్మైక్యవిద్యామయయునైన నన్నాశ్రయించి, యద్వితీయాపరోక్షబ్ర
హ్మచైతన్యస్వరూపకుండైనయీసదాశివుని యాత్మాకారాకారితవృత్తిగ
తచిదాభాసకుండవైననీవు, మిక్కిలితీక్ష్ణముగానుండు నెండలోనుంచఁబడినదీ
పపుమొగ్గవలె జ్ఞానకర్మేంద్రియపవన మనోవృత్తినిలయపూర్వకంబుగానేక
స్వరూపకుండవై వాతరహితంబగు దీపంబుభంగిఁదరంగశూన్యంబగు మున్నీటి
రీతిచ్యుతదళంబగు మహీజంబుమాడ్కిన వర్ణంబగునాకాశంబు పోల్కిస్వ
ప్నజ్ఞానపునరుద్ధానవిరహితదీర్ఘనిద్రవలెఁ జలనరహితుండవు, నిశ్చేష్టుండవు,
నిశ్శబ్దుండవు,నిర్వికల్పనిరాకారసుఖస్వరూపకుండవై బాహ్యాభ్యంతరంబులు

మఱచి నిరుపమరాజ యోగసమాధింబొందుమని యుపదేశించి వెండియు నిట్లనియె॥ 316

మ॥ మునుచెప్పంబడినట్లు ఖండవరసం, పూర్ణానుభావంబునె
మ్మనముల్ ప్రాణుల చాంచలంబడుగకే, మాన్యంబుగాగోచరం
బనువందండగఁగాదు బిందువునుస, మ్యగ్దీప్తిచేఁజంచలం
బునుగాకుండఁ,గఁ జేయఁజేనియదిసం, పూర్ణంబుగాచెమ్యోడల్॥ 317

సీ॥ హంసస్వరూపంబు, సనువుగాఁదెలియక, బిందువుచలనంబు,డిందుపడదు
దానినిఁగ్రమముగాఁదగఁజూడనటు మీఁద, మానసానిలములు,మఱఁగియుండు
షట్కర్మములఁబొందు, సత్క్రియఁగల్గిన, సుఖదశలనువెల్గి,సొంపుమీఱ
నంతటవ్యాపించు,నాపరబ్రహ్మంబు, నందునవసియించు,నట్టిమనసు
తే॥ నకు మహానందముదయించు, నాణె, మెఱుఁగు
నదియభేదైక్యమననొప్పి, సదమలంపు
వరపరబ్రహ్మమందున,వఱలుచుండు
దీనిభావంబుతెలయరే, ధీరహితులు॥ 318

ఉ॥ పాలునునీళ్లునుల్ బటిమఁబంచఁ గనేర్చినహంసరీతిగా
వీలునబ్రహ్మవేత్తలతి,వేత్తృత సారసుసారభేదముల్
మేలుగఁబంచఁజాలుదురు, మించిన హంసవిచారతత్పరో
న్మీలనఁజెందుతత్త్వవిధి,నేతలు సుస్థిరలక్ష్యవంతులై॥ 319

వ॥ తల్లిదండ్రులు భుజించు పదార్థమువలనఁగల్గెడు రుధిరరేతస్సులచే బిందుజననంబై చర్మపలలరక్తమజ్జాశల్యములు నరములునను షట్కోశంబై యమరు నీస్థూలశరీరమందు డెబ్బదిరెండువేలనాడులుగలవు. అందు వాయువుకంటె నంగుళద్వయమునకు పరిగలింగంబుకంటె రెండంగుళంబులు క్రిందుగ నధోముఖాగ్రంబై కోణత్రయంబులొప్పి దేహమధ్యమస్థానంబున మూలాధారచక్రంబలరు, తదాది (అనఁగా) ఆమూలాధారాదిచక్రము మొదలుకొని సహస్రారంబు తుదగవీపుభాగమున వీణాదండంబుభంగి సకలనాడులకు మూలకందంబై మూలోర్ధ్వచ్ఛిన్న వంశాభంబై షడాధార సమన్వితంబైయుండు పెద్దయెముక బ్రహ్మదండియనంబరఁగు ఆబ్రహ్మదండి మూలాధారాగ్రకోణస్థమై కుండలీనామపరాశక్తితోఁగూడి ప్రాణాగ్నిబిందునాదనిలయమై సావిత్రీసరస్వతీనామికమై బ్రహ్మరంధ్రమునుబొంది సుషుమ్నానాడిశోభిల్లును. ఆ సుషుమ్నయొక్క కుడియెడమభాగమ్ములను, ఆధారంబు మొదలుకొని నాసి

కాగ్రపర్యంతముం బ్రసరించి నాడీచక్రముం జేరినవై పితృయాన, దేవయాన లనెడు సంజ్ఞలుగలవై చంద్రసూర్య మండలంబులం బొంది యిడాపింగళలను నాడులొప్పుచుండును. నాభిమండలంబు నాశ్రయించి కోడిగ్రుడ్డువిధంబున నాడీచక్రంబమరు. ఆనాడికలనాడీచక్రసముదితలట్లు గావున గాంధారీహస్తి జిహ్వాయనునాడులు నేత్రాంతవ్యాపినులు. పూషాలంపూషానాడులు రెండు చెవులనుం బొందియుండును. శుభ్రాఖ్యనాడి, కనుబొమల నడిభాగముం జెందును. ముక్కు ద్వారములు రెండును, జవిబెజ్జములు రెండును, బొమలక్రిందఁ జేరియుండును. ఆచేరియుండుస్థలము శృంగాటకము చతుష్పథము ననివిలసిల్లును. గంగాయమునా సరస్వతీనదులను నామములుగల యిడాపింగళాసుషుమ్నలు కలిగి కూడిన భ్రూమధ్యస్థానము త్రికూటమని, త్రివేణి సంగమంబని చెప్పందగును. వాక్ప్రసారిణియైనసరస్వతీ నాడిజిహ్వాంతగామిని యగు విశ్వోదరీనాడి చతుర్విధాన్నంబు భక్షించును. కంఠమందుండు, పైస్వినీనాడి, క్షుత్పిపాసలు గలుగఁజేయుచు జలపానంబాచరించి మఱియు నాడీచక్రమందుదయించిన మూఁడునాడు లధోముఖులై యుండు. అందు రక్తాహ్వాయనాడి శుక్లంబును, సినీవాలీనాడి మూత్రంబును, గుహూనాడి మలంబును, వెలువరింపంజేయును. శంఖినీదామినీనాడులు భక్షితాన్నరసంబులు గ్రహించి కపాలకుహరంబునొంది శిరంబున నమృతంబుఁగావించు, నదియుంగాక యనాహతచక్రమందు నూటొక్కనాడులు ప్రకాశించును. అందొక్కనాడి యూర్ధ్వగామినియును, నన్నాడీమార్గంబు, మోక్షమార్గంబనియును, వేదాంతంబులు పలుకు. ఇట్లు వివరించిచెప్పినవెల్ల ముఖ్యనాడులు. వీనిలో నిడాపింగళాసుషుమ్నలు శ్రేష్ఠనాడులు. అందుబ్రహ్మనాడి సకలనాడికా శిరోమణియగు. ఈవిధముగ నడ్డముగ మీఁదుగాఁ క్రిందుగా వ్యాపించినవై శ్రేష్ఠములయిన రంధ్రముల ప్రధానలయినట్టి డెబ్బదిరెండువేల నాడులయందుఁ జలనధావనకంపనా కుంచన శోషణ ధర్మకంబులయిన దశవిధ ప్రాణంబులు మెలంగు, నందు హృదయస్థానంబున వసియించి ప్రాణియిడాపింగళాఖ్యనాడి కారంధ్రద్వయంబువలనను, శ్వాసరూపంబుచేత బాహ్యంబునకు నిర్గమించి ద్వాదశాంగుళ పర్యంతంబరుగుదెంచి, యచ్చట నడంగు, గుదస్థానంబునందుండి, యపానుండు శ్వాసరూపంబుచేతఁ బ్రాణికినధోముఖంబుగా నెదురునడుచుచు నధోముఖనాడీత్రితయంబువలన, మలమూత్రశుక్లంబుల వెడలించుచుండు. కంఠదేశంబునవసించి యుదానుండు మనంబునందలి సంకల్పవికల్పంబుల జిహ్వాద్యష్టస్థానంబులవలన శబ్దరూపంబు

గాఁబలికించుచు, సుషుప్త్యవసరంబున సకలేంద్రియంబుల సంగ్రహించియు పశమింపంజేయుచు, జాగ్రదవస్థలయందువాని నెల్లనెప్పటిచోట్లనుంచుచు, మఱియులోకాంతరాగమనంబుల సమర్థుండై యొప్పుచు, నగ్నిష్టోమము యుండై, సుషుమ్నారంధ్రంబు నాశ్రయించి బ్రహ్మరంధ్రంబునకుద్గమించుచుండు. సర్వశరీరంబున వ్యాపించి, వ్యానుండుబాహ్య శీతోష్ణంబుల నభ్యంతరంబునకు నాంతరశీతోష్ణంబులబాహ్యంబున కిచ్చుచు, భక్షితాన్న రసంబునంతటఁ బ్రసరింపంజేయుచుండు. నాభిస్థానమందుండు సమానుండు జఠరానలంబుం బ్రజ్వలింపంజేసి ప్రాణ్యుపభుక్తచతుర్విధాన్నంబులఁ బచనంబుఁ జేసి యెల్లనాడులకుఁ బంచిపెట్టు, నాగుఁడుద్గారంబుఁ గూర్ముండున్మీలనంబుఁ గ్రుకరుండుక్షుతంబు, దేవదత్తుఁడు విజృంభణంబు, సర్వవ్యాపియై ధనంజయుండు మృతంబైన విడువక దేహస్థౌల్యంబుఁ బుట్టించుచుండు. ఇటుల దశవాయువులతోఁ గూడి దశేంద్రియాన్వితంబై, కామరాగద్వేషాదివికారసహితంబై విషయసుఖగ్రహణంబుకొఱకు, నధోముఖంబై శ్రవణేంద్రియంబువలన ద్వివిధశబ్దంబులఁ ద్వగింద్రియము వలనఁ బంచవిధస్పర్శంబుల, నేత్రేంద్రియంబువలన షడ్వర్ణంబుల జిహ్వేంద్రియంబువలన షడ్విధరసంబుల, ఘ్రాణేంద్రియంబువలన ద్వివిధగంధంబుల, ననుభవించుచు వెండియు వాక్పాణిపాదపాయూపస్థలతోడంగూడి వచనాదాన గమన విసర్గానందకర్మంబుల నొనర్చుచు, మనంబు ప్రవర్తించుచుండు. అమ్మనంబుఁ గరణంబుగాఁ గైకొని తత్త్వవనమనోగ్రస్థితయుఁ గర్తృత్వభోక్తృత్వాది ధర్మసమేతయు నైన బుద్ధివిలసిల్లు. ఇదియె బిందువనంబరఁగు. అది సర్వకార్యకారణాశ్రయయు నిఖిలవాసనావాసితయు, నగుంగావున నమ్మనసమారుతేంద్రియ శరీరంబులతోఁ గూడి విషయాభిముఖయై తచ్చాంచల్యంబువలనఁ, దానుంజలించుచు బహిరంతర్విషయానుభవంబుఁ జేయుచు సుషుప్తియం దజ్ఞానాకారంబగుచు జాగ్రత్స్వప్నంబులయందు బుద్ధ్యాకారంబై తోఁచుచు ననాదికాలంబుననుండి ముక్తిపర్యంతంబనంతకర్మంబులనాచరించుచుఁ దత్ఫలంబులగు సుఖదుఃఖంబుల భుజించుచు నవిచారరూపిణియై నిరంతరపర్యటనశీలయైయుండు మఱియును॥ 320

చ॥ ఘనముగ మేనిలోఁగలుగు, గంధవవహుఁడె మఱిమానసాగ్రమం
దనయమునుండు బుద్ధియదె, హాయిగబిందువునంచువెల్గు నా
యనుపమమైన యాత్మయగు,నట్టి వికాసమె జీవుఁడేకదా
ధ్యొనరేఁ గశాప్తినాఁగఁ బవ,నోన్నత ఘోషఘునాదమేసుఖీ॥ 321

ఉ॥ ఆపరనాదబిందుకళ, లవ్వనజాక్షుఁడు మంచిదృష్టిచే
నావిలపాటుచెందక మ,హామతిఁజూచునొ యట్టిజీవునిన్
భావమునందుఁగన్గొనెడి, ప్రాజ్ఞుఁడు నుజ్జ్వలుఁడున్ సదాశివుం
డావిధిఁ దత్త్వసంఘముల, కాద్యుఁడు సుక్ష్మ వివేకిలక్షణా॥ 322

వ॥ ఇత్తెఱంగునఁ దత్త్వవిద్యానాయకుండైన, పరమాత్మయొక్క ప్రతిచ్ఛాయ యనెడు జీవకళతోడం గలసిన యాబిందువు సర్వకాలముద్యుమణి మండల సోమమండలవహ్ని మండలములతోఁ గూడిన, సూక్ష్మనేత్రాగ్రమునకు సూటిగా నధోముఖంబుగలదైయున్న మానసకమలముతోడం బ్రపంచాభిముఖమై, స్వవిషయానుభూతిఁదగిలి విడువక ప్రాణాదిదశవాయువులయొక్క హృదయేంద్రియ కళేబరసహవాసముచేత, విరామములేక సంచరించును. గనుక పదినాడులనడుమనున్నట్టి పదివిధములైన జ్ఞానకర్మేంద్రియ పవనచిత్తముననన్నింటిని నష్టదళకమలాంతర్వర్తియగు జీవతత్త్వమునందలి యనుభవముచేత లోఁబఱచినిరోధించి కదలకుండునట్లుచేయుము భూవరోత్తమా యని మఱియునిట్లనియె॥ 323

మ॥ ఘనహానింద్రియముల్జయించి పటిమన్, గన్గొంచుఁబ్రాణాలనం
దనయంబున్ నిజమానంబు ననుదా,దాత్మ్యంబుఁగావించియా
మనసుంబ్రాణముతోడహంసయనసా,మాన్యంబుగా నొప్పత
ద్ఘనవర్ణంబుల రెంటినిన్ నిరతిని,క్కంబారధ్యానింపుమా॥ 324

వ॥ మఱియు నెల్లప్పుడు పద్మాసనమందుఁగూర్చుండి దృక్కునిటలమందుంచి యింద్రియములను జలింపనీక, స్థిరముగాఁ జిక్కఁబట్టి దశవిధవాయువులఁ జలనాదివికారములను గలుగకుండునట్లుచేసి తదుపరి కామరాగాదులయందు నిచ్ఛలేనట్లుమనస్సును, శోధించి, ప్రాణవాయువు,మనస్సు ఈరెండిటితో హంస మంత్రమును జేర్చి జపించుచు హృదయాకాశమందు బుద్ధినిజెదరనీక, ప్రణవ నాదకళలను జూడవలయును. మఱియును నాదబిందుకళలకుఁగారణమై సాక్షియైన పరబ్రహ్మము, ఈనాదబిందుకళలవల్లఁబుట్టిన జీవేశ్వరజగత్తులకు సాక్షిగానుండు నదే హకారము.ఇంక దేహేంద్రియప్రాణమాన సాదులేయాకారముగాఁగలదియు నజ్ఞానమే రూపముగాఁగలదియుఁ ద్రిగుణములతోఁ గూడినదియు, నుత్పత్తిరహితమైనదియు, షడ్భావ వికారములులేనిదియునై యుండునదే సకారము. ఈహకారసకారస్వరూపములైన పురుషప్రకృతుల యొక్క చేరికయే మధ్యమునందుండెడుబిందువు.అందుచేతనే హంస యన్నఁగా

జీవుఁడని చెప్పుట. అట్టిజీవుఁడు మనోమారుతములతోఁగూడి ప్రకాశించును. ఇట్లు నిర్వికారుండైన పురుషునకుఁ గేవల జడాత్మికమైన ప్రకృతికి వేఱు వేఱు గాఁ, గర్తృత్వభోక్తృత్వాది రూపసర్వసంసారంబు కలుగదు గావున, హకార స్వరూపకుండైన యాత్మునకుఁడా శక్తియైన సకారంబుతో నన్యోన్యతాదాత్మ్యధ్యానరూపంబునంగూడి హంసస్వరూపకుండై, జీవుండై, నవద్వారపురంబునం బ్రవేశించి వివిధేంద్రియప్రాణ మనోయుక్తుండై పంజరమ్మునం దిరుగు పులుంగుచందంబునఁ జిక్కి వెడలు నుపాయంబుగానక నానావిధభోగంబు లనుభవించుచుఁ గ్రీడించునట్టి హంసకుఁ జంద్రవహ్నిమండలంబులు పక్షంబులు. ఓంకారంబు శిరంబు. నేత్రంబు ముఖంబు. హకారసకారములు పాదములుగా నొప్పి భానుకోటిప్రతీకాశంబై, కట్టెయం దగ్ని నువ్వులయందునూనె, పాలయందు ఘృతంబును వ్యాపించియున్న చందంబున బ్రహ్మ మొదలు తృణమువఱకు సర్వభూతములయందు హృదయకమలంబధిష్ఠించియుండును. అనఁగా సహస్రారమున వేయిచిన్న రేకులుగల కమలము. దాని నెనిమిదింటఁ భాగింపఁగా నూటయిరువదియేను చిన్న రేకులుగల పెద్దదళ మొకటియగుచున్నది. అట్టిదళములు, ఎనిమిదియై యెనిమిదిదిక్కులయందుండును. అందుఁ దూర్పుదళంబున సద్బుద్ధియు నాగ్నేయదళంబున నిద్రాలస్యాదులు యామ్యదళంబునఁ గ్రూరబుద్ధియు, నైఋతిదళంబునఁ బాపబుద్ధియుఁబశ్చిమదళంబున విలాసమును, వాయవ్యదళంబునగమనము మొదలగు బుద్ధియు, నుత్తరమున రతిప్రీతియు, నీశాన్యదళంబున ద్రవ్యము ధర్మము చేయుట, మధ్యంబున వైరాగ్యంబు, కింజల్కములయందు జాగ్రదవస్థయుఁ గర్ణికయందు స్వప్నంబు, లింగంబుననఁగాఁ దామరదుంపయందు సుషుప్తియుఁబొందుచుండు. మఱియు నెప్పుడు (పద్మత్యాగియానో) అనఁగా సహస్రారమును విడుచునోయప్పుడు నాదంబునవిలీనంబగునదితురీయంబు. ఇన్నాదంబాధారాది బ్రహ్మరంధ్రపర్యంతంబు శుద్ధస్ఫటిక సంకాశంబైనిండియుండు. అదియెపరమార్థ తత్త్వరహస్యంబనంబడును. 325

చ॥ అతులగురూపదేశమున, నావివరంబులు కాంచి వేగమే
వితతవివేకదృష్టిరుచి, వేడ్కనుగన్గొనునంతలోపలన్
మితిదెలియంగవచ్చుధ్వని, మేళనగల్గుస్థలంబునారయన్
గతులనుజూడనాస్థలము, కాంతిదలిర్పసుషుమ్నదేశమా॥ 326

సీ॥ సకలగాత్రహృదయ, జలజాతములయందు, సమముగాఁ బ్రాణసు, స్రాంతములును

హంసయనుచుఁబల్కు, నతఁడె నేననుకీలు, నెఱిఁగిధ్యాసను జేయ, విరుగుమనము
నీరహాస్యంబెంచి, యేకాగ్రచిత్తుఁడైఁని, రతంబుభజియింప, నిక్కువముగఁ
బ్రాణమానసములు, పటిమహంసనుగూడ, భాసిల్లితుదకును, భవ్యరుచిని

తే॥ బొందుఁబరిపూర్ణచైతన్య, మందు వేగ
వెలుఁగునందునమిశ్రమై, వెలుఁగునయ్య
ప్రవిమలానందకరముగాఁ బట్టిమిగుల
సిదియెమిక్కిలిగూఢార్థ, మేపుమీఱ॥ 327

తే॥గీ॥ స్వాంతగతవాయువేతెంచు, సాంద్రఘ్రాణ
రంధ్రములనుండిబైటికి, రమ్యముగను
ద్వాదశాంగుళమునకును, దడయకేపుమ
రాఁగనదిరేచకంబగు, రాజవర్య॥ 328

తే॥ అట్టియుచ్ఛ్వాసమేతెంచు, నంతలోన
నర్థసమయంబయచ్చోట, నమరిలయము
నెనయునదిబాహ్యకుంభకం, బేపుమీఱ
నావిధంబునలోపలి, కరుగునపుడు॥ 329

మ॥ అదినిశ్వాసమనంగయుక్తమగున, య్యాపూరకంబంతలో
విదితంబారయనర్థకాలము వెనన్, విచ్చేసిలీనంబెయా
నదియేయంతరకుంభకంబగునుద, న్నాయ్యయంపుసంచారమా
నదియే రేచకపూరకాదిగతులన్, హంసఃంబుఁజేకూర్చెడిన్॥ 330

ఉ॥ పూరకసంజ్ఞచేనరయఁ, బొల్కునకారముపొందుచేయఁగా
నారయఁగుంభకంబున సమంచితబిందువుఁగూర్చి యంతలో
గౌరవమొప్పఁగా మది స, కారము రేచకమందుఁజూచిగం
భీరగుణానవానిఁగను, బట్టగుజ్ఞానమె నేననందగున్॥ 331

శా॥ ఈరీతిన్ బవమానమానసములన్, హెచ్చుందఱిన్ గూడియున్
ధీరాగ్రేసరహంసరేపవలుసం, దీప్తిన్ బ్రకాశించుచున్
సారోదారతనాఱుచక్రములను, శ్రావ్యంబుగావచ్చునా
యారావంబుననిర్వదొక్కటగువే, తానాఱువందల్ వెసన్॥ 332

వ॥ అట్లు విహరించునుగనుక గుదస్థానంబునవశవసవర్ణగంబై నాలుగు రేకులుకల
దయి తప్తకాంచనసన్నిభంబై భూమికి నివాసంబై నాశమునకు హేతువై
మూలాధారచక్రంబువిలసిల్లు. అందు వినాయకునకు నాఱునూరులును

లింగస్థానంబున బభమయరలవర్ణగంబై యాఱుదళములతోఁగూడినదై రక్త వర్ణంబై జలమునకు నెలవై నాలుకకు హేతువై స్వాధిష్ఠానచక్రంబు రంజిల్లు. అందు బ్రహ్మకు నాఱువేలును నాభిస్థానంబున డఢణతథదధనపఫవర్ణగంబై దశ దళోపేతంబై యగ్నికిస్థానమై పసపుఁజాయగలదై నేత్రకారణంబై మణిపూర చక్రంబు ప్రకాశించు. అందు శ్రీమహావిష్ణువున కాఱువేలును వక్షస్థలమందు, కఖగఘఙచఛజఝఞటఠ వర్ణగంబై ద్వాదశదళోపేతంబై తెల్లనిచాయ గలదై వాయువునకు నివాసస్థానమై త్వగింద్రియకారణంబై యనాహత చక్రంబు తనరు. అందు రుద్రున కాఱువేలును గంఠస్థానంబునందకారాదిషోడశ స్వరగంబై షోడశదళయుతంబై నీలవర్ణంబై గగనసదనంబై కర్ణములకు హేతువై విశుద్ధచక్రంబలరు. అందు జీవాత్మునకు సహస్రంబును భ్రూమధ్య స్థానంబు హం, క్షం అనువర్ణంబులుగలిగి ద్విదళలలితంబై మాణిక్యవర్ణంబై యంతఃకరణభవనంబై యాజ్ఞాచక్రంబొప్పు, అందుఁబరమాత్మునకు సహస్రం బును బ్రహ్మరంధ్రస్థానంబున నోంకారవర్ణగంబై సహస్రదళశోభితంబై కోటి సూర్యప్రకాశంబై బుద్ధికి లయస్థానంబై సహస్రారచక్రంబలరు. అందు శ్రీగురు స్వామికి సహస్రంబును శ్రీమద్దేశికోక్తాసనముద్రాలక్ష్య మంత్రధ్యానక్రమ పూర్వకంబుగా సమర్పించు సద్గురుభక్తుండు జీవన్ముక్తుండగునట్లొప్పించునప్పుడు

మ॥ ఇరుపార్శ్వంబుల నాడులున్నడుచు స,ద్ధేలన్ సదా వాయువుల్
పరువుల్ వాఱఁగ వానిదీర్ఘగమనప్రఖ్యాతిలో వెల్వలన్
నిరతిన్ మధ్యమమార్గమంట మెలఁగున్ నిర్భీతి నారెంటికిన్
మరుగై వెలుఁగఁ బ్రజ్వరిల్లెడు సుషుమ్నానాళమందున్ వడిన్ 334

సీ॥ ప్రవిమలంబైనట్టి, ప్రణవకుండలియందుఁ, గూటస్థుఁడై యున్న గురుతరుండు
నంతరరాముండు, నయమొప్పసాక్షియై వెలుఁగుచునుండును, వేడుకలరఁ
జలనంబు లేనట్టి, చక్కనిహంసస్వ, రూపమెక్కడఁబుట్టు, రూఢిగాను
వినుతమే నెలవున, విలసిల్లితిర్గునో, యెచ్చటలయమౌనో, యెంచిచూడ

తే॥ నదియెసూ బ్రహ్మనాడియు, నదియెద్విదళ
కమలమనఁబడునదియెపో, కంజనయన
నిర్మలజ్ఞానదృష్టిని, నేర్పుమీఱ
నరయుమోయయ్యధీవరా, యందముగను॥ 335

వ॥ మఱియు దేహాదిసర్వప్రపంచముయొక్క పుట్టుకకుఁ గారణమైన ప్రథమస్ఫు రణయతి సూక్ష్మముగను ద్రష్టృదర్శన దృశ్యములయొక్క లయస్థానముగ

ను దనంతట వెలుఁగునదిగను దేనిని నంటకుండునదిగను జతుర్దశేంద్రియ విష
యశూన్యముగ నుండుటవలన నాసుషుమ్న యందె యింద్రియవ్యాపారముల
కుఁగారణమగు ప్రధానప్రజ్ఞ, అందే జీవేశ్వరులయొక్క కించిద్జ్ఞత్వ, సర్వజ్ఞ
త్వాది, ధర్మములను జేర్పఁగా నా తెలివియందే యపరోక్షజ్ఞానముపుట్టి యధిక
విజృంభణముతో నాజీవేశ్వరోపాధులను నశింపఁజేయును. కార్యోపాధిగల
జీవుఁడనెడు కారణోపాధిగల యీశ్వరుఁడనెడు నరణులయందు ధ్యానమనెడి
మథనమువలనఁ బుట్టినయపరోక్షజ్ఞానమనెడు నగ్ని ప్రజ్వరిల్లితనయుత్పత్తికిఁగా
రణములైన జీవేశ్వరులనెడి యరణులను నూర్ధ్వమందుఁబరబ్రహ్మమును జే
రునపుడు తనరూపముగఁ జేయును. జీవబ్రహ్మైక్యజ్ఞానముఁగలవారు ప్రణవాం
గమైన జీవుండు స్వచ్ఛమైన బ్రహ్మానందరసబిందువనియు, శుద్ధస్ఫటికముతో
సమానమైన యానందబిందువునందు శబ్దించుచుఁ బ్రకాశించెడు నీశ్వరస్వరూ
పముగు జ్యోతిప్రణవనాదమనియు, లింగస్వరూపమగు నీశ్వరునియొక్కయు,
నంగస్వరూపుఁడైన జీవునియొక్కయు, నభేదైక్యమే పరమశివకళయనియు,
వికల్పములేని శ్రవణమనననిదిధ్యాసములచేతఁ దెలిసికొనవలయుంగాన జీవే
శ్వరులయొక్క కించిదజ్ఞత్వసర్వజ్ఞత్వాద్యుపాధులను నశింపఁజేసియాత్మజ్ఞానా
కారముగఁ జేసిఘటాకాశము మహాకాశమందైక్యమైనట్లు తానుదానై 336
వెలింగెడు పరబ్రహ్మమందుఁగలయును.

సీ॥ కలహంసమునుగూడి, ఘననాదబిందువు, కళలైక్య మెప్పుడోఁగంజనయన
యప్పుడు వెలిఁగెడు, నాఘనసారంపుఁగల్కెమర్గినరీతి, ఘనముగాను
సర్వేంద్రియములతో, సంకలితంబైన, మారుతచిత్తముల్, మనుజవర్య
తాదాత్మ్యమునుజెందఁ, దానైన సుజాని, నిర్వాతదీపంబు, నిలుచునట్టు
తే॥గీ॥ లచలసచ్చిత్సుఖాకారుఁ, డగుచు నిరతిఁ
బూర్ణుఁడై వెల్గు నిరతంబు, పూతచరిత
యిదియు నీవాసఁగైకొని, యెంతొప్రీతి
నైక్యభావంబుఁగాంచుమా, యతులముగను॥ 337

వ॥ ఈప్రకారము హంసనాదబిందుకళలతో నానావిషయేంద్రియ సంకలితస్వాం
త పవనంబు లెప్పుడు తాదాత్మ్యంబు నొందునో యప్పుడా దశతురీయంబని
యు నున్మనియనియు సహజామనస్కంబనియుఁ బలుకందగు. అట్టిపూర్ణ
నిర్వికల్పసమాధియం దద్వితీయాపరోక్షస్వయం ప్రకాశకాఖండ సచ్చిదానం
దస్వరూప పరమాత్మారామ చైతన్యమాత్రుండవై యుండుమని యుపదేశించి

మఱియు నీప్రకారము హంసమంత్రమును సర్వదా ధ్యానచేయఁగా బుద్ధిచ
లింపకుండును. దశవిధప్రణవనాదములను వినఁగాఁ దుదకు ఘంటానాదము
మ్రోయును. అంతర్బాహ్యమధ్యలక్ష్యములను శోధించిచూడఁగా స్వప్రకాశ
ము కనఁబడును. యామద్వయంబు శివజీవైక్య నిష్ఠయందుఁ బూర్ణసమాధి
ని ధ్యానచేయ నుపశాంతికల్గును. అట్టియున్మన్యవస్థయందు నంతఃకరణమును
బ్రాణవాయువులును బహువిధములైన జ్ఞానేంద్రియ కర్మేంద్రియములతో
నశించును. ఈయది యుపనిషత్తులందుఁ దెలియఁబడిన రాజయోగము. ఈ
రీతి ననుదినము యామద్వయంబు యథానియమంబుగ నేర్చిన నిర్మల నిశ్చల
వృత్తిగల పురుషునకు నాఱుమాసంబులకు నపరిణత మనస్కునకు వత్సరం
బునకుఁ గేవల మూఢునకుఁ బండ్రెండువత్సరంబులకుఁ బరమసూక్ష్మతారక
యోగసిద్ధియగు నని యోగశాస్త్రంబులవినంబడు. దివ్యవిజ్ఞాన సంపన్నుఁడై
గురుమూర్తిసన్నిధి స్థానాంగభావాత్మ శుశ్రూషలు కావించుచు నిరతంబు
సేవించు మహానుభావునకు నిరంతరాయముగా శీఘ్రకాలంబునన నిర్గుణబ్ర
హ్మసాక్షాత్కారంబగును. నిస్సంశయమని యప్పుడు॥ 338

సీ॥ ఈరీతిబోధింప, నిలనాథుఁడత్తఱిఁ నష్టవిధానంద, పుష్టిఁగాంచి
సరగునగిరజకు, సాష్టాంగదండంబు, సమరసబుద్ధిచే, సల్పెననుచు
శ్రీపతిలక్ష్మికిఁజిత్తంబురంజిల్లఁ గరుణచేవినిపింప, గౌరవమున
నవ్వుమశ్రీగౌరీశు,ఁడానందమగ్నుఁడై నిజశిష్యునకు నేమి, నియతిఁదెలిపె॥

తే॥గీ॥ ననియమగలక్ష్మికిట్లని, యనియెశౌరి
క్షితిపతినిజూచిశంకరుం, డతులప్రేమ
మచ్చుపడనగ్గెఁబూర్ణద, యాత్ముఁడగుచుఁ
దెలిసెనాతారకార్థంబు, తేల్లముగను॥ 339

ధ్రువకోకిల॥ పరమపావనమానిపాలన, పాకశాసనుఁబ్రోచుశ్రీ
హరికృపానిధియంతరాత్మయ, నాదిరాక్షసభంజనా
నరసఖానరసింహరూపక, నాథరామపదంబుచే
వరుసగావరభక్తకోటికి, వాంఛఁదీర్చెడిశ్రీహరీ॥ 340

మాలిని॥ సకలదురితనాశా, సంహృతారిప్రవేశా
ప్రకటితగుణభూషా, భవ్యదివ్యాత్మభాషా

సుకరగుణవిహారా, సూరిచేతఃప్రచారా
నికటసుజనవాసా, నిర్మలానంతదాసా॥ 341

## గద్యము.

ఇది శ్రీసీతారామచంద్ర కరుణాకటాక్ష వీక్షావిశేషసంప్రాప్తకవిత్వవైభవ, శ్రీమదఖండ సచ్చిదానంద స్వరూపరాజయోగానందానుభవ, పవిత్ర వల్లుట్ల గోత్ర వాసిరెడ్డి వంశసంభవ, వెంకమాంబా సూరయనామధేయ తృతీయ తనూభవ, బుధజనవిధేయ, సమ్యక్కృతాభిధేయ, సత్సహావాస, వెంకటసుబ్బదాస ప్రణీతంబైన వాసిరెడ్డివంశచరిత్రమునందుఁ చతుర్థాశ్వాసము.

సంపూర్ణము.

శ్రీ సీతారామార్పణమస్తు.





శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# వాసిరెడ్డివంశచరిత్రము

## పంచమాశ్వాసము.





పరతత్త్వరూపగిరి, శేఖరసాదరయోగిరాజర

ఝూపరతంత్రతంత్రచయ, సాధకబోధకసద్బుధేంద్రవా

గ్దీపకతారకాయనవి, ధివ్రిదచిన్మయమూర్తిరామదే

వాపవమానసూనుభట, పాపవిశోషణభక్తపోషణా॥ 1

వ॥ అనిగంధవహాత్మజుండుస్వామికిందెలిపినట్లు పిమ్మటి కథాశేషంబునెఱింగించె
దనెట్లనిన॥ 2

ఉ॥ శంకరుఁడయ్యెడన్ మిగులసంతసమందిభవానిఁజూడఁగాఁ
బంకజనేత్రఁగాంచికృప, పాటిలఁబల్కె-మహాముదంబునన్
శంకలుదీఱనాపరమ, శాంకరితెల్పినబోధయందునే
వంకలులేకతారకము, వాలుగఁదేలెను భూవరోత్తమా॥ 3

మ॥ అనియిబ్భంగిమృడుండుపల్కె నృపుతో, నత్యంతహర్షోన్నతుల్
దనరారన్ బ్రియవాక్కులం దెలియఁగాఁ, దత్త్వార్థబోధోక్తులా
ఘనవిజ్ఞానసుసాంఖ్యయోగవిధులన్, గాంక్షామితిం దెల్పెదన్
వినుమాత్మావరనాదుబోధనముశ్రీ, విశ్వాసమేపారఁగాన్॥ 4

వ॥ సాంఖ్యామనస్కంబులు పనిషదర్థప్రతిపాదకంబులు. అందుఁదొలుత సాంఖ్య యోగమనఁగా జ్ఞానయోగము దెలియునట్లు చెప్పెద. స్థిరస్వాంతుండవై యాకర్ణింపుమనియిట్లనియె. ఓభక్తవర్యా! పరమపరిపూర్ణనిర్గుణబ్రహ్మయనఁగా నద్వయమైప్రకృతికంటెవేఱై దుఃఖము లేనిదై యెల్లప్పుడుండునదియై యలోకమైయంతట నిండినతేజస్సుగలదై తత్త్వజ్ఞానమై జగదధిష్ఠానమై మోక్షమునకాదికారణమై మాయలేనిదై రమ్యమై కేవలానందమై సారమై జ్ఞానాజ్ఞానస్వరూపమై సర్వవికారశూన్యమై విగతసంసారమగుచుఁ దెలియనలవిగాని పెనఁకువలుగల వికారములుగలదై మెలఁగుప్రకృతినిదగులక మిగిలివెలుఁగుచిచ్ఛక్తిని వెలుఁగందఁ జేయుచు సంపూర్ణముగాఁ బ్రకాశించును॥ 5

సీ॥ కారణహీనంబు, ఘనచిత్తరహితంబు, కదలికలేకని, ష్కల్మషంబు
కర్మేంద్రియంబులు, ఘనశూన్యమైనట్టి, వరకళాతీతమైపరఁగుచుండుఁ
బ్రకృతిశూన్యంబును, బటుకర్మనిష్ఠచేఁ, బ్రాప్యనిర్గుణబ్రహ్మ, ప్రబలమయ్యు
నది పుణ్యపాపాల, నధిగమించుటలేదు, తత్ఫలంబులసీయఁ, దగవులేదు

తే॥ జ్ఞానవిస్మృతులనుజేయు, శక్తిగల్గి
సచ్చిదానందమయశక్తి, సంగతమయి
కార్యకారణ సంగ్రహ, చర్యచేత
నలరునయ్యదధిష్ఠాన, మండ్రు బుధులు॥ 6

వ॥ త్రిగుణాతీతమైన పరబ్రహ్మము హేతువులేనిది కోరికలేనిదికదలికలేనిది క్రియారహితమైనది. అణవకార్మిక మాయామలములులేనిది కళాతీతమైనది ప్రకృతిశూన్యమైనది యిచ్చుట యీకుంశట లేనిది యెఱుకమఱపులకంటె వేఱైనదియుఁ ద్రికాలాబాధ్యమునుసుఖమును దెలివియు స్వరూపముగాఁ గలదియు నవ్యక్తనామక ప్రకృతికిని, నాప్రకృతివలనఁ బుట్టిన మహదహంకారాది సప్తావరణములకు నాదికారణమైన చిచ్ఛక్తికాశ్రయమైనదియు నుపనిషద్భాష్యాదులచేఁ దెలియఁదగినవాఁడు జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలను జూచువాఁడు సకలవస్తుసమూహములలో నుండువాఁడు నశాశ్వతములైన లోకములయొక్క సృష్టిస్థితిలయములకుఁ గారణస్వరూపుండునైన పరబ్రహ్మము పంచ

భూతములుసూర్యచంద్రులు, అను సప్తమండలములయందుఁ బ్రకాశించుచున్న సమస్తములయందును బుణ్యులైన బ్రహ్మముఖ్యదేవతలుండును. మిత్రులైన మనుష్యులయందునుండెడు నంతర్యామియును గవాక్షములలోపల నున్నట్టి కదలెడు కదలకుండెడునదియునై క్రియలేని యపరోక్షజ్ఞానముయొక్క చిత్కళాసమూహమును బ్రకాశింపఁజేయునదియునైన పరబ్రహ్మ యెట్టిదో వివరించెద. పరబ్రహ్మము సృష్టిస్థితి సంహారతిరోధానానుగ్రహముల నెడు పంచకృత్యములకుఁ గారణుండును బంచకర్తలకతీతుండును దేశకాలవస్తువులచేత వేఱుపడనివాఁడును జీఁకటికి సూర్యుఁడువలె నజ్ఞానమునకు నాశకుండును బ్రహ్మజ్ఞానముచేఁ దెలియఁదగినవాఁడును దనుత్రయోపాధులు లేనివాఁడును నెన్నశక్యముగాని స్వరూపముగలవాఁడును. మఱియు నాపరబ్రహ్మము చరాచరములను బొందియున్నట్టి నామరూపములుగఁదోఁచుచున్న ప్రకృతిజన్యమైన జననమరణములుగలిగినలోకసమూహముతోఁగూడినవాఁడును నభవుండును నద్వయుండునునైన పరమాత్మదేశకాలవస్తు పరిచ్ఛేదశూన్యమగు సదసత్పదార్థములయొక్క ద్వివిధరూపములయొక్క యుత్పత్తి, నాశములేనివాఁడును దనకంటె నితరములేనివాఁడును సూర్యచంద్రాగ్నులకుఁ గాంతినిచ్చువాఁడును సమష్టివ్యష్ట్యాత్మకశరీరావస్థాభిమానేశ్వర జీవత్రయవిలక్షణమైన ప్రజ్ఞానమె సర్వలోకసాక్షి. మఱియుఁ గార్యకారణములచేతం బ్రకాశించెడు నవ్యక్తము వలనంబుట్టిన మహదాదిసప్తావరణములకంటె విలక్షణమైన బ్రహ్మజ్ఞానముచే నొందఁదగినది. అట్టియీపరబ్రహ్మము సంచితప్రారబ్ధమునుబొంది తగిన వర్తమాన శరీరముతోఁగూడిన జీవునినెప్పుడును ద్రష్టవలెంజూచుచుండును. అవస్థాత్రయము నశింపఁజేయుటయుఁ గాపాడుటయు వహించుటయుఁ గలిగినట్టినిర్మలమైన సత్త్వగుణమే స్వభావముగాఁగలిగిన సంపూర్ణజాగ్రత్తయు రజోగుణస్వభావమైన కోపమును దామసగుణస్వరూపమైన భయమును నాకారముగల సర్వోన్నతమైన ప్రకృతియొక్క చిచ్ఛాయ యగుప్రపంచముయొక్క యుత్పత్తిస్థితిలయకారణమైన ప్రజ్ఞానము ప్రకాశింపఁజేయువానినే పరబ్రహ్మమందురు॥ 7

ఆ॥ ఇదియునదియునట్టి, దిట్టిదింతంతని। పలుకరానిదెద్ది, బ్రహ్మమదియె
ఇదియునదియునట్టి, దిట్టిదింతంతని। యరయు తెలివియదియె, యదియునదియె॥ 8

తే॥ అట్టిపరిపూర్ణబ్రహ్మమైనట్టినేను। బూర్వకల్పాంతమున నెయు, పూర్వవిశ్వ
జననమునకంటెమునునిరం, జనుఁడనగుచు। నేకరూపంబునను బ్రజ్వ, రిల్లుచుందు॥

వ॥ అట్టినాయందు మొదటినుండి యవ్యక్తనామశక్తి వెలుంగును. అవ్యక్తమైన జగదాదియగుచు మృత్తికయందున్న కలశశక్తితోఁ బక కుంభహేతువై పొందినట్లు భాసిల్లును. మఱియు వటబీజంబునందు వటవృక్షంబు కలిగించు శక్తియుఁ బ్రజ్వలదగ్నియందు మిగుల నుష్ణశక్తియు గారడివానియందు సంతతమాయాశక్తియు శిలలందుఁ గఠినశక్తియు జలమందుఁ జెమ్మగిలుశక్తియు మారుతమందుఁ గదలుశక్తియు, రేతోరక్తములందు శరీరకల్పనాసామర్థ్యమును శరీరములయందుఁ గదలెడు సామర్థ్యమును గలిగి మెఱుఁగరానిదై యాయా వస్తువుల కాధారమై యాధారమగు వస్తువులకంటె వేఱుగానియట్లు నాలోపల నుశక్తి యేర్పడక యన్యమై విశ్వహేతువగుచుం బ్రకాశించును. అట్టిమదీయ మారుతంబు మాయయను కాఱుచీఁకటి బ్రహ్మజ్ఞానముచేత నెప్పుడు శూన్యమై బాధింపఁబడుటవలన సత్తుగాదు. అనఁగాఁ గాలత్రయమందుండునదిగాదు. ప్రీతితో నేను మూఢుఁడననియజ్ఞానభూతమైయొప్పుచుండుటచేత నసత్తుగాదు. అనఁగా గాలత్రయమందు లేనిదియుఁగాదు. శోధింపఁగా సత్యమైనది యసత్యమైనదియుఁగానేరదు. అట్టిద్రవ్యంబున్నదనుట మిక్కిలివిరుద్ధముగనుక సమస్త జగత్స్వరూపముచేత మిగులనేర్పడుటవల్ల నవయవములు లేనిదియుంగాదు. దృశ్యమనఁగాఁ బ్రపంచము. నిద్రయందు నశించినను దానుశూన్యంబుగాని సావయవముగాదు. అనఁగా నవయవములు కలదియుంగాదు. క్రమముగా నొకవస్తువు అవయవములుకలదనియు లేనిదనియుఁ జెప్పుటకడువిరుద్ధముగా ననుభయాత్మకముగాదు. అనఁగా నవయవములతోఁగూడియుఁ గూడకయు నున్నదనుట॥ 10

సీ॥ ఆస్థానమునకంటె, నారయ వేఱొక్క, స్థానంబు లేదుని,స్సంశయంబు
కానమద్భిన్నంబు, గాదవిద్యయుఁజూమీ, ప్రకృతియవిద్యగాఁ,బల్కఁబడుట
చేతమద్భిన్నంబు,చేర్పింపఁగాఁగాదు, మాయనాకునహనాదిమాయయనఁగ
వేదాంతవేత్తలు, విరివిగానెఱిఁగిరి, తక్కువారలెఱుఁగఁ, దగరుగాన.
తే॥ భిన్నమనియును నాకునభిన్నమనియు నెన్నఁగా నేలమాయని,రీతియగుట
బ్రహ్మవేత్తలనిర్వాచ్య,పదవియనుచు మున్ను సెప్పిరిసకలంబు,మోదమలర॥
తే॥ అరయవిజ్ఞానదృష్టిశూన్యాత్మమైన దగుననిర్వచనీయమౌఁదగసుయుక్తి
దృష్టిచేతనులౌకిక,దృష్టిచే ననంతమగునాదుమాయయ,నంతతమము॥ 12

వ॥ మఱియును రజ్జువును సర్పమువలె దారువును బురుషునివలె శుక్తినిరజతము వలె నెండమావులఁ దేటనీళ్లవలెగగనమునల్లగాఁ దోఁచినట్లు, అద్వయానంద

స్వరూపముగలవాఁడనై తగునేను మిగుల నేమాయవలన జనులకందఱకు నసత్యము నజ్ఞానము శోకమునను వీనితోఁగూడిన లోకములవలెఁ గనఁబడుదునో యట్టినన్ను విద్వాంసులు పూర్ణనిర్గుణమైనట్టి యనుభవజ్ఞానదృష్టిచేఁ బరమాత్మస్వరూపియని తెలిసికొన్నంతమాత్రముననే యేదినశించుచున్నదో యదియె నాసంబాధమైన మాయ యనంబడు. మఱియు నాప్రకృతి సకల ప్రాణులయొక్క నిద్రయంతయు నాకృతిగాఁగలదియు నెల్లలోకములయొక్క ప్రపంచవాసనామయ గుణత్రయాత్మకంబు, తనలోపల దాపంబడిన యనంత కోటి జీవసంఘాతంబు కేవలజడంబు, భ్రమయే రూపముగాఁగలదియు సకల జగదుపాదానకారణంబున విద్యావ్యక్తతమస్సుషుప్తి ప్రకృతిప్రళయ ప్రధాన మాయాజ్ఞానాదిశబ్దవాచ్యంబునై యొప్పుచుండునని వెండియు॥ 13

సీ॥ మొదలును మధ్యంబు, తుదయునులేనిదై యాదిమధ్యాంతంబు, లమరినట్లు
తోఁచియు మొదలును, దుదయు మధ్యంబును, గననిపరబ్రహ్మ,మునకునిరతి
మొదలునుమధ్యంబు,తుదయునుజక్కఁగాఁగల్గునట్లుగమాయ,ప్రగమ్మకొనెడు
నామూలప్రకృతియు,నమరెరెండువిధాల, మొనసినిర్మలమాయ, మొదటిదండ్రు

తే॥ రెండవదవిద్యమలినమై, యుండుదీప్తిఁ
బ్రబలుచుండునుసతతంబు; పటిమమీఱ
నిట్టిమూలప్రకృతికథ, యేపువెలయ
ముందుతెలిపెదవివరించి, మోదమలర॥ 14

సీ॥ ప్రవిమలంబైనట్టి, ప్రబలసత్వప్రధా, నముగలమాయ య, నంగఁబ్రకృతి
యందధిష్ఠానమై, నట్టినేనతులిత, వారిదసంగత, వారిమించి
యంతరిక్షంబున, నమరబింబించిన, మాయకుఁదానమై, మలయుపరము
సర్వకాలంబులఁ జలియింపఁ దగియుండి, సువివేకమెడలింపఁ జూచునట్టి

తే॥ మాయతోఁగూడుకతమున, మాయికుండ
నైనయీశుండమాయికుఁడగునతండు
బ్రహ్మరూపంబుచేనుండుఁబ్రాభవమున
సతఁడుమాయావిహీనుఁడై, యలరుభూప॥ 15

వ॥ మఱియు నేనుమాయాసహితుండగు నీశ్వరుండను. అసత్వగుణ స్వరూపిణి యగు మాయయే పార్వతి. నాకుమాయస్వాధీనమైనప్పటికిమాయకు నేనుస్వాధీనుఁడనై భూమియందుద్భవింతును. ఇట్లు శుద్ధసత్వప్రధానమాయోపాధికుండును సర్వేశ్వరుండనైన నేను లోఁబఱుచుకొన్న మాయగలవాఁడనగుటచేజగం

బులు సృజియించి వానిం గాపాడుటకొఱకై పూర్వమునుండి యనేకవిధులదు
ష్టనిగ్రహశిష్టానుగ్రహములఁగావించుటకై యవతరించితి. నాచరిత్రంబు లోక
త్రయపవిత్రంబు. ధవలతాలవిత్రంబై యొప్పునని చెప్పి మఱియు నవివేకులు కొం
దఱుసచ్చిదానందనిత్యనిర్మలుండనైన నన్నుఁదెలియంజాలకపరాప్రకృతులకం
టె విలక్షణుఁడనియు గురుడఁనియు బహ్మయనియు సమష్టివిగ్రహ స్వరూపియు
నియు దేవతాప్రభుండైన యింద్రుండనియు విష్ణువనియు శంకరుఁడనియు
నారాధించుచున్నారని మఱియు నిట్లనియె॥ 16

సీ॥ వినుము నేసతతంబు, విశ్వంబునకునుపా, దానకారణనిమి, త్తవిధిహేతు
వగుచూర్ణ నాభిక్రి, యఁబ్రికాశింతునిం, కేకార్యములనైన, నెగ్గులేక
యాదిసర్వేశ్వరుం, డనఁగనుబరఁగిన, నాకునవ్యాకృతం, బేకడనగు
నానందమయకోశ, మైనయావద్భూత, మజ్ఞానమెల్లను, బ్రాజ్ఞబుద్ధి

తే॥ కారణశరీరమనఁదగు, ఘనసుషుప్త్య
వస్థబ్రహ్మదితృణముల, వఱకుసకల
జంతువులయెల్లయవయవాల్, జగముసృష్టి
స్థితిలయంబులుసేయుట, స్థిరమువినుము॥ 17

వ॥ జీవనోపాధియైన యవిద్య రాజసగుణ స్వభావముగలదియగును. అట్టిత్రిగుణ
ములతోఁగూడి మూలప్రకృతికాధారమగు నేను గడవలోని నీటియందుఁ బ్ర
తిఫలించెడి మేఘనక్షత్రాదులవలె నవిద్యయందుఁ దోఁచిన ప్రతిబింబస్వరూ
పుఁడగు జీవుండు మలినసత్వమే ప్రధానముగాఁగల యవిద్యకు స్వాధీనుఁడై
స్థూలసూక్ష్మశరీరములే తానని యెంచుచు నాశరీరములరక్షించుచు మిగు
లం దెలివిలేనివాఁడై చరించును. ఆజీవుండు కారణశరీరమునకు లోఁబడిన
వాఁడై నిద్రానందము ననుభవించుచుఁ దానుగాఁ బ్రకాశించు స్వరూపము
గలవాఁడగుటవలనఁ బ్రాజ్ఞుండను పేరుచేత నానందమయకోశముగలవాఁడగు
టవలన నానందమయుండను పేరుచేత నవస్థాత్రయమందుం జేరియుండుటవలనఁ
బారమార్థికుండను పేరుచేత నొప్పుచుండును. అట్టి మలినసత్వప్రధానమై
యవిద్యయు నవిద్యాప్రతిబింబంబు తదధిష్ఠానచైతన్యంబునంగూడి జీవుండనం
బరగు. ఆజీవున కానందమయకోశ సంజ్ఞగల వ్యష్ట్యజ్ఞానంబు, అనఁగా నవి
వేకము కారణశరీరంబు సుషుప్త్యవస్థయగు నారెంటియందునభిమానంబుగల
యతండు ప్రాజ్ఞుండనఁనెప్పు. ఆప్రాజ్ఞునకు నింతమాత్రముచేత జీవధర్మంబు
పర్యాప్తంబుగామింజేసి, అనఁగాఁ బూర్ణము కానందునఁ దదీయాదృష్ట

సహాయ పూర్వక సూక్ష్మశరీరసృష్టిప్రకారంబుఁ జెప్పెద వినుమని యిట్లనియె॥ 18

ఉ॥ నిర్మలమైన మాయనుసు, నీతిగఁగూడిన యీశ్వరుండనే
మర్మవిహీనతంబటిమ, మానుగఁజూచితి సృష్టివాంఛచే
ధర్మముగాఁ దమోగుణ ప్రధానమయంబగు మాయచేత నా
కర్మచయంబులన్నిటికి, గట్టిగఁదోడ్పడునట్లుగా వెసన్॥ 19

వ॥ ఈప్రకారంబీశ్వరుండు సత్వగుణప్రధానమైన మాయతోఁగూడి తమోగుణప్రధానమయినట్టిదియు సర్వమునకు నుపాదానకారణమయినదియు నగు మాయతోఁగూడుకొనిన బ్రహ్మశక్తివలన శబ్దమేగుణముగాఁగల యాకాశమును, ఆయాకాశముతోఁజేరిన యాత్మశక్తివలన స్పర్శమేగుణముగాఁగల వాయువును, ఆవాయువుతోఁగూడిన పరబ్రహ్మశక్తివలన రూపమేగుణముగాఁగల యగ్నియును, ఆయగ్నితోఁగూడిన పరబ్రహ్మశక్తివలన మాధుర్యమేగుణముగాఁగల యుదకంబును, ఆయుదకముతోఁగూడిన బ్రహ్మశక్తివలన గంధమేగుణముగాఁగల భూమియునుబుట్టె. ఒకటివలన నొక్కటిపుట్టిన యీభూతము లైదుగా భాగింపఁబడని సూక్ష్మభూతములనియుఁ బంచతన్మాత్రలనియుఁ జెప్పంబడును. తమోగుణసంజాతములగు నీసూక్ష్మభూతంబులైదును సత్వరజోగుణములచేత సత్వసూక్ష్మపంచభూతములని రజస్సూక్ష్మపంచభూతములని రెండువిధములు, మఱియు నీవ్యష్టిసమష్టిభేదములచేత సత్వవ్యష్టిసూక్ష్మభూతములని రజస్సమిష్టిసూక్ష్మభూతములని నాల్గుపదములు వానిలోసత్వవ్యష్టి సూక్ష్మపంచభూతములవలనఁ బదిదిక్కులుగాలి,సూర్యుడు వరుణుఁడు, ఆశ్వినేయులువీరనెడు నధిదేవతలతోఁగూడిన శ్రోత్రము, చర్మము, నేత్రము, నాలుక, ముక్కనుజ్ఞానేంద్రియములైదునుబుట్టెను. మిగిలిన సత్వార్థసమష్టివలనఁజంద్రుడుఁ బృహస్పతి, యీశ్వరుండు, జీవుండనెడునధిదేవతలతోఁగూడిన సంశయాత్మకమగుమనస్సును నిశ్చయాత్మకమయిన ప్రజ్ఞయును గర్తవ్యాత్మకమగు నహంకారమును జంచలాత్మకమగు చిత్తమునుగలిగెను. పైఁజెప్పఁబడిన యాకాశాదిపంచభూతములయొక్క రజోగుణవ్యష్టిభాగమువలన నగ్ని, ఇంద్రుఁడు, విష్ణువు, యముఁడు, బ్రహ్మ, వీరనునధిదేవతలతోఁగూడిన వాక్పాణిపాదపాయూపస్థలను కర్మేంద్రియపంచకంబుపుట్టె.మిగిలినసగమయినరజోగుణముయొక్క సమష్టిపంచభూతములవలన విశిష్టుఁడు విశ్వకర్మ, విశ్వయోని, అజుఁడు, జయుఁడు, ననునధిదేవతలుగల ప్రాణాపాన

వ్యానోదాన సమానములను, పంచప్రాణములు పుట్టెను. ఈవిధముగాఁబుట్టిన జ్ఞానేంద్రియములైదును మనోబుద్ధిచిత్తా హంకారములనెడు నంతఃకరణచతుష్టయమును, కర్మేంద్రియములైదును ప్రాణాదివాయువులైదును జేరి, పందొమ్మిదియైనయంగములచేత లింగశరీరముకల్గెను. ఈసూక్ష్మశరీరము చెట్టువలెను వనమువలెను, వ్యష్టిసమష్టియని చెప్పఁబడును. ఈలింగశరీరమునకువ్యష్టిసమష్టిస్వప్నములు దశలగును. ఈవ్యష్టిలింగశరీరస్వప్నములయందుఁ బూర్వోక్తమయిన సుషుప్త్యవస్థాభిమానియగు ప్రాజ్ఞుఁడనిజీవుఁడు కర్తృత్వముకలవాఁడై ప్రపంచాకారవృత్తితోఁచుకాలమునందు మాత్రమున్నాఁడు గనుక ప్రాతిభాసితుఁడనియు నజ్ఞానకార్యమయిన నిద్రాసక్తితోఁగల్పింపఁబడునుగనుక స్వప్నకలితుఁడనియు నంతఃకరణవృత్తితోఁ గూడిన తైజసుఁడనియుఁజెప్పంబడు. సమష్టిసూక్ష్మశరీరములయందుఁగూడుకొన్నయీశ్వరుఁడగునేను జ్ఞానశక్తికలవాఁడనగుటవలన హిరణ్యగర్భుఁడనియు మణులయందు సూత్రమువలె నానావిధప్రపంచముచేరి యుండుటవలన సూత్రాత్మకుఁడనియుఁ గ్రియాశక్తితోఁగూడికొనియుండుటచేతఁబ్రాణుఁడనియు సమస్తప్రాణులచేతఁబూజితుండైయుండు. ఇప్పుడుచెప్పినది జీవేశ్వరులయొక్క సూక్ష్మసృష్టిక్రమము. ఇఁకమీఁదస్థూలపంచీకరణ ప్రకారముంజెప్పెదవినుమనియిట్లనియె॥ 20

## సూక్ష్మశరీరపంచీకరణచక్రము.

| | అపంచీకృతపంచసూక్ష్మభూతములు. | ఆకాశము. | వాయువు. | అగ్ని | జలము. | పృథివి. | సత్వరజస్సూక్ష్మభూతములు |
|---|---|---|---|---|---|---|---|
| సత్వసూక్ష్మపంచభూతములు | సత్వసమష్టిసూక్ష్మపంచభూతములు | | మనస్సు చంద్రుఁడు | బుద్ధి బృహస్పతి | చిత్తము జీవుఁడు. | అహంకారము రుద్రుఁడు | అంతఃకరణములు అధిదేవతలు |
| | సత్వవ్యష్టిసూక్ష్మపంచభూతములు | శ్రోత్రము దిక్కులు | త్వక్కు వాయువు | చక్షువు అర్కుఁడు | జిహ్వావరుణుఁడు | ఘ్రాణము అశ్వినులు | జ్ఞానేంద్రియములు అధిదేవతలు |
| రజస్సూక్ష్మపంచభూతములు. | రజస్సమష్టిసూక్ష్మపంచభూతములు | సమానము జయుఁడు | వ్యానము విశ్వయోని | ఉదానము అజుఁడు | ప్రాణము విష్ణుఁడు | అపానము విశ్వకర్మ | పంచప్రాణములు అధిదేవతలు |
| | రజోవ్యష్టిసూక్ష్మపంచభూతములు | వాక్కు వహ్ని | పాణి యింద్రుఁడు | పాదము విష్ణువు | గుహ్యము బ్రహ్మ | పాయువు మృత్యువు | కర్మేంద్రియములు అధిదేవతలు |

## (ఆత్మ) స్థూలశరీరపంచీకరణచక్రము.

| ఆకాశము అంతఃకరణము | మనస్సు | బుద్ధి | చిత్తము | అహంకారము |
|---|---|---|---|---|
| సమాన వాయువు | వాయువు వ్యానవాయువు | ఉదాన వాయువు | ప్రాణ వాయువు | అపాన వాయువు |
| శ్రోత్రేంద్రియము | త్వగింద్రియము | తేజస్సు చక్షురింద్రియము | రసనేంద్రియము | ఘ్రాణేంద్రియము |
| శబ్దము | స్పర్శము | రూపము | జలము రసము | గంధము |
| వాగింద్రియము | పాణేంద్రియము | పాదేంద్రియము | ఉపస్థేంద్రియము | పృథివి పాయ్వింద్రియము |

జీవస్థూలదేహతత్త్వాధిదేవతలే యీశ్వరస్థూలదేహతత్త్వములు.

## బ్రహ్మప్రణవచక్రము.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| జీవేశ్వరచతుష్టయొక్యచైతన్యచతుష్టయాన్యోన్యమేళన విభాగములు | ఈశ్వరచతుష్టయాన్యోన్య మేళనవిభాగములు | జీవచతుష్టయాన్యోన్య మేళన విభాగములు | అవస్థాచతుష్ట యాన్యోన్య మేళనవిభాగములు | స్థూలాది దేహచతుష్టయా న్యోన్యమేళన విభాగములు | అవిద్యా విద్యానందతురీయ పాదాన్యోన్యమేళనవిభాగములు | అకార, ఉకార మకార అర్థమాత్రాన్యోన్యమేళన విభాగములు |

అకారము అవిద్యాపాదము,స్థూలదేహము,జాగ్రదవస్థ,విశ్వుఁడు,విరాట్టు, ఓత ఇవిచేరి బ్రహ్మపీఠము, సద్యోజాతముఖము, పృథివీతత్త్వము, నకారము, నివృత్తికళ, తారకము.

| | | | |
|---|---|---|---|
| అకారమున అకారము | అకారమున ఉకారము | అకారమునమకారము | అకారమున అర్థమాత్రము |
| అవిద్యాపాదమున అవిద్యాపాదము | అవిద్యాపాదమున-విద్యాపాదము | అవిద్యాపాదమున-ఆనందపాదము | అవిద్యాపాదమున-తురీయపాదము |
| స్థూలదేహమున స్థూలదేహము | స్థూలదేహమున సూక్ష్మదేహము | స్థూలదేహమున-కారణదేహము | స్థూలదేహమున మహాకారణదేహము. |
| జాగ్రత్తలో జాగ్రత్త | జాగ్రత్తలో స్వప్నము | జాగ్రత్తలో సుషుప్తి | జాగ్రత్తలోతురీయము |
| విశ్వునిలో విశ్వుఁడు | విశ్వునిలో తైజసుఁడు | విశ్వునిలో ప్రాజ్ఞుఁడు | విశ్వునిలోప్రత్యగాత్ముఁడు |
| విరాట్టులో విరాట్టు | విరాట్టులో హిరణ్యగర్భుఁడు | విరాట్టులో అవ్యాకృతుఁడు | విరాట్టులోఁబరమాత్మ. |
| ఓతలో ఓత | ఓతలో అనుజ్ఞాత | ఓతలోఅనుజ్ఞైకరసుఁడు | ఓతలో అవికల్పుఁడు |

ఉకారమువిద్యాపాదము, సూక్ష్మదేహము స్వప్నావస్థ తైజసుఁడు, హిరణ్యగర్భుఁడు, అనుజ్ఞాత. ఇవి అన్నియుఁ జేరివిష్ణుపీఠము-వామదేవఋషి జలతత్త్వము-మకారము-ప్రతిష్ఠాకళ-దండము.

| ఉకారమున అకారము | ఉకారమున ఉకారము | ఉకారమున మకారము | ఉకారమున అర్థమాత్రము |
|---|---|---|---|
| విద్యాపాదమున అవిద్యాపాదము | విద్యాపాదమున విద్యాపాదము | విద్యాపాదమున ఆనందపాదము | విద్యాపాదమున తురీయపాదము |
| సూక్ష్మదేహమున విస్థూలదేహము | సూక్ష్మదేహమున సూక్ష్మదేహము | సూక్ష్మదేహమున కారణదేహము | సూక్ష్మదేహమున మహాకారణదేహము |
| స్వప్నములో జాగ్రత్త | స్వప్నములో స్వప్నము | స్వప్నములో సుషుప్తి | స్వప్నములో తురీయము |
| తైజసునిలో విశ్వుఁడు | తైజసునిలో తైజసుఁడు | తైజసునిలో ప్రాజ్ఞుఁడు | తైజసునిలో ప్రత్యగాత్ముఁడు |
| హిరణ్యగర్భునిలో విరాట్టు | హిరణ్యగర్భునిలో హిరణ్యగర్భుఁడు | హిరణ్యగర్భునిలో అవ్యాకృతుఁడు | హిరణ్యగర్భునిలో పరమాత్మ |
| అనుజ్ఞాతలో ఓత | అనుజ్ఞాతలో అనుజ్ఞాత | అనుజ్ఞాతలో అనుజ్ఞైకరసుఁడు | అనుజ్ఞాతలో అవికల్పుఁడు |

మకారము. ఆనందపాదము. కారణదేహము. సుషుప్త్యవస్థ. ప్రాజ్ఞుఁడు. అవ్యాకృతుఁడు. అనుజ్ఞైకరసుఁడు. ఇవిచేరి రుద్రపీఠము. అఘోరము. అగ్నితత్త్వము. శికారము. విద్యాకళ. కుండలాకృతి.

| | | | |
|---|---|---|---|
| మకారమున అకారము. | మకారమున ఉకారము. | మకారమున మకారము. | మకారమున అర్ధమాత్రము. |
| ఆనందపాదమున-అవిద్యాపాదము. | ఆనందపాదమున- విద్యాపాదము. | ఆనందపాదమున-ఆనందపాదము. | ఆనందపాదమున-తురీయపాదము. |
| కారణదేహమున-స్థూలదేహము. | కారణదేహమున-సూక్ష్మదేహము. | కారణదేహమున-కారణదేహము. | కారణదేహమున-మహాకారణదేహము. |
| సుషుప్తిలో జాగ్రత్త. | సుషుప్తిలో స్వప్నము. | సుషుప్తిలో సుషుప్తి | సుషుప్తిలో తురీయము. |
| ప్రాజ్ఞునిలో విశ్వుఁడు. | ప్రాజ్ఞునిలో తైజసుఁడు. | ప్రాజ్ఞునిలో ప్రాజ్ఞుఁడు. | ప్రాజ్ఞునిలో కూటస్థుఁడు. |
| అవ్యాకృతునిలో విరాట్టు. | అవ్యాకృతునిలో-హిరణ్యగర్భుఁడు. | అవ్యాకృతునిలో-అవ్యాకృతుఁడు. | అవ్యాకృతునిలో-పరమాత్మ. |
| అనుజ్ఞైకరసునిలో ఓత. | అనుజ్ఞైకరసునిలో అనుజ్ఞాత | అనుజ్ఞైకరసునిలో. అనుజ్ఞైకరసుఁడు | అనుజ్ఞైకరసునిలో-అవికల్పుఁడు |

అర్థమాత్రము. తురీయపాదము. మహాకారణదేహము. తురీయావస్థ. కూటస్థుఁడు. పరమాత్మ.అవికల్పుఁడు. ఇవిఅన్నియుఁ గూడినమహేశ్వరపీఠము. తత్పురుషముఖము. వాయుతత్త్వము. వకారము. శాంతి. కళ.అర్థచంద్రాకారము

| | | |
|---|---|---|
| అర్థమాత్రమున-అకారము. | అర్థమాత్రమున-ఉకారము. | అర్థమాత్రమున-మకారము. |
| తురీయపాదమున-అవిద్యాపాదము. | తురీయపాదమున-విద్యాపాదము. | తురీయపాదమున-ఆనందపాదము. |
| మహాకారణదేహమున.స్థూలదేహము. | మహాకారణ దేహమున-సూక్ష్మశరీరము. | మహాకారణ దేహమున.కారణశరీరము. |
| తురీయమున జాగ్రత్త | తురీయమునస్వప్నము. | తురీయమునసుషుప్తి. |
| కూటస్థునిలోవిశ్వుఁడు. | కూటస్థునిలో తైజసుఁడు. | కూటస్థునిలో ప్రాజ్ఞుఁడు. |
| పరమాత్మలో విరాట్టు. | పరమాత్మలో హిరణ్యగర్భుఁడు. | పరమాత్మలోఅవ్యాకృతుఁడు. |
| అవికల్పునిలో ఓత. | అవికల్పునిలో అనుజ్ఞాత. | అవికల్పునిలోఅనుజ్ఞైకరసుఁడు. |

పైనఁజెప్పినవెల్లఁగూడి సదాశివపీఠము-ఈశానముఖము-ఆకాశతత్త్వము యకారము శాంత్యతీతకళ-బిందురూపము-ఇదివఱకుశక్తితత్త్వములు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| అవికల్పునిలో అవికల్పుఁడు | పరమాత్మలో పరమాత్మ | కూటస్థునిలో కూటస్థుఁడు | తురీయమున తురీయము | మహాకారణశరీరమున-మహాకారణశరీరము | తురీయపాదమున తురీయపాదము | అర్థమాత్రమున అర్థమాత్రము |

ఇదిశివతత్త్వము-శివతత్త్వమును-శక్తితత్త్వములను-మీఱినదే-నిర్గుణపరబ్రహ్మము అది--నిష్కళము--నిరీహము--నిష్ప్రపంచము-నిర్మలము--నిరంజనము--నిర్వికారము నిరాలంబము--నిర్ముక్తము-నిత్యము-బుద్ధము-కేవలము--అఖండము--అప్రమేయము అద్వితీయము-ఆద్యంతవిహీనము-- పరాత్పరము--అపరోక్షము-స్వయంజ్యోతి--సర్వ వ్యాపకము-నిరతిశయానందము

ఓమ్

బ్రహ్మాండపంచీకరణచక్రమునందు స్థూలశరీరనిర్ణయము

బ్రహ్మణఅవ్యక్తః-అవ్యక్తాన్మహత్ - మహతోహంకారః- అహంకారాత్పంచతన్మాత్రాణి- పంచతన్మాత్రేభ్యఃపంచమహాభూతాని- పంచమహాభూతేభ్యోఖిలంజగత్-

తా॥ అద్వితీయపరబ్రహ్మమువలన అవ్యక్తమును-దానివలన-మహాతత్త్వమును- అందునమహదహంకారమును- దానివలన-పంచతన్మాత్రలును-వానివలన-పంచభూతములును- వానివలనచతుర్దశభువనములునుబుట్టెను————అది తేటగాఁదెలియుటకై క్రింద బ్రహ్మాండపంచీకరణచక్రముఁ వ్రాయఁబడుచున్నది-స్థూలజగత్సృష్టికిమును పు పంచభూతములు ప్రకృత్యవచ్ఛిన్నములై యున్నవి.

| ముందుపుట్టిన పంచభూతములు. | ఆకాశము. | వాయువు. | అగ్ని. | జలము. | పృథివి. | ఈగిన్న పంచమహాభూతములు. |
|---|---|---|---|---|---|---|
| ఈపంచమహాభూతములవలన సృష్టియైనదేహస్థితి. | ఆకాశములోసగము భాగము రాగమైనది. | కొదవసగములో నాలుగు ఖండములై ఆకాశతత్వములోపరకయును పృథివితత్వములోఁ గూడిద్వేషముఅయినది. | ఆకాశతత్వములో పరకయును జలతత్వములోఁ గూడిభయము,అయినది | ఆకాశతత్వములో పరకయును అగ్నితత్వములోఁ గూడిలజ్జ అయినది. | ఆకాశతత్వములో పరకయును వాయుతత్వము లోఁగూడి మోహముఅయినది. | |
| వాయుతత్వమువల్లఁబుట్టినవి. | వాయుతత్వములో సగముభాగముచలనమైనది. | తతిమ్మాసగభాగము నాలుగుఖండములై వాయుతత్వములోపరకయుపృథివితత్వములోఁగూడి గమనము అయినది. | వాయుతత్వములో పరకయు జలతత్వములోఁ గూడితీవ్రముఅయినది. | వాయుతత్వములో పరకయుఅగ్నితత్వములోఁ గూడినీల్గుటఅయినది | వాయుతత్వములో పరకయు ఆకాశతత్వములోఁగూడి కంపము పుట్టినది. | |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| తేజస్తత్వమువల్లఁబుట్టినవి. | తేజస్తత్వములో సగభాగమువల్ల క్షుధపుట్టినది. | రెండవసగములోనాల్గుఖండములై అగ్నితత్వములో ఒకభాగముపృథివితత్వములో కూడి తృష్ణ అయినది. | అగ్నితత్వములో ఒకభాగముజలతత్వములోఁగూడినిద్ర అయినది. | అగ్నితత్వములో ఒకభాగమును వాయుతత్వములోఁగూడిఆలస్యముఅయినది | అగ్నితత్వములో ఒకభాగము ఆకాశతత్వములోఁగూడిసంగమముఅయినది. | |
| జలతత్వమువల్లఁబుట్టినవి | ఆపోతత్వములోసగముభాగము శ్లేష్మము అయినది | తక్కినసగము నాలుగుఖండములు అయిజలము ఒకభాగముపృథివితత్వములోఁగూడి మూత్రము అయినది | జలముఒకభాగము అగ్నితత్వములోఁగూడి చెమట అయినది. | జలముఒకభాగమువాయుతత్వములోఁగూడి శుక్లముఅయినది. | జలముపరకయుఆకాశతత్వములోఁగూడి రక్తము అయినది. | |
| పృథివీతత్వమువల్లఁబుట్టినవి. | పృథివీతత్వములోసగముభాగము వలనశల్యములుఅయినవి. | తతిమ్మాసగములోనాలుగుఖండములుఅయి పృథివియొకభాగము ఆపోతత్వలోఁగూడి మాంసము అయినది. | పృథివిఒకభాగముఅగ్నితత్వములోఁగూడి చర్మముఅయినది. | పృథివిఒకభాగమువాయుతత్వములోఁగూడి నరములు అయినవి | పృథివిఒకభాగము ఆకాశతత్వములోఁగూడిరోమములుఅయినవి | |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| పృథివితత్వము వల్లఁ బుట్టినవి | వాక్కు | పాణి | పాదము | గుహ్యము | పాయువు | కర్మేంద్రియములు |
| జలతత్వము వల్లఁ బుట్టినవి | శబ్దము | స్పర్శము | రూపము | రసము | గంధము | పంచతన్మాత్రలు |
| తేజస్తత్వము వల్లఁ బుట్టినవి | శ్రోత్రము | త్వక్కు | చక్షువు | జిహ్వ | ఘ్రాణము | జ్ఞానేంద్రియములు |
| వాయుతత్వము వల్లఁ బుట్టినవి | సమాన | వ్యాన | ఉదాన | ప్రాణ | అపాన | పంచప్రాణములు |
| ఆకాశతత్వము వల్లఁ బుట్టినవి | మనస్సు | బుద్ధి | చిత్తము | హంకారము | జ్ఞాతృత్వము | అంతఃకరణములు |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| తేజస్తత్వము | ఆకాశతత్వములో సగముభాగముజ్ఞాతృత్వము అయినది. | తక్కినసగము నాలుగుఖండములు అయిఆకాశతత్వమొక భాగము అగ్నితత్వములోఁ గూడిబుద్ధి అయినది | ఆకాశతత్వములో రెండవభాగము వాయుతత్వములోఁ గూడిమనస్సుఅయినది | ఆకాశతత్వములో మూడవభాగము జలతత్వలోఁగూడి చిత్తము అయినది | ఆకాశతత్వములో నాలుగవభాగము పృధివీతత్వములోఁ గూడిహాంకారము అయినది | పంచమహాభూతములవలన బంచీకరణముఅయినవివరము |
| వాయుతత్వము | వాయుతత్వములో సగము భాగము వ్యానవాయువు అయినది | తక్కినసగములో ౪ ఖండమ్లు అయి వాయుతత్వములో ౧ ఖండము ఆకాశతత్వములో గూడిసమానవాయువు అయినది | వాయుతత్వములో ౨ఖండము అగ్నితత్వములో గూడిఉదానవాయువు అయినది | వాయుతత్వములో ౩ఖండము జలతత్వములో గూడిప్రాణవాయువు అయినది | వాయుతత్వములో ౪ఖండము పృధివీతత్వములోఁ గూడిఅపానవాయువుఅయినది | |
| అగ్నితత్వము | అగ్నితత్వములోసగము చక్షురింద్రియము అయినది | తక్కిన సగము ౨ ఖండములు అయి ఒకొక్క ఖండము ఆకాశతత్వము లోఁగూడి శ్రోత్రేంద్రియము అయినది | అగ్నితత్వములో ౨ ఖండము వాయుతత్వములో గూడిత్వగింద్రియము అయినది | అగ్నితత్వములో ౩ఖండము జలతత్వము లోగూడి జిహ్వేంద్రియము అయినది | అగ్నితత్వములో ౪ఖండము పృధివీతత్వము లోఁగూడి ఘ్రాణేంద్రియము అయినది | |

| | | | | | |
|---|---|---|---|---|---|
| జలతత్వము | జలతత్వములోసగము భాగము రసముఅయినది | తక్కినసగము ౪ ఖండములుఅయి అందులనొక ఖండము ఆకాశతత్వములోఁగూడిశబ్దము అయినది | జలతత్వములో ౨ ఖండము ఆకాశతత్వములో గూడిస్పర్శ అయినది. | జలతత్వములో 3 ఖండముఅగ్నితత్వములోఁగూడి రూపముఅయినది. | జలతత్వములో ౪ ఖండము పృథ్వీతత్వములోఁగూడి గంధము అయినది. |
| పృథివీ తత్వము | పృథివీతత్వములో సగము పాయ్వింద్రియము అయినది | తక్కినసగము ౪ ఖండములుఅయి అందులనొకఖండముఆకాశతత్వములోఁగూడి వాగింద్రియముఅయినది | పృథివీతత్వములో 2 ఖండము వాయుతత్వములోఁగూడిపాణీంద్రియము అయినది | పృథివీతత్వము 3 ఖండముఅగ్నితత్వములోఁగూడిపాదేంద్రియముఅయినది | పృథివీతత్వములో ౪ ఖండము జలతత్వములోఁగూడి ఉపస్థేంద్రియము అయినది |

పంచమహాభూతముల యొక్క నామరూపగుణ స్వభావములు వివరము

| పృథివీతత్వానకు | | జలతత్వానకు | | అగ్నితత్వానకు | | వాయుతత్వము | | ఆకాశతత్వము | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| నామము ఆకారము వర్ణము గుణము స్వభావము ముఖము అక్షరము | పృథివి చతురము పీతము శబ్దస్పర్శ రూపరస గంధములు కఠినము సద్యోజాతము అకారము. | నామము ఆకారము వర్ణము గుణము స్వభావము ముఖము అక్షరము | జలము అర్ధచంద్రము శ్వేతము శబ్దస్పర్శరూపరసము లలితము వామదేవము ఉకారము | నామము ఆకారము వర్ణము గుణము స్వభావము ముఖము అక్షరము | తేజస్సు త్రికోణము రక్తము శబ్దస్పర్శ రూపము ఉష్ణము అఘోరము మకారము | నామము ఆకారము వర్ణము గుణము స్వభావము ముఖము అక్షరము | వాయువు షట్కోణము రక్తధూమ్రము వర్ణము శబ్దస్పర్శము సంచరించుట తత్పురుషము బిందువు | నామము ఆకారము వర్ణము గుణము స్వభావము ముఖము అక్షరము | ఆకాశము వర్తులము నీలము శబ్దము బయలుగానుండుట ఈశాన్యము ఓం |

హాకారము శివుఁడనుపేరెట్లనఁగా శ్లో॥ నాళగుహ్యాంపరంజీవం దేహభూతంచ పంచమం స్వాంతతస్వాంతభూతాంతా హాకారం శూన్యమవ్యయం॥

| | | | | | |
|---|---|---|---|---|---|
| తొంబదిఆఱుతత్వములవివరము | ౫ కర్మేంద్రియములు వాక్కు పాణి పాదము పాయువు ఉపస్థ | ౫ ప్రాణవాయువులు ప్రాణ అపాన వ్యాన ఉదాన సమానములు | 3 శరీరత్రయము స్థూలసూక్ష్మ కారణదేహములు 3 అవస్థాత్రయము జాగ్రదవస్థ స్వప్నావస్థ సుషుప్త్యవస్థ | ౬ అరిషడ్వర్గము కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములు | ౧౪ దిగ్వాతాద్యులు శ్రోత్రానకుదిక్కు. త్వక్కునకువాయువు చక్షుస్సునకు సూర్యుఁడు జిహ్వకు వరుణుఁడు ఘ్రాణమునకు అశ్వినీదేవతలు వాక్కునకు అగ్ని పాణికి నింద్రుఁడు |
| | ౫ జ్ఞానేంద్రియములు త్వక్కు చక్షువు శ్రోత్రము జిహ్వ ఘ్రాణము | ౪ మానసాదిఅంతఃకరణములు మనస్సు బుద్ధి చిత్తము హంకారము | ౧ అజ్ఞానము ౬ షడ్భావవికారములు ౧ ఆస్తే ౨ జాయతే 3 పరిణమతే ౪ వర్ధయతే ౫ అపక్షీయతే ౬ వినశ్యతి | ౫ జీవపంచకము విశ్వుఁడు, తైజసుఁడు ప్రాజ్ఞుఁడు ప్రత్యక్కు నిరంజనుఁడు | పాదానకు ఉపేంద్రుఁడు పాయువునకుమృత్యువు ఉపస్థకు బ్రహ్మ మనస్సునకుచంద్రుఁడు బుద్ధికి బృహస్పతి చిత్తానకు విష్ణువుహంకారమునకు రుద్రుఁడు |

| | | | | | |
|---|---|---|---|---|---|
| | ౫ శబ్దాది<br>విషయము<br>లు-శబ్ద<br>స్పర్శ<br>రూప<br>రస<br>గంధములు | ౫పంచభూ<br>తములు<br>పృథివి<br>జలము<br>అగ్ని<br>వాయువు<br>ఆకాశము | ౫ పంచకోశ<br>ములు<br>అన్నమయ<br>ప్రాణమయ<br>మనోమయ<br>విజ్ఞానమయ<br>ఆనందమయ<br>ములు | ౫ ఉపవా<br>యువులు<br>నాగుఁడు<br>కూర్ముఁడు<br>కృకరుఁడు<br>దేవదత్తుఁడు<br>ధనంజ<br>యుఁడు | 3 గుణత్రయము<br>సత్వగుణము<br>రజోగుణము<br>తమోగుణము<br>3 కర్మత్రయము<br>ఆగామి<br>సంచితము<br>ప్రారబ్ధము |
| | ౫ పంచక<br>ర్మేంద్రియ<br>విషయ<br>ములు<br>వచన<br>దాన<br>గమన<br>విసర్గ<br>ఆనంద<br>ములు | ౪ మాన<br>సాదివిషయ<br>ములు<br>సంకల్పము<br>అవసాయ<br>అభిమాన<br>ము అవధా<br>రణ అనగా<br>నిశ్చయ<br>ములు | ౪మైత్ర్యాదివా<br>సనలు<br>మైత్రి<br>కరుణ<br>ముదిత<br>ఉపేక్ష | | |

| | ఆదిశక్తివల్లఁబుట్టినతత్వములు. | క్రియాశక్తివల్ల పుట్టినతత్వములు | ఇచ్ఛాశక్తివల్లఁబుట్టిన తత్వములు. | జ్ఞానశక్తివల్లఁబుట్టినతత్వములు. | పరాశక్తివలనఁబుట్టినతత్వములు. |
|---|---|---|---|---|---|
| సంకేతములవల్ల సంబంధించినట్టి తత్త్వములు ఏదను. | పృథివి<br>జలము<br>అగ్ని<br>వాయువు<br>ఆకాశము | వాక్కు<br>పాణి<br>పాదము<br>పాయువు<br>ఉపస్థ | మనస్సు<br>బుద్ధి<br>చిత్తము<br>హంకారము<br>జ్ఞాతృత్వము | త్వక్కు<br>చక్షువు<br>శ్రోత్రము<br>జిహ్వ<br>ఘ్రాణము | ప్రాణ<br>అపాన<br>వ్యాన<br>ఉదాన<br>సమానవాయువులు |
| | | | | ౫ అగ్నిపంచకము<br>జ్ఞానాగ్ని<br>క్షుధాగ్ని<br>శీతాగ్ని<br>కోపాగ్ని<br>కాలాగ్ని | ఆత్మయందునుండునది<br>నాభియందునుండునది<br>హృదయమందునుండునది<br>నేత్రములయందుండునది<br>పాదములయందుండునది |

| | | | | |
|---|---|---|---|---|
| చతుర్దశభువనములు దేహమందునిరూపింపఁబడ్డవైనము | అతలము వితలము సుతలము తలాతలము రసాతలము మహాతలము పాతాళము | అరికాళ్లయందు మీఁగాళ్లయందు పిక్కలయందు మోకాళ్లయందు తొడలయందు గుదమునందుగుహ్యమందు | భూలోకము భువర్లోకము సువర్లోకము మహర్లోకము జనర్లోకము తపోలోకము సత్యలోకము | నాభియందు కుక్షియందు హృదయమందు గళమునందు భ్రూమధ్యమందు లలాటమందు మూర్ధమందు |
| | యీ౭న్ను అధోలోకములకు పేర్లు | | యీ౭న్ను ఊర్ధ్వలోకములు | |

| సనాతనపంచబ్రహ్మలు | రూపముఁగలపంచబ్రహ్మలు | పంచాక్షరములు | పంచవాచకములు | పంచశూన్యములు | పంచావస్థలు |
|---|---|---|---|---|---|
| తారకబ్రహ్మ దండకబ్రహ్మ కుండలిబ్రహ్మ అర్థచంద్రకబ్రహ్మ బిందుబ్రహ్మ | బ్రహ్మ విష్ణు రుద్రుఁడు ఈశ్వరుఁడు సదాశివుఁడు | అకారము ఉకారము మకారము ఇకారము ఎకారము | వైఖరి మధ్యమపశ్యంతి పర పరాపర | క్రిందశూన్యము మీఁదశూన్యము మధ్యశూన్యము సర్వశూన్యము ఆత్మశూన్యము | జాగ్రదవస్థ స్వప్నావస్థ సుషుప్త్యవస్థ ఉన్మని అవస్థ సహజావస్థ |

| పంచదేహములు | పంచమాతృకలు | పంచవేదములు | పంచక్రియలు | పంచభూతములు | పంచముఖములు |
|---|---|---|---|---|---|
| స్థూలదేహము సూక్ష్మదేహము కారణదేహము మహాకారణదేహము జ్ఞానదేహము | హ్రస్వము దీర్ఘము ప్లుతము అర్థము అనుచర్యము | ఋగ్వేదము యజుర్వేదము సామవేదముఅధర్వణవేదము సూక్ష్మవేదము | సృజన పాలన పతనసూర్యక్రియ చంద్రక్రియ | పృధివి జలము అగ్ని వాయువు ఆకాశము | సద్యోజాతము వామదేవము తత్పురుషము అఘోరము ఈశానము |

| ఈశ్వరదేహపంచకము | ఆకాశపంచకము | పంచముద్రలు | పంచసూత్రములు | పంచగోప్యముద్రలు | ఆకాశపంచకము |
|---|---|---|---|---|---|
| హస్తము పైసగము స్థూలదేహము అంగుష్ఠప్రమాణము-లింగదేహము అంగుష్ఠము లోసగము-కారణదేహము అంగుష్ఠాగ్రమాత్రము సూక్ష్మదేహము ఇంత,అంత,అని ప్రమాణము లేనిది మహాకారణదేహము | రక్తాకాశము పీతాకాశము శుక్లాకాశము శ్యామలాకాశము నీలాకాశము | ఖేచరి భూచరి సాచరి గోచరి ఉన్మని | ఉన్మని ఉన్మీలని జ్యోతి జపాల కళాతీతము | షణ్ముఖిఉన్మీలని శాంభవి ఆత్మభాషిణి పూర్ణఘోధని | ఘటాకాశము మఠాకాశము మహాకాశము చిదాకాశము నిరాకాశము |

| పంచపాదములు | పంచస్థానములు | జగత్త్రయస్థానపంచకము | స్థానాభిమానదేవతలు | పంచమార్గములు- | పంచనాదములు |
|---|---|---|---|---|---|
| గాయత్రి ద్విజత్వము విప్రత్వ ఓంకారము బ్రహ్మజ్ఞానము | నేత్రస్థానము కంఠస్థానము హృదయస్థానము మూర్ధస్థానము శిఖాస్థానము | సత్యలోకము వైకుంఠము కైలాసము నిరాశ్రయము సాక్షి | విశ్వుడు తైజసుడు ప్రాజ్ఞుడు ప్రత్యగాత్ముడు నిరంజనుడు | పిపీలికామార్గము విహంగమార్గము కపిమార్గము మీనమార్గము శేషమార్గము | తంత్రీనాదము వీణానాదము మృదంగనాదము సుస్వరము అనాహతమందు-సునాదము ఓంకారము |

| | | పూర్వదిక్కు పంచకము | ఉత్తరదిక్కు పంచకము | పంచ శక్తులు | పంచవిచారములు |
|---|---|---|---|---|---|
| ఓంకారమువలఁ బుట్టిన దేవమంత్రము బ్రహ్మాండదేవపంచకము. | ౧ గణపతి ౨ సూర్యుఁడు ౩ విష్ణువు ౪ ఈశ్వరుఁడు అవగా సాంబమూర్తి ౫ ఆదిశక్తి | ౧ పూర్వదిక్కు ఇంద్రుఁడు ౨ పశ్చిమదిక్కు వరుణుఁడు ౩ దక్షిణదిక్కు యముఁడు ౪ ఉత్తరము కుబేరుఁడు ౫ ఊర్ధ్వదిక్కు పద్మజుఁడు | ౧ నైఋతికోణానకు నైఋతి ౨ ఈశాన్యకోణానకు ఈశానుఁడు ౩ ఆగ్నేయకోణానకు అగ్ని ౪ వాయుకోణానకు వాయువు ౫ మధ్యకోణానకు విష్ణువు | ౧ ఆదిశక్తి ౨ ఇచ్ఛాశక్తి ౩ క్రియాశక్తి ౪ జ్ఞానశక్తి ౫ పరాశక్తి | ౧ క్షరుఁడు ౨ అక్షరుఁడు ౩ కూటస్థుఁడు ౪ నిర్ణయాత్మకుఁడు ౫ క్షేత్రజ్ఞుఁడు |

| పంచాగ్నులు | పంచసగుణనిరూపణము | హంసపంచకము | మనోలయ పంచకము | జీవన్ముక్తివిధి పంచకము |
|---|---|---|---|---|
| ౧ బడబాగ్ని ౨ మధ్యాగ్ని ౩ ఉదరాగ్ని ౪ శోకాగ్ని ౫ అధమాగ్ని అనఁగా నింద్రకామాగ్ని | ౧ అవయవములుగలిగిన విగ్రహధ్యానము ౨ జ్యోతిఃప్రకాశధ్యానము ఆకాశమందు ౩ దీపమువలె సుషుమ్న ధ్యానము ౪ నివరిముల్లు అగ్రములాగున ౫ అణువుపోలికను | ౧ అస్తి ౨ ఖాతి ౩ క్రియ ౪ రూపము ౫ సామము | ౧ సుషుప్తి ౨ మూర్ఛ ౩ మరణము ౪ తూష్ణీంభూతావస్థ ౫ సమాధి | ౧ జ్ఞానము ౨ తపస్సు ౩ సర్వసంపాద్యము ౪ దుఃఖసంక్షయము ౫ సుఖావిర్భావము |

| సమాధిపంచకము | పంచావస్థలు | పంచప్రమాణములు | పంచమూర్తులు |
|---|---|---|---|
| ౧ బాహ్యదృశ్యానువిద్ధసమాధి ౨ ఆరూఢిబాహ్యశబ్దానువిద్ధసమాధి ౩ అంతర్దృశ్యానువిద్ధసమాధి ౪ అంతరశబ్దానువిద్ధసమాధి ౫ నిర్వికల్పసమాధి | ౧ జాగ్రత్త<br>౨ స్వప్నము<br>౩ సుషుప్తి<br>౪ తురీయము<br>౫ తురీయాతీతము | ౧ ప్రమాణాతీతప్రమాణము ౨ మినురాత్రిప్రమాణము ౩ ప్రవధ్యమాసప్రమాణము ౪ అంగుష్ఠప్రమాణము ౫ హస్తప్రమాణము | ౧ సదాశివుఁడు<br>౨ ఈశ్వరుఁడు<br>౩ రుద్రుఁడు<br>౪ విష్ణువు<br>౫ బ్రహ్మ |

| పంచవర్ణములు | పంచదేహాభిమానులు | పంచపాదములు | పంచవాద్యములు | పంచస్థానులు |
|---|---|---|---|---|
| ౧ శుద్ధశుద్ధశ్వేతపీత-సునీలవర్ణము ౨ శుద్ధ-నీలసునీలవర్ణము ౩ శ్యామలవర్ణము ౪ శ్వేతవర్ణము కుబేరవర్ణము ౫ రక్తవర్ణము-పీతవర్ణము. | ౧ విశ్వాభిమానుఁడు ౨ తైజసాభిమానుఁడు ౩ ప్రాజ్ఞాభిమానుఁడు ౪ ప్రత్యగభిమానుఁడు ౫ నిరంజనాభిమానుఁడు | ౧ గాయత్రిపదము ౨ సావిత్రిపదము ౩ సరస్వతిపదము ౪ ఓంకారపదము ౫ పరమార్థపదము | ౧ వితంతువీణావాద్యము ౨ మృదంగచర్మవాద్యము ౩ ఘన-కాసాదివాద్యము ౪ సుస్వరాదివాద్యము ౫ అనాహతవాద్యము | ౧ భ్రమాకంపస్థానము ౨ అరుటపటస్థానము ౩ కోట్లాటస్థానము ౪ శ్రీహాటస్థానము ౫ త్రికూటస్థానము |

| పంచగుణములు | పంచానందములు | పంచదీక్షలు | జీవన్ముక్తినిఅనుగ్రహింపఁబడెడిజనులు |
|---|---|---|---|
| ౧ సత్త్వగుణము<br>౨ రజోగుణము<br>౩ తమోగుణము<br>౪ నిర్గుణము<br>౫ శుద్ధసత్వము | ౧ బ్రహ్మానందము<br>౨ విదేహానందము<br>౩ అర్థానందము<br>౪ యోగానందము<br>౫ విషయానందము | ౧ అనామయోగము<br>౨ శివోహం<br>౩ కోహం<br>౪ సోహం<br>౫ అహం | ౧ శిష్యులు<br>౨ భక్తులు<br>౩ ఉదాసీనులు<br>౪ పాతకులు |

ఆత్మతీర్థలక్షణము

భూ్రిమధ్యము కాశి-హృదయము ప్రయాగ-శిరస్సుయొక్క-అగ్రము-శ్రీశైలము నేత్రములు కురుక్షేత్రము-ఫాలము కేదారము-ఇళనాడిగంగ-పింగళనాడియ మున-సుషుమ్న సరస్వతి-వీనినిఁగానకతిరుగుచుందురు-ఇంతకన్నఁదీర్థములు వేఱేలేవనినమ్మిగురుధ్యానము చేయవలెను.

(ప్రణవలక్షణము)-ఉరలు గుతత్వములును 3 గుణములునుగూడి విశ్వమూలమై త్రిమూర్తులు కలిసినముద్ద అయి, అకార, ఉకార, మకార, త్రివర్ణసంకలితమై, త్రివిధలింగాభిదాన రహితమైనిత్యమై ప్రకాశమానమై యుండును.

(1) పంచభూతములను లయముఁజేసి ముక్తిఁబొందెడి లక్షణము.

వ॥ భూమి, గంధమందు, గంధము జలమందు, జలము రసమందు, రస మగ్నియందు, అగ్ని రూపమందు, రూపము వాయువునందు, వాయువు శబ్దమందు, శబ్ద మాకాశమందు, ఆకాశము చిత్తమందు, నిలిచి యాచిత్తము, అహమందుఁజేరి యా హంకృతి బుద్ధియందు, బుద్ధి యవస్థయందు, అది త్రిగుణాత్మకమైన ప్రాణధనమున నైక్యమొనరించి యవిదాటి యావలవెలుఁగుతోఁగూర్చి ముక్తుఁడై సంతోషించువాఁడు యోగియని గ్రహించునది.

(2) గురుపథనిరూపణము.

వ॥ సూర్యమండలము, చంద్రమండలము, అగ్నిమండలము, యీమండలత్రయముయొక్క కాంతులుచూచి యామధ్య హృదయస్థానముండును. అక్కడ శృంగాటకమనెడి త్రోవకలిగియుండి యది కుండలియొక్క వైభవమును బొంది యీనాలుగుత్రోవల నడుమను, పైనను, దాను బ్రకాశించుచుండును. ఆప్రకాశములోఁజొరఁగా నాపోజ్యోతిమైయుండును. ఆత్మబోధ యనెడి మంటపముయొక్క యంతర్గతమై యానందమనెడి వేదికయుండును. అదియే కైవల్యమార్గము. అట్టిచోట గురువునుజూచినవాఁడె ఘనుఁడును, నిజముంగాంచినవాఁడును నగును॥ 22

(3) యోగరథప్రకరణము.

వ॥ ఆచారము బండికన్నులు, యజ్ఞము బండిచక్రములు, ప్రాణాలు కాఁడి, త్యాగము ధ్వజము, జీవము రథము, చిత్తము గుఱ్ఱములు, పరమయినగురువు రథికుఁడు, పూర్వకర్మము సారథి, భూతాహంకారములు బుద్ధులు, ఇంద్రియములు సేవకులై యింకం గావలసినవానింగూడి గురుకృపకుం బాత్రుఁడైనయోగి యజ్ఞానారణ్యచ్ఛేదియై క్రూరమృగేంద్రియసంహర్తయగు॥ 23

(4) యజ్ఞనిరూపణ.

ఋత్విక్కులు, బుద్ధి, చిత్తహంకారములు యూపస్తంభము, ఇంద్రియములు, ప్రాణములు.
బోధాగ్ని, అనాహతచక్రము, సోమదానము, జ్ఞానకృతము.
త్రివేణి, అవభృథస్నానము.

(5) పంచభూతస్థాననిరూపణ.

1. అంగుష్ఠాగ్రమందు బ్రహ్మను అకారయుక్తముగ ధ్యానించుట పృథివీజయము.
2. నాభిని, ఉకారయుక్తముగ విష్ణును ధ్యానించుట, ఉదకజయము.
3. గళమున మకారయుక్తముగ రుద్రుని ధ్యానించుట, అగ్నిజయము.
4. భ్రూయుగ్మమందు ఇకారయుక్తముగ నీశ్వరుని ధ్యానించుట వాయుజయము
5. లలాటమందు, ఎకారయుక్తముగ సదాశివుని ధ్యానించుట ఆకాశజయము

వ॥ ఇట్లాకాశార్థభాగమందు వాయుతేజోజలభూభాగంబుల, వాయువుయొక్కయర్థభాగమందు, ఆకాశము, అగ్ని, జలము, భూమి, వీనియొక్కభాగములను, నాల్గుతునకలుగాఁ జేయఁబడిన యనలార్థభాగమునందు, గగనము, వాయువు, జలము, భూమి, వీనియొక్కతునకలను, నాల్గుగాభాగింపఁబడిన జలముయొక్క సగముభాగమందు ఆకాశము, వాయువు, అగ్ని, భూమి, వీనియొక్కసగభాగములను నాలుగుగాభాగింపఁబడిన భూమియొక్కసగముభాగమునందు, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, వీనియొక్కభాగమువలన జీవాద్సృష్టసహాయంబునంగూర్చిన క్రమంబుచేత, శబ్దగుణకంబయిన యాకాశంబు శబ్దస్పర్శ గుణకంబయిన పవమానంబు శబ్దస్పర్శ రూపగుణకంబయిన దహనంబు, శబ్దస్పర్శరూపరస గుణకంబయిన జలంబు, శబ్దస్పర్శరస గంధ సమేతంబయిన ధరణియు, నైదు విధములుగా భాగింపఁబడినవై మిగుల విజృంభించి, ప్రబలమాయను, ఈపంచభూతములవలన, అతల, వితల, సుతల, రసాతల, తలాతల, మహాతల, పాతాళ, భూలోక, భువర్లోక, స్వర్లోక, మహర్లోక, జనుర్లోక, తపోలోక, సత్యలోకంబులను, పదునాల్గుభువనంబు లాయాలోకోచితములయిన జరాయుజము, అనఁగా మాఁవివలనంబుట్టిన మనుష్యులు, అండజములనఁగా గ్రుడ్డువలనంబుట్టిన సర్పములు మొదలగునవి, స్వేదజములనఁగా జెమ్మటవలనంబుట్టిన పురువులు, ఉద్భిజ్జములనఁగా భూమినిబ్రద్దలుచేసికొని పుట్టినవృతూదులు. నాల్గువిధము

(4) యజ్ఞనిరూపణ.

ఋత్విక్కులు, బుద్ధి, చిత్తహంకారములు యూపస్తంభము, ఇంద్రియములు, ప్రాణములు.

బోధాగ్ని, అనాహతచక్రము, సోమదానము, జ్ఞానకృతము.

త్రివేణి, అవభృథస్నానము.

(5) పంచభూతస్థాననిరూపణ.

1. అంగుష్ఠాగ్రమందు బ్రహ్మను అకారయుక్తముగ ధ్యానించుట పృథివీజయము.
2. నాభిని, ఉకారయుక్తముగ విష్ణును ధ్యానించుట, ఉదకజయము.
3. గళమున మకారయుక్తముగ రుద్రుని ధ్యానించుట, అగ్నిజయము.
4. భ్రూయుగ్మమందు ఇకారయుక్తముగ ఈశ్వరుని ధ్యానించుట వాయుజయము
5. లలాటమందు, ఎకారయుక్తముగ సదాశివుని ధ్యానించుట ఆకాశజయము

వ॥ ఇట్లాకాశార్థభాగమందు వాయుతేజోజలభూభాగంబుల, వాయువుయొక్క యర్థభాగమందు, ఆకాశము, అగ్ని, జలము, భూమి, వీనియొక్క భాగములను, నాల్గుతునకలుగాఁ జేయఁబడిన యనలార్థభాగమునందు, గగనము, వాయువు, జలము, భూమి, వీనియొక్కతునకలను, నాల్గుగాభాగింపఁబడిన జలము యొక్క సగముభాగమందు ఆకాశము, వాయువు, అగ్ని, భూమి, వీనియొక్క సగభాగములను నాలుగుగాభాగింపఁబడిన భూమియొక్కసగముభాగమునందు, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, వీనియొక్కభాగమువలన జీవాద్యుత్పత్తి సహాయంబునంగూర్చిన క్రమంబుచేత, శబ్దగుణకంబయిన యాకాశంబు శబ్దస్పర్శ గుణకంబయిన పవమానంబు శబ్దస్పర్శ రూపగుణకంబయిన దహనంబు, శబ్దస్పర్శరూపరస గుణకంబయిన జలంబు, శబ్దస్పర్శరస గంధ సమేతంబయిన ధరణియు, నైదు విధములుగా భాగింపఁబడినవై మిగుల విజృంభించి, ప్రబలమాయను, ఈపంచభూతములవలన, అతల, వితల, సుతల, రసాతల, తలాతల, మహాతల, పాతాళ, భూలోక, భువర్లోక, స్వర్లోక, మహర్లోక, జనుర్లోక, తపోలోక, సత్యలోకంబులను, పదునాల్గుభువనంబు లాయాలోకోచితములయిన జరాయుజము, అనఁగా మావివలనంబుట్టిన మనుష్యులు, అండజములనఁగా గ్రుడ్డువలనంబుట్టిన సర్పములు మొదలగునవి, స్వేదజములనఁగాఁ జెమ్మటవలనంబుట్టిన పురుగులు, ఉద్భిజ్జములనఁగా భూమినిబ్రద్దలుచేసికొని పుట్టినవృక్షాదులు. నాల్గువిధము

తె॥ మఱితపోలోకమరయ భ్రూ, మధ్యమగును
సత్యలోకంబు విపులమ, స్తకముసుమ్మి
విశ్వరూపధరుండనై, వెలయునాకు
జలనిధిగభీరమధ్య భక్త, జలజనేత్ర॥ 27

వ॥ ఇట్లు సకలలోకంబుల కాశ్రయమయినదియు సంతతనిండినదియు నామరూప శమదమాద్యనంత కళ్యాణగుణంబులును వర్ణాశ్రమోచితధర్మంబులును, గర్భాధానాదిషోడశకర్మములు లేని సంపూర్ణమయిన సత్యజ్ఞానానందస్వరూప మయిన పరబ్రహ్మంబునైన నేను సమష్టికారణ స్థూలసూక్ష్మశరీరోపాధి విశిష్టత్వంబువలన, నవ్యాకృతుండన, హిరణ్యగర్భుండన, విరాట్పురుషుండన, సకలజీవోపాస్యుండనై ప్రకాశించుచుండుదు; మఱియు వ్యష్టికారణ స్థూల సూక్ష్మదేహోపాధితాదాత్మ్యాభిమానంబువలనఁ బ్రాజ్ఞుండనఁ, దైజసుం డన, జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థల ననుభవించుచు జ్ఞానవశుండనయి జీవుఁడన నీశ్వరోపాసకుండనయి, ప్రవర్తించినచందంబునఁ దోఁచెద. ఈజీవేశ్వరత త్త్వంబుల విద్యాకల్పితంబుల యవిద్యాశశవిషాణవంధ్యాపుత్రగగనారవిందం బులభంగి నాయందు నన్నెఱింగిన నభావంబగునట్లుగావున నింక జీవేశ్వరై క్యం బుపదేశించెద. సావధానచిత్తుండవై యాకర్ణింపుమనిశివుండు రాజోత్త మునితో నిట్లనియె. ఘటములయందుఁగల జలమును ద్యజింపఁగ నాకలశమే ఘములయందుఁ బ్రతిఫలించిన యాకాశప్రతిబింబములు లేనందున, నాకాశ మాకారము లేనిదియును భాగింపరానిదియును, బరిపూర్ణమై యేకమైయుం డును. ఆతీరున శరీరముల మాయావిద్యలఁ బరిత్యజింపఁగా జీవేశ్వరులు ప్రకాశింపక పోవుటవలనఁ, దనకంటె నితరము లేని బ్రహ్మచైతన్య ము ప్రకాశించును. అది యెట్లంటేని కుంభగత జలమునకును, దజ్జలమందుఁగన్పట్టు నాకాశ ప్రతిబింబమునకును, వేఱైనదియు నితర వస్తువులతో సంబంధము లేనిదియు, నాకారము లేనిదియునై, కుంభగతాకాశ ము ప్రకాశించును. ఆలోచింపఁగా నాత్మానాత్మవివేకముఁగల పండితులకు నాఘటాకాశమే యఖండాకాశమగును. వరుసగా స్థూలసూక్ష్మకారణ దేహ ములకును, సుకరజాగరణ స్వప్న సుషుప్తులకును బ్రభువులగువిశ్వతైజసప్రాజ్ఞుల కు విలక్షణుండగు పరమాత్ముండు వేఱైసాక్షియై ప్రకాశించును. ఆపరమా త్ముఁడు కూటస్థుఁడనఁ బ్రత్యగాత్ముఁడన, నక్షరుండనఁ బురుషుండన సాక్షి యనఁగాఁ బ్రకృతిపురుషులనంటక, సచ్చిదానంద చైతన్యమై తేజరిల్లును. మే ఘమునకు నామేఘమండలి జలమ్మునకు బ్రహ్మప్రతిచ్ఛాయమైన యా

శ్వరునకు విలక్షణమై దేనినంటనిదై, నిరాకారమై, సర్వవ్యాపకమై మహాకాశమఖండమై యలరును. మఱియు నీశ్వరుని యొక్క తన్త్రితయావస్థాత్రితయములకు నఖిలాత్మకమాయావిప్రాణ విరాట్పురుషావళికి సాక్షియై పరబ్రహ్మము ప్రకాశించును. అతఁడు పరమాత్మయును, బరబ్రహ్మమును, జిత్స్వరూపుఁడునునై నిర్వికల్పుండును, నితరవస్తువులతో సంబంధము లేనివాఁడును దనకంటె వ్యతిరిక్తము లేని వాఁడునై ప్రకాశించుచుండును. ఎట్లనఁగాఁగలశమేఘములయందలి జలములలోఁ బ్రకాశించుచున్న ప్రతిఫలితములైన యాకాశములయొక్క జంటనొక్కసారియే త్యజింపఁగా, ఘటాకాశ మహాకాశములకు నేకత్వంబుకల్గినట్లు వ్యష్టిసమష్టిదేహములను, నవిద్యామాయలను దత్త్వమసీత్యాది మహావాక్యవిచారజ్ఞానముచేతఁ జూచి వర్జించినపుడు, జీవనిష్ఠమైన కూటస్థునకును నీశ్వరనిష్ఠమైన పరబ్రహ్మమునకును నైకమత్యముకలుగును. ఇందుకాత్మానాత్మవివేకియైనవాఁడు కుండ, మూకుడు, అనుభేదములవదలి మృత్తికనొక్కటిగానే చూచునట్లు కుండనుంజరువును, నేకకాలమందెవిసర్జించి ఘటతటాకాంతర్గతజలము నొకటిగాభావించినట్లును దీపకరదీపికాతేజంబు నొక్కటిగాఁ దెలిసికొనునట్లును ఘటమఠంబులను విడిచి తద్ఘటమఠములందలి యాకాశము నొకటిగానెంచినట్లును,అవిద్యామాయోపాధులుగల జీవేశ్వరులయొక్క తన్త్రయోపాధులజంటను బ్రసిద్ధజ్ఞాననేత్రముచేఁ దిరస్కరించి యఖండనిత్యనిర్మల పరమాత్మరూపము నొక్కటిగాఁజూడవలెను. 28

సీ॥ కుండమూకుడనెడి, కులభేదములఁద్రోచి, మృత్తికనొకటిగా, నెంచురీతి
కడవంగొలంకును, గడువిసర్జించిత, ద్గతరసమొకటిగాఁగనెడికరణి
దివ్వెయదివటీని, దేకువఁగడకొత్తి, యావెలుఁగొకటిగా, నరయువిధిని
ఘటమఠభేదంబుఁ,గాంచక యందలిమిన్నొక్కటియెయంచు నెన్నుపగిది

తే॥ బాధ్యజీవేశ్వరత్రయో, పాధియుగము
నెంతొవిజ్ఞానదృష్టిచే, నేపుమీఱు
నిర్మలాఖండచైతన్యనియతియొకటి
గావిచారింపవయ్య మే,ధావియనఘ॥ 29

వ॥ ఇట్లుజీవునియొక్క స్థూలసూక్ష్మకారణములతోఁగూడిన జాగ్రత్స్వప్నసుషుప్తులనెడు మూఁడవస్థలును విశ్వుండు, తైజసుండు ప్రాజ్ఞుండునను నామత్రయముతోఁగూడిన,యవిద్యోపాధిగలజీవస్వరూపమును స్వల్పజ్ఞానమునఁగర్తృత్వభోక్తృత్వాది గుణంబులంగూడి త్వంపదమునకు వాక్యార్థము. దేహత్రయ వి

లక్షణమును నవస్థాత్రయద్రష్టయుఁ గోశపంచకాతీతంబును, నన్నృతజడ దుఃఖరహితమైనదియునైన ప్రత్యగాత్మ స్వరూపమే త్వంపదమునకు లక్ష్యార్థము. సమష్టియనఁగా నీశ్వరుని తను త్రయోపాధులును నవస్థాత్రయాత్మకమైన మాయయువైశ్వానర హిరణ్యగర్భావ్యాకృత నామకంబైన మాయాప్రతిబింబేశ్వర చైతన్యంబు సమస్తంబు దెలియుట మొదటికిం బ్రభువగుట, యన్నిటియందు నిండియుండుట యనెడు గుణంబులంగూడి తత్పదవాక్యార్థంబు ఈదేశమందున్నది, యాదేశమందు లేదనుట దేశకృతపరిచ్ఛేదము ఈకాలమందున్నది యాకాలమందు లేదనుట కాలకృతపరిచ్ఛేదము. ఈ వస్తువునందున్నది యావస్తువునందు లేదనుట వస్తుకృతపరిచ్ఛేదము. అనఁగా నివి లేనిదియు, స్వజాతీయ విజాతీయ స్వగతభేదరహితంబు. అనఁగా వృక్షమునకు వృక్షాంతరము స్వజాతీయము, పర్వతశిలాదులు విజాతీయములు. పత్రపుష్పఫలాదులు స్వగతము. ఇదిస్థావరము. పురుషునకుఁ బురుషాంతరము స్వజాతీయము. వృక్షాదులు విజాతీయములు. నఖకేశాదులు స్వగతములు. ఇది జంగమము. ఈభేదములు లేవనుట సచ్చిదానందములే స్వరూపముగాఁగలదైన పరిపూర్ణాద్వితీయ బ్రహ్మచైతన్యమాత్రంబు, తత్పదలక్ష్యార్థంబగు. విరుద్ధధర్మంబులైన జీవేశ్వరరూపములతో స్వభావధర్మములు గల ప్రత్యగ్బ్రహ్మములకుఁ జేరిక సంభవింపదు. కావున నొక్కదేశంబున నొక్కసమయంబున నొక్కరూపంబుననున్న పురుషుని మఱియొక రాజ్యంబున మఱియొకకాలంబున వేఱురూపంబుచే నుండఁగనుంగొని యారాజ్యము, నా సమయము, నాదశాభేదమును, ఈరాజ్యము, నీకాలము, నీదశాతిశయమును లెక్కపెట్టి యాయాదేశకాలరూపవేషములను జూడక కనఁబడిన యతండితఁడని యొక్కనిఁగా నెఱింగిన తెఱంగున జహదజహల్లక్షణచేత ననఁగా "సోయందేవదత్త"యను విడిచి విడువనిలక్షణచేత మాయాస్వరూపములైనట్టిరెండైన జీవేశ్వరులను నిషేధించి రెండువిధములైన త్వంపదములకు లక్ష్యార్థములైన చైతన్యంబులకుఁ బొందిక నెఱుంగుము, ఇదియే యసిపదార్థము. ఇదియే జీవేశ్వరజ్ఞానము. ఇదియే మహావాక్యార్థంబు. ఇంక జీవబ్రహ్మైక్యంబుపదేశించెద నాకర్ణింపుము, మఱియు నాకాశము నల్లగాను, రజ్జువు సర్పముగాను, దారువుపురుషుఁడుగాను, ఎండమావులు సలిలముగాను ముత్యపుఁజిప్ప రజతముగాను దోఁచి చక్కఁగాఁ బరిశీలింపఁగా వానియందుఁ గలిగిన భ్రాంతి విడిపోయి గగనము శుభ్రవర్ణముగా, ర

జ్జువు త్రాడుగా, స్థాణువు మనుష్యుఁడుగా, ఎండమావు లెండమావులుగా, ముత్యపుంజిప్పలు ముత్యపుఁజిప్పలుగా నున్నట్లు ప్రత్యగాత్మ పరబ్రహ్మ స్వరూపమయ్యును ననాద్యజ్ఞానస్వరూపమైన నిజస్వభావము వలన జీవరూపముగా నగపడి ముఖ్యమైన తనస్వభావమును దెలిసికొనుకాలమందుఁ దొల్లింటి జీవరూపము విడిచి పరిపూర్ణమైన సుఖస్వరూపముగాఁ బ్రకాశించుచుండును. ఇవ్విధంబున దారము నెను నెఱుక లేనందున రజ్జువునందు సర్పభ్రమయుంచఁబడినదై యాప్తవాక్యంబులచే దారవు భుజంగమనెడు భ్రమ నశించుచుండఁగా రజ్జువు రజ్జువైన తెఱంగున నద్వయమైన పరబ్రహ్మము స్వస్వరూప విస్మృతివలనఁ దనకుఁదానే జీవుండై తోఁచి తదుపరి శ్రీ గురువాక్యంబుచే నీవు జీవుండవు కావు. అఖండపరమాత్మస్వరూపివని యేక్షణమందుఁ దెలుపఁబడునో యప్పుడాతండు దేహేంద్రియప్రాణమనోబుద్ధి చిత్తాహంకారభ్రాంతి నివర్తించుచుండ సత్యజ్ఞానానంద నిత్యపరిపూర్ణపరబ్రహ్మమేయగును. ఇది జీవాత్మ పరమాత్మల కైకీభావము. ఇంక నోంకారస్వరూపంబు వివరించెద వినుమని యిట్లనియె. వ్యష్టిసమష్ట్యాత్మకములైన స్థూలదేహములును వ్యష్టిసమష్టి జాగ్రదవస్థలును విశ్వనామకజీవుఁడును విరాట్టనెడు నీశ్వరుఁడును గూడి యవిద్యాపాదాత్మకమైన, యకారప్రణవార్థమగును. వ్యష్టిసమష్ట్యాత్మకములైన స్వప్నములును, ఆదేహావస్థాభిమానులగు, తైజసనామక జీవుఁడును, హిరణ్యగర్భుఁడనెడు నీశ్వరుండును గూడి బ్రహ్మ ప్రణవార్థమందలి విద్యా పాదాత్మకమై, ఉకారప్రణవార్థమగును. వ్యష్టిసమష్టికారణ శరీరములును, ఆయుభయశరీరానస్థలైన నిద్రావస్థలును ప్రాజ్ఞుఁడను జీవుఁడును, అవ్యాకృతుఁడనెడి యీశ్వరుండును బ్రహ్మప్రణవమందలి యానందపాదస్వరూపమగు మకారప్రణవార్థమగును. ఎల్లప్పుడు సర్వవ్యాపకమై స్థిరమైసుఖస్వరూపమైజ్ఞానస్వరూపమై ప్రత్యగ్బ్రహ్మచైతన్యము తురీయపాదాత్మకమైన యోంకారమనునర్థమాత్రయగును. ఇట్లర్థమాత్రయగుటవలననవిద్యావిద్యానందపాదాత్మకములైన, అకార, ఉకార, మకారములను, వీనింగూడి యొక్కరూపమగు, కడపటిపాదమగు సామాన్యావస్థయును, అవిద్యారూపమైన యిదియంతయుఁ జెప్పుటకుఁ దగిన యర్థమగుటవలన నీవాక్యార్థము నేనుగాను. నేనుశుద్ధోంకారస్వరూపుఁడను. నేనను లక్ష్యార్థముం దెలిసి బ్రహ్మప్రణవమునకు లక్ష్యార్థమై పరబ్రహ్మము నేనని యూహింపవలయును॥

పైఁజెప్పిన ప్రణవార్థప్రకారము జాగ్రదాదిదశలు వ్రాయఁబడినవి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| దేహత్రయము స్థూల సూక్ష్మ కారణ శరీరములు | అవస్థాత్రయము జాగ్రత్స్వప్న సుషుప్తులు | తాపత్రయము ఆధ్యాత్మిక ఆధిదైవిక ఆధిభౌతికములు | సుఖత్రయము విషయానంద వాసనానంద బ్రహ్మానందములు | కర్మత్రయము పుణ్య పాప మిశ్రములు | కర్తృత్రయము జీవ, ఈశ్వర, ప్రత్యక్కులు |
| బుద్ధిత్రయము సాత్విక రాజస తామసములు | శ్రద్ధాత్రియము గురుశాస్త్ర నిష్ఠలు | ధృతిత్రయము సాత్విక రాజస తామస శ్రద్ధలు | గుణత్రయము సత్వరజస్తమో ధృతులు | శక్తిత్రయము ఇచ్ఛా జ్ఞాన క్రియలు | కాలత్రయము భూతభవిష్యద్వర్తమానములు |
| లోకత్రయము స్వర్గమర్త్య పాతాళములు | దేవత్రయము వసురుద్ర ఆదిత్యులు | మూర్తిత్రయము బ్రహ్మవిష్ణురుద్రులు | వృత్తిత్రయము శాంత ఘోర మూఢవృత్తులు | స్థానత్రయము నాభి హృదయ భ్రూమధ్యములు | జీవత్రయము విశ్వ తైజస ప్రాజ్ఞులు |
| ఈశ్వరత్రయము విరాట్టు హిరణ్యగర్భుఁడు అవ్యాకృతుఁడు | విరక్తిత్రయము ఐహిక ఆముష్మిక మిశ్రములు | భక్తిత్రయము బాహ్యభక్తి అనన్యభక్తి ఏకాంతభక్తి | దీక్షాత్రయము దృక్కు వాక్కు స్పర్శము | నేత్రత్రయము వామ దక్షిణ నాసాగ్రములు | లక్ష్యత్రయము బాహ్య, అంతర మధ్యములు |
| జ్ఞానత్రయము సంజ్ఞా విజ్ఞాన ప్రజ్ఞానములు | మండలత్రయము సూర్యచంద్ర, అగ్నులు | ముక్తిత్రయము క్రమముక్తి జీవన్ముక్తి విదేహముక్తి | | | |

అని యీచెప్పఁబడినవే స్వరూపముగాఁగల అకార, ఉకార, మకారములు,
కల్పింపఁబడిన, పలుకఁదగిన యర్థముగనుక నీచెప్పఁబడినదంతయును, క్రమ
ముగ, నకారార్థమందుండెడి యకారార్థమును, నుకారార్థమందుండెడి యు
కారార్థమును, మకారార్థమందుండెడి మకారార్థమును, నోంకారమందుఁ
జేర్చి యవల నర్థమాత్రాస్వరూపమైన, శుద్ధసత్వమును బ్రపంచస్థానమై,
యఖండస్వరూపమై, యనాశమై, దృగ్రూపమైన దీనిని, నిర్మలప్రణవముగాఁ
జూచి యెప్పుడు నాయావికల్పా వికల్పమాత్రుండవై, ప్రకాశింపుము॥ 31

తే॥ అనుచుబోధింపనయ్యెడ, నవనిపతియు
నంతరాత్మానుభవముచే, నభవుదేవుఁ
గాంచితెలియంగఁగోరెను, ఘనముగాను
వరసువాక్యార్థమును వేగ, వదలినపుడె॥ 32

తే॥ అంతలక్ష్యార్థమునుగనె, నతులయుక్తిఁ దెలుపవేఁడెదశంకరా, డిట్టముగను
నందముగనాకునదివిన, డెందమందుఁ గాంక్షగల్గియె వేఁడితి, గరిమనిన్ను॥ 33

తే॥ అనుచుభూనాథుఁడయ్యెడ, హర్షమొసఁగఁ
దనదుపదపద్మములకువం, దనముచేయ
భూవిభునిఁజూచి శంభుండు, పొలుపుగాను
భూరిసత్కృపఁబల్కెను, బొందుమీఱ॥ 34

వ॥ అన్నజన్యంబగు రేతస్సువలన నుద్భవించి యన్నముచే వృద్ధిఁబొందుచున్న శరీరమన్నమయకోశంబనఁబడు. కర్మేంద్రియములయిదును బంచప్రాణములంగూడి ప్రాణమయకోశమగును. మనశ్చిత్తంబులును జ్ఞానేంద్రియపంచకంబునుగూడి, మనోమయకోశమగును. బుద్ధియు శబ్దస్పర్శరూపరసగంధములైదునుంగూడి విజ్ఞానమయకోశమగును. ప్రియ, మోద, ప్రమోద, వృత్తులుకలదై జగదుత్పత్తి ప్రధానకారణమై యనాదియగు నజ్ఞానమే యానందమయకోశంబనంబడు. మఱియు జ్ఞానలవదుర్విదగ్ధులగు కొందఱు పూజ్యతావిశిష్టంబగు నన్నమయకోశము పరబ్రహ్మమగునని పల్కుదురు. మఱికొందఱు కర్మేంద్రియమయమై పంచప్రాణమయమైనకోశమే పరమాత్ముఁడని పల్కుదురు. ఇంకంగొందఱు మిగులనొప్పిదమైన మనోమయకోశమే సచ్చిదానంద స్వరూపుఁడని వచింతురు, వేఱుకొందఱు విజ్ఞానమయకోశమే పరమాత్ముఁడని నుడువుదురు. కొందఱు జ్ఞానులేమియు గోచరింపని శూన్యతత్త్వమే పరిపూర్ణబ్రహ్మమందురు. మఱికొందఱు పరబ్రహ్మమానం

దమయకోశ స్వరూపుఁడగునని చెప్పుదురు. కొందఱుప్రబుద్ధులు సర్వగుణపూ
ర్ణుఁడగువాఁడని యెఱుంగమిఁద్రసరేణువులలో నైదవభాగమయిన పరమా
ణుస్వరూపుఁడనియును, త్రసరేణువులలో మూఁడవభాగమయిన మధ్యమపరి
మాణుస్వరూపుఁడనియు నందురు. కారణమేమనజ్ఞానాభావమే. 35

క॥ కొందఱుచిద్రూపుండని। కొందఱుచిదచిత్స్వరూప, కుండగ్రజ్ఞులో
కొందఱుసద్రూపుండని। యందురుపరమాత్మ, దెలియనశ్వాతలేమిఁ॥ 36

తే॥ కొందఱజ్ఞానులద్వయుఁ, గూర్చివివిధ। గతులభిప్రాయములతోడఁ, గనఁగ వేరు
సచ్చిదానందుఁడనినీవు, సమరసమునఁ, దెలిసిస్థిరబుద్ధినుండుమా, దివ్యచరిత॥ 37

సీ॥ కుండచూచెడివాఁడు, కుండదాఁగాకను, వేఱుగానున్నట్లు, నేరుపుడుగు
దృఢమైనతనువును, దేరువఁజూచుచుఁ, జిత్పరమానంద, చిన్మయాత్ముఁ
డయిననేనెప్పుడు, నరయదృశ్యంబును, గంధర్వపుర, నిభకాంతితోడ
నిరతంబునుండని, నిర్మలంబయినట్టి, నామరూపాత్మక, శ్రీమెఱసిన

తే॥ ఘనతఁగుటిలయవిద్యచేఁ గలితమైన। వ్యాకులతనిచ్చునట్టివంటి, యుబ్బురంపు
వరతనూకోశమునుగాను, వసుమతీశ। వంశపావనవినుమయా, బ్రహ్మనిరత॥ 38

వ॥ రాజోత్తమాయభేదంబుగా శరీరము నెఱుంగురీతి నీకసంబడుచున్న దశేంద్రి
యములను, బంచప్రాణములను, జిత్తమనోహంకృతులను, గనుఁగొనుచుఁ
జైతన్యంబునైననేనాశరీరేంద్రియప్రాణాదులెప్పుడును, గానేరను. నాకింక
నాశరీరేంద్రియప్రాణాదుల యుత్పత్తిలయములుజాగ్రత్సుషుప్తులయందుఁజూ
డంబడినవగును. ఇంతేకాక యిదినాగృహమనియు, నిదినాసువర్ణంబనియు, నిది
నాభార్యయని, యనెడు పురుషుండాగృహధన సువర్ణతల్పములకు వ్యతిరిక్తుఁ
డై సాక్షియై యవిగాని పగిది నిదినాశరీర, మిదినాయింద్రియము, లిదినా
ప్రాణ, మిదినామన స్సిదినాయహంకృతి, యిది నాబుద్ధియని, యనేక విధం
బులుగఁ గనంబడుసాకారముల నన్నింటిని నాసంబంధమైనవని తెలిసి నిర్ణయ
ముచేయు, నేనాయాశరీరాది నిఖిలవస్తుసంఘమునకు విలక్షణసాక్షినగుదును.
కాని యావస్తుసంఘమందు నేనేదియుంగానని తెలిపి మఱియునిట్లనియె॥ 39

తే॥ గీ॥ బుద్ధ్యహంకారములతోడి, పొందుగలిగిఁ నేనునేననువాఁడను, నేనుజుమ్మి
నేను నేననువాఁడను నేనటంచుఁ దెలిసికొని వృత్తినెఱిఁగెడి, తెలివినేను। 40

వ॥ శ్రోత్రేంద్రియములవలన సకలశబ్దములను నిర్ణయించి తెలిసికొనెడి తెలివినేను
త్వగింద్రియముచేత మృదుకఠినశీతోష్ణమిశ్రములనెడు స్పర్శభేదములనువిభ
జించి యెఱుంగునెఱుకనేను. చక్షురింద్రియములచేత దశవిధవర్ణములను నిశ్చ

యించి తెలిసికొను జ్ఞప్తిని నేను. జిహ్వేంద్రియమున సకలరుచుల విభాగిం
చి తెలిసికొనెడు జ్ఞానము నేను. నాసికేంద్రియమువలన సకలవాసనలను
భిన్నపఱచి కనుంగొనెడు తెలివి నేను. మనస్సుచే నెల్లతలంపుల నేర్పరించి
యెఱింగెడి యెఱుక నేను. సుశబ్దాపశబ్ద మిశ్రశబ్దములనిచ్చుట పుచ్చుకొను
టలను, రాకపోకలను, మలప్రస్రావముల రాకడపోకడలను, దెలిసికొను
జ్ఞానము నేను. ఇంక సర్వోపాధులయందున్న వాఁడనై సర్వేంద్రియక్రియ
లను శీఘ్రముగాఁ జేయుచు, నాచేయంబడినయంతటి నంటక ప్రకాశించు
బ్రహ్మమును నేను. మఱియు సంపూర్ణమై, యక్షీణమై, శాశ్వతమైన ప్ర
కృతికిఁ బరమైన తేజోరూపుండనై, చంద్రుని, నగ్నిహోత్రుని, సూర్యుని,
మఱియు నిట్టి తేజోమూర్తులనన్నింటినిఁ దేజరిల్లఁజేయుచు నెల్లప్పుడు సర్వత్ర
యొక్కరీతి నేకస్వరూపముతో వెలుంగుదును. అదియునుంగాక, యుపాధి
కనామంబులనఁగా, విశ్వ, తైజస, ప్రాజ్ఞ, జీవ, విరాట్, హిరణ్యగర్భ,
అవ్యాకృత, ఈశ్వరనామముల నామయోపాధులవలనఁ గలిగెడు రూప
ములును సత్యముగా నాకు లేవు. చతుర్దశేంద్రియ వ్యాపారంబులం జూచు
చుండెడు నంతర్బాహ్య ప్రపంచమందావరించి సర్వసాక్షినైనందున నాకు
నామరూపములు లేవని మఱియు నిట్లనియె॥ 41

తే॥ గీ॥ తనువుగాసింద్రియంబులు, ధరణినాథ
కానుబ్రాణంబుచిత్తంబు, గానుసుమ్మి
పరమహంకారశూన్యంబు, పార్థివేంద్ర
గానుబుద్ధియుదీర్ఘంబు, గానువినుము॥ 42

తే॥ గీ॥ కానుగుజ్జంబుస్థూలంబు, కానుసూక్ష్మ
మునుమఱియునల్పునెర్పును, మోదమలరఁ
దెలుపునుంగానురంగుల, తెరవుగాను
బంచభూతంబులునుగాను, బరమపురుష॥ 43

తే॥ గీ॥ నేనుజీవుండఁగానయ్య, నేనుగాను। గానుకాననువానినిఁ గాంచువాఁడఁ
జూచువానినినిరతంబుఁ, జూచుఁవాఁడ। నౌనుగాననువికృతులు, లేనివాఁడ॥ 44

చ॥ దివియఘటాదులన్ వెలుఁగుదెర్వును జూపెడిరీతిగాసదా
వివశతనొక్కతీరుగను, వేడ్కసముజ్జ్వలచిత్తచక్షువుల్
భువిఁగలదృశ్యసంచయము, పొల్పుగనాత్మసుచేష్టలంతగా
నవిరళయుక్తిచేఁగనుచు, నన్నియునంటకయుందుద్రష్టనై॥ 45

తే॥ సూర్యతేజస్సుప్రాపృత, సుస్వభావ కర్మములయందు నీమానఘనులు వేగ
సంచరించెడిరీతిని, సమరసమున మత్ప్రకాశమునంటెడీ, మానసములు॥ 46

తే॥ అనఁగఁజిత్తంబునింద్రియ,ఘనచయంబు నిజసమస్తంపుఁగార్యాలఁ, నిష్ఠమీఱ
మానకచరించునెందభి,మాన పూర్వకాదివృత్తులచేతను, నార్యవినుత॥ 47

వ॥ జ్ఞానాజ్ఞానములందెలిసికొనెడి తెలివినేను. శాస్త్రవిహితకర్మలను, దద్విరోధ కర్మలను, గనుంగొనువాఁడను నేను. వాదవిషయములన్నింటిని వాదించునట్టి యథార్థవస్తువును నేను, నేను నేనని పరిశీలించునది కాదు నేను. అవివేకియహా మనఁగాఁ బంచకోశాత్మకశరీరమని చూచుచుంగాన మేల్కని సత్యజ్ఞానానందమయుండగాన పరోక్షజ్ఞానముచే నెఱుంగవలయును. నేననుశబ్దము శరీరమునకభిమానమునకుం దాత్పర్యముగునని తెలంపద. ఆయర్థములు రెండు నసన్న్యాయములగును. నేననుశబ్దము శరీరముకంటె నహంకారముకంటె వేఱైన ప్రత్యగాత్మసుమీ. ఇంతియకాక సర్వత్రనిండియుండు వానినిఁ గననఁగాఁబరబ్రహ్మస్వరూపునిఁగాఁ జెప్పితిని. అవిద్యాసంబంధమువలనఁ గించిజ్ఞత్వాదిగుణములుగల జీవునివలెఁ గనంబడుచున్న ప్రత్యగాత్మనైన నిన్నుఁబరబ్రహ్మయని చెప్పితి. అఖండసచ్చిదానంద నిత్యపరిపూర్ణుండనైననన్ను నవిద్యచేఁగల్పింపఁబడిన స్థూల సూక్ష్మ కారణశరీరత్రయాభిమానియగు కూటస్థుఁడని చెప్పలేదు గనుక నీవు పంచకోశాదివ్యతిరిక్తాఖండసచ్చిదానంద పరమాత్మ నేననెడు నన్నుఁజక్కఁగా విచారించి నేననుపదమునకు వాచ్యార్థమైన సర్వజ్ఞత్వాది గుణవిశిష్టమైన మాయను నీవనుపదమునకు వాచ్యార్థమయిన యవిద్యను వివేకదృష్టిచేత విచారించి యుపనిషత్సారమైన నేతినేతియను మహావాక్యములచేత మాయావిద్యలనువదలి నేననుపదమునకు సర్వసాక్షియునైన నన్నును నీవనుపదమునకు జీవసాక్షియునైన నిన్నును సత్యజ్ఞానానంద నిత్యపరిపూర్ణపరమాత్మయేయని తెలిసిపలుకును. అనఁగా నేనే పరబ్రహ్మము. పరబ్రహ్మమే నేనని పలుకుము. అదియునుంగాక శరీరము మనము, అహంకారమును, అనఁగా శరీరత్రయమును నేనని యనెడు స్మరణను వదలి నిష్ఠచేతఁ బరమాత్మనైన నన్నే ప్రియముతో నేనని విశ్వసించితివేని నీసంశయజ్ఞానము పక్షహేతుసాధ్యములచేత, నభేదనిశ్చయముగలదై వృద్ధిఁబొందును. 48

తే॥ స్వాంతమేవనిచేసిన, దంతమనమె చేసితిమటంచుమదిఁదోఁచుస్థిరపురాత
నమగుద్యోతనమైచేత,నముఁగనొప్పునదిమనకుఁగల్పనముసుమీ,యవనినాథ॥

సీ॥ అనవరతంబును, నంతరంగములోన, జానోప్త తేజస్సు, నేనుసుమ్ము
చావుపుట్టుకయును, సకలవర్ణములును, గర్తృత్వమునుగార్య,కరణములును
వర్ణగుణాశ్రమ, వర్ణంబులునుమఱి, యభిమానములునాకు, నరయలేవు
వరఘనంబగునాదు, వచనంబునెమ్మది, యరుచిజనింపంగ, నరయఁబడెడి

తే॥ నింద్రియాదులకోరిక, లెల్లమాని
మానితస్ఫురదభిమాన, మానసవచ
నాదివాసనలందక, యఖిలవిశ్వ
మునునభావంబుగానెంచి, మోదమలర॥ 50

వ॥ ప్రత్యగాత్మయగునేనే పరబ్రహ్మమను జ్ఞానముచేత, విచారింపఁగాఁ, బరబ్రహ్మేతరముకానని స్ఫురించుటచేతనేనే పరబ్రహ్మస్వరూపమని నిశ్చయింపుము. అనుభవజ్ఞానముచేఁ బరిశీలింపఁగా నెప్పుడును గొంచెమైన వస్తురూపముగాఁగనంబడకయే, వస్తురూపముగానున్న దానివలె వృద్ధినొందుచున్న షడ్భావవికారములకుం గారణము, అజ్ఞానముగానున్నది. ఈయజ్ఞానలక్షణముఁ జక్కఁగాఁదెలిసికొని ప్రకృతిని నశింపఁజేసి, పరబ్రహ్మస్వరూపియై తాను శరీరమును మఱచి, నిశ్చలబుద్ధిచేఁ బ్రకాశించుచున్న ప్రవర్తనకలవాఁడల్పకాలములోనే మోక్షమొందునని యుపదేశించి, మఱియుం బరబ్రహ్మస్వరూపము మిగుల స్పష్టముగాఁ దెలిసికొనుటకొఱకు, నింకొక పరమరహస్యంబుఁ జెప్పెద సావధానచిత్తుండవై యాకర్ణింపుము. 51

చ॥ కలితసుశబ్దశ్రోత్రఘన, గౌరవమానసహంకృతాదులున్
సలలితదృశ్యవస్తువులు, చక్కఁగవీనికిద్రష్టనాదునే
విలసితమైనస్పర్శమును, వీలుగనైదుత్వగింద్రియంబులన్
గలసినచిత్తహంకృతులు, కన్గొనువానికిద్రష్టనాదునే॥ 52

చ॥ సలలితరూపలోచనను, సారసచిత్తముహంకృతాదులున్
విలసితదృశ్యసంచయము, వీనినిఁజూచెడిద్రష్టనాదునే
లలితరసంబుదెల్పుకొన, లావగుజిహ్వాయుమానసాదులున్
నయయుత;దృశ్యజాతులగ,ణంబులకున్దగద్రష్టనేఁజుమీ॥ 53

చ॥ అతులసువాసనాసహిత, హంకృతియున్మఱిమానసంబుత
ద్వితతికిదృక్కునేనుజుమి, వింతగలోపలనున్ బహిస్స్థలిన్
బ్రతిభువియందునున్గలుగు, ప్రాభవయుక్తప్రపంచదృశ్యమ
త్యతిసులభంబుగానగుట, యాపరిపూర్ణసుదృక్కునేఁజుమీ॥ 54

వ॥ నేనుద్రష్టయెట్లన్నఁ జెప్పెదవినుము శ్రోత్రేంద్రియము మొదలుగాఁగల పంచవిషయములుచూడందగిన విస్తారములగు మనోబుద్ధ్యహంకృతులకు శ్రోత్రేంద్రియము మొదలగు నింద్రియపంచకము చూడందగినదగును అట్టిమనోబుద్ధ్యహంకారములకు సంతతనిండియుండు దృక్స్వరూపుఁడనయిన నేనుజూచుటకాని చూడంబడుట లేనందున సర్వోత్కృష్టమైనదియు షడ్భావవికారములు లేనిదియు విషయశూన్యమయినదియు నాశరహితమయినదియుఁ జిదాకాశ స్వరూపమయినదియు నపవాదవ్యతిరిక్తమయినదియు సచ్చిదానందరూపములచేతఁ బ్రకాశించుచున్నదియునగు విభాగింపఁగాఁబడనినిర్మలమయిన పరబ్రహ్మమును నేనుగానున్నను మనోబుద్ధులు మొదలగు సకలేంద్రియములకు వ్యతిరిక్తమయినట్టి దృగ్వస్తువైననాకుఁ జూడంబడుటయెట్లు లేదనఁగాఁ జెప్పెదనువినుము దృక్సంవిత్తును, చిత్తును, జ్ఞప్తియు, జ్ఞానంబును, బోధంబును, చైతన్యంబును, ననునివి, ఘట, కలశ, కుంభశబ్దంబులభంగిఁబర్యాయనామంబులు అట్లగుట దృక్కునైన నన్నవలోకించునది దృగన్యంబనిన దీపభాస్యంబులై జడంబులైన ఘటాదులు భాసకంబై దీపమును బ్రకాశింపఁజేయనేరనివిధంబున నాచేతఁ బ్రకాశించెడున చేతనములైన యహంకారము మనస్సు నేత్రము రూపము మొదలగునవి ప్రకాశించునట్టి నాస్వరూపమును దెలిసికొనంజాలవు. నేనెట్లు ప్రకాశింపఁజేయుచున్నానో యాప్రకారమున నన్ను బ్రకాశింపఁజేయు దృక్కు మఱియొక్కటి యున్నదన్న యెడల, నల్పప్రకాశముగల దీపము, అధికప్రకాశముగల సూర్యు నెట్లు ప్రకాశింపఁజేయఁజాలదో యట్లే యధికప్రకాశముగల నాస్వరూపమును నీచమగు దృగంతరము తెలిసికొనఁజాలదు. నాతో సమానమైనదృక్కు నన్నెట్లు వెలిఁగింపఁగూడదనిన నొకరత్నము తనతో సమానమగు మఱియొకరత్నమును బ్రకాశింపఁజేయుట కెట్లు సమర్థమైనదిగాదో యట్లే నాతో సమానమైనది నన్నుఁ బ్రకాశింపఁజేయ శక్తముగాదు. అదియునుంగాక యుపనిషదాదులందు వస్తుద్వయమనుక్తమగుటచే మత్సమానమగు వేఱొండున్నదనుట యప్రసిద్ధము. మొదట దృగ్వస్తువు శ్రేష్ఠమైనదంటిమేని యే దృగ్వస్తువు సమస్తమునకు హేతువైనదియుఁ దనకు మఱొక్క హేతువు లేనిదియునై, తనకంటె నిరంతరంబగు సర్వంబును నిర్హేతుకమై తానేచూచునో, యదియే సర్వశ్రేష్ఠమైన నేనుగనుక నేను స్వయముగాఁ బ్రకాశించునట్టి పరిపూర్ణజ్ఞానరూపమైన పరమాత్మనగుదును॥ 55

సీ॥ తెలియంగఁబడుచున్న, యలవిశ్వమంతయు,దృశ్యంబటంచును, దృఢముగాను
దెలివినై సర్వంబు, తేటగాఁజూచెడు, ద్రష్టను నేఁజుమ్మ, ధరణినాథ
నాకంటెమిగులుగా, నేకొంచెమెదిలేదు, సత్యంబు వేదాంత, సంగ్రహంబు
విశ్వతైజసప్రాజ్ఞ, విపులతనుత్రయా,వస్థాత్రయాలకుఁ, బర్యాయవల
తే॥ భిన్నమైనట్టివాఁడను, వీతరాగ, యట్టిపవిత్రయాద్యము, లనఁగఁబరఁగు
వానియెడనుండిలేములు,వరుసనెఱుఁగు నిరుపమజ్ఞానరూపుండ, నీరజాక్ష॥ 56

"క్షరాక్షరవిచారము"

వ॥ పంచభూతములును బుద్ధియును, అభిమానమును, అవ్యక్తమును మూలప్రకృతియును, జ్ఞానేంద్రియకర్మేంద్రియదశకంబును, వీనికధిష్ఠానమయిన యొకమనస్సును, జేరి, పదునొకొండు, టియును బంచతన్మాత్రలును, మనోవృత్తివాంఛయు, నప్రియము, ఖేదమోదములును, దేహేంద్రియాదిసంఘాతధైర్యమనునివి క్షేత్రమనియు, నక్షరమనియు మిక్కిలి రాణించును. ఈభూతపంచకములోనగువానిరూపముగనుండునవియే, యపరాప్రకృతియనియుఁ, బ్రకృతియనియుఁ, జెప్పనొప్పును. ఈమూలప్రకృతితోడంగలసి, మెలంగుచుండెడి జీవుండక్షరుండనియు, నాత్మయనియు, క్షేత్రజ్ఞుండనియుఁ జెప్పనొప్పును. ఈప్రకృతికింబురుషునకును జేరిక గలుగుచుండఁగా, నొప్పిదముగవీక్షించుచుండెడినేను బురుషోత్తముండనునట్లును బరుండనునట్లును, బ్రకాశించుచుందును॥ 57

క॥ నేననుచునక్షరుండ। జ్ఞానముచేక్షరము నెఱుఁగు, చందంబునవి
జ్ఞానముచేనప్పురుషుని। నేనసివీక్షింతు వేఱు, నిజముగ లేమిన్॥ 58

క॥ పరమాత్మయనఁగ నాకును। బరమాక్షరపురుషునకును, వరభేదఁబున్
బరికింపలేదుబింబం। బరయంబ్రతిబింబమునకు నగుభిదమాడ్కిన్॥ 59

తే॥ ఘటమువగులంగఁ దద్ఘటాకాశ, మాక
సమున నైక్యంబుఁగనురీతి, జ్ఞానదృష్టిఁ
దనువు నెడఁబాసి, యక్షరుండెనయునన్నఁ।
గూడిక్రమ్మరఁదొలిసంజ్ఞ, గోనఁడునిజము॥ 60

వ॥ ఇవ్విధంబునఁ బంచభూతంబులును, మనోబుద్ధ్యహంకారంబులును, వీనికిహేతువులైనవిక్షేపశక్తియు, జ్ఞానేంద్రియకర్మేంద్రియంబులును, బంచవిషయంబులుంగూడి, యిరువదినాలుగుతత్వంబులగును. కొందఱువాగాదికర్మేంద్రియములైదును, శ్రోత్రాదిజ్ఞానేంద్రియంబులైదును శబ్దాదిపంచవిషయంబులును ప్రాణాదిపంచప్రాణంబులును, మనఃపరిభృత్యంతరింద్రియములును నా

లుగుచేరి, చతుర్వింశతి తత్వంబులని పలుకుదురు. ఈతత్వంబులును శరీరత్రియంబనియుఁ, బంచకోశంబులనియుఁ, బండితులు గణింతురు, ఇదిమదీయాపరాకృతి, అనఁగానాసంబంధమైన యపరయనిపేర్కొనఁబడెడి ప్రకృతి. ఇదిక్షేత్రంబుక్షరంబుప్రకృతియనాత్మదృశ్యంబసత్తుజడంబు. దుఃఖాత్మకంబు సంసారంబననొప్పు.పూర్ణతప్తంబగు నయఃఖండంబులోఁగలసి ప్రకాశించునగ్నిరీతి నసత్యరూపమైననే ననుభావముచేత, స్వప్రకృతిలో మిళితమై సంచరించుచు మన్న నాకళచేతంబుట్టిన చిదాభాసుండిరువది మొదవవాఁడు. ఈ స్రుఁడు నా సంబంధమై పరాభిఖ్యయగు ప్రకృతిక్షేత్రజ్ఞుఁడనియు, నక్షరుండనియుఁ, బురుషుండనియు నాత్ముఁడనియు, సాక్షియనియుఁద్రికాలాబాధ్యమైనస్వరూపముఁ గలవాఁడు జ్ఞానస్వరూపుండానంద స్వరూపుండు, సంసారియును నటుల వలుఁగుచుండును. అదియెట్లన్న, ముందుచెప్పఁబడిన యిరువది నాల్గుతత్వంబులయందు ముఖ్యమయినదియు, సమస్తకార్యములైన కార్యమనశబ్దాది కార్యములకును, కారణమన నింద్రియములకును ఆధారమయినదియు సకలవాసనామయంబును మొదలులేని, పలుకనశక్యముగాని ప్రకృతిచే నిర్మింపఁబడినట్టి బుద్ధ్యహంకారాత్మకాంతఃకరణవృత్తి విశేషంబునందు, జలఘటంబు సంబాదిత్యప్రతిబింబంబు దర్పణంబునందు ముఖాభాసముండోఁచిన నస్మచ్ఛాయ ప్రతిఫలించి, ఆయంతఃకరణవృత్తిరూపోపాధిఁగలవాఁడై వ్యాపారవత్కరణంబులగు చక్షురాదులనెడు భోద్యజ్ఞానప్రమాణశబ్దములచేఁ బలుకఁదగిన స్థూలశరీరసంబంధమయినయవకాశస్థానములయందుఁగూడినజ్ఞానకర్మేంద్రియప్రాణపంచకసమన్వితమనశ్చిత్తాత్మకాంతఃకరణవృత్తివిశేషసాధనంబుచేతఁగార్యమనఁగాఁజక్షురాదికరణజనితకార్యములనెడుభోగమనఁగా భోజ్యప్రాప్తమయినభోగములనెడుజ్ఞేయప్రమేయశబ్దవాచ్యంబులైనశబ్దాదివిషయంబుల ననుభవించుచుఁగర్తయు భోక్తయు జ్ఞాతయుఁ బ్రమాతయు శ్రోతయుస్పృష్టయు ద్రష్టయు,రసైతయు, ఘ్రాతయువక్తయు, దాతయుగంతయు విసర్జయితయు నానందయితయుఁబ్రాణియు మన్తయుననఁగా మననముచేయువాఁడును దేహముఁ గలవాఁడును జీవుండును, అని పలుకునట్లు తెలసినవాఁడై సమధికశరీరమనఁగా స్థూలశరీరమునకు జాగ్రదవస్థకుంగర్తయై విశ్వుండన సూక్ష్మదేహస్వప్నావస్థాభిమానియై తైజసుండనఁ గారణాంగ సుషుప్త్యవస్థాభిమానియై, ప్రాజ్ఞుండన విలసిల్లి నిఖిలవాసనానసమేతుండై, యయస్కాంత సాన్నిధ్యంబుచే నినుము చలించెడు విధానసూర్యాలోకంబు నాశ్రయించి స్వస్వవ్యాపారం

బుల సంచరించు మనుష్యులవలె సర్వాధిష్ఠానభూతుండు ప్రధానపురుషేశ్వరుండు పురాణపురుషోత్తమాఖ్యుండు తనకు ముఖ్యబింబభూతుండు షడ్వింశకుండు పరుండు పరమాత్ముండనైన నాసన్నిధానంబున నస్మదీయ తేజంబు సంశ్రయించియు నన్నెఱుంగక తన్ను నామరూపాత్మకునిఁగాఁదలంచి సంసృతిచక్రంబుననే పరిభ్రమించు. కొంతకాలంబునకుఁ బెక్కుబాములయందు సంపాదితమయిన సుకృతరాశియొక్క పరిపక్వసమృద్ధివలనను నాదయవలనను స్వచ్ఛమనస్కుండై నిత్యానిత్యవస్తువివేకము, ఐహికాముష్మికార్థఫలభోగవిరామము, శమాదిషట్కసంపత్తిమోక్షమునను నాలుగు నుపకరణముల యొక్క సమృద్ధితోఁగూడినవాఁడై సద్గురుచరణంబు లాశ్రయించినవాఁడై తత్ప్రసాదలబ్ధాత్మానాత్మవివేకజ్ఞాన కలితుండై యక్షరుండుగా, నాద్యహంకృత్యంతంబైన క్షమంబంతయుఁ దానుగానని నిరాకరించి కలశజలనాశానంతరంబుననుపసూర్యకంబు మార్తాండునింజెందిన చందంబునముకురవియోగంబగుచుండ వదనాభాసంబు ప్రధానాననంబునంగలసినరీతి మఠఘటకుడ్యకుసూలస్తంభపటాద్యఖిలమూర్తద్రవ్యంబుల వేర్వేఱవిభజించిన యశేషవస్తునిషేధావధీభూతంబు ననమూర్తంబునగు తదవచ్ఛిన్నాకాశంబు మహాకాశంబయిన పగిదిఁ దనుత్రయవిలక్షణుండు నవస్థాత్రయసాక్షియుఁ బంచకోశవ్యతిరిక్తుండునై యఖండాద్వితీయసచ్చిదానంద స్వరూపపరిపూర్ణ పరబ్రహ్మతత్వమాత్రుండగు క్షరాక్షరాతీత పురుషోత్తమ తత్త్వంబేనని చెప్పి మఱియు నిట్లనియె. 61

సీ॥ పంచతన్మాత్రలు. పంచేంద్రియములచేఁ, గనుగొనఁబడియెడు, ఘనుఁడనేను
బంచకోశములను. బంచభూతంబుల, నెంచికన్గొనునట్టి యెఱుకనేను
నాకిది తెలిసెను, నాకదియంతగాఁ, దెలియదు తెల్పెదఁ, దెలియుదనుచుఁ
బల్కితినిఁకఁబల్కఁ, బల్కెదననిమదిఁ, దలఁపనుదలఁచితి, దలఁచెదనఁగ

తే॥ బాహ్యమందంతరంబునఁ, బటిమఁదెలియఁ
బడుసువృత్తులఁదెలియుచుఁ, బ్రభవెలుంగు
లనువెలుంగులుకల్గఁగా, లాలితముగఁ
గనుచువెల్గించుతొలివెలుం, గనఁగనేను॥ 62

వ॥ అనఁగా సనాతనప్రకాశముగల నన్ను విజ్ఞానసంపత్తిగల మనస్సుచేతం దెలియుము. 63

శా॥ నానాచ్ఛిద్రఘటాంతరోదరములో, నక్షజాలసందీప్తిచే
లోనన్ వెల్పలనుండువస్తుచయమున్, లోకంబులున్ మెచ్చఁగాఁ

గానంజేసెడిదీపకాంతిగతిగాఁ గన్పట్టుహృద్దీయుత
జ్ఞానప్రాణముఖాఖిలేంద్రియములుఙ్ సంశ్లాఘ్యమౌమేనిలోన్॥ 64

తే॥ చక్కఁగానందునుండిన, సంజ్ఞనేను। గారణములేనియవివేకి, కల్పనమున
బాహ్యకాంతగనామరూపప్రముఖవి। తతివెలింగించుచుందును,దగినలీల॥ 65

వ॥ వసుధాధిపా! దేహమును బ్రాణములును జ్ఞానేంద్రియ కర్మేంద్రియములును
యథార్థముగాఁ దమ్మెందాఁ దెలియఁజాలవు. ఇట్టివితరము నెట్లు తెలిసికొను
ను. అయ్యవితరముం దెలిసికొనలేవనుట నిక్కము. సర్వసాక్షి నైన నేనెప్పు
డు నాదేహేంద్రియాదులను, నాదేహేంద్రియవ్యాపారములను నసత్యము
గాను బరబ్రహ్మమయిననన్ను సత్యముగానుజూతును. మఱియుం దెలిసికొను
వాఁడు తెలిపి, జ్ఞానములనుసవిమనస్సుయొక్కయుం బ్రజ్ఞయొక్కయు సంక
ల్పవృత్తులే స్వరూపముగాఁగలవి. అట్టిజ్ఞాతృజ్ఞేయజ్ఞానములయొక్క నాశము
నుత్పత్తిని సుషుప్తిజాగ్రదవస్థలుకనఁబఱచుచుందును. నేనుగూటస్థబ్రహ్మమున
యి యాయాశ్చర్యములను నాసుషుప్త్యవస్థలనుగలిగించెడు స్వకీయమయిన
ప్రకృతింజూచు ప్రకాశముచేత నున్నదియు లేనిదియునగు వస్తువులకంటెవిల
క్షణుండనై యుందును. మత్సాన్నిధ్యమువలన నవ్యక్తము, నాయవ్యక్తయు
తమయిన పవనప్రాణాదివాయువులు మనస్సును నేత్రశ్రోత్రాదిదశేంద్రియ
ములును మిగులం బ్రకాశించుచున్న సూదంటురాతిసమీపమందు సూదులు
కదలంబాఱినరీతి దేహేంద్రియాదులచేతనములగుటచే నాతేజస్సుచేత సంచ
రించుంగాని తమంతటందిరుగనేరవు. తప్తంబగు నినుపముద్దయొక్క లోపల
వెలుపలవ్యాపించిన యగ్నిమండలమువలె నేనేయవిద్యచేనావరింపంబడిన ప్ర
పంచమును లెస్సగా వెలింగించుచున్న జ్ఞానస్వరూపుండను. మఱియుభూమి,
ఉదకము, అగ్ని, వాయువు, మిన్నువీనియొక్క లోపలవ్యాపించియున్న స
కలమునకాధారభూతమయిన ద్రష్టను. సూర్యచంద్రులయందు నంగారకాది
గ్రహములయందు నశ్విన్యాదితారలయందు విద్యుత్తులందు నావరించియున్న
దివ్యతేజస్సయిననేను, అమరమానవపశుపక్షిమృగంబులు మొదలయిన ప్రా
ణులయొక్క బుద్ధిని వికసింపఁజేసెడు మహాజ్ఞానసంపన్నుండను నేను నలువ
మొదలగు వేల్పులచేత వేఁడుకొనందగినయనేకములైన శాంతశమదమాద్య
నంత సద్గుణయుక్తమైనశరీరముగలవాఁడను నేను కార్యరూపంబులై దృశ్యం
బులైన చతుర్దశభువనములకు శోభిల్లుచున్న ఘటశరావాదులగు మృత్తిక
వలె సముదాయికారణంబును గులాలుండైనట్లు శుద్ధసత్త్వస్వరూపమై నిరతి

శయమైన కారణోపాధియైన మాయతోఁగూడిన పరమాత్మను నేనని మఱి
యునిట్లనియె॥ 66

సీ॥ వేదశాస్త్రంబులు, వివిధాగమంబులు, తెలియంగఁదగినట్టి, దీప్రనిత్య
వరపరబ్రహ్మంగా, మెఱయుచుండెడినేను, సర్వజ్ఞులైనట్టి సరసులకును
జపతపోదానసంచయయజ్ఞములచేత, నారాధ్యుఁడైనట్టి, హరిని నేను
సకలభూతములందు, సాక్షినై వెల్గుచుఁ గాలత్రయంబున, ఘనతనొందు
తే॥ ననఘసాకారుఁడనుగాను, వినుసమష్టి
ఘనతనుద్వయమేళన, మునకుఁజొరమి
సరినిరాకారుఁడనుగాను, సాక్షినగుచుఁ
గారణశరీరమేనను, కలఁకలేమి॥ 67

తే॥ సకలప్రాణులయందునే, సకలప్రాణ
ములును నాయందునుండఁగాఁ బొరయనెందు
వానినవినన్ను నంటవు, వసుమతీశ
సమతనుండెడిగగనంబు, చందమునను॥ 68

వ॥ ఎండమావులంజూచి, యుదకమని భ్రమించి, పిదప నెండమావులుగ నెఱింగిన
వానికి, జగములగపడక నేనేకనంబడుదును॥ 69

సీ॥ ఘృతముతోఁగూడిన, క్షీరధారలుచాల, మధురమైయున్నట్లు, మనుజవర్య
కనఁబడుచున్నట్టి, గాఢానృతంబును, జడమసుఖంబైన, జగము నెపుడు
మూఢులకెల్లను, మొనసిసత్యముగాను జైతన్యమునుగాను, జతువులకు
సుఖభోగములుగాను, సుస్థితిఁగనుపట్టు, నెల్లనన్నెనయుట, వల్లఁజుమ్మి
తే॥ జ్ఞానులకఖండసద్రూప, ధీనియుక్తి మైనయానందసుస్వరూప, పానసాక్షి
నగుచుసుజ్ఞానమునఁదెలి,యంగఁబడియు। సంతసమ్మునసాక్షాత్క,రింతునధిప ॥

వ॥ అట్లు నేనై సాక్షాత్కరించుటవలన బ్రహ్మజ్ఞానులందఱు నన్ను సత్యజ్ఞానానంద స్వరూపునిఁగాను, సర్వకర్తృత్వకరణ కార్యములకు సాక్షింగాఁదెలిసి యెల్లప్పుడుస్మరింపవలయు. అనియిట్లుచెప్పఁగావిని యారాజోత్తముండు శ్రీగురుమూర్తి పాదారవిందములకు సాష్టాంగప్రణామమ్ము లాచరించి వినయవివేకములతో నిట్లువిన్నవించెను. ఓమహానుభావా! ఏనియమముకలిగి, ఏనమయంబున నెటువంటి తూష్ణీంభావము కలిగియుండి, వాఙ్మౌనమనఁగా నింద్రియములఁగుదియించిపట్టుట, అక్షరమౌనమనఁగాఁ జేష్టారహితుఁడయియుండుట. కాష్ఠమౌనములనెడు మౌనత్రయముంబూనియో మానియో మంత్రము, తంత్రము, అనఁగానిర్గుణమో, సగుణమో, యేదోస్థిరబుద్ధితో, ధ్యానింపవల

యుంగాన, నేనడిగినవన్నియుఁ, దెలియంజెప్పవేయన నమ్మహామహుం 71
డిట్లనియె॥

శా॥ భూపాలుండతిభక్తితోనడుగఁగా, భూతేశ్వరుండప్డు తాఁ
బ్రాపౌచున్ నిజమానసంబునఁగడున్, రాణించు ప్రేమార్భటిన్
శ్రీపుణ్యుండగు శిష్యుఁడూకొనఁగను, శ్రీగూఢ్చహాగ్లోక్తులన్
దీపింపంబలికెన్ సమస్తమగుసం, దేహమ్ములెందోచనన్ ॥ 72

సీ॥ భూనాథదేహంబు, భూరిసదాగతు, లింద్రియపంక్తియు, నిచ్ఛస్వాంత
బుద్ధులునేనని, పొల్పారమానమ్ము, పూనినమానవ, పుంగవుకుఁ
ద్రివిధమానములను, దేశకాలములను, నియమతంత్రంబులు, నిక్కవముగఁ
గనుఁగొనుసాక్షిని, ఘనశక్తినేనను, పూరుషునకులేపుపు,ణ్యచరిత

తే॥ తద్వికారచయంబులు, తథ్యముగను। గానఁదెల్పెదవినుమయ్య,గౌరవమున
నిర్మలస్వాంతముననీవు, నేర్పుబలిమి। నార్యజనపోషణోల్లాస,యభవదాస॥73

సీ॥ ఆత్మయనాత్మయన్, వ్యాప్తిచేరెండైన, వస్తుయుగ్మంబును, వరసులక్ష్య
ములుగదా యందున మొనసి యనాత్మాత్మభ్రమసృష్టి మొదలుగాఁ బ్రబలము
గను। సహజమైయుండఁగా, సరసంబుగా నాత్మజ్ఞప్తివంచునునీవుసాధువిధిని
నంటినేనిఁకమీఁద, నన్యమేమియులేదు, శుద్ధపరబ్రహ్మ,సుస్థిరునకు

తే॥ ఘనసుకూటస్థచైతన్య,గంధునకును వేఱుగానియఖండవివేకమూర్తి
యనఁగనానందమయువిన,ఁగనఁగలేదు కానినీవది తెలియుము, గౌరవాబ్ధి॥ 74

వ॥ జ్ఞానేంద్రియకర్మేంద్రియములను, మనస్సును, బంచప్రాణములను లయింపఁ జేయవలయుననెడు నభ్యాసవ్యాకులతను వదలి యేకీభూతబుద్ధివై, యసమానమై సంపూర్ణమైనదగు నిర్వికల్పసమాధిం జెందుమని మఱియునిట్లనియె. రాజోత్తమా నీవు మాయావికారములగు దారపుత్రులనుశరీరేంద్రియములను మనోబుద్ధిచిత్తహంకారములను, వదలుటకుందగినయుక్తిం దెలిసిన ప్రమాణాతీతమైన, జ్ఞేయస్వరూపముఁకలవాఁడవుగాన నేదేశమందైన, నేకాలమందైన నేమిసేయుచుండిన, నెట్టులయిన సమస్తక్రియలజ్ఞానకల్పితంబులు. నీవ వికారుండ ప్రపంచశూన్యమైన కల్పనారహితమైన సంపూర్ణమైన నిశ్చలమైన పరిశుద్ధమైన యవినశ్వర సత్యస్వరూపమయిన జ్ఞానస్వరూపమైన యానంద నిర్మలనిరీహాపరిపూర్ణనిర్గుణకూటస్థునికంటె వేఱుగాని పరబ్రహ్మమునని తురీయసమాధిచే నెల్లప్పుడాత్మావలోకనముచేసెడు సత్పురుషునకుఁ బ్రణవాది మంత్రములును, శాస్త్రములునేల. విధినిషేధకామ్యప్రాయశ్చిత్తాదికర్మంబు

లెందుకు జపతపోవ్రతదానయజ్ఞంబు లెందుకు. నామవర్ణాశ్రమాభిమానంబు లెందుకు కూడవుసుమీయనియిట్లనియె. 75

తే॥ వసుధపతిసర్వవాసనా, వాసితంబు
లింగదేహంబుజడమగు, లీలదాని
నంటకవెలుంగుచుండుఁజి, దాత్ముఁడచ్చి
దాత్ముఁడగువానివికృతు లెట్లంటునయ్య॥ 76

వ॥ ఘటముంబొందిన ప్రతిబింబముయొక్క సర్వవిధజలచలనాది వ్యాపారములా బింబమున కధిష్ఠానమయి ప్రకాశింపఁజేయుచున్న రవినంటనట్లు దేహేంద్రియ ప్రాణబుద్ధ్యహంకారములకు దదింద్రియాదులకు స్వాభావికములగు జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలును, ఆదేహేంద్రియాదిధర్మములను వెలుంగఁజేయుచు సాక్షియై ప్రకాశించు సద్రూపుండును జ్ఞానస్వరూపుండునైన పరబ్రహ్మమునంటవు. తెలుచుగా నట్టిపరబ్రహ్మస్వరూపియై యొప్పు బ్రహ్మవేత్తకు వర్ణాశ్రమాచారాది నియమములు గలుగనేరవు. బ్రహ్మవేత్త, కర్తగాఁడు గనుక చతుర్దశేంద్రియ వ్యాపారములు లేవు. బ్రహ్మవేత్త నాకంటె నితరుఁడుగాఁడు. బ్రహ్మసాక్షాత్కారముచే విచారించినచో, బ్రహ్మవేత్తకుఁ బరబ్రహ్మమైన నాకును భేదములేదు. అనఁగా బ్రహ్మనిష్ఠునకుం గేవలాత్మయగు నేనన్యుండఁగాను. ఆబ్రహ్మవిదుండు బ్రహ్మమయిన నాకంటె నన్యుండుగాఁడు. బ్రహ్మజ్ఞానమనునది యజ్ఞానియైన తన్నును విజ్ఞానస్వరూపుండనయిన నన్నునుం దెలియఁజాలమిచే నజ్ఞానసంబునం గానంబడదు. మఱియునతిసుగుణులు నిర్వికారుండనైన నన్ను జ్ఞానదుఃఖమోహాత్మకగుణత్రయ స్వరూపియగు ప్రధానమునంటునప్పుడు సగుణుఁడందురు. ఆప్రకృతిని వదలునప్పుడు గుణరహితుఁడందురు. ఆసంయోగవియోగములు లేవు. గనుక యీరెండునుంగాను, తుమ్మెదలు, మిడుతలు, పక్షులు, సింహములు, లేళ్ళు, కోఁతులు, గుఱ్ఱములు, పాములు, దేవతలు, మనుష్యులు మొదలగు జంగమజంతువులతోఁ బర్వతములు, వృక్షములు మొదలగు స్థావరములతోఁగూడియుం గూడకయునుండక యేకరీతిగాఁ బ్రకాశించుచుండును. అట్టి నేను నీకంటె భిన్నముకాను గనుక నన్నునీవేయని కనుఁగొనుము. అభిమానియగు జీవునకు శరీరము తానె యనెడు దృష్టియే విల్లుగాను నిరంతరము గుణత్రయయుక్తమయిన మనస్సే బాణముగాను దద్బాణమునకు మిగులయుక్తములై కనంబడెడు దురింద్రియవ్యాపారములు లక్ష్యములుగానున్నవి. సమస్తమునకు మనస్సు ప్రధానము. ఆమనస్సునకు ముఖ్యమయినది ప్రకృతి. అట్టి ప్రకృతివదలి తే

వలాత్మయగు నన్నుం జూచిన వెంటనే యాప్రకృతి తనంతం దానె క్షీణయగు. ప్రకృతివికారములు కలది. అట్టి ప్రకృతియొక్క స్వభావముం దెలిసి పరబ్రహ్మమయిన నన్నుం జూడుము. పరబ్రహ్మము నెఱుంగునపుడు ఘ్రానికచేఁ బ్రకృతి యపకారముం జేయుచుండును. మనస్సాకాశమునలె శూన్యమయినదియు, బ్రహ్మసుఖస్వరూపముగాక శబ్దాదివిషయసుఖరూపమగునదియు నంతర్ముఖమయినదిగాక బహిర్ముఖమయినదియు, నానందస్వరూపమయినదిగాక దుఃఖస్వరూపమయినదియుఁ బరాఙ్ముఖమగు బ్రహ్మానందసుఖముగలదియునై, అనఁగా మనస్సు జడమగుటవలన బ్రహ్మానందసుఖము నెఱుంగనేరదు. పరమాత్మ యాకాశమువలెఁ బాడవైనదియు, నంతటఁ నిండియున్నదియునై యున్నది. అట్టియాత్మస్వరూపుఁడైన తన్ను విజ్ఞానశరీరముం దనుభవదృష్టివలనఁ దెలిసికొని జీవించునట్టి బ్రహ్మవేత్తల బ్రతుకే ముఖ్యమగునది. సదసత్తులైన యాత్మానాత్మల యొక్క విమర్శనమందు నేర్పరియగు పండితుండాకాశమెట్లు శరత్కాలమేఘములకు దూరమో యట్లే వికారజన్యదృశ్యప్రపంచముయొక్క సమూహమునకు విముఖుండై ప్రకాశించును. పరబ్రహ్మము శాశ్వతమయినదియుఁ గాలత్రయాబాధితంబైనదియునై యున్నది. అట్టి బ్రహ్మమునందు జ్ఞానమనఁగా బ్రహ్మజ్ఞానము లభింపఁగా మనస్సు మొదలగు పదునాల్గింద్రియములు పరబ్రహ్మముకంటె భిన్నముగానందున శ్రేష్ఠముగా, మనోహరముగా, నానందకరముగానున్నది. అవివేకి ప్రపంచము పరమాత్మస్వరూపమని తెలియుటకష్టము. గురుకృపగల మహాత్మునకు జగత్తు పరబ్రహ్మేతరముగాదని యెఱుంగుట యనాయాసము. అనియిట్లు శ్రీ గురుస్వామి తద్దాసున కుపదేశించి మఱియు నిట్లనిరి॥ 77

ఉ॥ మాయనుమిథ్యగాఁ దెలియు, మాయనుఁ దత్కృతమెల్లఁ గల్లసు
మ్మాయను మేను నేననకు, మాయను సాక్షివి నీవు చూచుకో
మ్మాయనుఁ జూడఁగా నితర, మాయను నేన నిశ్చయించుకో
మ్మాయనుఁ గాక పోసతర, మాయను మానము మాను మాయనున్ 78

ఉ॥ మంచిగురూపదేశమున, మానుగఁ గర్మవిదూరవృత్తుఁడై
యంచితమోహమున్ వదలి, యాశలు మాని నిరస్తలోభుఁడై
వంచన లేక క్రోధగతి, వాలుగ వీడి ధనాదిగర్వముల్
మించినజ్ఞానసంపదను, మేలుగ వీడినవాఁడు పోడిమిన్॥ 79

ఉ॥ నీచతరేంద్రియంబులను, నేర్పున లోఁబడఁ జేయువాఁడు దృ
గ్గోచరమైన ధర్మమును, గూరిమి నెప్పుడు వృద్ధి చేయుచున్

భూచరరూపసంఘముల, భూరిసుకీర్తివహించుపెద్దతా
నౌచుశుభప్రదంబగున, మంచితభక్తిమెలంగుయోగ్యుఁడై॥ 80

వ॥ గురువు తనశిరస్సునందు హస్తముంచి తెలిపిన సత్యస్వరూపము తెలిసినవాఁడుగాను, శమాది షట్కసంపత్తి, సకల సుగుణసంపత్తి, కలమనస్సుగలవాఁడుగాను, సమస్తవిరుద్ధకార్యములు గలదియు, గరళతుల్యమైనదియు నగుపాపసంఘముతోఁగూడిన యింద్రియార్థములకుఁ బరాఙ్ముఖుండుగా నుండును॥ 81

సీ॥ తత్త్వజ్ఞుఁడాదిసి, దగువేత్తలనువుగా, బోధించుశాస్త్రాది,బోధవలన
మునుకొనియింద్రియ, ములనిరోధించుచు,ఁగామాదులన్నింటి, ఘనతమదిని
శోధించివేధించి, శుభ్రతబాధించి, దుఃఖకారణమయి, దుర్భరంపు
గిరులుపాధులవీడిసరసావధీభూతసాదిభూతాదిద్రై, వాదియజ్ఞ

తే॥ దానమయనిరుపాధిక, తంత్రమసద
బాధకానందదివ్యపాథోధియగుచు
రోగములభూరిమానస, రుగ్ణతలను
బాయఁగలనిష్ఠగలవాఁడై, ప్రాజ్ఞతముఁడు॥ 82

వ॥ అణిమాద్యష్టసంపదలుగల గురుశిక్షవలన వస్తుతత్త్వజ్ఞాన మెఱింగినవాఁడును, బద్ధాసనాసీనుండును బ్రహ్మప్రభృతి దేవతలకు నివాసభూతుఁడైన శివునియొక్క యుపాసనానిష్ఠచేత నుపనిషద్రహస్యార్థ విచారజ్ఞానముయొక్క యునికిచేత వికసించినయంతరంగము కలవాఁడయి యనాదియైన ప్రతిబింబములేని నానార్థావభాసకానంద సత్యాసమానధీసాక్షి శ్రేష్ఠమైన జీవునకెడ నెగనియలవాటుచేఁబోఁగొట్టంబడినబడలికగలవాఁడయి, ధనలేశముమీఁదనుదారపుత్రధనభృత్యాదులమీఁద నాసంజేసిమోసపోవక దోసములభరింపక పరబ్రహ్మస్వరూపియైచిద్విలాసుండగుచు, బ్రహ్మవిద్వరిష్ఠులచేతనిశ్చయింపంబడినయుపదేశింపంబడిన,మోక్షప్రయోజనమునునియతితోఁ గూడుకొనుటచే నానందమొందినవాఁడగుచు నసాధ్యమై, మూఢసంజుష్టమైఅనగాఁదిరోధానశక్తిచేఁ గప్పంబడినదై రజస్సత్త్వతమోగుణవిశిష్టమయినదై, సుగుణ నీచమైనదై చెడ్డదై,యొప్పుచున్న యవిద్యాసంబంధమగుమాయాసంబంధమైన జీవేశ్వరరూపములైన భూజలాగ్ని వాయు గగనమనోబుద్ధ్యహంకారములమయమై కనంబడుచుండెడు ప్రపంచముపతితమైనదిగాను, మిగులనశించునదిగాను, అనుభవజన్యజ్ఞానదృష్టిచేఁ జూచిమిగిలినవాఁడగుచు భూర్, భువర్ సువరాదిలోకసృష్టికర్తయై యావెల్లజగంబులనంటని వాఁడగుచు ద్రష్టయైకాలస్థాయియైన నిర్మల పరబ్రహ్మమైవి చేష్టుఁడైన తన్నులెస్సగాఁగాంచి యానదించు

చున్నవాఁడై యభిలషితమోక్షప్రాప్తిం జెందును. బ్రహ్మానేత్రమనస్సును జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను గదలకుండునట్లు హరించునట్లుచేసి చక్కఁగా మనఃకమలమున కాదికారణమగునట్టి యపరోక్షజ్ఞానజన్యమైన యానంద జలధిని శ్రేష్ఠమైనట్టి బుద్ధి, అజ్ఞానములేనియ ట్లేకీభవించురీతిని, మిళితమై యుండఁగా శాస్త్రానుభవహీనులందఱు దూషించిన భూషించిన సుఖదుఃఖములు వచ్చునప్పుడు వానియందుం దగులువడక వానిం బ్రేమఁబోఁబొందుచు నేను బ్రహ్మమగుదునో కానోయను సంకోచమును వదలి సనకాదివందనీయుండనైన నాయందైక్యమగును. గనుక పవిత్రమైన బ్రహ్మభావనచేత నింద్రియముల జయించి మనఃకాలుష్యము నడంచి యెల్లప్పు డేకాంతస్థల నివాసివై నన్ను ధ్యానింపుము. మఱియు నన్ను సత్యజ్ఞానానందస్వరూపునిఁగాఁ జూడందగిన మార్గముం దెలిపెద. నిశ్చితభావంబున వినుము. సంశయంబులడంగు. సృష్ట్యాదికాలము మొదలుగ, ననేకవర్ణంబులు గోత్రంబులు నామంబులు రూపంబులు సుఖదుఃఖ పాపసంఘంబులను హరించుచుండ నేను జననమరణ హీనుండనగుటవలనఁ బూనికతో వీనిం జూచుచుందును. ఇంకం జిలుకలు మొదలగుపక్షులు, గుఱ్ఱములు, సర్పములు, పర్వతములు, వృక్షములు, చతుర్దశభువనములు నశింపఁగా సాక్షినై సమస్తముం జూచు చుందు. శరీరేంద్రియ పంచప్రాణములను, ధీమనోహంకారచిత్తములను దమతమచేష్టలు వదలి సుషుప్తియం దవివేకము నశించుచున్నప్పుడు నేను మిగిలియుండుటవలన నాశరీరాదులయొక్క లేమినంతయు నెఱింగియుందును. గావున నంతఃకరణాదివృత్తులు తమతమ వ్యాపారాభిముఖము లేనప్పు డవిలేవనెడి యనుభవముం జక్కఁగాఁ దలంచుచు ననుదిన మవస్థాత్రయమువచ్చుచుం బోవుచుండఁగా నేకస్వరూపుండనై వానిని నిరంతరముం జూచుచుండుటవలన నవి నశ్వరరూపుండను జాగ్రదవస్థలయందుస్వప్నసుషుప్తులు,స్వప్నంబున సుషుప్తిజాగరణంబులు గాఢనిద్రయందు స్వప్నజాగరణములు కలిగి యుండఁగా నేను గాలత్రయములందుం జూచుచుందును॥ 83

చ॥ తనువనుభూమియందుఁ, బటుధాటినవస్థలుమూటియందునుం
ఘనముగనేకరూపమునఁ గాంతినినొక్కదినంబునందు నం
దొనరఁగనుండునట్లుగమ, హోద్ధతినేగినకాలమందువే
యనుపమవర్తమానమున, నారయవారసుపక్షమందునన్॥ 84

ఉ॥ మానసములందునబ్దముల, మానుగఁగల్పవినాశమందునన్
వీనముమారకేనుదగు, వీలుగనొక్కటనుందుఁగావునన్

దానవశ్రేణ్యా, నిక్కమిది తద్దయుసత్యసురూపినాచు నే
నీసకలేంద్రియాదులన, నీదృశదీప్తిగమింతు నంతటన్॥ 85

శా॥ నేనుంగాననిభావమందు నెపుడున్, నిక్కంబుగా నెంచినన్
భూనాథాగ్రణి, బాహ్యకాంతరములన్, భూదృశ్యసంఘంబులన్
నానాబాధవివర్జనాదులగునే, నద్వైనతిన్ సాక్షినై
యానందంబునఁ బ్రజ్వరిల్లుచును ని, త్యంబొప్పుదున్ మేలుగన్॥ 86

వ॥ పంచప్రళయ వివరణము, మఱియు లఘువర్ణముచ్చరించునంతకాలము నిమేషము. అట్టినిమేషములు పదునెనిమిదియగునేని కాష్ఠయగును. ఆకాష్ఠలు ముప్పదియైనచోఁ గళయగును. ఆకళలుముప్పదియయ్యేనేని క్షణమగును. ఆక్షణములు పండ్రెండయ్యేనేని రెండుగడియలకాలమగును. ఆముహూర్తంబులు మూఁడుపదులయ్యేనేని నొక్కపగలు రేయియునగును. దీని నేయహోరాత్రమందురు. అట్టిదినమందు స్థూలసూక్ష్మకారణశరీరములును, దశేంద్రియములును దశవిధప్రాణములును, అంతఃకరణంబులును, మనస్సును, దమతమవ్యాపారములవదలితమకుంగారణమైన నిద్రారూపమగు నజ్ఞానమనెడు నంధకారమందు హరించును. అట్లు క్షీణించినపుడు జాగ్రత్స్వప్నరూపమైనదియు, సకలేంద్రియరూపమగునదియునగు ప్రపంచము పృథివియందు గంధగుణమువలెనున్నదయి చిగుళ్లు, ఆఁకులు, పుష్పములు కాయలు పండ్లు వేళ్లు, శాఖలు, చిఱుకొమ్మలు, ఇవియేస్వరూపముగాఁగల వటవృక్షము వటబీజము నందును ననేక విధ వర్ణములు గల నెమిలి తన గ్రుడ్డులోని నీటియందున్న విధమునఁ బ్రకృతిలో లీనమయి యుండును. దీనినే, దినప్రళయమందురు. అట్టి పదునైదు దినములొక పక్షమగును. నెలకట్టి పక్షంబులురెండు, శుక్లపక్షము కృష్ణపక్షమనంబడును. ఇట్టినెలపితృదేవతలకొక్కదినమగును. ఇట్టినెలలురెండయిన నొక్కఋతువు. మూఁడుఋతువులొక్కయయనము. అట్టియయనములుత్తరాయణ దక్షిణాయన నామకములురెండైన నొక్కసంవత్సరము. అట్టిసంవత్సరము దేవతలకొక్కదినము. ఇట్లానిర్జరులదినములు వారములునెలలు. వీనిక్రమముచే ద్వాదశవర్షంబులయ్యేనేని మానవులకుఁబదునేఁడు లక్షల యిరువదియెనిమిదివేల సంవత్సరములుగల కృతయుగము. పండ్రెండులక్షల తొంబదియాఱువేల సంవత్సరములు గల త్రేతాయుగము, ఎనిమిదిలక్షల యఱువదినాల్గువేల సంవత్సరములు గల ద్వాపరయుగము. నాలుగులక్షల ముప్పదిరెండుసంవత్సరములుగల కలి

యుగమతిక్రమించును. ఈనాలుగుయుగములొక్క మహాయుగమనంబడును. అట్టిమహాయుగములు డెబ్బదియొక్కటియైన మన్వంతరమగును. అట్టిమన్వంతరములు పదునాలుగైన బ్రహ్మకొక్క పగలగును. ఆపగలు వేయిమహాయుగముల పరిమితిగలకాలము. అట్టిబ్రహ్మదేవుని పగటియందే పదునల్గురుమనువుల ప్రళయములును, ననేకయుగసంధులుగల ప్రళయములుజరుగును. ఆప్రళయములు నైమిత్తికప్రళయములని, యాగంతుకప్రళయములని,ప్రసిద్ధములు. ఆవిరించి పగటియందు ననేకప్రాణసంఘములు నశించును. ఆదినాంతమందు బ్రహ్మనిద్రించును. ఆనిద్రమహామాయయనంబడును. ఆమాయయందు సకలజీవులప్రవర్తనములు విరామమునొందును. ఆకాలమునందుఁ బంచమహాభూతములు మాత్రను మిగిలియుండును, అది ధాతయొక్క పగటియందుఁగలిగెడు ప్రళయమనంబడును. ఆబ్రహ్మదినసంఖ్యాప్రమాణముచేత,నూరేండ్లైనేని బ్రహ్మసుఖస్థానముంబొందును.(అనఁగామరణించును)ఆబ్రహ్మమరణకాలమందు మృత్యువు సర్వప్రాణులనొక్క పెట్టునఁ జంపును. అప్పుడు నేనుఫాలనేత్రముం దెఱచిచూతును.రవి ద్వాదశరూపంబులఁ ధరించిప్రకాశించును. ఆకాలమందుమిక్కిలివెలుంగు నగ్నిపుట్టిప్రపంచమంతయునీఱుచేయును. సప్తవాయువులు స్వేచ్ఛగావీఁచును. నవమేఘంబులు విడివడిసాంద్రతర వర్షంబులఁగురియును.ఆవానచే సప్తసముద్రములుచేరి యేకజలంబై భూమండలమును ముంచును.అట్లుముంచునపుడు భూచక్రమాప్రవాహజలమధ్యమందుఁ జిన్నమృత్పిండమువలెఁగరగిపోవును.తప్తంబగునయఃఖండంబొకనీటిబొట్టునుబీల్చినవిధంబున బడబాగ్నివిజృంభించి యాజలముంద్రాఁగును. గాలి దీపమును మలిపినట్లు తద్బడబాగ్నిని గొప్పగాలి నశింపఁజేయును.ఆపెనుగాలి నిరాధారమగుటవలన గగనమంతటవ్యాపించి జీవులు నిద్రయందు నశించు విధమున నాయాకాశమందేనశించును.శబ్దగుణకమైన యాకాశము శ్రవణేంద్రియస్వరూపమైన మనసు మ్రింగినట్లా మహాగగనమును గొప్పదైనయామనస్సుమ్రింగును. శబ్దస్పర్శరూపరసగంధములనెడు పంచతన్మాత్రలతోఁగూడిన యామనస్సును నిద్రాసమయము మ్రింగినట్లు మహదహంకారముమ్రింగును. ఆయహంకారమును సమష్టిజ్ఞానముకబళించును. ఆసమష్టిజ్ఞానమును మహత్త్వమందురు. ఆమహత్త్వమును మూలప్రకృతి తనలోఁజేర్చికొని మఱుగుపఱచుకొనియుండును. ఆమూలప్రకృతియే మాయయనియు నవిద్యయనియు నవ్యక్తమనియుఁ దమ

స్సనియు సుషుప్తియనియుఁ బ్రకృతియనియు నానందమనియుంజెప్పంబడు. అట్టితుద మొదలు లేనిదియు నిట్టిదట్టిదని చెప్పఁగూడనిదియునగునజ్ఞానము. అట్టియజ్ఞానము సద్గురుబోధితజీవేశ్వరులయొక్క (త్వంపదలక్ష్యార్థమైన శుద్ధప్రత్యగాత్మజీవుఁడు తత్పదలక్ష్యార్థమైన పరిపూర్ణబ్రహ్మచైతన్యము, ఈశ్వరుఁడు) ఐక్యజ్ఞానానుభవకాలమందు నశించును. అట్టియజ్ఞాననాశమే మహాప్రళయమనంబడును. ఈప్రళయమునే యత్యంతికప్రళయమనియుంజెప్పుదురు. ఇట్టినిత్యనైమిత్తికదైనందిన కల్పాంతమహాప్రళయములయందు దేనిచే బాధింపంబడక సాక్షినై యాప్రళయములనన్నింటింజూచుచుఁ గాలత్రయమందు నొక్కతీరుననే యుండుటవలన సర్వకాలపరిచ్ఛేదశూన్యుండనగుదును॥ 87

క॥ ఇదికలశంబిదివస్త్రం బిదిగేహంబిదియుగోడ, యిదిగహనంబా
నిదిగోత్రంబిదిభూమియు నిదియుదకంబంచుఁబలుకు, నింపలరంగన్॥ 88

ఉ॥ ఈతఁడువహ్నియానిదియు, నింపగువాయువటంచుఁబల్కుతా
నీతఁడుద్వాదశాత్ముఁడగు, నెప్పటికియ్యదియేవలాహకం
బీతఁడెయోషధీశుఁడగు, నీతనిప్రక్కలవెల్గుఁదారలం
చాతతదీప్తినుండునవి, యానుగ్రహంబులటంచువెండియున్॥ 89

ఆ॥ ఇవియచేతనంబు, లివియచేతనములు। టంచునీతఁడాతఁడనఁగఁ బరఁగు
చున్నవాఁడితండె, సుస్థిరమ్ముగనంచు। వెలయుచుండు నెపుడు వేడ్కమీఱ॥ 90

తే॥ అట్టినాకంటె వేఱగు, ననెడిజడము। లైనబాహ్యపదార్థసం,హతులనెల్ల
సాధనములేకయరిగెడి, సాక్షినగుట। నేనుజిద్రూపకుఁడసుమ్ము, నీరజాక్ష॥91

వ॥ ఇదిదేహంబు, ఇదియింద్రియదశకంబు, ఇదివిషయపంచకంబు, ఇదిప్రాణవాయువు, ఇదిమానసము, ఇదిచిత్తము, ఇదియహంకారము, ఇదిబుద్ధి, ఇదిజ్ఞానము, ఇదియజ్ఞానము, ఇదికామము, ఇదిక్రోధము,ఇదిలోభము,ఇదిమోహము, ఇదిదీర్ఘక్రోధంబు, ఇదిమదంబు, ఇదిజాగరణంబు, ఇదిస్వప్నంబు, ఇదిసుషుప్తి, ఇదితురీయంబు, నాయెదుటంగనంబడు నంతర్దృశ్యములన్నింటిని నెల్లప్పుడే సాధనములేక సాక్షినగుచు నేనెఱుంగుదుంగావున నిత్యనిర్మలచిత్స్వరూపుండను, మఱియుందలంపఁగా నెప్పుడుక్రమముగా లభ్యమగుదుఃఖములను దొలంగునటుల వీక్షించుచునధికముగాఁ జలనములేని సుఖాతిశయమునుంబొందుచుండుటకుఁ గోరుచుందుంగనుక నేను నిరతిశయానందరసమునకు స్థానభూతుండనయియుందును. ఆహేతువుచేత బ్రహ్మానందస్వరూపుండఁ జుమీయని మఱియునిట్లనియె॥ 92

తే॥ సకలకష్టాత్మకంబైన, సాంద్రవిషయ
పుంజమత్యంతసుఖకమై, పొసఁగుచెల్ల
మిగులనానందమయుఁడనై, మించునాదు
నవ్యప్రతిబింబమునఁగదా, శ్రావ్యచరిత॥ 93

తే॥ నాకుభేదంబుకల్పిత, నటనఁద్రోఁచు। సుఖము సహజమునాకగు, సూరివర్య
యట్లుగావుననిరతిశ,యాప్రమేయ। నిరుపమానందమయుఁడను,నేనుభూప॥ 94

వ॥ అఖండలక్షణము ఇట్లుకాలత్రయంబువలన బాధింపంబడని హేతువునఁ దనయం దభ్యసింపంబడిన సమస్తపదార్థ భాసకత్వంబువలనను మహత్తరానంద రసాశ్రయుండనగుటవలనను సత్యజ్ఞానానంద స్వరూపకుండనైన నేను మణి కనకరజత తామ్రలోహ కాంస్యమృణ్మయకలశములయొక్క లోపలవెలుపల నంటక మిన్నా నరించియున్నట్లు గగనవాయు తేజోజలభూదేవ మానవపశు పక్ష్యాదుల చరాచరంబులయందు లోపలవెలుపల సంబంధములేనివాఁడనై పూర్ణుండనగుటవలన నాకుదేశముచేతంజేయఁబడిన భేదములేదు. వచింపం గూడని ప్రకృతిచేత నిర్మింపంబడిన కాలత్రయమందు నొక్కరూపముచేత ద్రష్టనైయుండి తత్కాలత్రయంబును నన్నిటిని నిరంతరము విషయములని తెలియుటచేతఁ గాలకృతపరిచ్ఛేదంబు కలుగదు. మఱియుంజెట్టునకు మఱి యొకచెట్టు తనజాతికలదై శిలాదులు పృథగ్జాతికలవై పత్రపుష్పఫలాదికం బులు తనయందుంగలవై వెలసినట్లు మాయామయమగు నీలోకంబునశించు నదియగుటవలనఁ గరచరణాద్యవయవశూన్యమైనదియు నంతటనిండియున్న దియు దేనితోడంజేరనిదియునైన యాకాశమునకు శూన్యరూపమేనైజమై నందునఁ గుందేటికొమ్మున్నదియు లేనిదియుఁగానట్లు తనజాతివలనంగలిగిన వేఱొక్కజాతివలనంగలిగిన స్వగతంబులు అనఁగాఁదన్నుఁబొందియున్న భేద ములుకానేరవు. ఈత్రివిధభేదములులేకుండుటవలన వస్తుకృతపరిచ్ఛేదంబు శూన్యంబగును. ఇట్లు దేశకాలవస్తుకృతభేదము లేకపోవుటవల్ల నద్వితీయ పరిపూర్ణప్రత్యగభిన్న పరబ్రహ్మచైతన్యంబగుదునని వెండియునిట్లనియె॥ 95

తే॥ సచ్చిదానందమయుఁడనై, సాంద్రముగను
వెలుఁగుననునేనటంచును, దెలిసియున్న
వేత్తలందఱుముక్తిని, వేగనంది
మత్స్వరూపాత్ములైధాత్రి, మనెదరయ్య॥ 96

మ॥ అనియీరీతిని బోధచేసి సుగుణాత్మానందరూపుండనన్
ఘనుఁడై యుండెడినీలలోహితుని శ్రీకల్యాణపాదాబ్జమం
దనువందన్ నిజభక్తిచే శిరమునన్ వ్యాపింపఁగాఁ జేసియ
య్యనఘుండత్తఱి వందనంబుసలుపన్, సాంబుండు సానందుఁడై॥ 97

వ॥ నిజభక్తుండగు నారాజోత్తముంగాంచి యప్పు, డాతని శిరంబను పూర్వా
ద్రిశిఖరంబుపై నభయహస్తం బనెడు నపరోక్షజ్ఞాన కిరణములతోఁగూడిన
సూర్యమండలము డాయంగఁజేర్చి తనరు నీహస్తమస్తక సంయోగము నిప్పు
డే తెలివి యెఱుంగుచున్నదో యాతెలివినీవు. ఆతెలివి నీవని తెలుపఁగానే
ప్రజ్ఞానమెఱుంగు చున్నదో యాప్రజ్ఞానమే నీవనెడు స్వయంప్రకాశముచే నా
రాజోత్తముని బుద్ధియందుఁ బొందియున్న జగత్సృష్టికిఁ బూర్వమందున్న య
జ్ఞానాంధకారమెల్లఁ బాపి కేవల బ్రహ్మస్వరూపముం గనఁబఱచెను. అటు
పిమ్మట నాశిష్యోత్తముం డంతర్హృదయాకాశమందుఁ గనంబడుచు శోభిల్లు
చు మనోహరముగా మాటిమాటికిం గదలుచున్న యమృతములైనవిషయ
ములను పోఁకుచున్న యింద్రియములతోఁ గూడిన యధికసమర్థమైన యం
తఃకరణవృత్తియందుంచఁబడిన చిత్కళయొక్క యగ్రమే నివాసముగాఁ
గలదియును మిక్కుటమైన తన తేజస్సుచేత వెలింగింపఁబడుచున్న జగద్బీజ
కోశము స్వయంజ్యోతిని జూచెను॥ 98

ఆ॥ అట్టితన్నుఁగాంచి, యానందమూర్తియై
చిత్రరూపమట్లు, చేష్టలుడిగి
తనువుమఱచి కొంత, తడవూరకుండెనా
యవనివిభుఁడు భవుఁడు, హర్షమంద॥ 99

తే॥ కొంచెమైననవిద్యను, గూడనట్టి। ఘనులఁబొగడంగఁజాలరు, మనుజులవని
సకలజగములనెఱిఁగిన, సరసవరుల। నుతులఁజేయంగశక్యమే,నోటికొలఁది 100

తే॥ మంచిసుజ్ఞానయోగ స,మాధినొంది
ప్రబలి యానందమూర్తియై, ప్రజ్వరిల్లు
భూతలేశ్వరుఁడయ్యెడఁ, బొందుగాను
శివునిఁ బొడఁగాంచి యిట్లనెఁ, జిత్తమలర॥ 101

తే॥ మ్రొక్కి మూఢతవీడి స, మ్మోదమలర
భక్తితోడుత యోగాను, భవమునొంది
నిలిచియున్నట్టి శిష్యుని నెమ్మిఁజూచి
శివుఁడు కౌఁగిటఁజేర్చె సు,శ్రీవెలుంగ॥ 102

వ॥ ఇత్తెఱంగున మన్నించిన నయ్యవనీపతి యయ్యుమాపతి కనేకవిధ పూజాపుర స్కారస్తోత్రంబు లొనర్చెనన విని హరిప్రియ యటుపై నాశిష్యోత్తమునకుఁ బశుపతి యేమియుపదేశించెనని నీరజాక్షుం బ్రశ్నించిన విష్ణుఁట॥ 103

సీ॥ ప్రణవాంతరావాస, ప్రణవస్వరూపక, ప్రణవజ్ఞప్రణవవి, పాకతుంద
ప్రణవార్థవేదివై, ప్రణుతినొందెడువాఁడ, ప్రణవార్థదృష్టిని బ్రబలువాఁడ
ప్రణవవేద్యా నీవు, ప్రణవాధినాథతఁ, బ్రణవసంజనియందుఁ, బ్రథమకార
ణుండవు పాపాప, నోదనదక్షుండ, వఖిలస్వరూపమై, యలరువాఁడ

తే॥ నీమహత్త్వంబు సూరిమ, ణిప్రకాండ
గమ్యమైయుండు నిత్యంబు, గణుతిఁ గాంచు
కార్యకారణకలనంబు, గల్గువాఁడ
నిత్యవిజ్ఞానధనమతుల్, నించువాఁడ॥ 104

వ॥ మఱియు వికారములులేనివాఁడా, వ్యాధులులేనివాఁడా, గుణత్రయరహితుఁడా క్షరాక్షరాతీతుఁడా, యఖండానందనిశ్చితస్వరూపుఁడా, చరాచరనిర్మితసమ స్తసంసారధారిజీవకూటస్థవ్యత్యస్తుఁడా, బ్రహ్మవేత్తలకు గోచరించువాఁడా, సూర్యచంద్రాగ్ని తేజోధికతేజస్సుగలవాఁడా, నిత్యనిరతిశయానందముఁగల వాఁడా, ప్రణవరూపప్రపంచగర్భముగలవాఁడా, మాయావ్యతిరిక్తుఁడా, సృష్టి స్థితిలయకారకుఁడా, అణిమాదిసిద్ధ్యష్టకప్రదుఁడా, చిచ్ఛక్తికిస్థానమైనవాఁడా, వేదవేద్యుఁడా, వేదస్వరూపుఁడా, వేదవాఙ్మండనుఁడా, యుపనిషదర్థసంగ్రా హకజ్ఞేయుఁడా, చతుష్షష్టివిద్యాధారుఁడా, బ్రహ్మజ్ఞానప్రదుఁడా, యజ్ఞఫల దుఁడా, మంత్రప్రభావప్రదర్శకుఁడా, మంత్రాధారదైవతస్వరూపుఁడా, యర్చ నాఫలసంధాయకుఁడా, యనంతనామప్రభావుఁడా, యార్తజనరక్షకుఁడా, గురుజ్ఞానధురంధరుఁడా, సంకల్పాతీతుఁడా, బ్రహ్మజ్ఞానసంపన్నిధాన ప్రణవ ప్రభావపరమాధార సుగుణగణనాప్రకాశకుఁడా, సర్వభూతాంతర్యామిత్వ సమస్త ప్రపంచాతీతత్వసాంద్రతరరసైకస్వరూపత్వసత్త్వప్రధానుఁడా, దేవ దేవుఁడాయని వెండియునిట్లనియె॥ 105

మ॥ ప్రచురంబైన పరాపరప్రకృతిసంప్రాప్తుండవై మాయయం
దుచితంబైనవశంబుగైకొని సదా,యుద్భావవేత్తృత్వసం
శుచిశక్త్యుజ్జ్వలితుండసర్వమునకున్, సొంపారుకర్తృత్వతా
ఖచితోద్భూతసమస్తభూతగురుతా, కల్యాణసంధాయివై॥ 106

తే॥ సర్వరక్షకుఁడవుసర్వ, సంహరణుఁడ
వౌదుసర్వేశ్వరుండవు, హరిసర్వ
గురుఁడవౌసర్వసాక్షివి, యరయసర్వ
తోముఖుండవు జగదాళి, తోషకుఁడవు॥ 107

తే॥ నిర్వికల్పనిరంజన, నిర్వికార నిర్గుణ బ్రహ్మమైయొప్పు, నినుభజింతు
సంతతంబాత్మమయతనా, సాక్షాత్కరింపు। శ్రీసదాశివపార్వతీచిత్తచోర॥ 107

తే॥ పరిణవరూపప్రపంచసం, పత్తియందు। నేనువెలుఁగుచునుండుదు, నిర్మలముగ
నాప్రపంచంబునాయందు, నలఘుచరిత। ప్రజ్వరిల్లుచునుండును, బ్రబలముగను॥

తే॥ అరసియట్లాటఁజూచున, మంచితముగ। యుక్తియేభవదీయమా, యోగమాయ
యిట్టియోగసుదృష్టిచే, నెపుడునిన్ను। సేవకనుగొంచునుండెదు, నీయునికిని॥ 109

తే॥ కంటిమీకృపచేతను, గమలనయన। యిఁగమఱొక్కవరంబున, నుగఁగవలసె
గరిమనీస్థితినాస్థితి, గాభజించు। సలలితాభేదదృష్టినో, సంగుమయ్య॥ 110

వ॥ శాంకరియనియు, దేవియనియు, దుర్గయనియుఁ, ద్రిగుణాత్మకయనియుఁ బ్రకృతి యనియు, నెప్పుచున్న నీయొక్క ప్రభావ మపరాప్రకృతియనియుం బరాప్రకృతియనియు ద్వివిధమై ప్రకాశించుచుండు; అపరాపరప్రకృతిద్వయమందుఁ జతుర్వింశతితత్త్వస్వరూపిణియైన యపరయే దైవియు, నాసురియు, ననరెండుతెఱంగులం జెప్పంబడు. అందులో దైవియనునది శుద్ధసత్త్వప్రధానమైనది గనుక విద్యయనియు, మాయయనియుఁ జెప్పంబడుచున్నది. ఆసురియను నవిద్యమాయనుబొంది నీవేమాయాసంబంధముచే నీశ్వరుండనునట్టియు, నవిద్యాసంసర్గముచే జీవుండనునట్టియుఁ, బేళ్ళచే నొప్పుచుందువు. విద్యావిద్యారూపప్రకృతసంబంధముచే నీశ్వరజీవసంజ్ఞలును సమష్టివ్యష్టిజాగ్రత్స్వప్నసుషుప్తులు, సర్వజ్ఞత్వకించిజ్ఞత్వాదులుగలవాఁడవై యీప్రకృతుల నీజీవేశ్వరుల సాక్షివై చూచుచుండుటవలన షడ్భావవికారశూన్యుండవు, మఱియు నపరాప్రకృతి యవిద్య, క్షరము, క్షేత్రము మొదలగు పదములచేఁ బలుకఁదగిన ప్రకృతియొక్క సమీపమునందుండుటవలనఁబుట్టిన బ్రహ్మప్రకృతులయొక్క శ్రేష్ఠమైనప్రతిబింబములయొక్క కూడికచేనైన మిథ్యాతాదాత్మ్యముచేత నాప్రకృతియే పరాప్రకృతియను నట్టియు, విద్యయనునట్టియు, క్షరమను నట్టియు, క్షేత్రజ్ఞుండనునట్టియు, సత్తనునట్టియుఁ, బురుషయనునట్టియుం బేళ్ళచేతఁ బ్రకాశించు, నేనపరపరయనెడి ప్రకృతిద్వయముకంటె వ్యతిరిక్తుఁడను. ఆప్రకృతి వికారములులేనట్టియు, నాప్రకృతుల నంటనిసాక్షినై ప్రకా

శించురీతిం దెలిసికొనినపిమ్మట నీయుపదేశసంజనిత జ్ఞానముచే శరీరేంద్రియాదికము నేఁగాను; తత్సాక్షినని తెలిసి (అనఁగా నపరోక్షజ్ఞానముచే నవిద్యోపాధి జన్యమైనసాక్షి సర్వజ్ఞత్వాది ధర్మముల నిషేధించి సచ్చిదానంద నిత్య నిర్మలమైన నీస్వరూపమును సేవింతును. బ్రహ్మజ్ఞానవిరక్తియుం బ్రకాశమానమైన బ్రహ్మజ్ఞానమును సాటిలేని సద్రూపానంద పరిపూర్ణముల నెడు పంచ లక్షణలక్షితైశ్వర్యమును, మహాకర్తృత్వభోక్తృత్వత్యాగిత్వాద్య పరిమితప్రభావమును నవిచ్ఛిన్నకీర్తిని సమగ్రమోక్ష సంపదనుగలిగి సంపూర్ణకృప నంతర్బాహ్యేంద్రియముల నిగ్రహమును, సూర్యచంద్రాగ్ని కాంతులను, మీఱినగొప్పతేజస్సు, మహోగ్రమగు త్రివిధతపస్సు, బ్రహ్మము సత్యమనుట, యంతర్బాహ్యపరిశుద్ధి, ద్వంద్వసహనము, ఋజుభావము, అనుసిము దలుగాఁగల గుణములచేఁ బ్రకాశించుచుండఁగాను శివజీవైక్యమునకుంగారణమైనట్టియుఁ, గారణోపాధిమైనట్టియుఁ జతుర్వింశతితత్త్వరూపమైన ప్రపంచమును బాలింపఁగాను సచ్చిదానందలక్షణములు గలిగినట్టియుఁ, ద్రిగుణాత్మిక ప్రకృతితోఁగూడినట్టియుఁ గూడనట్టియు స్వరూపముఁగలపరమాత్మవైన నీవెల్లప్పుడు ప్రత్యగాత్మస్వరూపముచేత బాగుగా దర్శనమివ్వు సాంబ శివాయని మఱియునిట్లనియె॥ 111

సీ॥ ఘనఘటాకాశమా, కాశాంశమగుచును, మేఘంబునకు వేఱు, మెఱయునట్లు
క్షరముతోఁగూడియ, క్షరుఁడనై విలసిల్లు, నేనునీయంశంబు, నిశ్చయంబ
యైననమాద్యవి, ద్యాశక్తిగుణరాశి, నాయందునారోప, ణమునవిలిపి
జీవుండనఁగుచుసం, సృతిఁజెందియుండితి, నిందాకనదియిప్డుఁ జెఱఁగికొంటిఁ

తే॥ గానవివరింపభేదమిం, తైనఁగలుగ! దిట్టివిజ్ఞానసంపద, నెల్లప్రొద్దు
చిత్తమందుఁబ్రకాశింపఁ, జేయుమయ్య!శివమహాదేవశాంభవీ,చిత్తచోర॥ 112

తే॥ నిన్నునువినాగవేఱొండు, నెన్నఁడెఱుఁగ
నెట్లనఁగఁ దెల్పెదను విను, మింపుమీఱ॥
నామహానుభవంబెల్ల, నధిపవినుము
సకలమానింద్రియములకు, సరసముగను॥ 113

తే॥ జగమువిషయంబయావిశ్వ, చారురూపుఁడవుగదానీవుతలఁచుట, డంబమంద్రు
గాననీవుప్రసన్నతఁ, గానిపించి! తివిగదాయిప్పుడీవిశ్వ, జవముకనఁగ॥ 114

తే॥ అనుచునెంచెడి యజ్ఞాన, మడఁగిపోయె
నీదయామయ దృష్టిచే, నెమ్మివెలుఁగఁ

బటిమనానందమూర్తిఁ నై, ప్రబలితయ్యె
సంశయము లేదుగానియీ, సర్వజగము॥ 115
తే॥ సమరసజ్ఞాన వాంఛను, సంతతంబు। లభ్యమౌనట్లు సెలవిమ్ము, లలితముగను
బరమకారుణ్యసాగర భవ్యచరిత। శివమహాదేవశంకరా, శ్రేయమలర॥ 116
సీ॥ ఇరువదినాల్గగు, నింపైనతత్త్వాల, కాదినాయకుఁడవు, హరిచరిత
పంచవింశకుఁడవు, ప్రకృతికింబరుఁడవు, గురుఁడవుపరమేశ, గుర్తుగాను
బురుషవర్యుఁడవయ్య, పొందుగానీవును, బురుషేశ్వరుండవు, పూర్ణుఁడనఁగఁ
బరఁగునిన్నెఱిఁగిఁ, ప్రబలంబుగానేన, యీజ్ఞానముండదే, యొప్పుఁడనఁగ
తే॥ నలరునజ్ఞాన కార్యదే, హరికాత్మ। సంతతాభ్యాస విఖ్యాతి। చారిమమున
నట్లుగావునఁ గేవలా, త్మాత్మయోగ। దృష్టిగలుగంగ జేయుము, దేవదేవ॥ 117

తే॥ అనుచు నీరీతిఁ ప్రార్థిమ, నధిగమించు
నటుల వినఁగోరు భూవరు, నాననంబు
సాదరంబుగఁజూచి యా,సాంబశివుఁడు
భూరిదయతోడ నిట్లనెఁ బొందుగాను॥ 118

మ॥ నిరతానందము నొందునట్లు మనముఁ నిశ్చేష్టితంబైన యా
వరయోగానుభవంబుచేఁ గలుగు, తత్త్వజ్ఞానసంపన్నమౌ
పరమాహ్లాదసమాధిఁగోరితివి సం,భావించి నేనిప్డుఁ
సరసాంకా,యమనస్కభావమును స్వే,చ్ఛఁ దెల్పెదఁ భూవరా॥ 119

ఉ॥ తేలికగాను వారిధులు, తీవ్రతనట్టిటులొక్క పెట్టునఁ
వాలుగనీఁదవచ్చును గు,భాలునగోత్రము లెత్తవచ్చు బల్
లాలనతోడ మేఘముల, లాగి తటాలుననూపవచ్చు నీ
కాలములో ననున్మనినిఁ, గ్రక్కునఁదెల్పఁగరాద యేరికిఁ॥ 120

వ॥ కావున నామనోన్మనీయోగము బ్రహ్మవేత్తలకే గ్రహింపఁ గష్టమయినది. బ్రహ్మవిచారదూరులకెట్లు లభ్యమగును, భావమునందుఁ బ్రకృతినిఁ బరమాత్మను జక్కఁగాఁ దెలిసికొనుజ్ఞానముగలవానికి, శాశ్వతసౌఖ్యప్రదమయిన యీయమనస్కరాజయోగము సులభప్రాప్యమగును. వివేకుల యీ యమనస్కరాజయోగము, పుష్పములంగోయుటకంటెఁ గన్నులమూయుటకంటె ననాయాసముగం బొందదగినదియు సౌఖ్యకారియు నూత్నంబును నైయున్నది. అమృతపానంబుభంగి రాజయోగముంబూని యహర్నిశమభేదముగాఁ గేవలాత్మయైన తన్నుంజూచునట్టి బ్రహ్మవేత్త నాముక్తికాంత

పరిగ్రహించును. మృత్యుంజయత్వముంబొందినయట్లు రాజయోగమును ధరించి రాత్రియుంబవలభేదముగాఁ గేవలాత్మమైన తన్నుంజూచునట్టి బ్రహ్మవేత్త నయ్యమృతాంగన పరిగ్రహించును.

సీ॥ సారపదార్థంబు, చక్కఁగానరయుచుఁ, దానెల్లనిగమముల్, తడయకెపుడు
చదివిననైనను, జారువిశిష్టమౌ, నేమంబులను నరుల్, నెఱపుచుండి
జపములు తపములు, సక్రమంబుగఁజేసి, సకలతీర్థంబుల సంచరించి
గౌరవంబలరారఁగానుండినను మహా, రాజయోగబలంబు, రాదుసుమ్ము

తే॥ కానఁ బరమ రహస్యవిజ్ఞాన నిలయ
మైన దమనస్క యోగంబు, దానిమర్మ
మెల్ల నీకెఱిఁగింతును, జిల్లతాఖ్య
సూక్ష్మదృష్టిని గనుమది, సుకరముగను॥ 122

వ॥ పృథివ్యాది సమస్తస్థూల ద్రవ్యములును, బరమాణ్వాది సమస్తసూక్ష్మద్రవ్యములును ద్రష్టయును, బ్రమాణమును, దర్శనమును, బ్రమాణములచే నిర్ణయింపఁదగినవియును మనస్సుకంటె భిన్నములుగా నివియును, నభిలాషయు, సకలేంద్రియముల కనుకూలపదార్థలబ్ధివలనఁ గలిగిన ప్రీతియును, జతుర్దశేంద్రియములకుం బ్రతికూలలభ్యపదార్థమువలనఁ గలిగిన ద్వేషమును, బహులసంపదంజూచి యోర్వకుండుటయు, ననునివిమొదలగు ప్రవర్తనములు మనోరూపంబులే, వర్ణాశ్రమములకుందగినసకలపుణ్యకార్యంబులాగామి సంచితప్రారబ్ధముల రూపసంబంధమును నట్టిబంధవిమోచనమును, మనస్సుకంటెనన్యముకాదు. ఇట్లుచెప్పనేల. నామరూపయుక్తమైన ప్రపంచమంతయు నీవుప్రపంచముగా నెఱింగినదంతయు మనస్సుకంటె భిన్నమే యనంబడును॥ 123

తే॥ సర్వసంసారమును మాన,సముననొదవు
సర్వసంసారమును మాన,సముననుండు
సర్వసంసారమును మాన,సముననడఁగు
సర్వసంసారమును మాన,సంబెయగును॥ 124

మ॥ మనముల్గాఢసుషుప్తిలోఁగలిసినన్, మాన్యంబుగానేమియున్
ఘనతన్దోఁపకయుండునమ్మనము మే,ల్కాంచంగ నీలోకముల్
నెనరొప్పంగనుపించుచుండును సదా,నిర్బంధమోహాది వ
ర్తనమేకారణకార్యసంఘముల నా,ర్యత్వంబునిప్పించెడిన్॥ 125

వ॥ ఆమనస్సు కార్యాకారంబై సంకల్పంబుసంసారంబు సర్వవాసనామయంబు బంధమోక్షకంబన నొప్పు. కారణాకారంబై యవిద్య, ప్రకృతి, యజ్ఞానంబు మాయయనందనరు. అట్టిమానసంబు లేమియ యమనస్కంబగుటం జేసి॥ 126

ఉ॥ త్రాడునుజూచి సర్పమని, తథ్యముగా భ్రమఁజెంది వేగమే
చూడఁగరజ్జువయ్యెమఱిఁ, జోద్యముగా నొకదారువుఁ గనఁ
వేమఱఁగోడమర్త్యుఁడను, పీలుజనించినభ్రాంతివీడఁగా
నేఁడదిదారువైనవిధి, నిల్కడనాత్మనకన్నిశూన్యమా॥ 127

వ॥ అదెట్లనిన గగనమందు భూసంబంధము చేత నలుపు మొదలగు రంగులుతోఁపఁగా నాకాశము నిర్మలమయినదని యెఱింగినవిమ్మటనీలత్వాదులుతోఁపనట్లు, అఖండపరిపూర్ణసచ్చిదానంద పరబ్రహ్మసందర్శనము కల్గినేనిఁ గల్పితమగు మనస్సుతోఁపకలయించి పరబ్రహ్మమేకనంబడును. అదిసాధనచతుష్టయసంపత్తిపూర్వకంబుగాఁ బరిపూర్ణుండవైయున్నకాలంబున స్వాధిష్ఠానచిదాభాసుండవైన నీకు నావరణంబులయిన చతుర్వింశతితత్త్వాత్మక పంచకోశంబుల వేర్వేఱవిభజించి “నేతినేతి” యనుమహావాక్యంబు చెప్పిన విధంబున నేనుగానని నిషేధించి కేవలకూటస్థచైతన్యమాత్రుండనైతినని తెలిసి యంతట నీప్రకారంబున దేవతిర్యఙ్మనుష్యప్రభృతి సర్వభూతంబులఁ బంచకోశంబులఁ బంచమహాభూతంబుల నొక్కపెట్ట నిరాకరించి యచ్చటఁ బరబ్రహ్మచైతన్యంబుండ భావించి యటుపై, త్వంపదాహంపదాత్మపరప్రజ్ఞానపదలక్ష్యార్థభూతప్రత్యగాత్ముండనైననేన, తత్పదబ్రహ్మపదలక్ష్యార్థ భూతపరమాత్ముండనని యుఁ దత్సత్యజ్ఞానానందస్వరూప పరమాత్ముండ సచ్చిదానందలక్షణప్రత్యగాత్ముండనైన నేనసియు నిట్లన్యోన్యాఖండసమర సైక్యంబనుభవించినిరావరణాధిష్ఠాన పరిపూర్ణా ద్వితీయశుద్ధచైతన్య ప్రకాశమాత్రుండవై ప్రకాశించునీకుఁ బ్రచండ మార్తాండున కంధకారంబు కనుపట్టనితెఱంగున సర్వకారణ కార్యాత్మకంబైన మనంబుగలుగదు. రజ్జ్వారోపిత సర్పంబుఁగని యిది సర్పంబుగాదని తన్నిరసనంబుకావించి మఱి యిదిరజ్జువని విధించి యయ్యధిష్ఠానంబు నెఱింగినపిమ్మటఁ గల్పితభుజంగం బభావంబై, రజ్జుమాత్రంబు శేషించు తెఱంగున శరీరత్రయంబాత్మకాదని కడఁద్రోప నాత్మానాత్ముండవైన నీకు మనంబు లేదు. మఱియు నాసింపఁబడిన ప్రత్యగాత్మకంటె వేఱుగాని పరమాత్మకు నాశ్రయమయిన జ్ఞానముయొక్క ప్రతిబింబమైతివేని నీకుం బ్రపంచమంతయును వేఱుగాఁ గనంబడును; ప్రకాశించుచున్న ముఖ్యుఁడవు

ను శాశ్వతుండవును ప్రతిబింబరహితకూటస్థుండవు నైతివేని బాహ్యాంతరప్రపంచమంతయు నశించును॥ 128

ఉ॥ కన్నులుమూసిన్నైనమఱి, కన్నులువిప్పియున్నైననెప్పుడున్
సన్నుతసచ్చిదాత్మకుని, సాంద్రతఁజూడఁగఁ జాలకున్ననా
పన్నుఁడు కన్నులుండెఱవ, బాగుగమూసినఁ గానుపించుఁజీ
కొన్నమనోవికారములు, కూరిమి వెల్వలలోన నంతటన్॥ 129

ఉ॥ తారకసాంఖ్యయోగములు, తథ్యమటంచును జూడనేలయిం
పార మనంబుపట్టువిడి, యర్గఁగనీయక యింద్రియంబులన్
ఘోరతనిల్పనేలయటు, కోరిఘటంబునుగాంచురీతిగా
నారసి బ్రహ్మగాదనిన, నంతటఁజూచినఁ దానెబ్రహ్మమా॥ 130

ఉ॥ చూచినయంతలో వెలయు, చోద్యములెల్లను దానయ్యై ప్రభం
గాఁచినహేమమట్లుతుది గౌరవమంది వెలుంగునెమ్మదిన్
సూచనఁదన్నుఁ దాగనని, సుందరశీలు మనంబుస్వేచ్ఛగా
నీచతనెప్పుడున్ మసలి, నెమ్మదిలోలతసంచరించెడిన్॥ 131

క॥ ఘనముగఁ దనుఁదాఁగనుగొను। ఘనసత్పురుషుండునెపుడు ఘనమానసమున్
ఘనమానందాబ్ధినివెస। ఘనమగ్నతఁజెందుచుండుఁ, గడువేడుకతోన్॥ 132

మ॥ అబలానందనచందనాది విషయా, త్యానందమున్బొందుచున్
శిబికాకుంజరరాజ్యసంపదలచేఁ, జిక్కుండి చిత్తమ్మునన్
ప్రబలానందవివేకలభ్యగుణసం, ప్రాప్తిన్ వెసన్ గాంచఁగా
విబుధానీకము మెచ్చనౌనుజుమి త, ద్విజ్ఞానసంపత్తిచే॥ 133

వ॥ అదియెట్లులన్న ననేకవృక్షగతపుష్పముల సంచరించు ద్విరేఫము గంధఫలీస్పర్శముకలిగినంతఁ జచ్చునట్లు మనస్సు బ్రహ్మానందమందు లయించును. మఱియుఁ జక్కెరయును లవణంబు నుదకమందుఁ గరఁగినరీతి మిగుల బ్రహ్మస్వరూపమైన తన్నుఁజూచెడు బ్రహ్మవేత్తమనస్సు బ్రహ్మానందసాగరమందు గుండ్రముగాఁ దిరిగి పరవశమగుచు నశించును. ఇంతియకాక యితర సంకల్పములేక యెల్లప్పుడు తాను బరబ్రహ్మమునని పరబ్రహ్మమగు తన్నుఁజూచువాని మనస్సు తనంతటనే కట్టెలలోని నిప్పు కట్టెలంగాల్చి తాను జల్లారినట్లు తనలోపలనే నశించును. సూర్యుండు క్రుంకువేళ నతనికిరణములతనివెంటనేపోవునట్లు గొప్పదైన మనస్సులయింపఁగానే ముందుగా నామానసమునందలి గుణత్రయముయొక్క వికారములు నశించును॥ 134

తే॥ సకలప్రారబ్ధ వాసనా,సంఘమెల్ల। నాశమునుబొందకయె తత్త్వాధీశపదవి
నందఁగలుగునె యవలీల,న ప్పుడిప్పు। డిట్టిమానందమిడుబుద్ధి నింపుమీశ॥

వ॥ అని మఱియు నిట్లనియె. పరమభాగవతోత్తమా! నీవు దేహవ్యతిరిక్తుండవగుటంజేసి జన్మాస్తిత్వవృద్ధిపరిణామాపక్షయ వినాశంబులును బాల్యకౌమారయౌవనజరావస్థలును వర్ణాశ్రమ కుల గోత్ర నామరూపదేశకాలాదికంబులును, స్థూలత్వకృశత్వదీర్ఘత్వహ్రస్వత్వసితత్వ రక్తత్వాదికంబులును నిరింద్రియుండవగుటంజేసి వచనాదానగమన విసర్గానంద కర్మంబులును బంచతన్మాత్ర విషయసంఘంబులును నప్రాణుండవగుటంజేసి కదలుట, పరుగెత్తుట, ముడుచుకొనుట, వణంకుట, చాచుట, మొదలైనవి యునుక్షుత్తు పిపాస మొదలగునవియు లేవు. నీవమనస్కుండవగుటంజేసి నీకుఁగోరుట, కోరకయుండుట, మొదలుగాఁగలదీనగుణంబులును పరబ్రహ్మమనెడు లోకమనెడు నీరెండువస్తువులయొక్క యెఱుంగుటయు నిహపరలోకభోగంములయందు నాసలేమియు, శమదమాదికంబును ధీవిలక్షణుండవు, నిరహంకారుండవు. వక్తృత్వ, దాతృత్వ, గంతృత్వ, విసర్జయితృత్వ, సురతాదులచే నానందించుటలును, వినుట, సోఁకుట, చూచుట, రసములంద్రాఁగుట, మూర్కొనుటలును మఱియు నాలోచించుట, చంపుట మొదలగునవియు నీకుఁగలుగవు. నీవు కేవల శుద్ధచిద్రూపప్రత్యగభిన్న బ్రహ్మచైతన్యప్రకాశమాత్రుండవుగావున నేను శరీరేంద్రియ ప్రాణమనోబుద్ధి చిత్తహంకారంబులుగాను స్వయంప్రకాశ సచ్చిదానందస్వరూపమాత్రుండనని నిన్ను నీవు విలోకించు సమాధిసమయంబున, సకలవికార సమన్విత మనోరహితుండవుగావే, కాలత్రయంబున నీతీరునంబ్రకాశించుటవలన నెప్పుడు వికల్పరహితుండవై యేకస్వరూపుండవై యుండుటంగాదే. సర్వవికారశూన్య సహజామనస్కరాజయోగసమాధియని బోధించినం దెలిసి యానరవరుండు శంకరున కిట్లనియె॥

చ॥ కనఁబడువస్తుసంచయము, గౌరవహీనమనాత్మనేనుగా
ననియిదితత్త్వమేననుచు, నచ్చుపడందెలియంగనప్పుడుఙ్
ఘనమఃగమానసంబచట, గట్టిగనుండునొయుండకుండునో
యనుపమభక్తవత్సలత, నయ్యదితెల్పుముపార్వతీపతీ॥ 137

వ॥ సమాధియందుమనంబుగలదంటేని మనసుసమాధియందుండెనేని బుద్ధియును దశేంద్రియంబులును బ్రాణాదులును జేరియుండును. ఈమానసాదులు స్థూలదేహమునువదలియుండవు గనుకయాస్థూలశరీరముండవలసియున్నది. ప్రపం

చమునందు నిమిత్తకారణములయిన దండచక్రాదులు లేక ఘటాదులుండవు గనుక నిచ్చటఁగార్యములగు సూక్ష్మశరీరములుండుటవలన వీనికిఁగారణము గు కారణశరీరముగలదు. అట్టిశరీరత్రయముంబొంది యాద్యంతములు లేని యహంకార వ్యాపారమంతయు స్పష్టముగానుండును. ఆలోచింపఁగా నావిధ నహంకారవ్యాపారమున్నయెడల సహజమైనట్టియు, మనశ్శూన్యమైనట్టియు, శ్రేష్ఠమైనట్టియుఁ బ్రత్యగ్బ్రహ్మస్వరూపమైనట్టియు సమాధి సర్వదాలభింప నేరదు. అందుచేఁజక్కఁగాఁ జిత్తమంతయు నశింప నాపరబ్రహ్మస్వరూపుఁడై యున్న యాబ్రహ్మనిష్ఠునకు సమాధినుండి మరలలేచుట సంభవింపదు. మరల లేవకుండుటసంభవించెనేని భూమిపై బ్రహ్మనిష్ఠ నెవ్వండుఁబొందఁడు. బ్రహ్మనిష్ఠంబొంది యమనస్కయోగసమాధిని విమర్శించిబోధించు బ్రహ్మవిద్వాంస యాచార్యులుండరని చిత్తమందు సందేహించుచున్నాను. బ్రహ్మజ్ఞానోపదేష్టలగు గురువులు లేరనిచెప్పినయెడల శ్రేష్ఠమైన యోగీశ్వరులయొక్క పరంపగలకును, వారుబోధించినబోధకును, బోధింపంబడినవారి బ్రహ్మనిష్ఠకును సమాధియందు మనస్సు సుంతయేని లేకుండుటచే బాధకమగును. ఇందుచే జ్ఞానవిజ్ఞానసంపన్నులైన మహానుభావులు సమాధియందుఁ గొంత తడవు మనోరహితులైయుండి కొండొకసేపునకు మేల్కొని మెలంగుదురని పరపదంబునొందినవారికిఁ బునరావృత్తిప్రాప్తించునట్లు మోక్షంబున కనిత్యత్వంబువచ్చు. ఇట్లు బహువికల్పసమన్వితంబైన యీసంశయంబు నిశ్శేషంబగునట్లు పరమరహస్యార్థంబుపదేశించి నిరతిశయకరుణాకటాక్షవీక్షణంబుచే ననుగ్రహింపవేయని ప్రార్థించినఁ దద్భక్తుని బుద్ధి కుశలతకుమెచ్చి భక్తావన కుతూహలుండగు శంకరుండు సానందుండై సాదరంబుగానిట్లనియె॥ 138

తే॥ గీ॥ స్వాంతముజడంబు దృశ్యంబు, సారసాక్షు
యణువుమాత్రమనిత్యంబు, లైనదేహ
మింద్రియాదులనిత్యమం, చేపుమీఱి
నవివితర్కించుచుండెదు, నవనినాథ॥ 139

చ॥ జననవినాశయుక్తమును, జక్కనిసంశయరూపచిహ్నలన్
మనసునఁగల్గియుండినను, మానుగఁజిత్సుఖదీప్తితోడనీ
వనయమునుండమానసిక, మైతగువంచనకల్గఁబోదు చం
ద్రునిఘనవృద్ధి క్షీణతయు, రోయకయంటునెతిగ్మభానునిన్॥ 140

తే॥ గీ॥ ఎంచఁగుండేటకొమ్మున, కేపుమీఱి గగనమునకును జేరిక, కల్గనట్లు
మనమునకుసచ్చిదానంద, మయుఁడవైన నీకుసంబంధమును లేదు, నిర్మలాత్మ॥

వ॥ స్వప్నమందుంజూచిన సంధ్యాకాలమందలి యరుణకాంతులు స్ఫటికపర్వతము నంటనట్లు మానససంబంధములైన సంకల్పవికల్పాదులు స్వయంప్రకాశుండ వగు నిన్నంటనేగవు. మఱియు నచేతనములగు కుంభవస్త్రములయందుఁ జేరియుండు చిల్లివడుట, చిల్లిలేకుండుట, సన్నముగనుండుట, మృదువుగా నుండుట, చేరియుండుట, చేరకయుండుట మొదలగు వికారములు జగదుద్దీప కుండగు సూర్యునింబొందఁజాల నట్లహంకారము,బుద్ధియు, మనస్సు,నింద్రియ శరీరాది విరుద్ధదోషంబులు స్వయంప్రకాశాత్మకుండవైన నిన్నుంబొందవు. వాయుతేజోజలభూతంబులును, నానాల్గుభూతములగుణములగు శబ్దస్పర్శా దులును దనయందుండియును దానన్నిటియందు భూతకార్యములగు స్పర్శాది గుణములయందు వ్యాపించియుండియు నిందు దేనిని నాకాశమంటనట్టులీ సమస్తహేతువులైన యింద్రియములును దదింద్రియార్థములయిన సంకల్ప వికల్పాదులును నిన్నాశ్రయించి నీయందుండినను సర్వతఃపూర్ణుండవగు నీవు దేనితోడం జేరవు. అందుచే నింద్రియములు, మనస్సువిషయములందుఁ బ్రవ ర్తించెనేని నేనుజలింతునని నీవుతలంపకుము. పరమాత్ముండవైన నిన్నుఁ జూచినేను గదలనివాఁడననియెఱుంగుము. అటుపై నాయింద్రియమానసంబు లును, నతినిశ్చలంబులగును. 142

తే॥ గీ॥ తత్వదీప్తినిజూచెడి, తత్త్వవిదుని। మానసేంద్రియచేష్టలు, మణఁగిపోయి
యొదిగిచలనాదిశూన్యమై,యొప్పియుండు।సింగముంగన్న కరిభంగి,జిగియెఱింగి॥

సీ॥ ఆమానసాద్యంబు, లచలంబులౌనెడ, నేనచలుఁడనని, యోచఁబోకు
మాయింద్రియమనస్సు,లటుచలించుచుమాని,కదలకుండుటమహా,గరిమనీటఁ
నిన్నంటవవియెల్ల, నిక్కంబుగానీవు, సంతతంబునువాని, సాంద్రబుద్ధి
నెఱుఁగుచునుండెడి, హెచ్చినసాక్షివి, హృదయేంద్రియములకు,నెచ్చిపోయి

తే॥గీ॥ కానుపింపనికేవల, ఘనుఁడవగుచుఁ
ద్రిగుణములులేనిమూర్తివి, దివ్యచరిత
కాన సతతంబునీవిట్లు, కనుమటంచుఁ
దెలిపి మఱియును బ్రేమచేఁ, దెలుపఁదొడఁగె॥ 144

ఉ॥ తొల్లిటికాలమందుఁ గడు, దుర్భరమౌ వనమందు రమ్యసం
ఫుల్లవికాస పుష్పతతిఁ, బొల్చెడియాశ్రమమందునుండఁగా
నుల్లమురంజిలంగ నవు, డుండము నీశ్వరకామినీమణుల్
పెల్లుగ నన్నుఁజూచుటకుఁ, బ్రేమదలిర్పఁగఁ గోరిరయ్యెడన్॥ 145

తే॥గీ॥ అట్టిమునిభార్యలందఱు, నప్పుడునను
ముందునిడుకొనివారెంతో, మోదమలర
నితఁడె నీపతియనిసూత్మ్మ, మతినెఱుంగ
నచటివహానుల విభజించి, యడుగనాపె॥ 146

శే॥గీ॥ ఘనతనాబుషులందఱు, కాఁడుకాఁడ
టంచుఁదలయూచుచుండినఁ, గాంచియప్పు
డొకటనాఁగాఁడనకయూర, కుండెనత్తె
అంగుఁగని సంతసించిరా, రమణులెల్ల॥ 147

సీ॥ గాఢవిరక్తిని, ఘనవివేకజ్ఞాన, మునుగూడునట్టియా, ముఖ్యమైన
యాదరువప్పర, మాభాసునకునాత్మ, చిత్సుఖరసమును, శ్రేష్ఠముగను
గనఁబడునందాక, గౌరవంబలరార, దేహగతేంద్రియాల్, దీప్తివెలయఁ
బ్రాణపంచకమును, బటుసుహృద్బాంధవ, హంకారములఁదోఁచు,నాత్మనిరతి
తే॥గీ॥ నేనదియకానుగానని, నిరసనంబు। కనఁగనంతటనిల్చును, గౌరవమున
మనసుదాఁరువురీతిని, మనుజవర్య! । ఁయింతకువిరాగమేముఖ్య, మెందునంద్రు॥

తే॥గీ॥ ఆచిదాభాసుఁడాబుద్ధి, నధిగమించి
యాత్మచైతన్యతేజంబు, నందుఁ దనకు
వెలుఁగునైక్యంబుచేయధీ, వృత్తిలేక
యెండలోదీపమున్నయ, ట్లుండు ననఘ॥ 149

వ॥ ఇట్లు శరీరేంద్రియప్రాణ మనోబుద్ధిసమన్వితంబైన యహంకారంబుతో సహజతాదాత్మ్యంబుగల స్వాధిష్ఠాన చిదాభాసుండు నిద్రావసరంబున సర్వవ్యాపారంబులు చాలించి శయ్యాతలంబున స్థూలదేహంబుడించి యింద్రియంబుల విడనాడి ప్రాణంబుల డిగ్గవిడిచి మనశ్చిత్తంబుల నహంకారంబు నడంచి యహంకృతిని ధీవృత్తియం దొదిగించి యంతర్ముఖుండై జీవోపాధియైన యవిద్యకాశ్రమమైన పరబ్రహ్మముయొక్క చేరువకు సులభంబుగాఁబోయి ప్రియమోదప్రమోదానందవృత్తులే రూపముగాఁగల యానందమయకోశమందుండన కుపాధిభూతంబై నానావిధవాసనావాసితంబైన బుద్ధి వ్యాపారము వదలి యమూలమై యవాచ్యమగు నవివేకాంధకారము నడంచినవాఁడై పిమ్మటఁ గాలత్రయాబాధ్యమైన స్థూలాద్యుపాధులులేని సర్వోత్కృష్ట బ్రహ్మానందసాగరమందు మగ్నుండై నవిధంబునఁ బూర్ణాధికారియై సమాధి సమయంబున మొదలనే దృశ్యంబు గాను ద్రష్టననియు

ద్రష్టనుగాను ద్రష్టనను వృత్తియు దృశ్యంబు గావున దీనికి ద్రష్టననియు నివ్విధంబున విజాతీయప్రత్యయ తిరస్కార స్వజాతీయ ప్రత్యయ వ్యవహారాంగీకారపూర్వకంబుగాఁ గేవల స్వకీయమయిన సుఖము ననుభవించునందాక సమస్తాంతర్బహిర్దృశ్యములను ద్రోయుటయును జేయుచు బుద్ధివ్యాపారమునకు సాక్షి. బ్రహ్మస్వరూపముయొక్క దగ్గఱకుం బోవుచుండఁగా, నేవేళఁ గొఱంతలేని సల్లక్షణచిల్లక్షణ అను లక్షణములే యాకృతిగాఁగల యాత్మసాక్షాత్కారంబగునపుడు మిగుల నెఱ్ఱని యెండలో నుంచఁబడిన కప్పురంపుదివియవలెం బరిపూర్ణప్రత్యగభిన్న పరబ్రహ్మచైతన్యంబుతో నేకీభూతుండై యానందించుచుండు. ఇట్లుండునతండు తన్నుఁదాఁగనుంగొనుచుఁ దనకు నభిముఖుండై యుండమిం జేసి సర్వకారణమైన యామనస్సుచేత నముగనుక గాలితగులనిదీపమువలెఁ గదలకుండియు సంకల్పరూపముగ వ్యాపింపకుండుటచేత లేని దానివలెనుండును. ఇదియే సహజామనస్కరాజయోగసమాధి. ఇదియే జీవన్ముక్తియని యుపదేశించునెడ నిజముఖారవింద విలోకనమ్ముసేయుచు ముసిముసినగవులు నగుచుం గాత్యాయని నెమ్మొగంబువీక్షించి వికసితవదన కమలుండై యావృత్తియే కళంకములేని శుద్ధసత్త్వమగు పరబ్రహ్మమును బ్రత్యగాత్మనుం జేర్పందగిన తెలివియే యాకృతిగాఁగల జ్ఞానమే యాపతివ్రతాశ్రేష్ఠురాలగు భవాని సర్వకాలములందెడఁబాయకుండునదియు సమస్తకాంక్షాప్రయోజనమిచ్చునదియు లోఁబడి నడుచుకొనునదియు నై యుండును. నేనిప్పుడు చెప్పిన వృత్తి జ్ఞానమున కాధారమైనట్టియు నిర్మలమైనట్టియుం బరమాత్మను నాయొక్క సచ్చిదానంద నిత్యనిర్మలత్వమును విమర్శించి తెలిసికొనుమని ప్రజ్ఞానలక్షణముచేత బ్రహ్మభావమును బుద్ధికందంజేసి యాబ్రహ్మానుభవముం గనంబఱచి మరల నిట్లనియె॥ 150

తే॥గీ॥ ప్రీతితోడను శివమహా, విభుఁడయంచు
భక్తినెవ్వరు నాస్వరూ పప్రశస్తి
పొందుదురొ వారిఁదక్కనీ భూరికాళి
యెవ్వరింబ్రోవకుండు నీ, వెఱుఁగు భూప॥ 151

సీ॥ సత్యమసత్యంబు, చక్కఁజేయఁగనేర్చు ననృతమ్ముఋతమని యనఁగనేర్చు
విద్యయవిద్యఁగా వేడ్కతోఁగననేర్చు యజడమ్ముజడముగా ననఁగనేర్చుఁ
గష్టమ్ముసుఖముగా ఘనతఁజూపఁగనేర్చు సుఖముకష్టమ్ముగాఁ జూపనేర్చు
నిదియుదిగాదని యింపుగాననేర్చు నదియిదిగాదని యనఁగనేర్చు

తే॥గీ॥ మొదలఁగలదిమొకలదులే నిదియలేదు
కడఁగియజడంబెయజడము జడముజడము
సుఖమెసుఖముతలంపన సుఖముసుఖము
నదియె యిదియిదియదియని యాడనేర్చు॥ 152

వ॥ అట్లు గావునఁ బొందంగూడని వస్తువును బొందంజేయునదియుఁ బరబ్రహ్మమునకుం గూటస్థచైతన్యమునకు నైక్యముంగలుగఁజేసెడి జ్ఞానస్వరూపమైనదియు నాయందు వీడనిపొందిక గల చిచ్ఛక్తియైనదియు నత్యంతనిర్మలమైనదియు ననుగ్రహము గలదియు నగు సర్వజ్ఞ స్వతంత్రాది షట్ఛక్తియుక్తమగు నీగౌరీభగవతి ననుకూలంగాఁ జేసికొను. అట్లనుకూలంగాఁ జేసికొంటివేని శీఘ్రంబ ప్రత్యగాత్మవైన నీకు శాశ్వతమైనట్టిదియు స్థూలసూక్ష్మకారణోపాధులులేనట్టిదియుఁ బ్రకృత్యతీతమైనట్టిదియు స్వచ్ఛమైనదియు స్వకీయమైనదియు నగు బ్రహ్మానందానుభవములభించును. అట్టియానందము లభించు నుపాయములను జెప్పెదను వినుమని యిట్లనియె॥ 153

మ॥ నిరతిన్ లక్ష్మియుఁ గేశవుండుసురలున్ నిక్కంబుగా నాత్మలం
దరయన్ సత్యసురూపవృత్తిగతితథ్యంబొప్పఁగానయ్యెడన్
నిరతిం జేర్చి సదార్యమింపఁగనుహృన్నీకేజసంతృప్తితోఁ
బరమానందుఁడవైన నాకుఁబటిమన్ భాసిల్లె శంభుండనన్ ॥ 154

తే॥గీ॥ ఈయిలాస్థలిశివపదం బేపుమీఱఁ। బలుకఁదగినట్టివాఁడనై ప్రబలినేను
బ్రహ్మవేత్తలుబుద్ధిని బటిమమూన। సేంద్రియాంగంబులనునస త్తేయటంచు॥

వ॥ నుడువుచుండఁ జిదాత్మనగుచు నేనెప్పుడు మిగిలియుందును॥ 156

తే॥గీ॥ భూరిగుణశివనామంబు పొందినట్టి
యేనుబెద్దలు బుద్ధి చిత్తేంద్రియాంగ
ముల ననాత్మయనికడకు మోదమలరఁ
బుచ్చమిగులుదుఁ జిన్మయ పూర్ణుఁడగుచు॥ 157

వ॥ జ్ఞానస్వరూపినైన నాకు సత్తామాత్రపరమాత్మనైన నాయొక్కయాకృతిం దెలియంజేసెడి వృత్తి జ్ఞానము, అనఁగా, స్వరూపజ్ఞానమే వృత్తిజ్ఞానమై యజ్ఞానరూపమైన జగత్తును గాల్చి స్వరూపజ్ఞానమందె కలయును. అట్టి వృత్తి జ్ఞానము నాకుంగలుగుటవలన నిత్యవిభూత్యధిదేవతయగు పార్వతీదేవి బ్రహ్మముందెలియునట్టిజ్ఞానము నాస్తిశబ్దముచేతఁ జెప్పంబడుటవలనను దత్పదలక్ష్యార్థమువలన నాకు శ్రీ సదాశివనామమొప్పెను. మఱియు విచారిం

పఁగా వృత్తిజ్ఞానమున కెల్లప్పుడు సాక్షియుఁగూటస్థుండు నగు నాయొక్కయునికి
శోధించి తెలిసికొనుటకుం బ్రసిద్ధమైనదియు, రెండవదియు నగు శివనామ
ము ప్రత్యగాత్మనైన నాకు సమస్తోపనిషదర్థములకు నునికిపట్టైన ప్రణవస్వ
రూపమై ప్రకాశించును. సర్వతః పరిపూర్ణతఁ గూటస్థుండనైన నేను స
త్యజ్ఞానానందస్వరూపుండనని నాయునికిశోధించి తెలిసికొనుటకా మూఁడవ
శివనామము నశించెడు భూతభౌతికములకంటె నాశమునొందని భూతభౌతిక
ములందు వ్యాపకమైన కూటస్థచైతన్యముకంటె వ్యతిరిక్తమగు నసిపదమై
ప్రకాశించును॥ 158

తే॥గీ॥ హర్షమెసఁగంగ శివశివయనుచు నాదు
సేవసల్పెడి దివ్య సుశ్రీయుతులకు
సంతతము మోక్షసామ్రాజ్య సౌఖ్యయోగ
సిద్ధి నిచ్చుచునుండును శ్రీ భవాని॥ 159

సీ॥ గనుకొనిపరిపూర్ణ మునునిర్వికారంబు నగు తత్త్వమీరీతి నధిగమించి
వెలుఁగుచునుండంగ వేడ్కతోఁ దెలియంగ నేరక యెప్పుడు ధీరహితుల
యాశరీరేంద్రియాలీప్రాణబుద్ధుల ఘనత చేనిరతంబు కడకుఁ ద్రోయు
టకు నెంతొ రక్తులై డాసిబ్రహ్మముగనఁ జూచెడివారికిఁ జోద్యముగను
తే॥గీ॥ గలుగు నేచిత్తమందును గరిమమెఱయు
సాక్షియగు నాపరబ్రహ్మ సారమెఱుఁగఁ
జాలదది నీకుఁ దెల్పెదఁ జక్కఁగాను
నరవరోత్తమనామాట నరయుమిపుడు॥ 160

వ॥ సకలేంద్రియములచే నాయింద్రియవిషయంబులగు శబ్దస్పర్శాదికార్యముల
నన్నింటిని దెలిసికొనినట్లు సకలేంద్రియములను నాయింద్రియవిషయముల
ను దెలియునట్టియు సకలేంద్రియ విషయములనందియున్నట్టియు నావిషయ
స్వరూపుండనగునట్టియుఁ బరమాత్మనభేదదృష్టిచేఁ దనకంటెనితరముకాదని తె
లిసికొనవలయును. అదెట్లనినఁ గుంభశరావాదుల మట్టితోఁ జేయంబడిన వస్తు
సమూహముల లెక్కించి మన్నని చూచునట్లు నిర్మలమైన కుండలములు
కిరీటములు మొదలగునవి బంగారని యెఱుంగురీతిని ఖడ్గాదుల నినుమని తెలి
యునట్లును బుద్బుదాదుల జలమని వీక్షించినట్లును సుందరతరములైన వస్త్రా
దుల నూలుదారములని యెఱింగినట్లును మొదలిసందియమువిడి ఘటాభర
ణాది ప్రథమభ్రమవదలి సర్వప్రపంచము పరబ్రహ్మమేయని సదాసుఖముఁగాఁ

జూడుము. నిరనుమానంబుగ నెప్పుడు నామరూపాత్మక ప్రపంచమంతయు బ్రహ్మమనిచూచు చిత్తలయమే నిక్షేపముగాఁగల బ్రహ్మవేత్తకు స్థూలదేహము స్థాణువువలెఁ గదలకుండును. జ్ఞానేంద్రియకర్మేంద్రియములు వానివాని వ్యాపారముల వదలియుండును. ప్రాణాదివాయువులును మానసమును గదలకుండును. కామక్రోధాదులు నశించును. తన్నుఁ దానుబాగడుకొనకుండుట మొదలగు సద్గుణములు లభించును. గుణత్రయశ్రేష్ఠమగు శుద్ధసత్వమునకు మీఱిన బ్రహ్మలక్షణము గలుగును. ఇహపరసౌఖ్యకాంక్ష లేమియు నాత్మజ్ఞానమును సర్వకర్మపరిత్యాగపూర్వకముగఁ బరబ్రహ్మమొదుఁ గూడి యుంటయును దక్కువ లేనివై మనస్సునందు వృద్ధింగాంచుచుండును. బ్రహ్మానందసముద్రముప్పొంగి ప్రవహించుచుండును. ముక్తికాంత స్వయముగ 161
నెదుటనిలుచును॥

తే॥ పెద్దదొరతనముండిన పృథ్వీపతిని। భూజనులు రాజభక్తి నెప్పుడునుబూజ
సల్పుభంగిసమస్తంబు స్వయమతలఁచు।నపుడెయుత్తమగుణవర్గ మందునయ్య॥

తే॥ పొలఁతి వేషంబుగైకొన్న,పురుషుఁ డెపుడు
పురుషుఁడగుఁగాని వివరింపఁ,దరుణియగునె
జీవభావంబునొందిన, కేవలాత్మఁ
డాత్ముఁడగుఁగాని మఱిజీవుఁ,డగునె తెలియ॥ 163

మ॥ కరిరూపంబున నెప్పుదారువరయం, గాదారువై యుండుఁద
త్కరిరూపంబునుగానిభంగి సదయ,త్వంబారవిశ్వాకృతిన్
సరసత్వంబునఁదోఁచుశంకరుఁడు ని,స్సంకోచతన్ శంకరుం
డురుతాపాత్రుఁడుగాకవిశ్వమగునే, యూహింపవే యేటికిన్ ॥ 164

సీ॥ హస్తియటంచును నతిభ్రాంతిఁజెందెడు వానికిదారువు వాంఛదోఁప
దాక్రియదారువు నాసఁజేఁగాంచెడి పరతత్త్వవేదికిఁ బ్రబలముగను
బరికింపఁగల్గునే భవ్యవారణమట్లు సర్వప్రపంచంబు సత్యమనుచుఁ
బల్కెడువానికిఁ బ్రబలతబ్రహ్మంబు కనుపింపదూరక యునికినిపుడు॥

తే॥ బ్రహ్మమంచునుగనుఁగొను భద్రయోగి
కెపుడుసర్వప్రపంచంబు నింపుమీఱి
నుండునట్లుగఁదోఁచునే యుర్వియందు
యోజనముసేయసుజ్ఞాన యోగమునను॥ 165

వ॥ అనినవినియాభక్తోత్తముండు శ్రీసదాశివమూర్తికిట్లనియె॥ 166

తే॥ మీరుబోధించురీతిని మేలువెలయ
నరసిసర్వముబ్రహ్మమటంచుఁగాంచు
ఘనుఁడు నెటువంటిప్రారబ్ధకర్మసలుపు
దీనినెఱిఁగింపుఁడనశివ దేవుఁడనియె॥ 167

సీ॥ ఘటకంకణంబులు ఘనతరంగంబులు పటనికాయంబులు పరఁగజ్ఞాన
దృష్టిచేఁదటుకున దేదీప్యమానమా మన్నుబంగారంబు మంచిజలము
నూలని తెలిసిన మేలుగానవియెల్ల నామరూపంబుల గోముచెడక
యన్నియుఁబనులకు నప్పటివలెవచ్చు నచ్చినవానికి వక్రతలను

తే॥ గలుగునేహేతుదృష్టికి ఘనతఁదప్పి
యట్లుసకలంబుతత్త్వమటంచుదివ్య
వరతరాధ్యాత్మయోగసంభావనమున
నిశ్చయముగనుయోగికి నిరుపమముగ॥ 168

వ॥ ఏస్థలమందాబ్రహ్మజ్ఞానియొక్క శరీరము కర్మేంద్రియజ్ఞానేంద్రియములు బుద్ధి వీనియొక్కసమూహామునకుఁ దాత్కాలికానుభవరూప ప్రారబ్ధముయొక్క యనుభవముకలుగును. అట్లుతోఁచెనేని యాబ్రహ్మవేత్తసాక్షియై శ్రేష్ఠమై నట్టియు గంభీరమైనట్టియు నాత్మానాత్మవిచారజ్ఞానముచేత నంతయుం బరమాత్మగానేకనుంగొనుమని యిట్లనియె॥ 169

సీ॥ సంగీతనృత్యముల్, సరసంబుగాఁదాళ గతులనుగావించు గానధీరు
విద్యయందలినేర్పు, వేడ్కతోఁజూపుచు శిరముపైనుండున బ్బురపుదొంత
రనుబూనఁగైకొను రమ్యతరంబైన నాట్యశీలునిగతి నాణెముగను
దండోపతండతఁ దగఁబ్రకాశించెడు వివిధేంద్రియవుఁదెల్వి నెలసియుండి

తే॥ బ్రహ్మవేత్తయునానంద ఫలదుఁడైన
సచ్చిదానందమయుఁడగు సారసాత్ము
నుల్లమందునదర్శించు నొప్పమెఱయ
ననుచుబోధించియిట్లనె నవనిపునకు॥ 170

ఉ॥ తానునృజించుపట్టణము దబ్బరయంచునెఱింగిభ్రాంతితా
నూనకయైంద్రజాలికుఁడ హాయనదానినృజించురీతిఁగా
జ్ఞానిమనస్సుచేఁగృతజ గత్తునభావముగాఁదలంచుచుఁ
శ్రీనయభూరిమాయలను జెందకయన్నియునల్పఁగార్యముల్॥ 171

సీ॥ పరతత్త్వజీవైక్య భవ్యసమాధిలో వెలుఁగొందుచున్నట్టి వివశమైన
చిన్మాత్రతత్త్వంబు స్థిరతఁదానవలీలఁ గనిపూర్ణుఁడయి వెన్కఁ గలితమాయ
సంసృతిఁజెందినఁ జక్కఁగాఁసవిమెల్లఁ దగులంగనేర్చునే ధరణియోగి
క్షీరంబులనుదధి స్థిరముగాఁజేసియుఁ ద్రచ్చంగవేఱుగా వచ్చువెన్న

తే॥ చల్లలోనికిఁగలయునే సరసగతిని। నెన్నివిధములఁగలిపిన సన్నుతముగ
నట్లగుటజ్ఞానయోగుల కట్టిప్రకృతి। వాసనలుచెందఁజాలవు వసుమతీశ॥ 172

ఉ॥ మంటలచేతఁగప్పఁబడి మండుచునుం దెడుపర్వతంబునం
దంటునెపక్షిజాతకము లావిధిఁదత్త్వవివేకియైనని
ష్కంటకబ్రహ్మవేత్తకును గాఢతరంబగుపాపపుణ్యముల్
దంటకుఁజేరునేయవియు ధారుణిలోపలమిథ్యగాక యే॥ 173

వ॥ సూర్యుఁడు సకలమైన జలములను గిరణములచేఁ గ్రోలుచు నానీళ్ళయందు
న్న యడుసు, నాఁచు మొదలగువాని నంటనట్లు బ్రహ్మజ్ఞాని యింద్రియార్థ
ముల ననుభవించుచుఁ దద్గుణదోషముల నెప్పుడు నంటక మిక్కిలి నిర్మల
మైనట్టియుఁ గదలనట్టియు మనస్సుగలవాఁడై సర్వోత్కృష్టమైన బ్రహ్మమనెడు
పునరావృత్తిరహితమైన సముద్రమునం దోలలాడుచుఁ బావనుండై ప్రకాశిం
చును. మఱియు సాధువైనవివేకి నిస్సారమైన మహాసంసారమునుబొంది
తామరాకు జలము నెల్లప్పుడుతాఁకియును దాకపట్లు కూడికలేనివాఁడై యుం
డును; అదెట్లనిన నగ్ని యన్నింటిని భక్షించువాఁడైనను నిర్మలుఁడైనట్లు
బ్రహ్మవిదుఁ డింద్రియములయందు నపేక్షగలవాఁడయ్యును వీతరాగుఁడై
ముక్తసంగుఁడగుచుఁ బ్రకాశించుచుండును. మృత్తికనుగలసియుఁ గలయక
యొంటరిగాఁదిరిగెడు కుమ్మరపురుగువలెఁ ద్రిగుణరహితమగు బ్రహ్మానందమం
దాసక్తిగల బ్రహ్మవేత్త ప్రకృతిరూపములైన సత్వరజస్తమోగుణవికారము
లనంటియు నంటకయుండును॥ 174

చ॥ ఒకనరునందు భ్రాంతిగల యొక్కసుభామినియింటిలోఁ బనుల్
సకలముసేయుచున్ బ్రియునిఁ జక్కఁగఁగన్గొనఁగోరురీతిగా
నకుటిలతత్త్వవేదినిజ హర్షమహాశ్రమయోగ్యధర్మముల్
సుకరముగాఁబొనర్చుచును సొంపగుసౌఖ్యముఁగాంచునెమ్మదిన్॥ 175

సీ॥ సుఖదుఃఖములకును సుస్థిరకారణం బైనమనంబుతో నంచితముగఁ
బరవాదభేదంబు, లరసియూరకయుండు కర్మవికర్మముల్, కలఁకనొంది

చేయఁడధర్మంబు, స్థిరధర్మములనొక యించుకయుఁదలంచి, యెపుడుఁగనఁడ
యభిమానమానమ్ము, లరుదందిసేయండు మానసుజ్ఞానముల్, మదివిడువఁడు
తే॥ కాంతలను వింతలనుబొందఁ, గలయఁడెపుడు
దుర్విషయచింతలను మదిం, దొరఁగఁజేయు
నతిసుషుప్తియసుప్తియు, నణఁచిగెల్చు
నాత్మసుఖతృప్తి జ్ఞప్తియు, నరసికాంచు॥ 176
సీ॥ అభిలాషవేషమ్ము, లతిలీలమతిఁదాల్పఁ, డతిరోషరోషమ్ము లరయుసమత
స్నేహమోహంబులు, స్త్రీలపైనుంచఁడు, మేనుగృహంబులు, మేలయనఁడు
ధనముబాంధవులను, దగనిరసించును, సత్తములనుమఱిఁ, జిత్తములను
సరసంబుగానెంచుఁ, జక్కనిమిత్రుల, భ్రాంతిచేఁజూడండు, భవ్యమనఁడు
తే॥ కలిమిబలిమిని రెంటిని, గనఁడు గరిమ
బుధుల చెలిమియుఁదాల్మియుఁ, బొందుఁగోరు
శాంతిదాంతినిరెంటిని, సడలనీఁడు
మోముకాంతినిశాంతిని, మొనసివిడఁడు॥ 177
వ॥ అని మఱియు నీశాస్త్రమునందుఁ జెప్పఁబడినవిధి, ఇఁక యనుభవమ్ము వినుము॥ 178
సీ॥ తలపోయఁగాగాధ, తరమైననిరసన, స్ఫుటతరాద్వైతాత్మ, సుఖదమైన
విజ్ఞానముజ్జ్వల, వివిధేంద్రియంబుల, మానసోపరతియు, మనుజవర్య
పూర్ణమైయెప్పుడు, పొసఁగంబ్రకాశింపఁ, దన్నుఁదాఁగాంచెడి, తత్త్వవిదున
కునువిశ్వమును వేగఁ, గనుపట్టదెప్పుడు, కలనుసింగముఁగన్న, గజముచచ్చు
తే॥ రీతిమాయామయంబైన, ఖ్యాతవాస। నాయుతంబైనసంస్కృతి, మాయకవలఁ
ద్రోసివెలుగొందుచున్నట్టి, భాసమాన। బ్రహ్మవిదులకుఁజొరవవి, భవ్యచరిత॥
వ॥ మఱియునొక్క విశేషతాత్పర్యంబు వివరించెదనాకర్ణింపుము, బ్రహ్మవిదుఁడు బ్రహ్మవిద్వరుండు, బ్రహ్మవిద్వరీయుండు, బ్రహ్మవిద్వరిష్ఠుండన మత్స్వరూపతత్త్వజ్ఞులు నల్గురుకలరు. అందు దేహేంద్రియాది కర్తృత్వంబును, గర్మఫలకాంక్షయులేక నిత్యనైమిత్తికంబులయిన యజ్ఞదానతపఃప్రముఖ వైదికకర్మంబుల యథావిధిగానాచరించుచు ఫలాపేక్షలంగూడి క్రియలనువదలి శాస్త్రములయందునిండింపఁబడని లౌకికకర్మంబులను యథోచితంబుగ నాచరించుచుఁ బుత్రమిత్రకళత్ర విత్తక్షేత్రాదులయందు విరక్తిగలిగి యప్రియత్నలభ్యవస్తుసంతుష్టుండగువాఁడును, రాగద్వేషాది వికారరహితుండును, నిరంతరవిజి

తచ్ఛరీరేంద్రియప్రాణాంతఃకరణుండును నిరహంకారుండును, నిత్యప్రసన్నచిత్తుండు, నాత్మసంతుష్టుండై సంచరించునతండు బ్రహ్మవిదుండనంబడు; సకలలౌకికకర్మంబుల విధిపూర్వకంబుగా సన్న్యసించి పూర్వోక్తలక్షణంబులు విలసిల్లి ప్రాప్తదుఃఖంబుల ద్వేషింపక నివృత్తసుఖంబులుం గోరక ప్రకాశప్రవృత్తి మోహంబుల నుదాసీనునిభంగిం జూచుచు సుఖదుఃఖమోహాదికార్యగుణంబులయందుఁ జిత్తేంద్రియవికారకారణగుణంబులు ప్రవర్తింపుచుండ వానిచేఁ జలింపఁ జేయంబడక నిశ్చలుండు, సమసుఖదుఃఖుండు, స్వస్థుండై సరిగా నెంచఁబడిన మృత్పిండశిలాసువర్ణంబుల సమముగాఁ జూచువాఁడునుఁ నిష్టమువలె ననిష్టముఁ దలంచువాఁడును సత్త్వరజస్తమోగుణముల కతీతుండునై వర్తించు మహనీయుండు బ్రహ్మవిద్వరుం డనంబడు; మున్ను వివరించిన గుణంబులన్నియు వెల్లుచుండఁగా నెప్పుడు స్వాభావికామనస్క. రాజయోగనిష్ఠాగరిష్ఠుండై యప్పుడప్పు డన్యులచే మేలుకొలుపఁబడి స్వల్పాహారుఁడగుచు నిదురించిన వానివలె శరీరమనెడి ప్రపంచమును, మఱచి, యుండునతండు, బ్రహ్మవిద్వరీయుండనంబడు; తనవల్లఁగాని యన్యులవల్లఁగాని మేల్కొనుట లేక బాహ్యాంతరప్రపంచములను మఱచి యెడతెగని నివృత్తిశూన్యమయిన సమాధియందున్నవాఁడై యఖండమైన కూటస్థునికంటె వేఱుగానివాఁడును, సర్వోత్కృష్టుండును, నగు చిద్రూప పరమాత్మయొక్క తేజస్స్వరూపుండై ప్రకాశించువాఁడు బ్రహ్మవిద్వరిష్ఠుండనంబడు, వీరలలో మొదటి యిరువురకుం బ్రారబ్ధంబుఁ దోఁచియు మిథ్యాభూతంబై యుండు, బ్రహ్మవిద్వరీయుని యందుఁ బ్రారబ్ధము లభ్యమయ్యును లేకయుండును. బ్రహ్మవిద్వరిష్ఠునకుఁ బ్రారబ్ధము, కొంచెమైనను గలుగనేరదు. అట్లగుటచే మహాప్రభావముగల యీబ్రహ్మవిదాదులయొక్క యనుభవములు నీవడిగినప్పటినుండి పరిశీలించి చెప్పితింగదా తెలిసికొమ్మని మఱియు నిట్లనియె॥ 180

## వైరాగ్యబోధోపరతుల తారతమ్యకారణరూప కార్యవిచారప్రకారము

సీ॥ భూరివైరాగ్యంబు బోధోపరతులను మూఁడును గలవు స, మ్మోదమలరఁ
దారతమ్యములందుఁ దగఁగల్గువిధమున, నానల్వురకుఁ గడు, నర్హముగను
సుఖములారీతిని, సుస్థిరంబుగఁగల్గు, నించుమించులుగాఁగ, నింపుమీఱి
యుండనోపినఁగాని యూర్జితంబయినట్టి, మోక్షమొక్క టెసుమీ, మునివరేణ్య

తే॥ యతులవైరాగ్యబోధోప, రతులయుతుల
మతుల నడఁబాయవన్యోన్య, గతులనెనసి

సూటిదప్పియొకానొక, చోటనుండు
రెండుప్రతిబంధవశమున, నుండుననఘ॥ 181

ఉ॥ మోదముతోడబోధయు న, మున్నతిముఖ్యము వానిలోపలన్
మీఁదటిరెండుసమ్మతిగ, మెప్పుగుచున్ సహకారులారయన్
సాదరణంబుగాఁబటిమఁ, జక్కఁగమూఁడును గల్గువారికిన్
వాదవిహీనతన్ గలుగ, వచ్చునుమోక్షముజ్ఞానికోటికిన్॥ 182

ఉ॥ నిర్మలమానవావళికి, నిశ్చలునక్షరసత్యమార్గమున్
గర్మనశించుసామ్యమున, గౌరవమోక్షమునిచ్చుజ్ఞానమున్
నిర్మదకుంజరంబుగతి, నిక్కపుసంసృతిదుఃఖమార్పెడున్
మర్మములేకసేయుము న, మంచితసౌఖ్యములిచ్చునచ్చుగన్॥ 183

వ॥ ప్రకృతివికృతి సంగపరిత్యాగమునకుం బ్రకృతివికృతులు జడత్వసగుణత్వసవికారత్వములను త్రిదోషములుంగలవని యెఱుంగుటయే హేతువు; ప్రకృతిద్వయముం బరిత్యజించుట శ్రేష్ఠము. మఱియు మద్వైకపాశశూన్యమయిన యపరోక్షజ్ఞానమునకు శ్రవణమననిదిధ్యాసలు మూఁడును హేతువులు. అనాత్మయయిన ప్రకృతియొక్క యింద్రికాలాబాధ్య పరబ్రహ్మము యొక్కయు విమర్శనమాకారమును బ్రకృతికిం బరమాత్మయయిన తనకును నైక్యము కల్గకపోవుట ప్రయోజనమగును. అమనస్కమందుఁ జెప్పఁబడిన యమనియమాది పంచదశయోగములయొక్క యనుష్ఠానమును, మనస్సుయొక్క బుద్ధియొక్క నిగ్రహలయములును, విద్యావిద్యలయొక్క సర్వవ్యాపారనాశములు యోజింపఁగాఁజిత్తలయముయొక్క కారణముఁ గార్యమునగును. 184

సీ॥ వైరాగ్యమునుమది, వాలుగానిలుపుచుఁ, బరతత్త్వవిజ్ఞాన, పటిమనంది
సకలకార్యంబులు, చక్కఁగావిడనాడి, మూఁడవస్థలకును, మొనసిసాక్షి
భావంబునొందుచు, బాగుగానీరీతి, యోగమందారూఢ, యుక్తిఁగనఁడు
వానికిఁగల్గునే, వ్యాప్తిమైనాగామి, సంచితప్రారబ్ధ, సంభవంబు
తే॥ లట్టివారలవివరించి, యర్థముగను। జెప్పెదనువినుధీవర, చిత్తమలర
సంతతంబును బరతత్త్వ, సంధిగలిగి। నిశ్చలసమాధియందుండు, నిర్మలునకు॥

## వైరాగ్యశబ్దార్థవిమర్శనము

క॥ ఇంతటికిని వైరాగ్యము। సంతతమానందకరము, చక్కఁగనిదియే
యంతములేకయె కల్గిన। యంతయుఁడనుఁదానె చేరు, వతిగుహ్యములన్॥ 186

వ॥ అదియెట్లనిన వినుము, మూలప్రకృతి యాలవాలంబు సుఖదుఃఖంబులు ఫలంబులు. త్రిగుణంబులు మూలంబులు. ధర్మార్థకామమోక్షంబులు రసంబులు, పంచేంద్రియంబులూడలు, షడూర్ములు స్వభావంబులు, సప్తధాతువులు పొరలు, అష్టప్రకృతులు విటపంబులు, నవరంధ్రంబులు, కోటరంబులు, దశవిధప్రాణంబులు పత్రంబులు, శబ్దాదివిషయంబులు పల్లవంబులు, రాగద్వేషాదు లుపశాఖలు, నానావిధకర్మంబులు, పుష్పంబులు, జీవేశ్వరులు పక్షులుగాఁ గలిగి, మందిరారామ క్షేత్రపుత్ర మిత్ర కళత్ర బంధు మధ్యస్థద్వేష్యజన తీక్ష్ణదుష్కంటక సంకీర్ణంబు, కామాదిచోర దుస్సంచారంబు, రోగవ్యాఘ్ర భయంకరంబు, దుఃఖదావానల సమావృతంబు, మృత్యువు, సింహభయగ్రస్తంబు ముదిమియనెడు, భూతముతోఁ గూడినదియుఁ బేదఱికమనెడు, కొండచే నిరుకైనదియుఁ, బాపమనెడి రాకాసి కులముచే భయంకరమైనదియు, నాశయనెడు భీకరసర్పముచేఁ గలతపెట్టఁబడినదియు, సంతోషమనెడు, కోపమనెడు, ఝంఝూవాతముచే నిందింపఁ బడినదియుఁ, బుణ్యలోకములనెడు పాపలోకములనెడు తప్పుత్రోవలచే మఱుఁగైన ముక్తియొక్క మంచిత్రోవలుగలదైన యాధ్యాత్మికాధిదైవికాధిభౌతికములనెడు చింతలుగల యడవియందు దారిఁదప్పి సుకృతదుష్కృతములకులోఁ బడినవాఁడై నలుప్రక్కలందిరిగిదిరిగి యాకులపడి యెక్కడ స్వస్థతలేక గోసి యెదుటంజూచి తుదలేసిదనియు, నిదివఱకెన్ని జన్మములెత్తితినో యనివెనుకఁ జూచి మొదలులేనిదనియు, నింకనెన్ని జన్మములెత్తవలెనో విశదముగాఁ జూచితుదమొదలెఱుంగ నశక్యమని యెంచి మిగుల నధికమగున దిగులుచేత వ్యసనముచే తంజలింపంజేయఁబడ్డ మనస్సుగలవాఁడు నాధ్యాత్మికాదితాపత్రయమనెడు సూర్యదీప్తిచేఁగాల్పఁబడ్డవాఁడునునై యనంతరమెడతెగనియధిక విలాసముగల కామికాద్యాగమములను చెట్లయొక్క నీడలనాశ్రయించి పూదండలు, చందనము, స్త్రీలు, ధనము, మొదలుగాఁగల వస్తువులయొక్క యార్జనమందుసాధనములైన దున్నుట, వర్తకముచేయుట, కొలువుసేయుట, యాచించుటమొదలగు లోకవ్యవహారకృత్యములవదలి స్వర్గము మొదలుకొని సత్యలోకము వఱకుంగలపరలోకసంబంధమయిన వస్తువులయందలి భోగములకు సాధనములయిన నిత్యనైమిత్తికాది కర్మలనుఫలకాంక్షచేఁజేయక బ్రహ్మార్పణముగాఁ జేసియాయీశ్వరానుగ్రహంబున నిర్మలచిత్తుండై తన్నుఁదానెపొగడుకొనకుండుట, తానుజేసినధర్మములఁ బ్రకటింపకుండుట, ప్రాణిబాధనొసర్ప

కుండుట, తిన్నందనము, ఓర్పు, గురుసేవ, బాహ్యాభ్యంతరపరిశుద్ధి, స్థిర భావము, మనోజయము, శబ్దస్పర్శాదిచతుర్దశేంద్రియ విరక్తిగర్వాభావము, జననమరణజరావ్యాధి దుఃఖములయందలి దోషములంగనుట, దారపుత్త్రిగృహక్షేత్రాదులందనిచ్ఛ, యనన్యాత్మభావనా లక్షణమైన యాసక్తి విశేషము లేకుండుట, సర్వదాయిష్టానిష్టలభ్యవస్తువులయందు సమబుద్ధినాకంటెనితరము లేదనుధ్యానమందు స్థిరభక్తి, నిర్జనస్థలనివాసము, జనసంఘమునందిష్టము లేకుండుట, యభిలాషత్యాగము, బ్రహ్మజ్ఞానమందు నిరంతరభావన, మోక్షజ్ఞానమందుఁబ్రయోజనదృష్టి, అనునీయిరువది లక్షణములనెప్పుడు పొందునోయాకాలమునందప్పుడే పరబ్రహ్మముయొక్క చేరికను బ్రత్యక్షముగాఁ జేయందగిన విచారమునందధికారియగును. ఇదంతయును, వైరాగ్యశబ్దాభిప్రాయము. ఇఁకమీఁద బోధశబ్దార్థము లెఱింగించెద వినుము. 187

బోధశబ్దార్థవివరణము.

తే॥ అట్టిసద్గుణశాలియ, త్యార్తితోడ । సత్వచిత్తుండుకారుణ్య, సాగరుండు
పరమవిజ్ఞానవంతుడై, ప్రబలుగురునిమించియతిభక్తితోడసే, వించుననఘ ॥

క॥ గురుఁడజుఁడుగురుఁడువిష్ణుఁడు । గురుఁడుమహాదేవుఁడఖిల గురుఁడుగురుఁడుస
ద్గురుఁడెపరబ్రహ్మంబని । గురునినుపాసించునతఁడుగురుతరభక్తిన్ ॥ 189

వ॥ గురుచరణారవిందములసేవింపకయతినిర్మలంబయినవిరాగమనెడుభాగ్యమహిమకలుగదనియు దేశికపాదోదకపానంబుసేయకయే, జ్ఞానవిజ్ఞానయోగానుభవముకలుగదనియు,గురుప్రసాదముంబొందక ప్రతిలేనిచిత్తోపరత్యానందము కలుగదనియుఁ, దత్పదలక్ష్యార్థమయినగురుస్వరూపము నాత్మనుఁ అనఁగా, త్వంపదలక్ష్యార్థపరిత్యాగాత్మయయిన తనయందునైక్యార్థము దర్శింపకపోయెనేని సర్వోత్కృష్టమయిన మోక్షస్థానములభింపదుగనుక బ్రహ్మజ్ఞానాసక్తుండయిన జితేంద్రియుండు వినయగురువునందు భయభక్తులు హృదయమందుఁబెనుచుకొనఁగాఁ బ్రసిద్ధములయిన స్థానాంగ భావాత్మలను, నాల్గువిధములయినశుశ్రూషలాచరించుచు నెల్లప్పుడు దేశికులసేవించినఁదత్ప్రాప్తి యగును. 190

క॥ వారల యుపదేశముచేఁ । దారకసాంఖ్యామనస్క, తత్త్వాత్మకమా
నారాజయోగమార్గం । బారూఢముగానెఱుంగు, మాధ్యతననఘా॥ 191

తే॥ వరుసరయొప్పారనహమను, వాక్యమునకుఁ
జెలఁగి కాయేంద్రియప్రాణ, చిత్తములను
మనమహంకృతిబుద్ధియు, మనుజవర్య
రూపజడజాతమెల్లని, రూఢముగను॥ 192

తే॥ పరమవాక్యార్థమాద్యము, భవ్యముగను
దత్త్వమానందరూపమై, తనరుశుద్ధ
ప్రత్యగాత్మప్రకాశము, పరమలక్ష్య
గతమహార్థంబు వేదశాస్త్ర తతిహితము॥ 193

వ॥ బ్రహ్మశబ్దమునకు యోజింపఁగాఁ బిండాండబ్రహ్మవిష్ణు రుద్రేశ్వర సదాశివ మాయాండపర్యంతమయిన సకలము వాచ్యార్థము. ఆపిండాండాదిమాయాండపర్యంతమయిన సమస్తమునకాధారమయిన శుద్ధచైత్యము సచ్చిదానందాది లక్షణపంచకముచేతంబొందఁదగిన వస్తువు. అహంపదవాచ్యార్థమయిన శరీరేంద్రియాంతఃకరణాదిభేదములతోడను, బ్రహ్మపదవాచ్యార్థమయిన పిండాండము మొదలు మాయాండమువఱకుంగల భేదములచేఁబ్రకాశించు సచ్చిత్సుఖరూపకుండగు ప్రత్యగాత్మకును సచ్చిదానంద పరబ్రహ్మమునకును గూడిక కలుగనేరదు. కాన నహంపదబ్రహ్మములకు వాక్యార్థములయిన బుద్ధ్యాదులను బిండాండము మొదలు మాయాండమువఱకుంగల శరీరములను దత్ప్రతిబింబితజీవేశ్వరులను, వదలి యహంపద బ్రహ్మపదలక్ష్యార్థములయిన బ్రహ్మకూటస్థులనేకముగా నెఱుంగవలయు. ఎట్లన రెండవది లేనికూటస్థుండగు నేనుబరిపూర్ణ నిర్గుణబ్రహ్మంబె యొక్కటయిన విలక్షణమయిన కూటస్థుండనయిన నేనని యిట్లు బ్రహ్మపదము లవాచ్యార్థములయిన జీవేశ్వరాది సకల మాయాండము వదలి నిర్మలులయిన కూటస్థబ్రహ్మపరమాత్ములను జేపట్టి జహదజహల్లక్షణచే బ్రహ్మనందైక్యమును బొందుటయే "అస్మి" యను పదమునకుఁ దాత్పర్యము, ప్రజ్ఞానపదమునకు బ్రహ్మాదిదేవతలు నరులు గుఱ్ఱములు, గజాదులంద నుస్యూతమై యేచైతన్యమున్నదో యాచైతన్యమే బ్రహ్మపదమ్మునకు లక్ష్యార్థము; అదియే బ్రహ్మస్వరూపము; చైతన్యము, ప్రజ్ఞానము, బ్రహ్మము, ఆత్మయను పేళ్లుమాత్రము వేఱుగాని వస్తువొక్కటియే గనుక నేనే బ్రహ్మమని నిశ్చయించుకొనుము. ఇదియే బ్రహ్మజ్ఞానము. బ్రహ్మస్వరూపమని వాచ్యార్థము. "అయమాత్మాబ్రహ్మ" యనెడు మహావాక్యమున కర్థము. అయం, ఆత్మా, బ్రహ్మ అని పదచ్ఛేదము, అయమనెడి పదమునకర్థ

ము, అయమనెడి పదముచేత నీయాత్మ స్వవశమై నిత్యాపరోక్షమై యుండు నదియనిచెప్పంబడుచున్నది. అహంకారాది స్థూలదేహపర్యంతము,నాదేహము ని యెఱింగెడి చైతన్యమే ప్రత్యగాత్మరూపము, కనంబడెడి సమస్తము, జగత్తుయొక్క తత్త్వం(బహ్మమనెడి శబ్దముచేఁ జెప్పఁబడిన లక్ష్యార్థము జగదధిష్ఠానభూతమైన బ్రహ్మమే స్వప్రకాశమైన యాత్మ. ఆయాత్మస్వరూపమే తానని యిట్లు నాలుగు మహావాక్యములయందును నీవే బ్రహ్మము, బ్రహ్మమేనీవని యెఱుఁగఁబడుచున్నది. అజ్ఞునకు శరీరమే యాత్మయను నమ్మకము కలిగియున్నట్లు బ్రహ్మజ్ఞునకు బ్రహ్మవిచారణానుకూలమైన మానుషభూమియందె కూటస్థచైతన్యమువేఱు గానిదే బ్రహ్మయను తలంపుకలుగవలయు॥ 194

తే॥ బోధవిధమునుదెల్పితిఁ, బూర్ణగరిమ। నింకనుపరతివిధివచి, యింతునీకు నుత్తమోత్తమమైయొప్పు, చిత్తశాంతి। పరమతత్త్వానుభూతికి, ఫలమువత్స॥

**ఉపరతిశబ్దార్థ విచారప్రకరణము.**

చ॥ దయగలదానభోగములఁ, దార్కొనఁజాలని మర్త్యకల్మియుఁ నయముగ సత్ప్రవర్తనము, నచ్చినయప్పుడులేని బ్రాహ్మణాధ్యయనము నెమ్మనంబునను, దారశమంబును బూనన్లొల్లకే నియమతపంబునింద్రియపు, నిల్కడసేయనియోగిరిత్తయా॥ 196

తే॥ వేదశాస్త్రంబులును గని, పెట్టిబుధుల। చేతఁజదివింపవచ్చుదాఁ, జిత్తమలరఁ జదువవచ్చునుమఘుదాన, చయతపంబు లొనరుపఁగవచ్చునధికారి, జనముచేత॥ 197

గీ॥ చేయనియమింపవచ్చుఁదాఁజేయవచ్చు। నిలనుగలతీర్థములకెల్ల, నేగవచ్చు నన్యులకు బోధలీవచ్చు, నర్మముగను। తానుబోవంగవచ్చును, దాల్మిఁగోడ॥ 198

గీ॥ తడయకష్టాంగయోగవి,ద్యలనుయోగ్యులకునునుపదేశ మొనరింపలక్షణంబె? ఘనతసాధింపవచ్చుఁదా,గౌరవమున। నెలమినెవ్వారికైననీ, తెలివిబలిమి॥ 199

గీ॥ యోగగతిదేహకేంద్రియా, లాగఁబట్టి మనమునరికట్టితనలోన, మంచిగాను నిల్పియనవరతంబును, నేర్పుమెఱయ। నిశ్చలసమాధినిష్ఠచే, నిలుపఁదరము॥

వ॥ చంచలాత్మకమగుచిత్తమును జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను జయించుట మిక్కిలిదుర్లభము. దానినేమానసేంద్రియ లయమందురు. ఇదిసర్వజనసామాన్యముగాదు. ఇట్టి యుత్కృష్టోపశాంత్యవస్థగల బ్రహ్మవిద్వరిష్ఠుండు లభింపఁడు. అట్టివాఁడెమత్స్వరూపుండు మఱికొందఱజ్ఞులు బ్రహ్మస్వరూపవేత్తలమని యహంకరించి మానసమును జయింపలేమిఁ జిత్తశాంతి యుక్తానందముం బొంద నేరక నానారూపేంద్రియార్థాభిలాషచే జనించిన చాంచల్యముచే నశింతురు. మఱియు 201

తే॥ గీ॥ అనుభవజ్ఞానయుతుఁడయ్యు, ననవరతము।
నాత్మభావన లేకున్న, యతనియింద్రి
యంబులుమనంబుతమకట్టు, లంటుకతన
విషయసుఖములఁజవిఁజూచి, వెతలఁబడఁడె॥ 202

వ॥ అట్లు దుఃఖమ్ములఁ లోఁబఱచునుగనుక, దశేంద్రియములును గారణరూపమైన మనస్సును, సదాబ్రహ్మము నాకంటె భిన్నముగాదను నెఱుకచేత నడ్డగించి బ్రహ్మమె తనకభిముఖముగఁ జేయవలయు. ఇట్లమర్చినపిమ్మట షడూర్మ్యలనెడు సంతశ్శత్రుసమూహమునడంచి నిర్మలబ్రహ్మాకారమైన ప్రవర్తనచే ముఖ్యమైనదియు నఖండమైనదియు, యథార్థమైనదియునగు బ్రహ్మస్వరూపముంగాంచి నిత్యనిరుపాధికస్వరూపుండై మహదాదిసర్వప్రపంచముం దనలో లయముచేసి చిత్తలయవిశిష్టుండగును, అట్లయిజ్ఞానాజ్ఞానములను క్షరాక్షరములను సంటని జ్ఞానస్వరూపుండగు పురుషోత్తముండు బ్రహ్మమేనేనను నిశ్చలజ్ఞానియననట్లును, మూలప్రకృతి మహదహంకారములను గుణత్రయము నంటనివాఁడునునై మనస్సు లేనట్టిదియుం బ్రకాశయుక్తమైనట్టిదియునగు యోగనిద్రావిశిష్టుండై యుండును. మఱియు నేమానవుండు పుణ్యకర్మభక్తిజ్ఞానములతోఁ గూడిన నియమముచే మనస్సుం బొందియున్న యెల్లకోరికలను క్రమముగా వదలిపూజ్య పరమాత్మయందే మనస్సంతుష్టికలవాఁడై యుండునో యాపురుషుఁడు, జ్ఞానాత్ముండునై యుండును. 203

తే॥ గీ॥ కాలగతిఁగల్గుసుఖదుఃఖ, కాండములను
బొందియప్రాప్తసుఖముల, పూన్కిఁగొనక
రాగభయరోషరహితుఁడై ప్రబలిమెలఁగు
పురుషుఁడేబ్రహ్మమనుదీప్తి పూర్ణుఁడగును॥ 204

తే॥గీ॥ సకలవిషయేంద్రియంబుల సారమడఁచి
కష్టసుఖములఁగాంచిన ఘనుఁడువంత
మురిపములనెంచకెవ్వాఁడు సరిగఁదలఁచు
పండితుఁడుచూచుఁదనుఁదాని, భావమందు॥ 205

సీ॥ తాఁబేలుధరణిలోఁదనకరచరణాద్య, పాంగమ్ములనుజాల, ననుపుపఱచు
మాడ్కి—నేయోగిస, మంచితేంద్రియమాన, సములనునమరని, స్సారముగను
మరలించునెవ్వాఁడు. మహితేంద్రియార్థమ్ము, లాతఁడాత్మజ్ఞాన, చేతనుఁడగు
వినుమురమాస్యార్థ, విధినెఱింగింతును వేయుఁజెప్పఁగనేల, వేడ్క—మీఱ
తే॥గీ॥ నేమహాప్రాజ్ఞనకుమాన, సేంద్రియములు।పంచినట్లాజ్ఞలోనిల్చి,పనులుసేయు
నాతఁడేసుమిబ్రహ్మోస్మియనఁగఁబరఁగు।నిశ్చలజ్ఞానియనఁబడు, నిర్మలాత్మ॥ 206

వ॥ సమస్తభూతములకు నేదిగోచరముగాక రాత్రివలెంబ్రకాశింపకుండునో,యా
యాత్మవిషయమైన ప్రజ్ఞానమందాత్మావలోకనపరుండైన పురుషుండుమే
ల్కాని యానందించునో యట్టియింద్రియనిగ్రహముగల పురుషునకు స
కలప్రాణిసమూహమును జతుర్దశేంద్రియవిషయాకారవృత్తియందు జాగ్ర
త్తనొందియున్నదో, యాబుద్ధియే యవిద్యాస్వరూపమగుటవలన రాత్రివ
లెంబ్రకాశహీనమగుచున్నది, బ్రహ్మజ్ఞానులజాగ్రత్తయాజ్ఞానులకు నిద్రయు
నజ్ఞానులజాగ్రత్త బ్రహ్మవేత్తలకునిద్రయు, నగుటవలనశరీరముంబరిశీలించు
టయే ప్రధానముగాఁగల యాత్మావలోకనముచే నింద్రియమనంబులజ
యించిలోఁబఱచుకొన్న పుణ్యపురుషుండును సమస్తప్రాణిహితుండును నతి
దయాళుండును మమతాశూన్యుండును సుఖదుఃఖసమానభావియు నేనను
నభిమానములేనివాఁడును బరిశుద్ధుండును బ్రయత్నహీనుండును స్వతస్సిద్ధ
లాభముచేఁ దృప్తుండగువాఁడును శుభాశుభత్యక్తయును, స్వేచ్ఛాసంచారి
యు, మద్భక్తుండునునై ప్రకాశించుచున్న బ్రహ్మవిద్వరిష్ఠుండెల్లప్పుడు,
విరామములేక ప్రకాశించుజీవేశ్వరైక్యసమాధియందు సూర్యుండఖిలప్రవా
దనదీతటాక కూపాది ప్రభూతజలము నాకర్షించునట్లును బడబాగ్నిసముద్ర
జలముంబీల్చునట్లును మహాదావానలమరణ్య దాహకమైనట్లును నవిద్యావిశి
ష్టగుణత్రయాదులన్నిటిని నిశ్శేషంబుగఁ గబళించి స్వేతరాభావుండును, బ
రిపూర్ణుండునగు స్వయంప్రకాశబ్రహ్మజ్ఞానస్వరూపుండై యుండును. అట్టియ
వస్థాభేదమే యుపరతియనంబడును. ఆయుపరతిలభించుటకు యమ, నియమ,
త్యాగ, మౌన, దేశకాలా, సన, మూలబంధ, దేహసామ్య, దృక్స్థితి,

పాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులను, పంచదశ యోగాంగంబులు, సాధనంబులుగనుక వానినన్నింటిని, ప్రత్యేకముగ వివరించెదనాకర్ణింపుము. 207

పంచదశయోగాంగవివరములు

ఉ॥ భేదములేకభూజలగ, భీరతరాగ్ని మరున్నభంబులున్
బాదుగనింద్రియంబులును, ప్రాణము చిత్తమనంబులాపయిన్
ఖేదముబుద్ధిహంకృతిప్ర, సిద్ధతరాకృతిలోనవెల్వలన్
మోదకదృశ్యసంఘమును, ముఖ్యపుసాక్షిగఁజూచుచుండఁగన్॥ 208

తే॥ గీ॥ తద్బ్రగాత్మకబ్రహ్మంబు, తానటంచు
నిరతముదలంచెనేనివి, నిశ్చయముగ
నదియెయమమనుయోగంబ, యగునుసుమతి
యిదియచింత్యంబువిమలాత్మ, యిలఁదలంప॥ 209

తే॥ గీ॥ వినుచునంటుచుఁజూచుచు. వివిధగతుల
నానుచును మూర్కొనుచుఁజాల,నర్థముగను
బలుకుచునుఁబనిఁగొంచును, బటిమఁజనుచు
ఘనతవర్ణాశ్రమోచిత, కర్మములను॥ 210

తే॥ గీ॥ ఇచ్ఛనలువుచుఁదలఁచుచు, నేపుమీఱ
నలరునింద్రియముల నింద్రి,యార్థములను
నెనసివర్తించునే వీనికెల్లసాక్షి
నవియుఁగేవల సచ్చిదత్యమలుడనఁగ॥ 211

మ॥ పరఁగెడి సుస్వరూపుఁడఁబ్రభాగుణజాతిసురూపనామముల్
తలఁచఁగలేనివాఁడనని, దార్ఢ్యముతోఁ గనుగొంచునెప్పుడే
నరమరలేకతాను దను, నారసికొంచును నిశ్చయంబుగా
నిరుపమమానఖండగతి, నేమమువీడక యుండయోగమా॥ 212

వ॥ నిరంతరము ప్రత్యగాత్మయైన తాను, జీవైక్యము చేఁజూచుచు సత్యసంపూర్ణమగు నానియమమును వదలకుండుటయే నియమయోగంబని చెప్పంబడు. మఱివిచారింపఁగాఁ బ్రత్యగాత్మస్వరూపుండై యొప్పు తనకు శరీరత్రయము చతుర్దశేంద్రియములు మొదలుగాఁగల యంతర్బాహ్యదృశ్యసమూహము నెల్లక వదలుటయే త్యాగయోగమనంబడు మాటలచే నట్టిదిట్టిదని పలుకంగూడనిదియు, మనస్సుచే నిట్టిదని యూహింపరానిదియునై ప్రకాశించు పర

మాత్మతానై పలుమాఱుమాటా ... కుండువాఁడు మాటాడెనేని తాను మాటాడితినని తలఁపకుండువాఁడున ... డును సంకల్పశూన్యుఁడును, నిరంతరబ్రహ్మానందామృతసారము ... ననుభవించుటయే మౌనయోగము. ఈయోగము మానక సేవింప ... ... యయు. ఏబ్రహ్మస్థానము పండితులు సద్గురూపదేశముచేఁ ... డెనో, పరిశుద్ధప్రకాశక చిదంబరస్థలమెద్దియే పరబ్రహ్మపదము దెలియం ... ... మాములందుత్తమములైన జ్ఞానభూమః లేడింటికి నెక్కుడైనదో కార్య సరం ... కారణాత్మక మనోజ్ఞానేంద్రియ కర్మేంద్రియములు ...ధప్రాణములు మొదలైన యవ్యక్తమదహంకారబుద్ధి చిత్తముల ప్రవేశసిద్ధి యభేదసిద్ధిం గన్న చిదాకాశమద్దియో యేతుర్యాతీతప్రక్షేపకము భయాభిలాష కాంక్షాక్రోధదుఃఖములు వీనివాసనలు లేశమైకసంబడకుండునో, యేయాసందాస్పదము తాపత్రయబోధలేనిదియు, గామాదిరహితమైనదియు, స్వాధికేతరము లేనిదియు నప్రాకృతమైన... యు నిరుపాధిక సుఖస్వరూపమైనదియు నై యొప్పునదియే, యాజ్ఞా... కాశమె ముఖ్యప్రదేశమగును. 213

తే॥గీ॥ అట్టులు వివిక్తసే ... శంబు, నధిగమించు నతని కేప్రొద్దు సౌఖ్యంబు, లమరుఁగాని
యన్యవిజనంబు ... నొందుదే, హాత్మవాది। కమరునే నిర్మలానంద, మవనినాథ॥

ఉ॥ కాలము ...
కాల...చేతఁబరి, కల్పితమౌచు వెలుంగునో సదా
కా...దొక్కరీతిగను, గాంతిమతెద్దివెలుంగుచున్నదో
...లపువై ఖరీవిధులు, కన్గొనఁజాలవు దేనిచేతనో
...మూలము లేనికాలమది, మున్వగనాశము లేనిదద్దియే॥ 215

వ॥ బ్రహ్మవేత్తపైఁజెప్పఁబడిన యుత్పత్తిలయములులేని కాలరూపమగు పరమాత్మస్వరూపుఁడై, తెప్పపాట్లు మొదలుగాఁగలదియును, బ్రహ్మవిష్ణు రుద్రప్రళయములవలఁ గుండునదియునగు కాలమును బత్తితునుకనంతట వ్యాపించిన కార్చిచ్చు రీతిఁగబళించి ప్రకాశించుచుండును. సూక్ష్మశరీరము నాశ్రయించియుండు ప్రాణవాయువు, ధర్మమగు చలనమును స్థూలశరీరధర్మమగు శరీరపీడయును, గారణశరీరధర్మమగు బడలికయును, మందస్వభావమునునిద్రయు నేపరబ్రహ్మస్వరూపముగ నుండుటచేఁగలుఁగ నేరవో, యాయునికియే సుఖాసనంబు. అసుఖాసనంబు వేఱొకనిచేఁ గల్పింపఁగూడదనితలంపుము. మఱియు నేపరమాత్మ సర్వకాలస్థిరస్థాయియై ప్రకాశించునో యపరోక్షజ్ఞానముచేత శోధించి యెపరబ్రహ్మతానైనపుడు సర్వలాభము లేక కాలమునంగలుగునో యాపరమాత్మయే సిద్ధాసనమనంబడు. అణవకార్మికమాయామలసహితమైన

మూలబ్రహ్మే యష్టపాశబంధ ... ములలో నిధానమైనబంధము, ఏయాత్మచే తన్యము వీక్షించునప్పుడీ బంధము ... నో ముప్పదియాఱుతత్త్వములకుం బ్రధానమెద్దియో యాపరమాత్మయే ... మూలబంధనమను యోగము సముద్రమున్ నదులవలె బ్రహ్మానందమందుం ... జతుర్దశేంద్రియ వృత్తుల గు రాగాదు లేకీభవించి సమరసము గలిగియుండుట ... యే దేహసామ్య యోగమగుటయు బాహ్యశబ్దదృశ్య విశిష్టమైనదియు వి ... ల్పవిశిష్టమైన నిష్ఠగలదగు లక్ష్యమెద్ది దశేంద్రియ విషయములగు శబ్దస్పర్శ ... దులం జూచునదియే బాహ్యలక్షణమనంబడు. అంతర్దృశ్యశబ్ద విశిష్టమైనదియు విశిష్ట సమాధిగలదియు నగు లక్ష్యమెద్ది నానావిధమనోబుద్ధి చిత్తాహంకారములయ ... సంశయ నిశ్చయచలన కర్తవ్యవృత్తులంజూచునో యదియే యంతర్లక్ష్యమ ... బడు బాహ్యాంతరసవికల్పక సమాధిగల యేల ... యములంగాంచునో యాలక్ష్యమే యంతక్ష్యము వెలుపలి లోపలి యిం ... క్ష్యము మనశ్శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వా ర్బాహ్య మధ్యదృష్టి యనంబడు. ఏ ... ముద్రయనంబడు. ఏలక్ష్య మాత్ర ఘ్రాణములను జూచునో యదియే షణ్ముఖ ... ల నెల్లప్పుడుం జూచునో ర్బాహ్య మధ్యషణ్ముఖములను నీనాల్గు లక్ష్య ... న్నే యున్మన్యవస్థయని యదియే శాంభవీదృష్టియనంబడు. ఈశాంభవీముద్ర ... వలన సరళశయ చెప్పుదురు. ఇది యన్నింట గొప్పది. ఇట్లు గొప్పదైనదనుటం ... పంగా నాకా మైనదియుం గేవలరహస్యమైనదియు నైయున్నది. ఇంక విచారి భూమ్యుద శము చూడందగినదిగానె యున్నది. వాయువు కనంబడుచున్నది. గనంబడు కాగ్నులు వీక్షింపందగినవి. ఉత్తరదక్షిణాద్యుపాధి భేదములచేం ... రుం రాజ్యము గోచరమైయున్నది. నిమేషము మొదలు ప్రళయాంతము ... దియ డు కాలము దృశ్యమైనదియే, శరీరము కనంబడుచున్నదియే, జ్ఞానేంద్రి కర్మేంద్రియములు దృశ్యములై యున్నవియే, ప్రాణవాయువు వీక్షణీయ మైనది, చంచలాత్మకమగు చిత్తము కర్తవ్యాత్మకమగు నహంకారము నిశ్చయాత్మకమగుబుద్ధి సంశయాత్మకమగు మనస్సు జ్ఞానాజ్ఞానములను నివియన్నియును దృశ్యములే. ఇట్లు భూతపంచకము మొదలుకొని జ్ఞానాజ్ఞానముల పర్యంతము వర్తించు సర్వము సామాన్యముగా గోచరించునదయ్యును గోచరింపని ద్రష్టయే యనంబడు, ఇంకం బ్రకృతిలయముచేం బ్రకాశించు బ్రహ్మనిష్ఠులకే పరబ్రహ్మమునందుం జూచువాఁడు చూపురూపములయను లివికలుగుచున్నవో యాపరబ్రహ్మమునందే దృష్టిం జేర్పవలయుంగాని భ్రమచే భ్రూమధ్యమందు నిలుపరాదనిచెప్పి మఱియు నిట్లనియె॥ 216

సుఖస్థితుండును స్వాధీనచిత్తుండును మితభాషియు నతిదయాశీలుండును సమస్తప్రాణిహితకారియు సత్త్వవర్తనప్రకాశకుండును మితాహారుండును శివజీవైక్యమందుఁదేఱినవాఁడును శీతోష్ణాదిద్వంద్వసహనుండును నిర్జనస్థలవాసియుఁ గపటహీనుండును నాశారహితుండును బ్రారబ్ధము చేలభించిన శరీరేంద్రియములయొక్క వ్యాపారములైన జాగ్రత్స్వప్న సుషుప్తిశబ్దాదులయొక్క స్వరూపములగు సుకృతదుష్కృతాదిక్రియలను నేను జేయుచున్నాననే ననుభవించుచున్నానను గర్వముతోఁగూడిన ముఖవికాసము దీనత్వమనునవి లేనివాఁడును సర్వదా నిర్మలబుద్ధియు సస్మితముఖుండును దుర్మార్గులతోఁగాని సన్మార్గులతోఁగాని చేరనివాఁడును బండితులతోఁజేరువాఁడును వాంఛారహితుండును మేల్గీళ్లంగూర్చు పనులఁజేరనివాఁడును మీమాంసాదిశాస్త్రవిమర్శనములనెడి భయంకరదావానలశిఖలచే దగ్ధమైన చతుర్వేద షట్శాస్త్రములును కామికాగమములు మొదలు వాతూలాంతముండు నిరువదియెనిమిది యాగమములను సప్తాదశపురాణములను నుపదేశించుగురువులును నట్టి గురువులయొక్క యుపదేశములచేఁ దెలియంబడిన యీశ్వరుండును శాస్త్రవిహిత కర్మలును వేదనిషిద్ధ కర్మలును మొదలైనవానియొక్క వాసనయను నరణ్యముగలవాఁడును దెలియంబడని దేహాది చిహ్నములు గలవాఁడును దెలియంబడని నడవడిక గలవాఁడును నొంటరిగా సంచరించువాఁడును ననిలయుండును గిరిగుహాస్థలసంచారియు మృత్యుభీతిహీనుండును, నిష్కపటశుద్ధసత్త్వవృత్తితోఁగూడినవాఁడును బుద్ధిమంతుఁడును నారోపాపవాదములయం దాశ లేనివాఁడును (శరీరేంద్రియాదులు నేననుట యారోపము. అవి నేఁగాననుట యపవాదము. ఇవి రెండును లేనివాఁడును) ప్రణవాతీతమయినదియు నంతట నిండియున్నదియు సాటిలేనిదియు నగు పరమాత్మయొక్క ప్రకాశమే రూపముగలవాఁడునునై ప్రకాశించుచుండును. 226

తే॥ ఆశవైతరణీనది, యధికకామ। మగు నధోగతి క్రోధమా, నంతకుండు
నిక్కమియ్యదియని తెల్పి, నెగడు వాఁడు। శ్రీసదాశివసౌఖ్యసంసిద్ధిగనును॥

వ॥ విశాలమగు నాకాశమను నల్లనిమేలుకట్టుచే నలంకృతమై సూర్యచంద్రాగ్నులను దీపములచేఁ బ్రకాశించునదియై సాటిలేని భూమండలమను గద్దియచే శృంగారింపఁబడినదై గాలియను విసనకఱ్ఱచే జనించిన వాయువుచే తనంతట నిండినదియై ధనవంతులను బంట్లచే సేవింపఁబడినదై యొప్పు లోకమనుపట్టణమందు జీవబ్రహ్మైక్యజ్ఞానముగల బ్రహ్మవేత్త ప్రజ్ఞానముచేఁ బ్రకాశించు

చున్న యింద్రియములను గుఱ్ఱములతోను మనస్సును పగ్గములతోను బుద్ధి యను సారథితోను గూడిన స్థూలశరీరమను చక్కని తేరెక్కినవాఁడును మహిమతో నొప్పు నపరోక్షజ్ఞానమనెడు స్త్రీతోఁగూడినవాఁడును బ్రహ్మానిందు నెడతెగని సంపదగలవాఁడునై ప్రకాశించును॥ 228

సీ॥ నిరపేక్షుఁడసమానుఁ, డురుభాగ్యనిధులను, దీనులపల్కుల, ధిక్కరించి
వినకయేకర్మముల్, విభజించినప్పడి, కర్మకాండాదులఁ, గాంచకెపుడు
తన్నుఁదాఁజూచుచుఁ దగనిర్మలంబగు, వరసుషుమ్నాదులవాంఛతోడ
భావనంబుగఁజేసి ప్రబలుఁడై నిరతంబు నియమసమాధిని, నిలిచియుండి
తే॥ సుఖతరంబైన యానంద, సుగతియందు।నోలలాడుచునుండెడు నొక్కబ్రహ్మ
విద్వరిష్ఠుఁడు విజ్ఞాన, విమలమైన। పూర్ణుఁడై యుండుసతతంబు, భూరిమహిమ॥

ఉ॥ ఆతఁడు నొక్కవేళఁ దన,యందున మీఱు ప్రపంచమంతయున్
భూతలమందునుండునని, పొందుగఁజూచుచు నవ్వుచున్ సదా
యాతతపంచభూతమయ,మై తనరారెడి యెల్లమేనులం
దాతఁడెనిండియుండునది, యంతయుఁదానని సంతసించుచున్॥ 230

చ॥ మఱియొకవేళ మేనుగల, మానవదింద్రియ సంఘమెల్లనే
యరమరలేక తాముతమ, వ్యాప్తులునల్పఁగ సాక్షినంచుఁ దా
నిరవుగ సంభ్రమించుచుని యింకొకవేళను నన్యమొప్పఁగే
నరయఁగలేదొకండనుచు, నాత్మలయంబును బొందుచుండియున్॥ 231

తే॥ అతులవైరాగ్యబోధోప,రతులుగల్గు। నతనిమహిమలుగణుతించియభినుతింప
హరిహరహిరణ్యగర్భుల,కైనఁ దరమె। యపరిమితసద్గుణసనాథ, యవనినాథ॥

క॥ తనపాదధూళిసోఁకిన। ననువుగసకలంబునిర్మలానందముతో
ఘనపావనతంబొందుచు। నవయంబొప్పారుచుండు, నతిహర్షమునన్॥ 233

మ॥ తనదేహంబును జూచుమానవులు సం, తాపంబులంబాసితా
మనయంబున్ ధరనిండియుండఁగను మేలౌభక్తిమర్త్యుండు మీల్
దనరన్ తత్తదుపాసనంబెపుడును, త్యశ్రీని జేయంగ వాఁ
డనిశంబున్ గురువై భవోన్నతులని, త్యంబొప్పనెప్పట్టునన్॥ 234

మ॥ తనకారుణ్యమునొందుభక్తులకు ని,త్యానందమోక్షంబు ని
మ్మనమందున్ దగఁదోఁపుహస్తగత స,న్మానోదకంబోయనన్
దనము య్యేషులవంగడంపుహితుల్, ధర్మిష్ఠులైస్వర్గమం
దనువందన్ నివసింతురంచువిబుధుల్,ధ్యానింపనాచార్యుఁడై॥ 235

వ॥ ఇట్టిబ్రహ్మవిద్వరిష్ఠుండు ప్రారబ్ధభోగావసానసమయంబున జలంబున జలంబును క్షీరంబున క్షీరంబును ఘృతంబున ఘృతంబును దేశంబునఁ దేశంబును నాకాశంబున నాకాశంబును బొందినచందంబున భూతకార్యంబులైన చతుర్వింశతితత్త్వంబు లాయాకారణంబులఁగలయుచుండఁదా వానితోఁ దాదాత్మ్యంబు లేమింజేసి ప్రకృతియును జ్ఞానంబునుగాక, ముఖ్యమయినదియు నంతటనుండియుండినదియుఁ, జలింపనిదియు, నదృష్టమూలమైనదియు, వేఱులేనిదియు రూపములేనిదియు, నిట్టిదట్టిదనిపలుకరానియు యోజింపఁగూడశక్యముగానిదియుఁ,త్రిగుణరహితమయినదియు సంకల్పవికల్పాదులు లేనిదియు జగద్విలక్షణమయినపరమాత్మయొక్క సుఖరూపమైనదియుఁ, బ్రకృతిలేనిదియు శాశ్వతమైనదియుఁ బ్రత్యక్షాదిప్రమాణములగు నెనిమిదింటిచేఁదెలియందగినదియు నుత్పత్తిస్థితిలయములు లేనిదియుఁ హద్దునతిక్రమింపనిదియు, ననుమానప్రమాణముచేఁ దెలియందగనిదియుఁ, బ్రణవరూపప్రపంచమున కాధారమయినదియు, సమష్టివ్యష్టిభేదములుగల జీవేశ్వరులయొక్కయు పాధులవలనంగలిగినవిశ్వవ్యాకృతహిరణ్యగర్భుల జ్ఞానప్రకాశముయొక్క ప్రతిబింబమునకుం బ్రకాశమును గలుగఁజేయునదియుఁ దనకంటెవేఱగు వస్తువు లేనిదియుఁ బరిపూర్ణమయినదియునగు విదేహకైవల్యముంబొందును. ఇందుకు సందేహము లేదు ఈసమయమునందు నీవునట్టిస్వరూపమాత్రుడఁవేయని మరలంజెప్ప నారంభించెను.

సీ॥ ఏకాలమందైన, నెట్టిచోనైనను, బ్రారబ్ధకర్మముల్, ప్రాప్తమైన
నిలజీవముక్తుండు, హెచ్చుగానలరెడి, దేహంబువిడిచిన, దీప్తితోడఁ
బుట్టుకయునువృద్ధి, భూరినాశము లేని, వాఙ్మనసములకు, వశముగాని
నిర్వికల్పంబైన, నిశ్చయాత్మస్వస్వ, రూపమాకైవల్య, మేపుమీఱఁ

తే॥ బొందుసత్యము నామాట, భూపవర్య
యిదియెశ్రుతిశాస్త్రసారమా, నిదియనంత
సౌఖ్యదంబిదె వేదాంత, సారమిదియె
నిర్మలానందజమ్మిదె, నిజమునిజము॥ 237

వ॥ అందువలన నాయంతరంగమందు గొప్పనిధివలెం బ్రకాశించు సకలవేదాంతసారమైన యీయపరోక్షజ్ఞానమును మద్భక్తుండవును, మత్పూజాసక్తుండవును, మత్సమర్పిత బుద్ధిగలవాఁడవును, మన్నివాసుండవును, నగుటవలన నీకుపదేశించితి. ఇతోధిక తాత్పర్యంబు నామనంబున లేదు. గనుక నీతాత్ప

ర్యభావంబు గ్రహించి తమోగుణమనెడు తాఁబేళ్ళుగలదియు, రజోగుణమనెడు మత్స్యములు గలదియు, నహంకారమనెడు మొసళ్లుగలదియు, శోకకలనెడు పాఁచి కలదియుఁ, బుట్టుట చచ్చుట యనెడు నలలుకలదియు, రోగము లనెడి బుద్బుదములు కలదియు, దుఃఖము లనెడు నీటివెల్లువలచేఁ బాతాళమునకంటెడి లోఁతుకలదియు నగు సంసారమనెడి సముద్రముం దాటి ముక్తియను గట్టుంబొందుము. అట్లు పొందుటచే ధన్యుండవును, మత్స్వరూపానుసంధానమం దున్కిఁ గలవాఁడవునై సంతోషింపు మని చెప్పఁగా నాశిష్యోత్తముండు పార్వతి యాదిశక్తి యనియు శివుండు పరబ్రహ్మమనియు నిప్పుడుపదేశించిన పరమాత్మయొక్క యథార్థజ్ఞానము సకలవేదశాస్త్రములయొక్కయు, సకలపురాణములయొక్కయుఁ గామికాదులగు నిరువదియెనిమిది యాగమములయొక్కయు మన్వాదిసమస్తస్మృతులయొక్కయు సారాంశమనియుం దెలిసికొని యత్యంతసంతుష్టి వికసన్ముఖారవిందుండై ప్రసిద్ధులును సంసద్యుక్తులును, గురువులును నగు పార్వతీపరమేశ్వరుల పాదారవిందముల కనేకపర్యాయములు నమస్కరించి యంజలిబద్ధుండై వినయముతో నిట్లనియె. 238

తే॥ శ్రీసదా శివశివశివ, శ్రీగిరీశ । నిత్యకల్యాణయాశ్రిత, నుత్యవిభవ
భూతమయసర్వభూతేశ, పాతకహార । శాశ్వతైశ్వర్యసర్వేశ, స్వప్రకాశ॥ 239

తే॥ దేహబుద్ధినిదాసుఁడ, దేవనీకు । జీవబుద్ధిని భవదంశ చెలఁగియరయ
నాత్మబుద్ధిఁద్వమేవాహ, మైతినిపుడు । సంశయంబణుమాత్రంబుసామివలదు॥

సీ॥ అనివిన్నవించియు, నవనీశుఁడతిభక్తి సాష్టాంగదండముల్ సలిపివేగఁ
దద్భవానీపతి, దయనుసంపాదించి, సిరిమీఱనచ్చట, సెలవునంది
నిజసౌధమునకేగి, నిశ్చలభక్తితో, రాజ్యాభిలాషలురహితపఱచి
విజనస్థలంబున, విమలాంతరంగుఁడై, శ్రీశివనామంబు చిత్తమలర

తే॥ నిర్వికల్పసమాధిని, నిరుపమాన
యోగసంసిద్ధిగాఁగ సద్యోగనిష్ఠ
సల్పి నిరతిసుఖంబును, సంగ్రహించి
ప్రవిమలానందమోక్షు సంప్రాప్తుఁడయ్యె॥ 241

వ॥ అని శ్రీహరిలక్ష్మీదేవితో నిట్లనియె, నోహరిప్రియా నేను నీకాశివమంత్రముయొక్కయు నాశివమంత్రాభిప్రాయముయొక్కయు నామంత్రాభిమాన దేవతయగు పరబ్రహ్మముయొక్కయు స్వభావములదాపక బోధించితిని. నామన

స్సులో నింతకంటె గొప్పసత్ఫలమేదియు లేదని కమలాదేవికిం గేశవుండుప దేశించెను. మఱియు నోలక్ష్మీ సర్వమంత్రోత్తమంబగు శ్రీశివమంత్రము, సకలోత్పత్తిస్థితి లయరూపములగు దోషములం బోఁగొట్టునదియు, నీప్సితముల నన్నింటిని సమకూర్చునదియు నిరవధికంబయినదియు, నాశములేనిదియునగు బ్రహ్మజ్ఞానమును బ్రహ్మానందమునిచ్చునట్టిదియును, విషయేంద్రియముల యొక్క యధిదేవతారూపములగు త్రిలోకములకుం బ్రభువగు పరమాత్మను బ్రత్యక్షీకరించునదియునై యున్నది. శ్రద్ధతో నీగ్రంథముం జదువుచున్నట్టియుఁ దదర్థముల్ వినినట్టియుం బుణ్యపురుషుల కనేకశుభసంపత్తులు పరమేశ్వరుం డొసంగును. పుణ్యకర్మాభివృద్ధి యొసంగును. చిత్తలయశమదమాది షట్క భాగ్యంబు లొసంగును. 242

సీ॥ వాసిరెడ్డి మహాన్వ, వాయమాచంద్రార్క, మొనలేనిసత్కీర్తిఁ, నెసఁగుఁగాక
వాసిరెడ్డి మహాన్వ, వాయమెన్నెన్నియో, మన్ననల్ గైకొంచుఁ మలయుఁగాక
వాసిరెడ్డి మహాన్వ, వాయమెన్నఁగరాని, ప్రబలసత్క్రియల చేఁ, బరఁగుఁగాక
వాసిరెడ్డి మహాన్వ, వాయమే నాఁటికి దైవతద్విజభక్తిఁ, దనరుఁగాక

తే॥ వాసిరెడ్డి మహాన్వయు, ప్రభవవిభవ
సత్ప్రభూత్తమ సంప్రాప్త, సాంద్రబల స
మృద్ధ యుద్ధార్జితసమజ్ఞ మెఱయుఁగాక
నిత్యకల్యాణపాళికా, నియతిఁ గనుచు॥ 243

చ॥ నిరుపమసత్కవిత్వరస, నిర్భరులౌ కవులెంద ఱెందఱో
వఱలెడి నేఁటికాలమున, వైదుషిచాలని నేను గ్రంథముల్
విరచన సేయుటన్నఁ గుల, వీరుల సద్గుణశౌర్యసంపదల్
ధరణిఁగలంతకాలముప్ర, థఁ గననంచు గ్రహింపుఁడీ బుధుల్

ఉ॥ ఒక్కనిచాయ నొక్కనికి, నొప్పదు కబ్బములల్లువేళ స
మ్యక్కృతికల్పనాచణుల, కన్నియుఁద్రోవ లెఱుంగనువాసి పెం
పెక్కఁగఁ దోఁచువైఖరిని, లిఖియించితిదీని, గాథనిం
దెక్కుడుగా గ్రహించి పెఱ, వెల్లననుగ్రహబుద్ధిఁగాంచుఁడీ 245

క॥ హనుమంతుఁడాదినుండియు। ననుఁబ్రోచెడు దేవుఁడౌట, నాగ్రంథమునన్
హనుమద్బుధసంస్కరణము। ఘనతరమైపొల్చుఁ బాఠకప్రవరులకున్॥ 246

శా॥ ఆనందాంశకమైన హయాణశకమం, దబ్ధీందురంధ్రాబ్జసం
ఖ్యానీతంబులు హాయనంబులు వెలుం,గన్ సర్వసంపన్నమా
నానందాబ్దమునందు భాద్రపద శుద్ధైకాదశీ సోమవా
రానన్ దైవకృపన్ మదీయకృతి పూ, ర్ణంబయ్యె నేకాకృతిన్॥ 247

శా॥ జానక్యాననతోయరుడ్భసలకా, సల్యాత్మజాసోదర
శ్రీనిర్వేశ, హనూమదాదిసుభట, శ్రేణీనమస్యాదరా
మానీంద్రప్రణుతి ప్రసన్నహృదయా, త్మానాథచూడామణీ
దీనవ్రాతశరణ్యగణ్యసుగుణా దేవాజగద్రక్షకా॥ 248

కం॥ పరమేశాజగదీశా। గురువాక్యశ్రుతివిలోల, గోగోపాలా।
ఖరరక్షఃకులభీమా। స్థిరధామాతుమ్మపూడి, సీతారామా॥ 249

గద్య.

ఇది శ్రీసీతారామచంద్ర కరుణాకటాక్ష వీక్షావిశేష సంప్రాప్తకవిత్వ వైభవ,
శ్రీమదఖండ సచ్చిదానందస్వరూప రాజయోగానందానుభవ పవిత్ర వల్లుట్ల
గోత్ర వాశిరెడ్డివంశసంభవ వేంకమాంబా సూరయ నామధేయ తృ
తీయ తనూభవ బుధజనవిధేయ సమ్యక్కృతాతిధేయ సత్స
హవాస, వేంకటసుబ్బదాస ప్రణీతంబయిన వాశిరెడ్డి
వంశచరిత్రమ్మునందు సర్వంబును బంచమా
శ్వాసము సంపూర్ణము.

స్వస్తి సర్వేషాం సమస్త సన్మంగళానిభవంతు.
శ్రీ శ్రీ సీతారామచంద్రార్పణమస్తు.